# SOCIAL REFORM

# A N D

# LITERARY WORKS OF VEERESALINGAM

By :

*Smt. V. Koteswaramma,* M. A., B Ed.,

PART TIME RESEARCH SCHOLAR



THESIS SUBMITTED TO THE NAGARJUNA UNIVERSITY

FOR THE AWARD OF THE DEGREE OF

DOCTOR OF PHILOSOPHY

MAY 1979.

# సంఘ సంస్కరణం :
# వీరేశలింగ సాహిత్యం

రచన :

శ్రీమతి ఐ. కోటీశ్వరమ్మ, ఎం. ఏ., బి. ఇడి.,

పార్ట్‌టైం రిసెర్చి స్కాలర్



పిఎచ్. డి. పట్టంకోసం

నాగార్జున విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత వ్యాసం.

**మే, 1979.**

## DECLARATION.

I declare that this thesis has been composed by me and has not previously formed the basis for the award of any Degree, Diploma, Associateship, Fellowship or other similar title, of any other University.

SIGNATURE OF THE RESEARCHER.

## CERTIFICATE.

Certified that this is a genuine and bonafide work.

DIRECTOR OF RESEARCH.



ప్రజోద్ధారకుడు

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు

## విషయానుక్రమణిక

— — —

# కృతజ్ఞతాంజలి

అభ్యుదయకాంక్షి, సంస్కరణాభిలాషి, సంస్కారి అయిన వీరేశలింగంగారి ఆలోచనా సరళిని ఇముడ్చుకొన్నవారు మాగురువులు ఆచార్య దోణప్పగారు. వీరేశలింగంగారి పట్ల నాకున్న కృతజ్ఞతాభావం శ్రీ దోణప్పగారి గౌరవభావం ఈ సిద్ధాంత వ్యాసరచనకు రూపురేఖలను దిద్దాయి. భాషాసాహిత్యాలలో నిరంతర పరిశోధనా నిష్ణాతులు ఈ పరిశోధనకు దర్శకులు, మార్గదర్శకులు శ్రీ దోణప్పగారు నా యీ ప్రయత్నానికి అడుగడుగునా చేయూతనిచ్చి, సహకరించినందుకు, ప్రయాణకాలాన్ని కూడా సిద్ధాంత వ్యాస పరిశీలనకే వినియోగించి ఉదాత్తమైన సలహాలను అందించినందుకు వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులను సమర్పిస్తున్నాను.

ఈ గ్రంథ రచనకు అవసరమైన సహకారాన్ని అందజేసిన శ్రీ తారకం గారికి, డాక్టర్. అక్కిరాజు రమాపతిరావు గారికి, డాక్టర్. కొత్తపల్లి వీరభద్రరావు గారికి, డాక్టర్. పి.ఎస్.ఆర్.అప్పారావు గారికి, శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారికి, డాక్టర్. జాన్ లియొనార్డ్ (యం.యస్.ఎ.) శ్రీ పి. లక్ష్మణరెడ్డి గార్లకు నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

అవసరగ్రంథాలను ఆదరంతో అందించిన వేటపాలెం ఆంధ్ర సారస్వత నికేతనం కార్యదర్శులు శ్రీ అడుసుమిల్లి సుబ్బారావు గారు, లైబ్రేరియన్ గారికీ, తమిళనాడు పత్ర కేంద్ర (**Archives**) డిప్యూటీ డైరెక్టరు శ్రీ శృంగరాజ్, ఎమ్.ఎ, ఎం.లిట్, గారికి, లైబ్రేరియన్లకూ, మద్రాసు విశ్వవిద్యాలయం గ్రంథాలయ శాఖలోని శ్రీ పి. గంగాధరరావు గారికీ, తెలుగు అకాడమీ డైరెక్టర్ శ్రీ ఎన్. వెంకటస్వామి గారికీ, లైబ్రేరియన్ గారికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

గ్రంథసేకరణలో తోడ్పడిన శ్రీమతి మోటూరు ఉదయం, శ్రీ పటుకూరి బలరామమూర్తి, కుమారి బాలసరస్వతి, శ్రీమతి వై. రత్నమాల శ్రీ దిగవల్లి శివరావు, శ్రీ చేకుమళ్ల రామచంద్రరావు, నాగార్జున విశ్వవిద్యాలయపు లైబ్రేరియన్ శ్రీ యస్. కామేశ్వరరావు, రామమోహన గ్రంథాలయం, ఆంధ్ర లైబ్రరీ, మాంటిస్సోరి కళాశాలల లైబ్రేరియన్లకు నా కృతజ్ఞతలు.

ఈ సాఫుప్రతిని సక్రమంగా రూపొందించడంలో సహకరించిన కళాప్రపూర్ణ మిమనూరి శివరామారావుగారు, చిరంజీవి వి. సుబ్రహ్మణ్యం, శ్రీ కె. రామకోటేశ్వరరావుగారు, చిరంజీవులు పేరి, పుష్పలత, లలితకుమారి, పద్మశ్రీ, శారద, సీత గార్లకు నా మనఃపూర్వక ధన్యవాదాలు.

సంస్కృత సాహిత్యాన్నవలోకించి కావలసిన ఆధారాలను సేకరించి అందచేయడంతోపాటు నా యీ కృషిలో ఆది నుంచీ అంతంవరకూ అందించిన అమూల్యసహకారానికి శ్రీ వేంకటేశ్వర శాస్త్రి గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు. ఈ గ్రంథరచనలో అడుగడుగునా నాకు బాసటగా నిలిచిన చిరంజీవి విజయలక్ష్మికి అనేక శుభాశీస్సులు.

ఈ నా కృషిలో నాకు చేదోడు వాదోడుగా నున్న చిరంజీవి వి. వెంకటేశ్వరరావుకు, వ్రాతప్రతిని శ్రద్ధగా అందంగా టైపుచేసి అందించిన రవి సర్కిల్ ఆఫ్ కామర్స్, ప్రొప్రయిటర్ శ్రీ పోడూరి బ్రహ్మానందరావు, చిరంజీవి ఆచంట వెంకట నరసింహారావు గార్లకు అభినందనలు. ఈ గ్రంథానికి ముఖపత్రం ముద్రించి యిచ్చిన చిరంజీవి జె. బసవేశ్వరరావుకు, తమ అమూల్యమైన సహాయం, సహకారాలనందించిన మాంటిస్సోరి విద్యాసంస్థల సిబ్బందికి, ప్రత్యేకంగా శ్రీమతి జి. నాగరత్నమ్మగారికి హృదయపూర్వక ధన్యవాదాలు.

—: O :—

# భూమిక

కవి దూరదృష్ట, పురోగామి, సంస్కారి, సంస్కర్త. కండకహారి వీరేశలింగంపంతులుగారు కవిశ్వరుడు. కవుల భావనలకు ప్రాక్ పశ్చిమాల అవధులుండవు. కులమత వర్ణలింగ పరిధులూ వుండవు. వీరేశలింగంపంతులుగారే దానికి తార్కాణం.

పాశ్చాత్యసంస్కృతితో ప్రత్యక్ష సన్నిహితత్వంవల్ల, క్రైస్తవ మిషనరీల విజ్ఞాన ప్రచార కాంతికిరణాల నుంచి, సమాజంలో ఉదయించిన చైతన్యశక్తిని తనక రచనాపాళ్లో సమకాలీన ప్రజలకు వ్యక్తం చేశారు వీరేశలింగం పంతులుగారు. ఇలా వ్యక్తం చేయడానికి ఆయన చేసిన కృషికి, దానికోసం ఓడ్చిన చెమటకూ ఆయన రచించిన గ్రంథసంపుటాలు శాశ్వత చిహ్నాలు. ఆయనలో ఉదయించిన నూతన భావాలను అనతికాలంలోనే పదివారందరు జీర్ణించుకోవాలనే ఆయన ఆసక్తికీ, ఆకాంక్షకూ ఆగ్రంథాలే ప్రమాణసూచికలు. ఆయన సమకాలీనపు ఉద్యమాలను సన్నిహితంగా అనుశీలించిన కొద్దీ, ఆవుద్యమాల కాయన ఆదికారణం కాకపోయినా[1] ఆదిమ కేంద్రం కూడా కాకపోయినా, అటువంటి వాటి కెన్నింటికో బలమైన సురక్షితమైన పునాదులను మాత్రం ఆయనే వేశారనే అభిప్రాయానికి అందరూ రాక తప్పదు. ఆధునిక యుగపు అభివృద్ధి కంతటికీ కారణం, మార్పులకు మూలం ఆయనే అన్నా అతిశయోక్తి కాదు కదా!

1910 లో జె. గురునాథం గారి 'వీరేశలింగం' గ్రంథంలో భారత జాతీయ భావాలను సమీక్షిస్తూ 'పంతులుగారిని మించి సాధించవలసింది' గా ఆంధ్రయువకులను ఆయన గట్టిగా ప్రోత్సహిస్తారు.[1] దాని ఫలితమే తరవాత రెండేళ్లలో వచ్చిన ఆంధ్రోద్యమం. 1953లో ఆంధ్రప్రదేశ్ అవతరణకూడ దాని పర్యవసానమే! ఇటీవల కాలంలో 'దక్షిణ భారతంలో నవాభ్యుదయ్యుడు' అని పంతులుగారి ఉత్సవాలు జరపబడ్డాయి.[2] క్రమంగా పంతులుగారి స్థాయి పెరుగుతూ వచ్చింది.

---

1. జె. గురునాథం. 'వీరేశలింగం' పుటలు 165, 166. రాజమండ్రి 1911.
2. వి. ఆర్. నార్ల. 'వీరేశలింగం' పుటలు 179 - 181.

పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థంలో పంతులుగారు జీవించారు. ఇరవయ్యో శతాబ్ది మొదటి రెండు దశాబ్దాల వరకు, ఇంచుమించుగా, ఆ జీవితం విస్తరించింది. యావజ్జీవం గొప్ప సంఘ సంస్కర్తగా, తెలుగు భాషావేత్తగా జీవించారు. ఆయన జీవించిన శతాబ్దాంతంలో సంఘసంస్కరణా, సాహిత్య వేత్తృత్వమూ సమన్వయం చెందడం సర్వసామాన్యం. వంగదేశంలో ఈశ్వర చంద్రవిద్యాసాగర్, మహారాష్ట్రంలో ఆర్.జి.భండార్కర్, సంస్కృత వాఙ్మయంలో వారికున్న పాండిత్యాన్ని సంఘసంస్కరణోద్యమంలో బహుధా వినియోగించుకున్నారు.[1] సంఘ సంస్కార కార్యకలాపాలకు శ్రుతి స్మృతి పురాణేతిహాసాల నుంచి ఉపపత్తులను అధికారయుతంగా చూపే నైపుణ్యానికి పైవారితో సరిరాకపోయినా, సంఘ సంస్కరణ కార్యకలాపాల్లో మాత్రం దక్షిణ భారతంలో పంతులుగారు సుప్రసిద్ధులయ్యారు. ఆ కార్యకలాపాలను నలభైయేళ్లపాటు నిర్విరామంగా ఆయన కొనసాగించారు.[2] ఆరోజుల్లో భాషాసేవా, సంఘసేవా చేసినవారనేకులున్నారు. వారందరిలో పంతులుగారి కొక ప్రత్యేక స్థానముంది. ఆయన కార్యరంగంలో దూకి, కార్యనిర్వహణకు జీవితాన్నంకితం చేసిన మహానుభావుడు. 4 [3]సంఘసంస్కరణలో పంతులుగారు సాధించిన విజయాలు అనేకాలు. నలభైకి పైగా వితంతు వివాహాలు జరిపారు. రెండు బాలికా పాఠశాలలు స్థాపించారు, స్థాపింపజేశారు. వితంతు శరణాలయాలు రెండు నెలకొల్పారు. ఒకటి మదరాసులో, రెండోది రాజమండ్రిలో తరవాత కొన్నాళ్లకి ఇంచుమించుగా మద్రాసులోనున్నది ఆయనతోపాటే రాజమండ్రికి తరలిందా అన్నట్లు ఇక్కడ ప్రారంభించడం, అక్కడివారు కూడా ఇక్కడికే రావడం జరిగింది. పతితరక్షణాలయం, స్త్రీల ప్రార్థనాసమాజం, పురమందిరం, ఆస్తిక పాఠశాల x సహవిద్య ప్రప్రథమంగా ప్రారంభించారు ఆధునిక యుగంలో x – ఇన్ని సంస్థల్ని స్థాపించడానికి కారకుడంటే,

---

1. Heimsath – 'Indian Nationalism & Hindu Reform' P. 124, Princeton, 1964
2x Vinay Ghosh – Eswara Chandra Vidya Sagar – p. 81 – 82, New Delhi, 1965
2. The Hindu – December 11, 1911.
3. The Hindu – September 5, 1919.

ఎంత కృషి చేశారో వేరుగా చెప్పనవసరం లేదు. ఆయన కార్యక్రమా లన్నింటినీ ప్రచురించడం కోసం ఒక పత్రికను కూడా స్థాపించారు. అదే 'వివేకవర్ధని'. ఆయనే దానికి సంపాదకుడు కూడా. రనడే, రఘునాథరావు మొదలైన ఆనాటి సంఘ సంస్కర్తలతో పోల్చిచూస్తే, ఆయన శక్తిసామర్థ్యాలు కొట్టొచ్చినట్టు కనబడతాయి. ఆయన సాధించిన విజయాలకు అద్భుతమైన ఉపకరణం వివేకవర్ధని పత్రికేనని చెప్పవచ్చు. ఆయన గావించిన భాషాసేవకు సంఘసేవకు అదే ప్రచండ సాధనం.

ఆపత్రికలో సంఘ దురాచారాలనూ, అనాచారాలనూ ఎత్తి చూపేవారు. నాటి బ్రాహ్మణుల వ్యక్తిగతలోపాలను, కపట వర్తనాలను గురించి తీవ్రంగా విమర్శించేటప్పుడు స్థానికంగా ఉన్న ప్రముఖ వ్యక్తుల మీద దాడి జరిపేవారు. వారిలో బ్రిటీషు ఉద్యోగులూ, భారతీయ న్యాయవాదులూ కూడా ఉండేవారు. తమ కార్యకలాపాల విజయానికై బ్రిటీష్ ఉద్యోగుల మీద ఆయన ఆధారపడ్డం అధికమైన కొద్దీ, తనకు వ్యతిరేకులైన తోటి సంస్కర్తల మీద ఆయన దాడి హెచ్చించారు. ఆయన ప్రయోగాలనేకం విఫలమైనప్పటికీ, చెప్పుకోతగినంతగా సాంఘికపు మార్పును తీసుకురాలేకపోయినప్పటికీ, ఆరోజుల్లో, ఆపరిస్థితుల్లో గణనీయమైన మార్పు మాత్రం సాధించగలిగారని చెప్పవచ్చు.

ఆయన ఆలోచనా ధోరణిలో రెండు విషయాలు ప్రముఖంగా ప్రత్యక్ష మవుతాయి. ఒకటి – పాశ్చాత్య సంస్కృతిలోని ఉత్తమోత్తమమైన దాన్ని భారతీయ సంస్కృతిలోని ఉత్తమోత్తమమైన దానితో సమన్వయం పరచడం. రెండోది – భారతజాతిని, ప్రత్యేకించి ఆంధ్రజాతిని, అభివృద్ధి పరచడం. అందులోనూ నిద్రాణంగా వున్న స్త్రీజాతిని చైతన్యవంతంగా చేయడం, విద్యాకార్యక్రమాల ద్వారా విద్యావతులను చేయడం, విజ్ఞానాన్నందించడం.

సాహిత్యరంగంలో ఆయన వెంపొందించుకున్న వచనరచనా (శైలి) రీతి ప్రధానమైంది. పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలన్నింటినీ తెలుగు సాహిత్యంలో ప్రవేశపెట్టారు. సాహిత్యవిమర్శలో ఆయన సమకాలీనుల్లో సముచిత స్థానాన్ని సముపార్జించారు. సంస్కృతాంగ్ల గ్రంథాల నుంచి అనువాద గ్రంథాలను

రూపొందించారు. వాటికి ఆంధ్రదేశ వాతావరణం కల్పించి, పాత్రల ఆచార వ్యవహారాలను కూడా ఆంధ్రజాతీయం చేశారు. స్వయం ప్రజ్ఞా ప్రాభవాలతో తెలుగు సాహిత్యాన్ని పరిశోధించి, పరిశీలించి, పునరుజ్జీవింపచేయడానికి ప్రయత్నించారు. వాటిద్వారా లభించే పరువుప్రతిష్ఠలతో ఇట గొప్ప సాహిత్యవేత్తగా ప్రకాశించడానికంటే, ప్రజాహిత సాధనం కోసమే ప్రధానంగా కృషిచేశారు. శాస్త్రీయ విజ్ఞానాన్ని, ఆయన ప్రజల్లో ప్రచారం చేసి, ఆవాబకం ఆచరణకు ప్రచారణ సందజేశారు. స్త్రీలసాహిత్యమనే ఉపరంగాన్ని రూపొందించి, అభివృద్ధిచేసి, స్త్రీలలో చదువు మీద జిజ్ఞాసను పురికొల్పారు.

పంతులుగారి సాహితీరంగంలోని కృషిమీద సమగ్రంగా పరిశోధన చేసినవారు అక్కిరాజు రమాకాంతరావు గారని చెప్పాలి. పంతులుగారి నవలలు, నాటకాలు, అనువాదాలు, మొదలైన అన్నిప్రక్రియలను విభజించి వివరించారు. ఆయన తెలుగు సాహిత్యరంగానికి అందించిన ప్రక్రియలన్నింటినీ క్షుణ్ణంగా పరిశీలించి, ఎనలేని శ్రమ కోర్చి, ఫలితాన్ని గ్రంథరూపంలో ఉంచారు. తరవాత వచ్చిన జీవిత చరిత్రకారులు. ఆయన జీవిత విశేషాలను క్రోడీకరించినవారు, అవుల సాంబశివరావు, నార్ల వంటివారు. రమాపతిరావుగారి సంపూర్ణమైన సమగ్రమైన ఆధారగ్రంథసూచికపై ఆధారపడి చేశారేమో అంటారు అమెరికన్ చరిత్రకారుడు జాన్ లియొనార్డ్. రమాకాంతరావుగారి 'పంతులుగారి జీవితం'లో, ముఖ్యఘట్టాలు సంవత్సరాలవరసలో తప్పులు వచ్చాయంటారు లియొనార్డ్. పందొమ్మిది ఇరవై శతాబ్దాలలోని రచనల్నిపరిశీలిస్తే, తొలిపరిశీలనలు సామాన్యంగా పంతులుగారి సాహిత్య కృషిని క్లుప్తంగా సమీక్షిస్తాయి. వాటిలో జయంతి రామయ్యగారి 'ఆధుని కాంధ్ర వాఙ్మయ వికాస వైఖరి' – కురుగంటి సీతారామయ్య, పిల్లలమర్రి హనుమంతరావు వ్రాసిన ''నవ్యాంధ్ర సాహిత్య వీథులు'' – నిడదవోలు వెంకటరావు గారి ''ఆంధ్రవచనవాఙ్మయము'' చాల విలువైనవి. వీరేశలింగం గారి సాహిత్యరంగంలోని కృషిని విమర్శించి, ఆయనతో విభేదించిన సాహిత్యవేత్తల్నీ అలాగా సంఘటనల్నీ ఈ గ్రంథాలు వివరిస్తాయి. పంతులుగారి ప్రాముఖ్యాన్ని గురించి తెలుగుసాహిత్యవేత్తలకూ ఆంధ్రజాతీయ నాయకులకూ ఉన్న భిన్నాభిప్రాయాలను కూడా ఈ గ్రంథాలు విశదపరుస్తాయి.

ఇవి ఎంతో ఉపయోగకరమైనప్పటికీ – పంతులుగారి గ్రంథాలూ వారి సమకాలికుల రచనలకంటే ఎక్కువైన వివరాలు ఈ పరిశోధనవల్ల లభించడం లేదు. వాటి దృష్టిని తెలుగుసాహిత్యంలో వచ్చేమార్పులకు మాత్రమే పరిమితమైంది. అవి అంతకంటే విస్తృతమైన సాంఘిక సాంస్కృతిక పరిణామాలకు సంబంధించినవిగా ఉండడం అరుదుగా కనబడుతుంది.

చాలమంది ఇప్పటికే పంతులుగారి జీవితచరిత్రను వ్రాశారు. కవిగా ఆయన చరిత్రను 1894 లోనే తోలేటి వెంకటసుబ్బారావుగారు రాశారు. ఆయనను పంతులుగారి ప్రెస్‌లో పనిచేయడం వల్ల సన్నిహిత పరిశీలన కూడా వుంది– ప్రత్యక్షంగా. శ్రీ నార్లగారు ఆయన జీవితకథను తాకినారి సమీక్షించారు. కానీ కింజెనార్డ్, మక్లీ, ఆయన ఇచ్చిన తేదీలు సందర్భాలు సరియైనవి కావంటారు. A catalogue of Telugu books in British museum తో పోల్చి చెపుతారు.[1]

పంతులుగారు 1911 లో ఆత్మకథ మొదటి సంపుటాన్ని ప్రచురించారు. 1915 లో రెండవ సంపుటం వెలువడింది. 1890 నుంచి 1913 వరకు ఆయన జీవితం ఇందులో వివరించబడింది. ఆ సంవత్సరమే టి.వి.సుబ్బారావుగారి వివరణాత్మకమైన ద్వితీయ సంపుటం ప్రచురించబడింది. పంతులుగారి కథను, జె.గురునాథం ఆంగ్లంలో ప్రచురించారు. వారిద్దరూ పంతులుగారి స్వీయచరిత్రనే ఆధారంగా తీసుకున్నారు. పంతులుగారి మరణానంతరం, ఆయన అంతేవాసినీ, సుప్రసిద్ధ కవయిత్రి, కాటికలపూడి సీతమ్మగారు 'కందుకూరి వీరేశలింగ చరిత్ర' అనే పద్యకావ్యాన్ని రచించారు. దీనిని ఆయన జీవితచరిత్రగా విభజించి చూసేకంటే, విషాదగాథ అంటే సులువుగా ఉంటుందేమో! 1931లో రాయసం వెంకటశివుడుగారు 'శ్రీవీరేశలింగ సంస్మృతి' అనే గ్రంథాన్ని రచించారు. ఇది పంతులుగారి సహచరులతో, సన్నిహిత బంధుమిత్రులతో, అనుయాయులతో ఆయనకున్న

---

1. London 1912

సంబంధ గ్రంథాన్ని గురించిన చక్కని స్పష్టమైన సమగ్రమైన వివరణ.[1] ఇతీలో శివుడుగారు పంతులుగారి శిష్యులే. తరవాత కొన్నాళ్ళకు విడిపోయినా, వృద్ధులైన పంతులుగారి పట్ల ఆయనలో ప్రేమాభిమానాలు మాత్రం పోలేదు.

1944 నుంచి 1959 వరకు పంతులుగారి జీవిత చరిత్రలెన్నో వెలిశాయి. ఆయన మీద వ్యాసాలెన్నో వచ్చాయి. కె.వి. దేశికాచారిగారు రచించిన ''జీవితచరిత్ర''[2] సంగేపి నారాయణస్వామిగారు ప్రచురించిన 'శ్రీ వీరేశలింగ స్మృతి' ఆంధ్రదర్శినిలో పంతులుగారిని గురించిన వివరణ[4] పంటు కృష్ణమూర్తిగారి 'వీరేశలింగచరిత్ర'[5] 'తెలుగు విజ్ఞానసర్వస్వం'[6] మూడవసంపుటి.

ఈ జీవిత చరిత్రకారులందరు రచయిత వీరేశలింగంగారికీ సంస్కర్త వీరేశలింగంగారికి మధ్యనున్న అగాధాన్ని విశ్లేషించి చూడలేదేమోననిపిస్తుంది. సంఘసంస్కరణలో ఆయన సాధించిన విజయాలపట్ల బహుకొద్ది ఆసక్తినీ అభిరుచినీ ప్రదర్శించిన సామాజికులు, ఆయన పొందిన అపజయాల్లో అంతకంటే ఎక్కువ ఆసక్తిని చూపలేదు. ఆయనపై రచనలు సాగించిన రచయితలు కూడ ఆయన జీవితంలోని కొన్నికొన్ని విధానాల్నీ దృక్పథాల్నీ ఆయన జీవితం నుంచి ఎన్నుకొని రాశారు. సామాన్యంగా వారికి తగిన వాటినీ, నచ్చినవాటినీ, వారు మెచ్చిన వాటినీ తీసికొన్నారు. చరిత్రలో నాయకత్వపాత్ర వహించడానికి తమదృష్టిలో నచ్చిన విధానాల్నీ, దృక్పథాల్నీ ఆయన జీవితం నుంచి ఎన్నుకొని విభిన్న దృక్కోణాలనుంచి, విభిన్నాభిప్రాయాల ననుసరించి ఆయన చరిత్రనూ, ఆంధ్రుల చరిత్రను కనుగొనడానికాయన స్వీయచరిత్రనే అధికంగా ఉపయోగించారు. సంఘసంస్కర్తగా ఆయన సంపూర్ణమయిన సమగ్రజీవితాన్ని, విభిన్నకోణాల నుంచీ పరిశీలించి, విభజించి చారిత్రక దృక్పథంతో లింపెయనార్డు సమర్పించారు.

ఇంతమంది చేపట్టి ఒక్కొక్కరు ఒక్కొక్క దృక్పథంతో పూర్తిచేసిన ఈ మహామనీషిగావించిన సంఘసంస్కరణలను, స్త్రీజాతిని నిద్రాణదశ నుండి జాగ్రదవస్థకు గొనితెచ్చిన స్త్రీజనోద్ధారకుని గురించి ఆదృక్పథంతో సమగ్రంగా పరిశీలించాలన్న పరమలక్ష్యంతో ఈ కార్యక్రమాన్ని చేపట్టడమయింది. సంస్కరణ

---

1. Guntur 1931
2. Rajahmundry 1946
3. Rajahmundry 1953
4. Vijayawada 1955
5. Rajahmundry 1957
6. Madras 1959

కార్యక్రమాలన్నీ స్త్రీని కేంద్రంగా, తీసికొని ఆమె చుట్టూ తిరుగాడేవే అవడంవల్ల ఆ స్త్రీ జాతి స్థానం భారతీయ సమాజంలో ఋగ్వేదకాలం నుంచీ ఎలా ఉంటూ వచ్చిందో పరిశీలిస్తూ వచ్చి పంతులుగారి జననకాలునాటికెంత అధమస్థాయిలో ఉందో గమనిస్తూ ఆసమయంలో జననమందిన పంతులుగారి జనన కాలపరిస్థితులు, పుట్టి పెరిగిన వాతావరణాన్ని సన్నిహితంగా అనుశీలనచేస్తూ అంతటా పరిస్థితులాంతయున్న సాహితీవేత్తగా, సంఘసంస్కర్తగా ఎలా రూపొందించారో. ఆయన సమాజంలో స్త్రీజాతి స్థానాన్ని, స్థాయినీ ఋగ్వేదకాలపరిస్థితికి గానిరావాలని పట్టుదలతో పనిచేసిన విధానాన్ని విపులంగా వివరించడమయింది. స్త్రీ విద్యావతి కావడానికి అవసరమయిన పరిస్థితులను పంతులుగారి దృక్పథంలో వివరిస్తూ, ఆమెకు విద్యావకాశాలను కల్పించడానికి, ప్రత్యేక పాఠశాలలను ధనాభావంతో దిగ్విజయంగా నిర్వహించలేకపోయినపుడు ఆస్తిక పాఠశాలలో ఆధునిక యుగంలో మొట్టమొదటిగా సహవిద్యనారంభించిన సంస్కర్త. బాలికలకే కష్టము లేకుండ ఉండడానికవసరమయిన జాగ్రత్తలన్నింటినీ ఆయన తీసికొన్నారు. పంచములనీ మాలమాదిగలనీ పారద్రోలే రోజుల్లోనే ఆయన వారికి ఆస్తిక పాఠశాలలో ఉచిత విద్యాసౌకర్యాన్ని కల్పించడంలో ఆద్యులైన ఉదారహృదయులు. మంచి, మానవతా కలిగిన మహోన్నతమూర్తి.

సమాజంలోని దురాచారాలనూ, అనాచారాలనూ, అవినీతి, లంచగొండితనాలను కూకటి వేళ్లతో పెల్లగించనారంభించిన మానవతావాది. మహాసంస్కర్త, అయిన పంతులుగారి జీవితసరళిని చక్కగా విశదపరచడమయింది.

ఈ కృషిలో అవసరమయినది ప్రత్యేకించి ఆయన రచనలు. తరువాత సమకాలీనుల రచనలు, సమకాలీన పత్రికలు, ప్రభుత్వరికార్డులు, డిస్ట్రిక్టు గెజటీర్లు, మద్రాసు నేటివ్ న్యూస్‌పేపరు రిపోర్టులు, మొదలయిన ఎన్నో ముద్రిత గ్రంథాలను సమకూర్చిన సంస్థలకూ, వ్యక్తులకూ, అవసరమైన విషయాలను సేకరించి యిచ్చిన స్నేహితులకూ, అభిమానులకు ఎంతగానో ఋణపడియున్నాను. దానిని కేవలం స్త్రీగా ఈ నాటి సమాజంలో స్త్రీల స్థాయిని, స్థానాన్నిగాంచి,

అన్నిరంగాలలోను, ఉన్నతస్థానాలను అందుకొనే అవకాశాన్ని రాజ్యాంగంలో కలిగించియుండడాన్ని చూసి, ఈ ప్రగతికి మూలం అయిన పంతులుగారి పట్లగల కృతజ్ఞతా భావాన్ని తెలుపుకోవాలనే భావంతో చేసిన కృషియిది.

—: ooo :—

## పద సంకేత వివరణ పట్టిక

1. అ.సం. అథర్వణ సంహిత
2. ఆప.గృ.సూ: ఆపస్తంబ గృహ్య సూత్రములు
3. ఆశ్వ.గృ.సూ: ఆశ్వలాయన గృహ్య సూత్రములు
4. ఋ. ఋగ్వేదము
5. ఋ.సం. ఋగ్వేద సంహిత
6. కం.వీ.కృ.: కందుకూరి వీరేశలింగ కృత గ్రంథాలు
7. కం.వీ.వ్యా.: కందుకూరి వీరేశలింగ వ్యాసములు
8. కం.వీ.స్వీ.: కందుకూరి వీరేశలింగ స్వీయ చరిత్ర
9. పు. పుట - పుటలు
10. బృహ.ఉప.: బృహదారణ్యకోపనిషత్తు
11. బోధా.గృ.సూ.: బోధాయన గృహ్య సూత్రములు
12. సాంఖ్య.గృ. సూ. సాంఖ్యాయన గృహ్య సూత్రములు

ABRIVIATIONS.

1. Aait. Brah. : Aaitaraya Brahmanam.
2. A.V. : Atharvanaveda.
3. C. M. S. : Church Missionary Society.
4. C.M.S.A. : Church Mission Society Archives.
5. G. O. I. : Government of India.
6. G.O.M. Report : Government of Madras Report.
7. I. E. C. : Indian Educational Commission.
8. I. O. L. : India Office Library.
9. M. E. P. : Madras Educational Proceedings.
10. M. F. P. : Madras Financial Proceedings.
11. M. J. P. : Madras Judicial Proceedings.
12. M.L.M.P. : Madras Local & Municipal Proceedings.
13. M.N.N.R. : Madras Native News Reporter.
14. M. P. P. : Madras Public Proceedings.
15. M. R. O. : Madras Record Office.
16. P. : Page.
17. P. P. : Pages.
18. Sat. Brah. : Satapatha Brahmanam.
19. Tait. Brah. : Taittiriya Brahmanam.
20. V. V. : Viveka Vardhani.
21. V. S. C. : Veeresalingam Sweeya Charitram.

---

# సాహిత్యం – సమాజం – సంస్కరణం

సాహిత్యానికి సమాజానికి ఉన్న సంబంధం యుగయుగాలుగా గుర్తించబడింది. సమాజ జీవనం సాహిత్యంలో ప్రతిబింబిస్తుందనే విషయం సర్వవిదితం.

సాహిత్యం – సమాజం 'లిటరేచర్ అండ్ సొసైటీ' అన్న ఆంగ్లవ్యవహారానికి సమానార్థకాలు. సాహిత్యంలో వచ్చే సకలమయిన మార్పులు సమాజంలో వచ్చేవాని ప్రతీకలే. ఆరెండింటిని గురించి కొంత పరిశీలిద్దాం.

సాహిత్యం ఎప్పుడు ఎలా ఆవిర్భవించిందీ విశదీకరించడం ఆవశ్యకం. సమాజంలో రసార్ద్రహృదయుండయినవాడు తన కష్టసుఖాలను తనదయిన శబ్దసంపద ముఖంగా వ్యక్తపరచడమే ప్రాక్తన భాషలో సాహిత్యావతరణమని చెప్పవచ్చు. దీని పుట్టుపూర్వోత్తరాలు ఊహాకందని దూరానికి పోతాయి. రాజ్యాలావిర్భవించక పూర్వం సభ్యత జనించనినాడు ఈ అవతరణ జరిగింది. సాహిత్యం సంగీతం కలిసే కవలలుగా జనించాయి. ఈ విషయంలో మనకు ఆఫ్రికాలో నిదర్శనాలింకా కనిపిస్తాయి. ఏదయినా ఆపద కలిగినప్పుడు గాని, ఆనందం అతిశయిల్లినప్పుడు గాని వారు ఢక్కలమీద ఒక లెక్కప్రకారం దెబ్బకొట్టి ఎంరంగువారికి పొరుగువారికి కూడా వార్తలనందజేస్తారు. ఆ ఢక్కానాదంలో ఒక కవితా స్పర్శ ఉంటుందని భావుకుల తలంపు.

మనదేశంలో కూడా ఇదే జరుగుతూ ఉండేది. ఇది సర్వదేశాలలోను జరిగిన విషయం, జరుగుతున్నది, జరుగబోయేది. నాట్లలో, కోతల్లో, పండుగ పబ్బాల్లో, పల్లెసీమల్లో బృందగానాలు చేయడం అనాదిగా వస్తోన్న ఆచారం. మానవుడు తన నిత్యజీవితంలో ఎదురయ్యే కష్టనిష్ఠురాల తాకిడికి తట్టుకోలేనప్పుడు ఆనందావేశాల వురవడిలో కొట్టుకుపోయినప్పుడు అతని హృదయాంతరాల నుండి బహిర్గతమయిన సహజగానమది. ఇదే కవితాప్రాదుర్భావప్రథమరూపమనవచ్చు. స్త్రీల పాటలు, పలిపాటలు, లాలిపాటలు, గాబ్బిపాటలు, జాజరపాటలు, తుమ్మెదపదాలు

వీరమ్మ, కామమ్మ, తిరుపతమ్మ, లక్ష్మమ్మగాథలు, వీరగాథలు, యక్షగానాది వివిధరూపాలు సమాజ హృదయం నుండి బహిర్గతమయ్యాయి. మచ్చుకు కొన్ని జానపదగేయాలు గమనిద్దాం.

''బాయికేమో వచ్చినాము, బాయిగంగా మేలుకోవే
బద్దరామరా బాయిగంగా బాలులూ నీ భారమమ్మా'' 1

మరొకటి

''ఆకులేనీ అడవిలోనా మేకలేలా మేపుతావూ
ఆశలేనీ దానియెంటా దేశమేలా తిరుగుతావూ'' 2

ప్రాథమిక దశలో అవతరించిన కవిత గేయరూపంలో బహిర్గతమయింది. స్త్రీల పాటలు వాటి నుండి అనుక్రమంగా వచ్చేవి ఆకోవకు చెందినవే. సమాజం పొందే ఒడిదుడుకులన్నీ ఈ గాన వాహినిలో ప్రతిబింబితమవుతాయి. సుఖదుఃఖాలు, కోపతాపాలు, ఆవేశావేశాలు, సర్వవిధాలయిన అనుభూతులరా ఆనాటివారికి తెలిసిన భాషలో గేయరూపంలో వెలువడ్డాయి.

ఈ దేశికవిత్వం ఏదేశానికాదేశానికి వేరుగా వర్తిస్తుంది. ఆయాదేశాల సమాజ పరిస్థితిని అదిగానంచేస్తుంది. నిజానికి ప్రజాకవిత్వమంటే ఈ దేశికవిత్వమే అనిపిస్తుంది. సరళమయిన, అకృత్రిమమయిన, నిసర్గమయిన కవిత్వం దీనిలో కనబడుతుంది. అయితే జరిగిందేమిటి? ఆనాటి పాటలు, గేయాలు గాలిలో జనించి గాలిలోనే సమసిపోయాయి. లిపిలేనినాడు వాటికి స్థిరరూపం కాదు కదా! లిపి యేర్పడిన తరువాత కూడా ముద్రణాసౌకర్యం లభించే వరకు శాశ్వత రూపం లభించినప్పటికీ బహుళ ప్రచారం సాధ్యం కాలేదు. లిపి లేనినాడున్న ఆశురూపం అక్షర రహితమైన (సాహిత్య) కళ. లిపియేర్పడిన పిమ్మట వచ్చింది అక్షరబద్ధమైన కళ.

---

1. ''తెలుగులో కొత్తవెలుగులు'' ఆచార్య తూమాటి దొణప్పగారి రేడియో ప్రసంగాలు. మొదటి సంపుటి. 'మన జానపద సాహిత్యం' పుట. 147.

2. పైది.

## సాహిత్య ప్రయోజనం

సాహిత్యం దేశకాల సామాజిక పరిస్థితులతో సంబంధం లేకుండా శూన్యంలో వ్రేలాడే పదార్థంకాదు. సాహిత్యానికీ సమాజానికీ భావనామయమయిన బింబ ప్రతిబింబ సంబంధముంటుంది. సాహిత్యం చదువరుల - శ్రోతల హృదయాలపై శాశ్వతముద్రవేస్తుంది. మనసుకు వికాసాన్నీ, మహానందాన్నీ ప్రాప్తింపజేస్తుంది. ఆహృదయమందిరాల్లో శాశ్వత స్థానమేర్పరచుకొని వారిని ఉత్తమమానవులుగా మలచడానికి, కర్తవ్య నిర్వహణ మార్గాలను నిర్మించడానికీ ఉపకరిస్తుంది.

"మానవజాతి ప్రగతి పథంలో మనోవికాసం యాదృచ్ఛికంగా సంప్రాప్తించింది కాదు. ఆదిలో చేతినాక సునిశితమయిన పరికరంగా మలచుకోడానికి ఎంతో పరిణామచరిత్ర జరిగింది. అదేరీతిని మధురాలాపనకు పరవశించే చెవి, మనోహరా కృతికి మెరిసే కన్ను మొదలయిన జ్ఞానేంద్రియాల నిశితత్వాన్ని సాధించిన మానవుడు ఆనందానుభవాన్ని స్వాధీన పరచుకోడానికి ఎంతో శ్రమించాడు, దాని కెంతో క్రమపరిణామం కావలసివచ్చింది." అన్నది కారల్‌మార్క్స్ మహాశయుని ప్రవచనం.

పంచేంద్రియాల ద్వారా లభించిన సమస్తమయిన అనుభవాలసారాన్ని అనుభూతుల వాసనల మధ్య భద్రపరచుకొన్న మానవ హృదయంతో సాహితీ క్షేత్రవ్యవసాయకుడయిన కవికి గల ప్రత్యక్ష సంబంధం మరేయితర కళకూ, కళాకారుడికీ లేదు.

కవి ఆత్మాశ్రయరీతిలో ఈ తిబాధల్ని హృదయానుభూతుల్ని సమన్వయ పరచిరాస్తాడు. చదువరికి ఆకవిచిత్రించిన భావాలు స్వీయానుభూతులుగా మార్చగల మాంత్రికశక్తి కవి సృజించిన సాహిత్యానికుంటుంది. రచయిత వల్ల వ్యక్తపరచబడ్డ అంశాలలోని నిశితత్వం, అనుభూతి చిత్రణలోని సార్వజనీనత,

రచనా నైపుణ్యం, సుందరతరంగా, లలిత మనోజ్ఞంగా మలచే శక్తి, సమర్థత చదువరి హృదయంతరాళంలో నిగూఢంగా, నిశ్శబ్దంగా దాగి ఉన్న కంఠాలు, గొంతెత్తి వినిపింపజేస్తున్న అనుభవాన్ని అతనికి కలుగజేస్తాయి. అందువల్ల సామాజికుల అంతశ్చైతన్య మంతా ఒకే కాలవీచికి అర్ధ్రమయి ఉంటుంది. దీన్ని క్రిస్టఫర్ కాడ్వెల్ ఈ క్రింది విధంగా చెప్పాడు.

"Men are affected by each other's emotional experience and the experience of reality"[1]

దీనివల్ల సాహితీ స్రష్ట అయిన రచయితకు దానిని ఆసక్తితో పఠించే పాఠకుడికి మధ్య ఎలాంటి అవాంతరాలు లేని అవినాభావ సంబంధం ఏర్పడుతుందన్న విషయం స్పష్టమవుతుంది. 'సమాజ సన్నిహిత సంబంధంతో మానవుడిలో చైతన్యం రూపొందుతుంది. ఆసంపర్కం కేవలం ఆసమాజంలోని అందరి చిత్తవృత్తులతో కాదు. చిత్తవృత్తులను సహజాతాలే పాలిస్తాయి. అయితే ఏమని? సామాజిక సంపర్కమంటే ఆర్థికోత్పత్తితో ఏర్పడిందని అర్థం.[2]

సాహిత్య మెప్పుడూ వర్తమానంలోని ప్రభావాలకు లోనవుతూ భవిష్యత్తు మీద తన ప్రభావాన్ని ప్రసరింపజేస్తుంది. సమాజపరిణామాన్ని, రాజకీయ కల్లోలాలనీ కేవలం స్థూలమాత్రంగా కాక జీవనధాతువు గానే పరిగణించి కానసాగుతుంది. అందువల్ల సాహిత్యం సహజ సౌందర్యాన్ని సంతరించుకో గలుగుతుంది. సమగ్రజీవిత జన్యమయిన సాహిత్యం శక్తిమంతమై సజీవసుందరంగా బహుముఖ ప్రకాశమై విలసిల్లుతుంది.

## సాహిత్యం - సమాజం - పరస్పర సంబంధం

సాహిత్యం సామాజికుణ్ణి పాలకునిలాగ శాసిస్తుంది. ధర్మాధర్మాలను ఈ విధంగానే ఆచరించడమవుతుంది. మిత్రునిలా హితాహిత బోధచేస్తూ సన్మార్గంలో నడిపిస్తుంది. అనుకూలవతి, అనురూపవతి అయిన గృహిణి సర్వవిధాలా భర్తమనసును

---

1. Caldwell - Illusion and Reality, p. 160.
2. Ibid, p. 144.

రంజింపజేసి వ్యంగ్యంగా అనుసరించి ఆచరింపవలసిన విధులను తెలియజేస్తూ సద్గుణ సంపన్నునిగా తీర్చిదిద్దేటట్లు సాహిత్యం చేస్తుంది. ఇలా సాహిత్యం సామాజికుని మీద ఎనలేని రీతిని తన ప్రభావాన్ని ప్రసరింపజేసి జీవనవిధానాన్ని మార్చివేయగలిగినంతటి శక్తి సంపన్నమయింది.

అలాంటి సాహిత్యాన్ని సృజించే స్రష్ట సృష్టికి అవసరమయిన ద్రవ్యం కావాలి. ద్రవ్యమంటే పదార్థం. అది సమాజంలోని పరిణామాల నుండే లభిస్తుంది. కవి సమాజంలో జనించి ఆ సమాజసంప్రదాయాలను జీర్ణించుకొని తన వ్యక్తిత్వం వల్ల ఆ సంప్రదాయాల కాకవినూత్న రూపాన్నిచ్చి ఒక నూతన విప్లవాన్ని లేవనెత్తుతాడు. ఈ సృష్టి ప్రతిభావంతమయి నూతన రూపంతో సమాజానికొక వినూత్నమయిన బాటనేర్పరుస్తుంది. ఎలాంటి వినూత్నమార్గాన్ని సృజించినా సమాజపు ముద్ర కవి మీద పడక మానదు. అతడి మనశ్శరీరాలు రెండూ సమాజంవల్ల ప్రభావితాలవుతాయి. కాబట్టి అతని సాహిత్యమంతా సమాజం మీదే ఆధారపడి ఉంటుంది.

కాగా సాహిత్యసమాజాల్లో ఏదిదేనిమీద ఆధారపడి ఉన్నదో చెప్పడం కష్టసాధ్యం, ఇది- విత్తు ముందా? చెట్టు ముందా? అన్న సామెతలా ఉంటుంది. చక్రనేమి న్యాయంగా పరస్పరాశ్రయాలై పరిభ్రమించే విషయాల్లో ఏది ముందు ఏది వెనుక అనే అంశాన్ని నిష్కర్షగా నిర్ధారణ చేయడం దుస్తరం. ఎంత పరిశీలించినా, ఎన్ని ఉపమానాలు తెచ్చిచూపినా రెండువాదాలు పాక్షికాలే గాని, ఏ ఒక్కటి పరిపూర్ణ సత్యంకాలేదు. కాగా అవి రెండూ పరస్పరాశ్రయాలుగా ఉండడం ఈ లోకంలో కనబడుతుంది.

## భేదాభేదాలు

ఈ జగతిలో ఏ శక్తీ ఎల్లప్పుడూ విజృంభితావస్థలో ఉండదు. ఇదొక జీవన స్రవంతిలాంటిది. ఎల్లప్పుడూ ఏకరీతిని స్రవించదు. ఒకప్పుడొక చోట కోస్తుంది. మరొకసారి వేరొకచోట దిబ్బవేస్తుంది. అదేరీతిలో సమాజం ఉద్రిక్తస్థితిలో ఉన్నపుడు

సాహిత్యాన్ని నియంత్రించి తన యిష్టానుసారం నడుపుకొంటుంది. సాహిత్యం ఉద్రిక్తావస్థలోనున్నప్పుడు సమాజాన్ని తన చిత్తానుసారం నడుపుకో గలుగుతుంది. మొత్తం మీద రెండూ గంగా యమునల్లా ప్రవహిస్తాంటాయి. ఏది ఎలాగున్నా సామాజిక జీవనంవల్లనే సాహిత్యం ఆవిర్భవిస్తుంది. సమగ్ర మయిన సామాజిక జీవనంలేనినాడు సాహిత్యం కూడా ఉండదు. పరస్పర భావాలను అవగతం చేసికోవలసిన అవశ్యకత కలిగినప్పుడు భాష ఉత్పన్నమవుతుంది. ఆఅవసరం కూడా సామాజిక జీవనమున్నపుడు మాత్రమే కలుగుతుంది. ఏవిషయాన్నయినా ఆలోచించటానికి, అభివృద్ధిపరచడానికి భాషే ప్రధానసాధనం. అదిలేనినాడు మానవుడు ఆలోచించడం కూడ కష్టసాధ్యం.

ఈ విధంగా సమాజంలో ఆవిర్భవించిన భాషసమాజంతో పాటు మారుతూ ఉంటుంది. సామాజిక జీవనంలోనే కళ ఉంటుంది. అదిలేనినాడు కళే మృగ్య మవుతుంది. కాబట్టి కళను గాని, కళలో ఒకభాగమయిన సాహిత్యాన్ని గాని సమాజం నుండి విడదీసి విమర్శించి యిదమిత్థమని తేల్చుకోడానికి వీలులేదు. అలాచేసిననాడు అగమ్యం తప్ప మరేమీ గోచరింపదు. ఈ కళకూ, సాహిత్యానికీ కారణభూతమయిన సమాజం అనుక్షణం మారుతూ ఉంటుంది. అలామారే సమాజంతోపాటు మానవుడి అనుభూతులు కూడా మారుతూ ఉంటాయి. ఈ అనుభూతులు మారుతూ ఉండడంవల్లనే పూర్వకాలంలో ఒక విషయం ప్రముఖం కాగా నవీనకాలంలో అది కాకపోవచ్చు. సామాజిక పరివర్తన వల్ల మానవుడి అనుభూతులు మారుతాయని అన్నాం. దానివల్లనే సాహితీ లోకంలో కూడ మార్పుకలుగుతుందన్నమాట. కాగా సామాజిక పరివర్తన ఎలా సంభవించేదీ వివరంగా చెప్పగలిగింది మార్క్స్ మహానుభావుడొక్కడూ మాత్రమే.

ఆమహానుభావుడి చారిత్రిక భౌతిక సిద్ధాంతాన్ని అనుసరించి సమాజం మారడానికి కారణం. సమాజంలోని ఆర్థికోత్పత్తి సంబంధాలు, వీటి నాధారంగా చేసికొనే తత్త్వం, శాస్త్రం, నీతి, ధర్మం, చట్టం, కళ, భావం, భాషలో ఉద్రేకాలు ఏర్పడతాయి. వీలయినంత వరకు ఉత్పత్తి సంబంధాలు, ఉత్పత్తి సాధనాల వల్ల నిర్ణయింపబడతాయి. ఈ ఉత్పత్తి సాధనాలు కూడ పర్వకాలాల్లోను సమానరీతిలో

ఉండవు. పరిస్థితుల ననుసరించి మారుతూ ఉంటాయి. సమాజంలోని నీతి, ధర్మం, సత్యం, భావం, ఆదర్శం వారికి సంబంధించి ఉంటాయి.[1]

ఈ సందర్భంలో గమనార్హమయిన అంశమొకటుంది. ఏజాతి యొక్క ఆర్థిక స్థితి, సమ్యగ్గతిలో స్థిరపడగలుగుతుందో ఆజాతి సాహిత్యం మరాడుపువ్వులా ఆరుకాయలుగా వర్ధిల్లుతుంది. కాబట్టి ఆర్థిక విధానాన్ననుసరించి సాహిత్యం కూడా వెంపొందగలదన్న విషయం స్పష్టమవుతోంది గదా!

సమాజం సాహితీ స్రష్టను ఒకరకంగా అనుశాసిస్తుంది. దాన్ని కాదని ఏ కవి కూడా ఆకాశంలో హర్మ్యాలను నిర్మించడం అసాధ్యం. ఒకవేళ నిర్మించినా అవి ఎన్నినాళ్లు మనగలవనే సంశయం తప్పదు. అందువల్ల ఎంతటి ప్రతిభావంతుడయిన కవి అయినప్పటికీ సమాజానికి లోబడి నడుచుకోవలసిందే. కాని ఒక విశేషం మాత్రం ఉంది. సమాజశ్రేయస్సును భంగపరచనంతవరకు మాత్రం కవికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఉంటుంది.

## సంస్కరణ

సంస్కరణ లేక సంస్కారం అంటే మార్పు. మార్పు ప్రకృతి ధర్మం. దృగ్గోచరమయినా అగోచరమయినా ఉనికిని కలిగి ఉన్న ప్రతిపదార్థం మార్పును పొందుతూనే ఉంటుంది. సజీవపదార్థాల్లో మార్పు త్వరితంగా కనబడుతుందంటే నిర్జీవ పదార్థాల్లో మార్పు శూన్యమని అర్థం కాదు. కాని అన్నివిధాలా కాన్ని పరిధుల్లో జీవిస్తున్న వ్యక్తి,నిర్జీవపదార్థాల్లో నెమ్మదిగా కానసాగుతూన్న మార్పును గుర్తించని సామాన్య జనానీకానికి మార్పు అంటే భయం. ఈ మార్పు, పరిణామం అనేవి ఒక్కక్షణంలో ఉడిపడవని చెప్పుకున్నాం గదా! వాటంతట అవికూడా ఏర్పడవు. కొందరు వ్యక్తులు తమ ఆలోచనా విధానాల్లో, జీవనసరళిలో వినూత్న పద్ధతులను ప్రవేశపెట్టుకుంటారు. ఆపద్ధతుల మంచితనాన్ని గురించి ప్రజాబాహుళ్యంలో ప్రబలంగా ప్రచారం చేస్తారు. అలా సమాజంలో రావలసిన మార్పుకు ఒకరకంగా నాందీవాక్యం పలుకుతారు. ఆమార్పు లేక పరిణామం

---

1. జి.వి.కృష్ణారావు - కావ్యజగత్తు పుటలు 80 - 82.

రావడానికోసం తమ జీవితాలనే 'పణం' గా పెడతారు. ఆపరిణామాల కోసం చేసే ఉద్ధృత ప్రవరాలే ఉద్యమాలు. అలాంటి ఉద్యమాలు జనించడానికి దేశంలోని 'కాలమానపరిస్థితులు' కారణమవుతాయి. ఉద్యమాలుదయించిన తరువాత ఉద్యమకారుల్లో నూతనోత్సాహం ప్రవేశిస్తుంది, వెల్లుబుకుతుంది. వారు తమ మేధనూ, అనుభవాన్నీ పురస్కరించుకొని చేసే పనులు ప్రజల జీవన సరళినీ, దేశగతినీ కూడ మార్చివేయగలుగుతాయి. గతంలో చేశాయి, చేస్తాయి. ఆపనుల్లో మంచినీ, అభివృద్ధినీ గ్రహించలేని మహార్షులు-ఈ మారు సంస్కారంకోసం పనిచేసే సంస్కర్తలకు ప్రతిపక్షంగా నిలబడి అభివృద్ధి ఆటంకపరచడానికి ప్రయత్నిస్తారు. అదీ జగత్తులో సర్వసామాన్యం. ఆటంకపరచేవారికి అభివృద్ధి కారకులయిన సంస్కర్తలు, వారి సంస్కరణ మహోద్యమాలు మహమ్మారిలా కనిపిస్తాయేమో! స్వయం జ్ఞానం లేనినాడు జరిగేవిలాంటివే గదా!

ప్రతి ఘటనలు ఎదురయినా, సంఘర్షణలు చెలరేగినా, సంస్కరణలు సమాజంలో అడుగడుగునా జరుగుతూనే ఉంటాయి. బౌద్ధులు క్షణికవాదులు. వారి సిద్ధాంతాన్ననుసరించి శరీరం క్షణక్షణానికి నూతనరూపం దాలుస్తుంది. ఈ జగత్తుకూడ అలాంటిదే. ప్రతిక్షణం సంస్కరణాన్ని పొందుతూంటుంది. అలాగే సాహిత్యంకూడా. మనసులో కవితలేని మానవుడుండడు. ఏదో ఒక నూతన విధానానుసరించని కవికూడా కనబడడు. ఏదేశానికాదేశం 'మాకవులు', మాకవులు, అని అభిమానాన్ని వెలిబుచ్చుతూ ఉంటుంది. అయినా కవులందరూ ఎవరి మార్గాన వారు పోతూఉంటారు. ఎవరి భాష వారిది. ఎవరి పోకడవారిది. ఎవరి ఊహవారిది. అది వారి జీవనసంపుటిని బట్టి, చిత్తసంస్కారాన్నిబట్టి మారుతూ ఉంటుంది.

ఈ పరిణామానికి జగమే మూలాధారం. భూతభవిష్యద్వర్తమానాలతో కూడిన ఈ విశాల విశ్వంలో వర్తమానంలో భూతకాలం సూక్ష్మరూపంలో ఉండగా భవిష్యత్తు వర్తమానంలో అంకురప్రాయంలో ఉంటుంది.

సమాజంలో జరిగే అన్యాయాలను సహించనివారు తిరుగుబాటు చేస్తారు. ఆతిరుగుబాటునే విప్లవమంటారు. సమాజపురోగతి చాలవరకు ఈ విధంగానే

జరుగుతుంది. ఇందులో సంఘ సంస్కరణోద్యమాలు ఒకభాగం. సమాజంలో మార్పును గోరే ఉద్యమాలను సంఘసంస్కరణోద్యమాలనీ, రాజకీయపరిణామాలు రావాలని కోరే వానిని రాజకీయవిప్లవాలనీ సాహిత్యంలో మార్పుకావాలనే వాటిని అభ్యుదయ విప్లవాలనీ అంటారు. అన్నీ స్థూలంగా పరిశీలిస్తే ఒకే జాతికి సంబంధించినవి అనే విషయాన్ని విస్మరించరాదు. అన్నీ ఒక నూతన పథాన్ని, ఒక నూతనరీతిని, ఒక నూతన విధానాన్ని కోరుతూన్న మాట మాత్రం వాస్తవం. జరుగుతున్న ప్రతిమార్పు మంచిని పెంచేది అవుతుందన్నది నూరుపాళ్లూ నిజంకాదు. కాని మంచిని కోరే మార్పునే విప్లవంగా, అభ్యుదయంగా, సంస్కరణగా గుర్తించడం సమంజసం.

## సమాజం – సంస్కరణలు

సంస్కరణలు బహుముఖంగా పయనిస్తూ ఉంటాయి. సమాజం తొలిదశలో, మనిషి మేధావిగా ఎదగని కాలంలో, స్వార్థంతెలియని స్థితిలో స్త్రీ పురుషభేదం ఆకారాలకే పరిమితంకాని స్థితిగతుల విభేదం లేదు. నాది అన్నది లేనప్పుడు, ఆస్తియన్న పదం తెలియదు. మనిషీ మనిషి అనుబంధమే ఆనాడు తెలిసింది. ఆస్తి, స్వార్థంలేని దశలో స్త్రీస్థానం ఉన్నతమయింది. జన్మనిచ్చిన తల్లి పూజలంది గౌరవించబడింది. ప్రకృతి వనరులు సమిష్టి సంపద అయినట్లే స్త్రీ పురుషులందరు కలిసి జీవించడమే కాని నావారు అన్న కుటుంబదృష్టి ఆనాడు లేదు. తండ్రి ఎవరో తెలియని దశ అది. నాగరికతా పరిణామంలో కుటుంబమేర్పడింది. సమాజంలో మాతృస్వామ్య వ్యవస్థ నెలకొంది. తల్లిగా, అధికారిణిగా గౌరవాలందుకొంది స్త్రీ. సమాజం మరింత ఎదిగింది. మేధస్సు వికసించింది. స్వార్థం పెరిగింది. ఆస్తికి సంబంధించిన బయట పనులు తానుచేపట్టి కాయకష్టంతో కండబలాన్ని పెంచుకున్నాడు పురుషుడు. ఎండకన్నెరుగ అవసరంలేని బాధ్యతలతో పనులతో సహచరిని అబలగా మార్చుకున్నాడు. పూర్తిగా పరాన్నజీవిగా ఆమెను మార్చి సర్వాధికారాలు తాను చేజిక్కించుకొని పితృస్వామ్య వ్యవస్థను పటిష్ఠం చేశాడు.

సమర్థవంతమయిన కుటుంబం ఏర్పడింది. కుటుంబంలో తండ్రి యజమాని. తదితరులు అతని ఆజ్ఞాబద్ధులు. కాని, ఒకే పురుషునికి ఒకేస్త్రీ ఉన్న ఆచారం శ్వేతకేతునికి పూర్వమున్నట్లనిపించదు. కుటుంబమరియాదల్లో అతిథి కన్నపానాదులు సమర్పించినట్లే భార్యను సమర్పించే ఆచారముండేదారోజుల్లో. జుగుప్సాకరమయిన ఈ ఆచారాన్ని అసహ్యంచుకొని స్వస్తి చెప్పించినవాడు శ్వేతకేతువని భారతం చెప్తుతుంది.[1] ఇది కూడా ఒక సంస్కరణే కదా. ఆనాటి నుండే వివాహం అనేదానికొక అర్థం, ఒక పతివ్రత ఏర్పడింది.

బహుభర్తృత్వం భారతావనిలో కలదని ఉదాహరణ కూడ భారతంలో కనబడుతున్నాయి.[2] ఆనాడు బహుభర్తృత్వానికి నిషేధం లేదనే విషయం స్పష్ట మవుతుంది. ఈనాడు సమాజంలో దానిని అరోచకంగా, అధర్మంగా భావించడం లేదా! దేవరన్యాయం కూడా ఆనాటి సమాజంలో నుండడం భారత కథవల్లనే తెలుస్తుంది. దాని నిప్పుడందరు అతినీచంగా, పాపంగా భావించడం లేదా? దానిని సమాజం నుండి కూకటి వేళ్లతో కూడ పెకలించి పారవేయలేదా! అదీ ఒక సంస్కరణే కదా! ఇవన్నీ ఎనాడో అస్తంగతమయ్యాయి. పూర్వం రాజులు మొదలయిన వారిలో బహుభార్యాత్వముండేది. ఇప్పటికీ మహమ్మదీయుల్లో కొంత ఉన్నదనే చెప్పవచ్చు. కాని హిందూ సమాజంలో చట్టంద్వారా దాన్ని నిషేధించారు గదా! అదీ సమాజంలో మరొక సంస్కరణే కదా!

అధునాతన సమాజం సతీసహగమనాన్ని చట్టరీత్యా నిషేధించింది. వరకట్న నిషేధచట్టాన్ని కూడ ప్రవేశపెట్టింది. 'కన్యాశుల్క' మనే దురాచారాన్ని వీరేశలింగం వంటి మహానుభావుల బలీయమయిన ఉద్యమాల ద్వారా క్రమంగా నిర్మూలించారు. ఆ పిమ్మట వచ్చిన దురాచారమే వరకట్నం. చట్టమున్నప్పటికీ అమలుపరచడంలో ప్రభుత్వం విజయవంతం కాలేదని చెప్పవచ్చు. సామాజికుల సహాయ సహకారాలు సంపూర్ణంగా లేనినాడు చట్టాలెన్నటికీ విజయవంతంగా అమలుపరచబడవన్న విషయం సర్వవిదితం. వితంతువివాహాలను వీరేశలింగంగారు ఆంధ్రదేశంలో ఆచారాత్మాలు

---

1. భారతం, 1-5-127.
2. పైది, 1-5-214.

అత్యధికంగా కృషించి ప్రోత్సహించారు. ఇవన్నీ సంఘ సంస్కరణోద్యమాలుగా ప్రసిద్ధిగాంచాయి. అవే సమాజ విప్లవాలు. ఈ విప్లవాలన్నీ సాహిత్యంలో కీర్తింపబడ్డాయంటే సాహిత్యం కూడా కొంతవరకు వీనికి కారకమయి తన విధిని నెరవేర్చుకొన్నదని అర్థమే కదా!

దీనిని బట్టి మనకొక విషయం సుస్పష్టం. సమాజంలో జరిగే సంస్కరణలు సాహిత్యంలో స్థానాన్ని సంపాదిస్తాయని, అలాగే సాహిత్య విషయాలు సమాజంలో జరిగేవనీ, ఈ అవినాభావ సంబంధాన్ని ఇంతకు ముందొకసారి చర్చించడం కూడా జరిగింది.

## సాహిత్యం – సంస్కరణ

మానవుడు సంఘజీవి. సమాజంలోని కష్టనిష్ఠురాలకు, ఆవేశకావేశాలకు స్పందించేవాడు, చలించేవాడే మనీషియై కవిగా మనగలుగుతాడు. ఆస్పందన తప్పక రచనల్లో చోటుచేసుకొంటుంది. సమాజ స్థితిగతులను ప్రతిబింబించిన రచనే పదికాలాలపాటు స్థిరంగా నిలిచి పోగలుగుతుంది. సాహిత్యోదయకాలం నుంచి ఈ నాటి వరకూ సాహిత్యచరిత్రను పరిశీలిస్తే కవుల జీవితంతో ఆదిముడిపడి ఉంటుంది. ఆకవులు తమ కాలంనాటి సమాజంతో ముడిపడి ఉంటారు.

సాహిత్యం సమాజానికి ప్రతిబింబం కాబట్టి అందరూ కావ్యాల్లోని పాత్రలు పరలోకంలోనివారయినా మనం సృష్టించుకొన్న దేవుళ్లనబడే అతీతమానవులయినా కవి కలంతో శాసించబడ్డవారే. కవి ఆలోచనలతో పోషించబడ్డవారే. ఏనాటి సాహిత్యమయినా తన కాలంనాటి సమాజంతో విడదీయరాని అనుబంధం కలిగిఉంటుంది. మారుతున్న సమాజంలో మారని సాహిత్య సిద్ధాంతాలు నిలువలేవు. కాబట్టి సాహిత్యవిప్లవాలు కవాడ తప్పనిసరి – తెలుగులో తొలిసారిగా 'జానుతెనుగు' అనేపేరుతో భాషావిషయకంగా ఒక సిద్ధాంతాన్ని లేవదీసి నన్నెచోడుడు * తరువాత కవులకు మార్గదర్శి అయ్యాడు.[1]

---

1. సి.నారాయణరెడ్డి, ఆధునికాంధ్రకవిత్వం, పు.112.

ఆ సిద్ధాంతాన్ని తిక్కనార్యుడు చెప్పక పాటించాడు. చెప్పి పూర్తిగా సాధించనివాడు పాల్కురికి సోమనాథుడు, సాహిత్యంలో ఈతడు తెచ్చిన మరొక విప్లవం ద్విపద ఛందస్సు. వర్ణవ్యవస్థకు అతీతంగా వున్న వీరశైవం ఆనాటి సమాజరీతికి ఒక తిరుగుబాటు. ఈ వీరశైవ ప్రచారంకోసం ప్రజలకు దగ్గరగా వున్న ద్విపద ఛందస్సును ఉపకరణంగా చేసుకున్నాడు. ఆనాటి కథల్లో, దేవరాల్లో ద్విపద సాహిత్యంలో సర్వులు సమానమన్న భావం వెల్లివిరిసింది. ఆవిధంగా సాహిత్య సంస్కరణతో బాటు సమాజ సంస్కరణకూడా జరిగిన విషయం సాహిత్యంలో ప్రతిబింబితం అవుతుంది. సోమనగారి రచనలనే పరికిద్దాం. సంఘసంస్కరణ సాహిత్యానికి యిది ప్రబల పతాకలాంటిది. మార్గకవిత్వంలో వున్నా కనబడని రీతిలో విప్లవ పంథాను తొక్కినవారు కూడా లేకపోలేదు. అలాంటివారిలో శ్రీనాథుని పేర్కొనవచ్చు. కామ్మలు తిరిగిన కవిసార్వభౌముండే ఈ మహానుభావుడు. అయినా పల్నాటి వీరచరిత్రరాసి విప్లవ పథం తొక్కినాడు. మార్క్స్ చేసిన సమాజ విభాగాన్నను సరించి ఈ కవులందరూ జమిందారీ సమాజంనాటివారు. ఆనాటి సమాజపు ముద్ర వారి మీద పడి కొంతవరకు సాహిత్యాన్ని ప్రజాసాగరాన్కి భిన్నమైన మార్గములో ప్రవహింపచేసినది.

సాహిత్యం సమాజంలో జీవిస్తూ సమాజంతో ప్రభావితమవుతూ సమాజాన్ని కూడా ప్రభావితం చేస్తుంది. ఆ ప్రభావితం చేయడం అనేది మంచి కోసం అయినప్పుడు అది సంస్కరణం అవుతుంది. అలా మంచి కోసం సాహిత్యాన్ని ఉపకరణంగా వాడుకున్నవారు గత కాలంలో వేమన. ఈ పాడులోకాన్ని మరామ్మత్తు చేయరాలని మథనపడ్డ సంస్కర్తలనేకుల్లో వేమన ఒకరు. మమతనూ మానవతనూ పెంచాలని భావించిన మహనీయులన్నికాలాల్లోను కాలాల్లోనూ అవతరించారు. చిత్తశుద్ధితో, స్థిరసంకల్పంతో కృషిచేశారు. కాని ఈ లోకం పరిణామశీలమయినప్పటికీ ఒట్టి మనుష్యతిన్న పెంజేరు. దీని బుద్ధి

కుక్కతోక; దీని స్వభావం చిత్రమయింది. వంచేవాడుంటే ఒదిగిఒదిగి బతుకుతుంది. వంగివంగి దండాలు పెడుతుంది. వారుకనుమరుగయినంతనే యథాపూర్వకమవుతుంది. ఆ మహాపురుషులందరికీ గుళ్లూ గోపురాలు కడుతుంది. పూజలూ పునస్కారాలు చేస్తుంది. ఎక్కడికక్కడికే సర్దుకుంటుంది. సరిపెట్టుకుంటుంది. అంతటితోనే సరి అవతార పురుషులు సఫా! మళ్లీ తనమానాన తానుసాగిపోతుందీ సమాజం. చెప్పేదానికీ చేసేదానికీ పోలిక ఉండదు. దేనికదే, నాటికీనేటికీ కనబడేదదే. ఆలోచించగా రోగమొకటీ మందొకటీ అనిపిస్తుంది. రోగనిర్ణయం సరిగా జరిగితే తప్ప అమృతం పోసినా ఆరోగ్యం ఏర్పడదు. సంస్కరణలదారి సంస్కరణలదే. సంస్కర్తలదారి సంస్కర్తలదే. సమాజందారి సమాజందేను.

పచ్చటి విజయనగర సామ్రాజ్యం భగ్గున మండిపోయింది. సీమసీమకు చిట్టిపొట్టిసామంతులూ,పల్లెపల్లెకూ పాళెగాళ్లూ పరిపాలకులుగా తయారయ్యారు. మహామండలేశ్వరుల అతివేలమైన భోగలాలసత్వం, స్థానికోద్యోగుల అధికారదాహం, దౌర్జన్యశక్తుల విశృంఖల విహారం ప్రజల బతుకుల్ని దుర్భరం చేశాయి. దొమ్మీలూ, దోపిడులూ సర్వసామాన్యమయ్యాయి. ఇలాంటి అరాచకానికి తోడు ప్రజల్లో వేరుకుపోయిన అజ్ఞానం, అల్లుకుపోయిన అమాయకత్వం, వేషధారుల వంచనా శిల్పం పరిస్థితుల్ని మరింత పాడుచేశాయి. పన్నులభారం మించిపోయింది. ప్రతి వృత్తివారు దానితో కటకటపడ్డారు. దానితో ఊళ్లకు ఊళ్లే ఉజాడయ్యాయి. సామాన్యుడి బతుకు పెనంమీద పెసరగింజలా తయారయ్యింది. దినదినగండం దేవర్యాలతో పోరయ్యింది. సదాచారంపేరునా, శాస్త్రాధికారం పేరునా స్వార్థపరుల బరాకరాప్పువైఖరులు, వాదబలం లేకపోయినా వాదిబలంతో ఎదుటివాడి నోరుమూయించే దబాయింపు ధోరణులు వెమ్మేపెరిగిపోయిన దుర్దినాలవి. అర్థంలేని ఆచారాలూ, అంతులేని దురాచారాలూ, మితిలేని శిష్ట మిథ్యాచారాలూ వీరవిహారంచేసిన రోజులవి. అట్టడుగున జనాల్లో వర్తమానంపట్ల అసంతృప్తీ, భవిష్యత్తుపట్ల ఆందోళనా చిట్టచివరి స్థాయికి చేరి సమాజం అట్టుడికినట్లుడికిపోయిన రోజులవి. జాతిలో చాలాభాగం చచ్చినచావుగా బతికిన పీడకలల విషమకాలమది. కళ్లయెదుట కన్నకసుమాలం జరుగుతూ వున్నా, అంతాఎగాదిగా చూసి నీళ్లునమిలేవాళ్లేగాని,

నిలదీసి ఇదేమని అడిగే తాహత్తుగానీ, ఎందుకీ అత్యాచారాలని ఎదురించే గావు గుండెతనంగానీ, ఎవరికీ లేకపోయింది. ఈ అసంతృప్తికి ఒక ఆకృతినిచ్చి తరణోపాయం సూచించగలిగిన నాథుడే కరువయ్యాడు. ఎదుటివాణ్ణి – అందులోను తిరుగులేని అధికారం కలవాణ్ణి – మదోన్మత్తతతో అహంకరించినవాణ్ణి ఎదుర్కోవడం చెదురుమదురుగా ఎక్కడన్నా ఉన్నా చివరిదాకా నిలదొక్కు కోవడం తలకు మించిన పనులు. నూటికో కోటికో నవతను సమతను కోరే వారున్నా పెద్దను ఎదిరించే తెగువగల వారెవ్వరూ లేకపోయారు. ఎవడో పుట్టుకు వచ్చి తమను ఆదుకుంటాడనీ, అమాంతంగా ఆపదల్లోంచి ఆదుకుంటాడనీ, ఆకాశంలోకి ఎదురుచూచే అలవాటు మాత్రం జాతికి పోలేదు. సంస్కారబలం చాలక దగాపడ్డ జాతికి స్వయంపోదకశక్తి శూన్యం. బహుశః యుగయుగాలుగా కర్మసిద్ధాంతానికి కట్టుబడ్డజాతి అవడమే దానికి కారణం కావచ్చు.[1]

అలాంటి దిక్కూదెసా తెలీక, చేవుణికిల్లాడే దశలో చిమ్మచీకటి తెరలను ఛేదించుకుని వెలిగిన వేగుజుక్కలు వేమన వీరబ్రహ్మేంద్రులు. ఇద్దరూ ఇంచుమించు సమకాలీనులే; ఒకరినొకరు ఎరుగకపోయినా, ఒకరినొకరు కలాడబలుకొక్కపోయినా, ఒకేఆశయంతో దాదాపు సమానమైన సాధనాలతో యిద్దరూ తమ ఉద్యమాలను నడపడం యాదృచ్ఛిక సంఘటనే. ఇదేసమయంలో కన్నడ దేశంలో పటిష్ఠమైన ఒక కొత్తగొంతు వీరితో శ్రుతికలిపింది. అదే సర్వజ్ఞుని వాణి. ‘‘భాషలెన్నింటైన భావమొకటి’’. వీరంతా నాస్తికులుకారు; పరమాస్తికులే. వీరి బోధల్లో ప్రశ్నించే తత్త్వం ఉంది. ప్రబోధించే ధోరణి వుంది. వీరు ప్రచారం చేసిన తత్త్వం అంతను పూర్వం అనేక మంది మహనీయులు ప్రతిపాదించిన పరమార్థానికి కొత్త వ్యాఖ్యానలను సంతరించింది. దానితోపాటు పారశీకాది పరసీమల్నుంచీ వచ్చిన ముస్లిం సాధువులు ప్రచారంచేసిన సూఫీతత్త్వం కూడా వీరిమీద కొంత ప్రభావాన్ని కలుగజేసినట్లు కనబడుతుంది. వీరు శాస్త్రంలో నిష్ణాతులుకాకపోవడంవల్ల తర్కకర్కశమైన ధోరణిలోకాక, అలతి, అలతియైన తెలుగు పలుకుల్లో సూటిగా బోధపడే అతి సన్నిహితమైన ఉపమానాలతో తమ ప్రచారాన్ని సాగించారు. నీతిప్రచారానికి వాహకమైన కవిత కేవలం ఒకపరికరంగా మాత్రమే ఉపయోగపడినట్లు కనబడుతోంది.

---

1. ప్రొఫెసర్ టి. దొణప్ప, వేమన – వీరబ్రహ్మేంద్రుల తాత్త్వికధోరణులు – ఆకాశవాణి

సమాజంలోని కుళ్లును కడగడానికి వేమన కవిత్వాన్ని ఉపయోగించిన పద్ధతి నేటికి కాదు. రేపటికూడా రేపటికవిత్వంలాగానే భాసింపజేస్తుంది. ఆయన సమకాలీన సమాజంలో ప్రభావితమవుతున్న మూఢమతాచారాలను వర్ణాశ్రమ విధానాన్ని నిశితంగా విమర్శించిన మహావిప్లవ యోధుడూ మహాయోగి. ఏ తత్కారణము వల్లనే శ్రీశ్రీ అంటున్నట్లు తన గురుత్రయంలో ఒకరిగా గైకొన గలిగాడు.

మూఢాచారాలతో, అవినీతి, లంచగొండితనంతో కుళ్లి లుకలుకలాడుతూ ఉన్న సమాజాన్ని, చైతన్యరహిత్యమైన సమాజాన్ని, నిద్రాణమయిన సమాజాన్ని సాహిత్యంతో మేల్కొలిపినవారు ఆధునికవైతాళికులు వీరేశలింగం, గురజాడ, శ్రీశ్రీ మొందలయినవారు.

విశ్వసమాజంలో వినూత్నమయిన మార్పు

మరొక వినూత్న పరిస్థితి ఈ నాడు సమాజంలో ఏర్పడింది. 'మా దేశం' మా రాష్ట్రం అని గిరిగీసుకొనే సంకుచిత దృష్టికి ఈ నాడు ఏమాత్రం అవకాశంలేదు. భాషలు సాహిత్యాలు, మతాలు, సంప్రదాయాలు అన్నీ కొత్తమూసల్లో పోసి పోతపోయబడుతున్నాయి. ప్రపంచంలో దూరాలన్నీ దగ్గరవుతున్నాయి. ప్రాతర్భోజనం ఢిల్లీలో, మధ్యాహ్నం లండన్‌లో, సాయంకాలం న్యూయార్కులో జరిగేటట్లు సమాజ కార్యకలాపాలన్నీ మారిపోతూ ఉన్నాయి. అభివృద్ధి చెందిన దేశాలలో అద్భుతమయిన శాస్త్రపరిశోధనలు జరుగుతున్నాయి. ఒకప్పుడు దేవతగ పరిగణింపబడ్డ చందమామ నేడు పరిశోధనీయమయిన జడగోళంగా మారిపోయాడు. అన్నిరంగాల్లోను అనుకోని మార్పులు జరిగాయి. జరుగుతున్నాయి. భావ స్రవంతులు తూర్పు నుండి పడమరకు, పడమర నుండి తూర్పుకు కల్లోలితాలై ప్రవహిస్తూనే ఉన్నాయి. వసుధైకరాజ్యం కావాలన్న వాదాలు కూడ అంకురిస్తున్నాయి.

అంతర్జాతీయ వాదం, సర్వమానవతా వాదం బలపడుతున్నాయి. ఇలాంటి క్షుభిత్యమైన దశలో సాహితీపరుల కర్తవ్యం సుస్పష్టంకదా! సాహిత్యంలోనికి ఈ భావనా స్రవంతులన్నీ పొంగిపొరలి వచ్చి సాహిత్యం వినూత్నమయిన రూపాన్ని సంతరించుకోవడంలో ఆశ్చర్యమేమీలేదు.

ఈ సంక్షోభంలో కార్మికకర్షకుల ఆర్తనాదాలు పతితుల దీన జనుల ఆర్తనాదాలు, కవుల చెవుల్లో గింగురుమంటూ వినబడుతున్నాయి. వారు ఆవేశులయి కవితా గర్జన చేయడం సర్వవిదితం. ఆ ఆవేశంలో వారు అగ్నికణాలను కక్కారు. ఇదే ఆధునిక కవిత్వరహస్యం. పూర్వం చరిత్ర అంటే కొందరు రాజులచరిత్ర. ఇతిహాసమంటే కొందరు రాముల కొండలు ధర్మరాజుల కథ. ఈ నాడు చరిత్ర అంటే, ఇతిహాసమంటే దీనుల గాథ, పతితుల కథ అన్నార్తుల ఆక్రందన; అందువల్లనే శ్రీశ్రీ –

'ఏదేశ చరిత్ర చూచిన
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం'.

'నైలునదీ నాగరికతలో
సామాన్యుని జీవనమెట్టిది?
తాజమహల్ నిర్మాణానికి
రాళ్లెత్తిన కూలీలెవ్వరు?'

'ఇతిహాసపు చీకటి కోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తే దాగని సత్యం'

అన్న చరణాల్లో స్పష్టపరచి హెచ్చరించాడు. సంస్కరణ జరగాలి, జరుగుతోంది. ఇకముందు కూడ జరుగుతుంది. ఇది సంస్కర్తలకు సంస్కార వ్యతిరేకులకూ జరిగే సంఘర్షణ. అన్నిరంగాల్లో సత్యాసత్యాలకు, ధర్మాధర్మాలకు, స్వాతంత్ర్య పారతంత్ర్యాలకు సంఘర్షణ జరుగుతూనే ఉంది.

''సత్యం, సన్మతం, సర్వదా ఐశ్వర్యంతో, అధికారంతో, ఉన్నత పదవులతో కలిసి మేడల్లో నివసించవు......స్వాతంత్ర్యానికి శత్రువులయిన వారు

నిరంకుశత్వానికి మిత్రులయినవారు యిందివరకెన్నడూ విజయం పొందలేదు. ఇక పొందబోరు'' [1] అనేది రాజారామమోహనుని ప్రవచనం.

సమాజంలో అన్యాయమధికమయినపుడు ధర్మమడుగంటినపుడు మహాపురుషులుదయిస్తారు. కావలసిన మార్పులు చేసి సమాజాన్ని కాపాడతారు. ఇదే గీతలో శ్రీకృష్ణుడు చెప్పింది కూడా.[2]

అలాంటి మహానుభావుల్లో రాజారామమోహన్‌రాయ్, కేశవచంద్రసేన్, ఈశ్వరచంద్రవిద్యాసాగర్, రనడే, పండిత రమాబాయి, కార్వే, ఆనందబాయి జోషీ, రమాబాయి జోషి, ఆంధ్రదేశంలో వీరేశలింగంగారు, చిలకమర్తి, గురజాడ, పానుగంటి, రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు, పిఠాపురం రాజాగారు మొదలయినవారాకోవకు చెందినవారే.

రామమోహనుడు నవభారత ప్రవక్త, దేశాన్ని ఉరూతలూగిస్తున్న నవశక్తికి పునాది ఆయన వేసిందేనని చెప్పాలి. భారతదేశ రాజకీయ, సాంఘిక, నైతిక, మతవిషయిక ఆశలన్నీ ఆయనలో మూర్తీభవించిన వనడంలో అతిశయోక్తిలేదు.

సమాజంలోని దురాచారాలను మాన్పడానికి, ఆయన జీవితాంతం సర్వశక్తులను వినియోగించి, నిర్విరామకృషి చేసిన మహానుభావుడు, రాజకీయ నిరంకుశత్వాన్నేవిధంగా ఖండించాడో సాంఘిక నిరంకుశాధికారాన్ని కూడా అదేవిధంగా, అసహాయశూరుడై ఎదురొడ్డి అతిఘోరంగా పోరాడి సతీసహగమనాది దురాచార పిశాచాలను తుంచి సాంఘిక స్వాతంత్ర్య జయ పతాకాలనెత్తి భారతీయుల తీరని కృతజ్ఞతకు పాత్రుడయ్యాడు. ఒక వంక స్త్రీలు, బలహీన జాతుల పట్ల ఘోరానాన్యాయాలు చేస్తూ మరొకవంక పాశ్చాత్యులు మన కన్యాయం చేస్తున్నారని గంభీరోపన్యాసాలు చేసే కపటదేశభక్తులకు ఆయన సంఘ సంస్కరణ రాజకీయ సంస్కరణ కంటె ముందుజరగాలనీ, సంఘంలోని అన్యాయాలను తొలగించి, దురాచారాలను మొట్టమొదలుగా రూపుమాపాలని ఉద్బోధించారు.

---

1. సీతారామబ్రహ్మం – రాజర్షి రాజారామమోహన్‌రాయ్ ద్వి. శతజయంతి సంచిక పు. 154.
2. యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. – భగవద్గీత

అదే విధంగా తరువాత వచ్చిన ఆంధ్రరాజా రామమోహనుడు, వీరేశలింగంపంతులుగారు• అయన కూడా సమాజంలో సర్వులు ముందు విద్యావంతులు కావాలనీ, ముఖ్యంగా స్త్రీలకు విద్య అత్యంతావశ్యక మనీ అప్పుడుగాని సమాజంలో చైతన్యం వెల్లివిరియదనీ ఉద్బోధచేసిన మహామనీషి• ఉజ్వలమయిన విజ్ఞాన కాంతికిరణాలు సమాజంలో సర్వత్రా వ్యాప్తించి, తన ప్రచండ కిరణాలవేడిమితో మూఢాచారాలను, మూఢవిశ్వాసాలను భస్మీపటలం చేసి అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు కావించాలని ఉద్ఘాటించారు•

ఈ మహానుభావుల నిరంతర కృషి సాహిత్యం నుండి ప్రతిబింబిత మవుతోంది• వీరేశలింగంగారు ముఖ్యంగా తమ ఆశయసిద్ధికి, అంటే సంఘసంస్కరణానికి సాహిత్యాన్ని ప్రయోజనార్ధంగా వాడారు• ఫ్రాన్సు దేశంలో వాల్టేర్ మహాశయుని వలె పంతులుగారు తమకలాన్ని ఖడ్గసదృశంగా రూపొందించిన మహానుభావుడు• సాంఘిక దురాచార నిర్మూలన కోసం బహుముఖ సాహితీ ప్రక్రియలను సృజించిన సాహితీవేత్త• 'వివేకవర్ధని' అనే మాసపత్రికను స్థాపించి భాషాభివృద్ధికి, సమాజాభివృద్ధికి సేవచేయగలిగానని స్వీయచరిత్రలో చెప్తారు•

లంచగొండితనం, స్త్రీవిద్యావిషయం, వితంతు వివాహం, బాల్యవివాహాల నరికట్టడం, మూఢవిశ్వాసాలను, దురాచారాలను రూపుమాపడం మొదలయిన విషయాల్లో ఆయన సాగించిన అవిరళ కృషి అనితరసాధ్యం•

ఆయన కృషి సంఘ సంస్కరణోద్యమాలతో ఆగలేదు• సాహిత్యక్షేత్రంలో అనేక నూతనశాఖలను నాటి భవిష్యత్తును దర్శించగలిగిన మహామనీషి ఆయన• ఒకమాటలో చెప్పాలంటే ఆంధ్రావనికి సాంఘికంగా, సాహిత్యాత్మకంగా నవచైతన్యాన్ని కలిగించిన ప్రథమ వైతాళికుడు వీరేశలింగంగారు•

## ప్రకృత రచనోద్దేశం

సాహిత్య విప్లవాలను గురించి యింతకు పూర్వం మనవి చేశాను• అవికొన్ని కవితా రీతుల్లో, మరికొన్ని మతవిషయాల్లో, యింకా కొన్ని

సాంఘిక వ్యవస్థలపయినా వచ్చినట్లు కనబడుతుంది. సమాజంలో సంప్రదాయం సిద్ధంగా వస్తూ ఉన్న మూఢాచారాలు, మూఢవిశ్వాసాలపైన తిరుగుబాటు జరిపి, వాటిని సమూలంగా నిర్మూలించి సమాజ సంక్షేమం కొఱకు నూతన సంప్రదాయాలను నెలకొల్పిన ఆ మహామనీషి వీరేశలింగంగారి మహత్తరమయిన కర్మయజ్ఞాన్ని సాహిత్యదర్పణంలో తిలకించి ఆయనకాలంలో జరిగిన సంస్కరణాన్ని ఆయన సాహిత్యరూపాలనుంచి సమీక్షించడమే ఈ రచన యొక్క పరమలక్ష్యం.

- : o : -

భారతదేశ చరిత్రలో అతిప్రాచీనమయింది వేదయుగం. ఆతరువాత క్రమంగా బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు, మంత్రబ్రాహ్మణాలు, పురాణేతిహాసాలు, రూపొందాయి. పురాణయుగానికి ముందున్నది జైన బౌద్ధయుగం. అయినా ప్రాచీన కాలాల్లో భారత స్త్రీల స్థితిగతులు ప్రస్తుతం స్థూలంగా పరిశీలిద్దాం.

వేదకాలంలో స్త్రీలు – ఋగ్వేదంలో

ఏకాలంలోనయినా స్త్రీజీవితానికి ప్రధానమయిన దశలు మూడు. బాల్యం, యౌవనం, వార్ధక్యం. ఒకటి ఉషోదయం, ఇంకొకటి మధ్యాహ్నకాంతి, వేరొకటి సాయంసంధ్య. బాల్యంలో కన్య, (వేద పరిభాషలో దుహిత) యౌవనంలో గృహిణి, (పత్ని) వార్ధకంలో మాత (జననీ). ఈ మూడు దశల్లోనూ ఋగ్వేద కాలంలో స్త్రీల పరిస్థితి ఉన్నత స్థాయిలో ఉండేదనడానికి ఎటువంటి సందేహమూ లేదు.

ప్రాచీనకాలంలో స్త్రీలూ పురుషులు సమానస్థాయిలో జీవించేవారు. నాడు స్వాతంత్ర్యాధికారిణులు. మగపిల్లవాడు పుణ్యఫలమనీ ఆడపిల్ల పుట్టడం అశుభప్రదమనీ అనాడనుకొనే వారు కారు.

సాధారణ గృహకృత్యాలతోపాటు అగ్నికార్యాలు, దేవతాపూజలు మొదలయిన మతక్రియల్లో కూడ పురుషులతో సమానంగా బాధ్యతలనూ, అధికారాలనూ స్త్రీలు వహించేవారు.[1] పుత్రుల్లాగే పుత్రికలకు కూడా ఉపనయనమూ, విద్యాభ్యాసమూ[2] జరిగేవి. శ్రాద్ధకర్మలు చేయటంలోనే ఆనాడు స్త్రీపురుషులు దాయాదులుగా సమానులే. స్త్రీలు తక్కువగా గాని, తేలికగా గాని చూడబడలేదు. ఈ సత్యాన్ని నిరూపించడానికి ముందుగా 'కన్య' అన్నపదాన్ని పరిశీలిద్దాం.

---

1. మహాభాష్యం. 4. 1–14–3 పు. 155
2. యమస్మృతి. హారీతుని వీరమిత్రోదయము సంస్కార ప్రకాశ పు. 402–403.
3. నిరుక్త – 2 – 5

భర్త భుజించిన తరువాత భార్య భుజించాలి.[1] భర్తమాట మీరకుండా సతి పతినుండి మెప్పుపొందుతుంది.[2]

సతీపతులు సమ సుఖాల భాగస్వాములు కాక పతిలో సతి విలీనమైపోయిన పరిస్థితి వచ్చింది. మరొక విశేషం కూడా కనబడుతుంది. శతపథ బ్రాహ్మణం (3.1.2.21) కన్యను పారితోషికంగా ఇవ్వబడిన వస్తువుగా వివరిస్తుంది. (ధేన్వో, నడ్వా) అంటే స్త్రీ ఒకవస్తువుగా పరిగణింపబడిందన్న మాటగా? బహుమానాలుగా ఇవ్వబడిన వస్తువు కదా!

ఈ విధంగా బ్రాహ్మణాల కాలంలో భిన్న భావాలు కన్పిస్తున్నాయి. మతవిషయాలలో గృహిణికున్నత స్థానముంది. గృహ, సమాజ విషయాలలో స్త్రీస్థాయి తగ్గింది.

## ఉపనిషత్తులు – గృహిణి

ఉపనిషత్తుల కాలంలో మళ్ళీ మెరుగయింది స్త్రీల పరిస్థితి. ఆడివారి కుత్సితమనే భావముండేది. ఛాందోగ్యోపనిషత్తులో

''కుటుంబం భవతు తే వ్యాపనీయమ్, త్వదీయం భవతు మే మనః''

అని వధువుతో వరుడు చెప్పే వచనాల్లో దంపతుల సమైక్య భావం వ్యక్తమవుతుంది. బాల్యవివాహం మొదటిసారిగా ఛాందోగ్యోపనిషత్తులో కనబడుతుంది. దాని వల్ల స్త్రీ విద్యాభ్యాసానికి అంతరాయం కలిగిందని వ్యక్తమవుతోంది. కానీ స్త్రీ విద్య అంతరించలేదని కూడా జానశ్రుతి కథవల్ల తెలుస్తుంది. శూద్రుడయిన జానశ్రుతికి రైక్వుడు బ్రహ్మజ్ఞాన ముపదేశించటానికి నిరాకరించాడు. జానశ్రుతి తన కుమార్తెను రైక్వుని కిచ్చి వివాహం చేస్తాడు. రైక్వుడంగీకరిస్తాడు. అప్పుడు తన భార్యద్వారా అతనికి బ్రహ్మజ్ఞానాన్ని బోధించవచ్చని అంటారు!

---

1. శతపథబ్రాహ్మణం 1.9.2-12, 10.5-2-9
2. ఐతరేయ బ్రాహ్మణం 24-7.8, గోపథ బ్రాహ్మణం 2 - 3.22

ఇది నేటికీ సంప్రదాయమయిన విషయం. మట్టిముద్దల పరీక్షల వల్ల కన్యాదాన్వయమ్ము తెలిసి అవకాశమున్నది. చాలమంది సూత్రకారులు మట్టిముద్దల పరీక్షను చెప్పుతారు. కాని అందరూ కాదు. ఆపస్తంబుడు చెప్పినట్లు తగిన కన్యను మనస్సు చెబుతుంది. వివాహ విషయంలో కన్యల కిడవలసిన స్వేచ్ఛ యివ్వబడలేదనేందుకు ఈ పరీక్షలు చాలుతాయి. మట్టిముద్దల నమ్మకాల మీద కన్యవివాహ జీవితాల్ని ఆధారపడి ఉండేయంటే వారి స్థాయి ఎంత దిగజారిపోయిందో మనకర్థమవుతుంది. పెద్దలెవరిని పెళ్ళాడమంటే వారిని పెళ్ళాడాలి.

ఆశ్వలాయనుడు అష్టవిధ వివాహాలను వివరిస్తాడు.[1]

1. బ్రాహ్మము : సకలాభరణ భూషితమైన కన్యను, వరుని కాళ్ళు కడిగి, వధువు తండ్రి కన్యాదానం చేస్తాడు.
2. దైవము : శ్రౌతాగ్నుల ప్రక్క బలిపూజలు చేసే పురోహితునికి వధువు తండ్రియై దక్షిణగాని కన్యాదానం చేస్తాడు.
3. ప్రాజాపత్యము: వధూవరులు ధర్మాలను నిర్వహించాలని ఆదేశించబడి, వధువు తండ్రిచేత, కన్యాదానం చేయబడుతుంది.
4. ఆర్షము : వధువు తండ్రికి ఎద్దును గాని, ఆవును గాని వరుడిచ్చి, కన్యను వివాహంలో గ్రహిస్తాడు.
5. గాంధర్వము : వధూవరులు అన్యోన్యానురాగంతో (పెద్దలతో నిమిత్తం లేకుండా) ప్రేమించుకుని పెళ్లిచేసుకుంటారు.
6. ఆసురము : వధువు తండ్రిని ధనంతో తృప్తిపరచి, (కన్యాశుల్కమిచ్చి) వధువును (వివాహమార్గానికి) తనతో వరుడు తీసుకు వెళతాడు.
7. పైశాచికము : కన్య, ఆమె కుటుంబమూ, నిద్రలో గాని అనారోగ్యంగా గాని ఉన్న సమయంలో, వరుడు దొంగచాటుగా వచ్చి, వధువుని బలవంతంగా ఎత్తుకుపోతాడు.
8. రాక్షసము : కన్యయొక్క కుటుంబసభ్యులతో యుద్ధంచేసి ఎదిరించి, ఆమెకిష్టం లేకపోయినా, తీసుకుపోయి వరుడు పెళ్ళి చేసుకుంటాడు.

---

1. ఆశ్వలాయన గృహ్యసూత్రాలు 1–6, 1, 2, 3, 4, 5, 6, 7.

ఎక్కడా కనబడదు. గృహ్య సూత్రకారులందరూ వివాహ విధానాన్ని విపులంగా వివరించారు. స్వల్ప భేదాలున్నా వారందరివీ ఒకే పద్ధతులు. పెళ్ళి సాధారణంగా వధువు గృహంలోనే జరుగుతుంది. అగ్నిసన్నిధిలో, అగ్నిసాక్షిగా జరుగుతుంది. ప్రతిప్రక్రియకు వేదమంత్రోచ్చారణ జరుగుతుంది. ఆ వివరాలిప్పుడు పరిశీలిద్దాం.

మొట్టమొదట వరుడు మంత్రోచ్చారణ చేస్తూ, వధువు యొక్క కుడిచేతి బొటన వ్రేలిని గ్రహించాలి. అదే పాణిగ్రహణ మహోత్సవం. బొటన వ్రేలిని పట్టుకుంటే పుత్రసంతానాన్ని కోరుకున్నాడనీ, తక్కిన వ్రేళ్ళను పట్టుకుంటే పుత్రికా సంతానాన్ని కోరుకున్నాడనీ సూత్రకారుడు సూచిస్తాడు. ఇది విచిత్రమైన భావం కదా! ఆనాడు కూడా ఆడపిల్లలు పుట్టాలని కోరుకునే వారని దీనివల్ల తెలుస్తుంది. అంటే ఆడపిల్లల మీద హీనభావం లేదని రుజువవుతోంది.

"వాడను నేను, ఆమెవు నీవు. ఆమె నీవు, వాడు నేను.
స్వర్గం నేను, భూమి నీవు. సామం నేను, ఋక్కు నీవు. రమ్ము.
మన మిక్కడ వివాహమాడెదము గాక! పుత్రాన్ని జనయుదుం గాక!"

అంటూ, వధువును వెంటబెట్టుకుని, వరుడు అగ్నిగుండానికి, జలకలశానికి ప్రదక్షిణం చేస్తాడు.

వివాహం వల్ల భార్యాభర్తలకు అవినాభావ సంబంధం ఏర్పడుతుందనీ, సంతానం కోసమే పెళ్ళి చేసుకోవడమనీ ఈ మంత్రం వల్ల తెలుస్తుంది. 'నీవు నేను, నేను నీవు' అన్నది దంపతుల మహాదాదర్శం. ఆ తరవాత అశ్మారోహణం జరుగుతుంది. ఒక రుబ్బురాయి మీద వధువు నిలబడాలి. "ఈ రాయిపై నెక్కుము, రాయివలె స్థిరంగా నుండుము" అంటాడు వరుడు. ఎదురుదెబ్బలెన్ని తగిలినా, స్త్రీ చలించకుండా నిబ్బరంగా నిలద్రొక్కుకొని ఉండాలనే భావం ఈ మంత్రంలో స్ఫురిస్తుంది.

---

1. పారస్కర గృ.సూ. — 1-7 3-4
2. మంత్రపాఠ 1 3-7 ఆశ్వలా. గృ.సూ. పు.20
3. ఋ.వే. 14 1-47

ఒది స్త్రీ మహోన్నత స్థానానికి నిదర్శనం. రామలక్ష్మణులకోసం సీతా ఊర్మిళలను వశిష్ఠుడూ, భరత శత్రుఘ్నులకోసం మాండవీ శ్రుతకీర్తులను విశ్వామిత్రుడు జనకుని అర్థిస్తారు ׀బాలకాండ•70 సర్గ•45 శ్లోకం׀

''భాస్కరునకు ప్రభవలెను అనన్య భరాతంతెరా, అట్లే భర్తకు భార్య అనన్యభరాత'' ׀ 5•21•5 ׀

రామాయణ కాలంలో స్త్రీలు గృహలక్ష్ములు, గృహదీప్తులు. విదుషీమణులు, విజ్ఞానధనులు, జ్ఞానమూర్తులు, గౌరవనీయులు.

## మహాభారతంలో

మహాభారత కాలంలో కూడా స్త్రీలు బ్రహ్మచర్యదీక్షతో వేదవిద్యాభ్యాసం చేసేవారు. అటువంటి వారిలో ' సులభ ' ప్రముఖురాలు ׀12•320׀. ' శివ ' అనే యోగిని సకల వేదశాస్త్రాలు అభ్యసించిన విదుషీమణి ׀ 9•54, 6-8 ׀. గౌతమి కూడా బ్రహ్మతత్త్వాన్ని గ్రహించిన విద్వాంసురాలు.

రాజవంశస్త్రీలు న్యాయశాస్త్రాలనూ, రాజకీయాలనూ అభ్యసించేవారు. ధర్మాన్ననుసరించేవారు. అందుకు నిదర్శనం గాంధారి. యుద్ధానికి వెళ్లే ముందు దుర్యోధనుడు తల్లిని దీవించమని కోరగా ' యతో ధర్మస్తతో జయః ' అన్న గాంధారి దీవెన సూక్తిగా నేటికీ నిలబడింది.

ద్రౌపది విద్వాంసురాలేకాక, విజ్ఞానిని కూడా! ''నన్నోడి తన్నోడెనా? తన్నోడి నన్నోడెనా?'' అని ఆమె వేసిన ప్రశ్న ఆమె న్యాయశాస్త్ర విజ్ఞతను నిరూపిస్తుంది.

నృత్య, గాన, చిత్రలేఖనాలను గృహమందే అభ్యసించేవారని విరాట రాజపుత్రిక ఉత్తర ఋజువు చేస్తుంది. ׀ 3•232׀.

గృహానికి స్త్రీలు లక్ష్ములనీ కరదీపికలనీ జాగ్రత్తగా పరిరక్షించుకోవాలనీ మహాభారతం చెపుతుంది ׀ 5•38•11 ׀.

నరకాసురునితో పోరాడిన సత్యభామ, అర్జునునకు రథసారథ్యం చేసిన సుభద్రా వీరనారులు.

ఆవేశంతోపాటు ఆలోచన కూడా జీవితంలో అవసరమని శకుంతల కథ చెపుతుంది. ఇచ్చిన మనసు తీసుకోగూడదని దమయంతి బోధిస్తుంది. పాతివ్రత్యమహాత్మ్యాన్ని ప్రదర్శించిన సాధ్వీమణి సావిత్రి.

ఆకాలంలో స్త్రీలు విద్యావంతులు, సమాజంలో గౌరవస్థానాన్ని ఆక్రమించారు. సతులు పతులకు సహధర్మచారిణులు. ద్రౌపదిని ధర్మరాజు జూదంలో 'పందెం' పణంగా పెట్టడం, స్త్రీలు పురుషుల సొత్తు సొత్తులు అన్భావాన్ని కలిగిస్తుంది. అంటే స్త్రీ స్థానం బాగా తగ్గిపోయిందన్నమాట.

## జైన బౌద్ధ యుగాలలో

జైనమత స్థాపకుడైన మహావీరుడు తన సంఘంలో స్త్రీలను చేర్చుకోడాని కెన్నడూ వెనుకాడలేదు. పురుషుల కంటే స్త్రీలే అధిక సంఖ్యాకంగా జైన మతంలో ప్రవేశించారు. నూతన మార్గంలో ఉన్నత విద్యను స్త్రీలకు బోధించడాని కంగీకరించింది, జైనమతం. స్త్రీ పురుషులకు సమాన స్థాయినీ సమానావకాశాలనూ కల్పించింది.

> ''స్త్రీగాని, పురుషుడుగాని, ఎవరి కారకాయరదం వేచి
> యుంటుందో వారు ఆయరదం వల్లే విచ్ఛిన్నుని సన్నిధికి
> పోదురుగాక! ''

అని సుప్రసిద్ధ జైనగురువుల గ్రంథం ' ది బుక్ ఆఫ్ కిండ్రెడ్ సేయింగ్స్ ' పార్టు-1, పు. 45లో వ్రాశారు. ఆకాలంలో స్త్రీలకు స్వాతంత్ర్యమూ, మానసిక ఆధ్యాత్మిక వికాసాలకు అవకాశమూ ఉండేవి. బౌద్ధయుగంలో స్త్రీలు ఆధ్యాత్మిక ~~వికాసాలకు అవకాశము ఉండేవి~~ సాహిత్యరంగంలో

సాధించిన ప్రగతిని థేరీగాథలు (భిక్షుణుల గీతాలు) క్లుప్తంగా వివరిస్తాయి. ఆగ్రంథంలో 71 మంది భిక్షుణులు రచించిన గీతాలు 500 కంటే ఎక్కువే ఉంటాయి.

ధమ్మ : (178 గీతాలు) గుత్తా: (163 ఎఫ్.ఎఫ్ గీతాలు) రోహిణి (71 ఎఫ్ ఎఫ్ గీతాలు) అనోపమ: (155 ఎఫ్ఎఫ్ గీతాలు)

ఈ థేరీలలో కొందరు గొప్ప ఆచార్యులు, బోధకురాండ్రు. కనుక వారు సంపూర్ణంగా విద్యాభ్యాసం చేశారని చెప్పాలి. ధమ్మదిన్న - సుక్క - పటాచార - ఖేమ - వీరందరూ గొప్ప భిక్షుణులై బౌద్ధధర్మాన్ని బోధించి, ప్రచారం చేశారు.

తుల్లానంద - కుంగల - బద్దాకుండల - వీరుకూడా ధర్మమార్గాన్ననుసరించిన విదుషీమణులు.

ఆకాలంలో స్త్రీ విద్యకూ, స్త్రీస్వాతంత్ర్యానికీ, ఎటువంటి అవరోధాలూ లేవు. పురుషులతో సమానంగా స్త్రీలు సాంఘిక రాజకీయరంగాలలో ఉన్నత స్థాన మాక్రమించారు. మతరంగంలో ఉత్తమ స్థాయి సాధించారు.

## స్మృతుల యుగంలో

అనేక సాంఘిక రాజకీయ కారణాలవల్ల స్త్రీల స్థాయి కొంత వరకు తగ్గింది. స్త్రీలకు వేదవిద్య నిషేధించడం వరకు వచ్చింది. అయినా వారి గౌరవం మాత్రం తగ్గలేదు.

మనువు మాతృదేవతలైన స్త్రీలను ప్రత్యేకంగా అభినందించాడు. ''ఉపాధ్యాయుని (సామాన్య విద్యాబోధకుని) కంటె ఆచార్యుడు (ఆధ్యాత్మిక గురువు) పదిరెట్లు మిన్న, వందమంది ఆచార్యదేవుల కన్నా ఒక పితృదేవుడు మిన్న, వెయ్యిమంది జనకులకన్న ఒక మాతృదేవత మిన్న'' (మనుధర్మశాస్త్రం-2, 145, 146)

అత్రిస్మృతిలో, భూమండలంలోని గురువులందరినీ మించిన మహాగురువు మాతృదేవత, అనివర్ణించబడింది.

అత్రిస్మృతి (188 ఎఫ్ ఎఫ్) – యాజ్ఞవల్క్యస్మృతి (71) – పరాశర స్మృతి (24–5) – ఎట్టి పరిస్థితిలోనూ స్త్రీని పరిత్యజించగూడదని శాసించాయి.

స్త్రీలకు వేదమంత్రాలు లేకుండా ఉపనయనం చేయవచ్చునని మనుస్మృతి (2–66,7) ఆదేశించింది. అందువల్ల స్త్రీల కుపనయనం మనువు కాలంలో ఆగిపోయింది. కాని, ఏదో విధంగా విద్యాబోధ మాత్రం ఆగలేదు.

వేదానంతరం బౌద్ధయుగంలో కూడా స్త్రీ ఆదరింపబడేది.

''కన్యాప్యేవం పాలనీయా శిక్షణీయాతియత్నతః''

పుత్రికను కూడా పుత్రునంత జాగ్రత్తగా పెంచి విద్యాబుద్ధులు నేర్పించాలి (మహానిర్వాణతంత్ర 8–47)

మహాకవి, నాటక రచయిత, వ్యాకర్త అయిన రాజశేఖరుడు సుప్రసిద్ధ గ్రంథమైన కావ్యమీమాంస (పు. 53) లో ఇలాగన్నాడు.

''పురుషవత్ యోషితోపి కవిభావేయుః సంస్కారోహ్యా
త్మని సమవైతి, నస్త్రైణం పౌరుషంవా విభాగం
అపేక్షతే, శ్రూయంతే దృశ్యంతేచ రాజపుత్ర్యః
మహామాత్య దుహితరో గణికాః కౌతుకి భార్యాశ్చ
శాస్త్ర ప్రహత బుద్ధయః కావ్యాశ్చ.''

పురుషుల వలె స్త్రీలు కూడా కవిత్వం చెప్పగలరు. సంస్కారం కలవారు కూడా. శక్తిసామర్థ్యాలలో స్త్రీపురుషలింగ భేదముండదు.

రాజకుమార్తెలూ, అమాత్యుల పుత్రికలూ, వేశ్యల కుమార్తెలూ, ఉపపత్నుల పుత్రికలూ కూడా మహాగ్రంథాల నధ్యయనం చేసి, వానిలోని విజ్ఞానాన్ని సొంతం చేసుకొని, వాటిమీద ఆధిపత్యం వహించి, కవయిత్రులైన వారెందరో కనబడతారు, వినబడతారు. కనక విద్వత్సరస్వతులకూ అర్హమైనదే!

' చతుర కవిత్వ తత్త్వపటు సంపద ఒక్కరిసొమ్ముకాదు, భారతి
దయ సౌధవార్ధి, కవిరాజుల మానసముల్ఘటంబు, లాయతమము
కాలంది లబ్ధమగు నయ్యమృతంబు....'

పశువు నుంచి మానవుని వేరుచేసేది విద్య.

" విద్యావిహీనః పశుః "

కనక స్త్రీపురుష భేదం లేకుండా సర్వమానవులకూ ఉత్తమ విద్య ఉత్సవసరం. అని సర్వులూ గ్రహించాలి.

జ న ని

మాతృభక్తి, మాతృపూజ, భారతీయుల మతంలోను, సాహిత్యం లోనూ, సామాన్య కళల్లోనూ, తత్త్వశాస్త్రంలోనూ వివరించబడింది. మాతృపూజకు ఈ దేశంలో విచిత్రమైన, పురాతనమైన చరిత్ర ఉంది. మాతృదేవతను గురించి రూపొందుతూ వచ్చిన నవీన భావాలతోపాటు, ఆమూర్తికి నూతనరూపాలూ నవ్యపూజావిధానాలూ ఉద్భవించాయి.

ప్రాచీన కాలంలో సెమెటిక్, హెల్లెనిక్, ట్యుటానిక్, నార్డిక్ జాతులలో కూడా మాతృదేవత మీద విశ్వాసం ఏదో ఒకరూపంగా ఉన్నట్టు కనబడుతుంది. వారిలో అది కాలక్రమేణా తగ్గింది. భారతదేశంలో ఆమాతృత్వం తన ప్రభావాన్ని, అనాదికాలం నుంచి ఆధునిక యుగందాకా, ప్రసరిస్తూనే ఉంది.

మాతృపూజలు ఒకవిధమైన ఉత్సవాలుగా మాతృస్వామిక సమాజంలో ఆరంభమైనాయి. ఆకాలంలో జననీయంత్రే కేంద్రస్థానం. సమాజంలో తమ స్థాయినీ స్థానాన్నీ పిల్లలు తల్లి వద్ద నుంచే సంగ్రహించడం సువిదితం. మాతృదేవత క్రమంగా కాళీమాతగా రూపొందింది. సింధునాగరికతలో శివుని అర్ధాంగిగా మాతృదేవత లీలామాత్రంగా గోచరిస్తుంది. ఆభావానికి ఫలితంగా వైదిక సాహిత్యంలో మాతృదేవతలనేకాలుగా అవతరించారు.

<u>వేదాలలో</u> : పురుషదేవతలకే ఆధిక్యం. స్త్రీదేవీ మూర్తులు స్వల్పసంఖ్యలో అరుదుగా కనబడతారు.

<u>అదితి</u> : మొదటి స్త్రీ దేవత అనాలి. దేవతలకు మాత. పురాణాల్లో దేవమాతగా ప్రబలింది.

పృథ్వి : మాతృపూజా పరిణామంలో అత్యంత ప్రాధాన్యంగల దేవత. స్వర్గాధిపతితో కలిసే ఆమె ప్రార్థింపబడుతుంది. ఋగ్వేదంలో [1] 'మాతృం 'మా భూమాత గాప్పది ' అని విడిగా వేరొక్కనుడింది. తండ్రియైన స్వర్గాధిపతినీ, తల్లియైన పృథ్వీపతినీ, తమకు పుష్కలంగా పాడిపంటల నిమ్మని జనులు వేడుకుంటారు.

అథర్వవేదంలో భూదేవిని కీర్తించే గీతం (అ.సం.12-1, 1-18) ఉంది. ''అమహామాత ధరిత్రి జనయిత్రి, ఉజ్వల దీప్తి మేధస్సంపదనూ, ఉన్నత బల సంపదనూ, ఉదార రాజకీయ సంపదను మనకు ప్రసాదించుగాక!''

ఐతరేయ బ్రాహ్మణంలో (8-5) శ్రీతో భూమికి నమ్మింది. ఉపనిషత్తులలో కూడా అలాగే ఉంది. లక్ష్మి అంటే పంట సిరి. శ్రీదేవీ భూదేవీ విష్ణుశక్తులు, పృథ్వీమాత యొక్క ద్వివిధమైన అంశలు - 1.భాగ్యము, 2.ఉత్పత్తి - ఇవి ఆ అంశలు.

## స ర స్వ తి

భారతీయ ప్రధాన దేవతల్లో సరస్వతి కూడా ఉంది. ఋగ్వేదంలో ఆమె ఒక పవిత్రమైన నది. నదులను కూడా దేవతలుగా మాతృమూర్తులుగా భావించడం భారతీయుల సనాతనాచారం. ఋగ్వేదంలో సరస్వతి దేవతగా భావించబడి బలిపూజలకు కూడా అర్హురాలయింది. తరువాత ఆమె సకల విద్యలకు అధిష్ఠాన దేవతయైన వాగ్దేవిగా పరిణమించింది. ఆమె వాహనం 'హంస'.[2] ధవళవాహనం, ధవళ వస్త్రం, ధవళ దేహం, ఆమె స్వచ్ఛతకు చిహ్నం. జగన్మాత వివిధరూపాలలో సరస్వతి ఒకరూపం. బ్రహ్మదేవునికి భార్యయై వేదాలకు మాతృమూర్తిగా పరిణమించింది. ఆమె గాయత్రీదేవియే. గాయత్రీ దేవి ఉదయాన్నే గాయత్రి, మధ్యాహ్నవేళలో సావిత్రి, సాయంకాలం సరస్వతి.

---

1. ఋ.సం.1. 168-33

2. Images of the Goddesss are found where the lion is her Vahana. In some images in South India she is found seated on a pea-cock. The lamb also is found to be her Vahana.

జైన బౌద్ధమతాల్లో కూడా సరస్వతీదేవికి స్థానముంది. వారి సంప్రదాయానుసారం విద్యలకధి దేవతయైన మంజుశ్రీతో సరస్వతి కలిసి ఉంటుంది. మహాసరస్వతి, ఆర్యవజ్రసరస్వతి, వజ్రవీణసరస్వతి, వజ్రశారద మొదలైన నామధేయాలతో బౌద్ధులామెను వర్ణిస్తారు.

## శ్రీ దే వి

మరొక మాతృదేవత లక్ష్మీదేవి. సమస్త సంపదలకు సర్వవిధసౌందర్యాలకు అధిదేవత. ఆమె మొదటిసారిగా ఋగ్వేదం (ఋ.బు.సం.5–15) శ్రీసూక్తంలో కనబడుతుంది.

లక్ష్మీదేవి కెందామరపై ఆసీనయై, ఎర్రనివన్నెలతో వెలుగొందుతూ, కెందామరలను ధరించేట్లు వర్ణింపబడుతుంది. అందువల్లే పద్మ అనేపేరు కలిగినట్లు శ్రీసూక్తం చెపుతుంది. ఆమె ఆదివిష్ణువుని అర్ధాంగి. ఐతరేయ బ్రాహ్మణంలో శ్రీదేవి భూదేవితో లీనమై పంటసిరిగా పూజింపబడుతుంది.

సర్వాంతర్యామియైన విష్ణుదేవునితో కలిసి, అతని శక్తిగానూ, సర్వసంపన్నయైన భూమాతతో కలిసి సస్యలక్ష్మిగానూ – శ్రీదేవి రెండు విధాలుగా గోచరిస్తుంది.

## దేవి

ఋగ్వేదంలోని పదవ మండలం ఇరవై ఐదవ గీతం 'దేవీ సూక్తంగా' ప్రసిద్ధికెక్కింది. అంభృణి ఋషిపుత్రికయైన వాక్‌దేవి, బ్రహ్మతో లీనమై పారవశ్యంలో (దేవీ) మహిమను కీర్తిస్తుంది. "సకల దేవతా రూపంతో చరిస్తాననీ, సకల సృష్టికీ కారకురాలననీ, భక్తి విశ్వాసాలవల్లనే తనను తెలిసికో గలుగుతారనీ" చాటుతుందా గీతం.

## రాత్రి

ఋగ్వేదం 10 - 127లో రాత్రి దేవీ మూర్తిగా భావించి కీర్తించారు. సామవిధాన బ్రాహ్మణం 3·38 లో రాత్రి మహాత్మ్యదేవతగా వర్ణించబడింది. రాత్రిని లేక చంద్రుని స్త్రీశక్తిగానూ - ఉషస్సును సూర్యునితో లేక శివునితో పోల్చడమూ - తాంత్రిక తత్త్వంలో కనబడుతుంది. ఐతరేయ బ్రాహ్మణం 7·11, మహాభారతం 8, 34, 32, మార్కండేయపురాణం చండీ అధ్యాయము - వీటిలో దుర్గాదేవికి 'రాత్రి' అనేపదంతో అంతమయ్యే విశేషణాలు ఉండడం గమనించవలసిన విషయం.

## అంబిక - ఉమ - దుర్గ

శుక్లయజుర్వేదం 3-57 వాజసనేయ సంహితలో అంబిక ఇంద్రుని సోదరి, రుద్రునితోపాటు వచ్చి, బలిప్రాణులందరి అర్పణలందుకొమ్మని ఆగీతంలో ద్యోతకమవుతుంది. అది తైత్తిరీయ బ్రాహ్మణం 1,6,10,40లో పునరావృతమైంది. మైత్రాయణీ సంహితలో 1,10,20 - ఈ అంబిక రుద్రునికి సోదరిగానూ, సతిగానూ కూడా వర్ణించబడింది. ఋగ్వేదానుబంధం (ఖిల 10-127) లోనూ, తైత్తిరీయ ఆరణ్యకం (10-1-2) లోనూ దుర్గాదేవిని అగ్నివంటి వర్ణంగలదిగా వర్ణించారు.

ప్రతిపదార్థంలోని దివ్యశక్తికీ దివ్యతేజస్సుకూ మూలం ఆ జగజ్జనని అని అథర్వవేదంలోని 6·38 గీతం కీర్తిస్తుంది. దేవదానవ యుద్ధవేళ దేవతలకు విజయం చేకూర్చిందని కఠోపనిషత్తు వర్ణిస్తుంది. దుర్గ, భవాని, ఉమ, హైమవతి, మొదలైన నామరూపాలతో అంబిక అర్చించ బడుతుంది. శివుని ప్రమాణాన్ని గణించ గలది గనక ఉమ 'ఓసీ తపస్సమానుము' అని తల్లిచేత కోరబడింది గనక కూడా ఉమ xx అనేపేరు వచ్చింది. ఆమె పర్వతదేవతగా అర్చించబడేదనడానికి ఆమె వివిధనామాలే నిదర్శనం. అగజ, నగజ, పార్వతి, గౌరి, గిరిజ మొదలైన వామె పేర్లు. ద్రావిడుల 'ఉమ్మ' అనేమాట 'ఉమ' కు మరొక రూపం. ఆమె వాహనం సింహం. కాళీమాత నల్లని శరీరంతో, ఎర్రని నేత్రాలతో, నెత్తురుతో

తడిసిన ముఖంతో భయంకరంగా ఉంటుందని భారతం సౌప్తిక పర్వంలో వర్ణించారు. పురాణేతిహాస కావ్యనాటకాలనేకం దుర్గాదేవి స్తుతి వర్ణిస్తాయి. అనార్యులైన శబరులకు ఆమె 'పర్ణశబరి', లోకమాత.

## శక్తితత్త్వం

ఈ ప్రపంచంలో ప్రతిదాని సృష్టిస్థితిలయాలకు కారణం శక్తి అని ఊహించారు. ఈ అనంతమైన శక్తి స్త్రీసంబంధమైనదనీ, అందుచేతనే జగజ్జనని మహాశక్తి అని భావించారు. ప్రతి పురుష దేవతకూ ఒక స్త్రీదేవీమూర్తి ఉంది. పురాణాల్లో పురుషుని స్త్రీమూర్తిగా ప్రకృతిని వర్ణించారు. మాయ, బ్రహ్మశక్తి, అంబశివశక్తి, లక్ష్మీవిష్ణుశక్తి, రాధకృష్ణశక్తి. ఆదిలో స్త్రీపురుష భేదం లేక రెండూ సంపూర్ణంగా ఏకమైనవనే భావించారు. క్రమంగా అవి రెండుగా విడిపోయాయి. సృష్టిలో మొదటి జంట అదే అయింది, బృహదారణ్యకోపనిషత్తు. ఈ భావాన్ని పురాణాలూ, తంత్రాలూ మహాయానమూ మొదలైనవి విరివిగా ఉపయోగించుకున్నాయి. ఒకదృక్కోణంలో అసత్యమైంది స్త్రీశక్తి అనీ, సత్యమయింది పురుషశక్తి అనీ భావించారు. కాని శివుడు గాని శక్తిగాని ఒకరు వినా మరొకరు సత్యం కారు.

## మాతృదేవీ పూజా పరిణామం

సర్వాతీతమైన మహాజ్జనని యొక్క చైతన్యశక్తి అనేక రూపాలతో అనేక కార్యాలలో సాక్షాత్కరిస్తుందని శ్రీ అరవిందుడు వివరించాడు. ప్రథమరూపం మహోత్తరమైన ఆదిశక్తి. ఆది సర్వలోకాతీతంగా నిలిచి, కావలసిన సత్యాన్నీ రూపాన్నీ పిలిచి చూపించగల అనంతశక్తి.[1]

ద్వితీయ రూపం – సర్వాన్నీ సృజించే జగన్మాత. సమస్తంలోనూ వ్యాపించి, సర్వోత్తమంగా నిర్వహించే మహాశక్తి.[2]

---

1. Sri Aurobindo. "The Mother". p. 3
2. Ibid. p. 37

తృతీయం రూపం - పై రెండు శక్తులను తనలో సమైక్యం చేసుకున్న వ్యక్తిగత శక్తి. దివ్యస్వభావానికీ మానవ వ్యక్తిత్వానికీ మధ్యంతరంగా వ్యవహరించే అపూర్వశక్తి.[1]

మూల ప్రకృతి లేక ఆదిదేవత ' మూడు మూర్తులుగా వ్యవహరిస్తుంది. సత్వగుణం ప్రధానంగా గల మహాసరస్వతి - రజోగుణం ప్రధానంగా గల మహాలక్ష్మి - తమోగుణం ప్రధానంగా గల మహాకాళి - ఈ మూడు రూపాలు మూడు కార్యాలకోసం ఆదిశక్తి (జగన్మాత) నుంచి రూపొందాయి. ఆమె చతుశ్శక్తులూ చతుస్స్వరూపాలుగా ఈ లోకాన్నీ లోకసంబంధ కార్య కలాపాలనూ నిర్వహించడానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. మాహేశ్వరి - మహాకాళి - మహాలక్ష్మి - మహాసరస్వతి - ఇవి ఆ చతుశ్శక్తి స్వరూపాలు.

### మాహేశ్వరి

విశాల ప్రశాంతమూర్తి. సర్వలోక సామ్రాజ్ఞి. దివ్యజనని. అనంత కరుణాసాగర - మాహేశ్వరి:

### మహాకాళి

ఈమెలో దివ్యశక్తులన్నీ కేంద్రీకృతమై ఉన్నాయి. సంగరావేశంలో ఉగ్రమూర్తియై ప్రపంచాన్నే కంపింపజేసే మహాచ్ఛక్తిగా గోచరిస్తుంది - మహాకాళి.

### మహాలక్ష్మి.

మధుర మంజులమూర్తి. గుప్త సౌందర్యరాశి. లయానుకూల గానానికి అనుగుణమైన మనోహరాకారంతో కనిపించే చల్లని తల్లి. అసమాన సంపదకూ, రూపసంపదకు ఆశ్రయమైనది. సర్వులకు ఆశ్రయమైనది మహాలక్ష్మి.

---

1. శ్రీ అరబిందో. '' ది మదర్ '' పేజి. 37

## మహాసరస్వతి

సమస్త విషయాలల్లో సంపూర్ణతను సమగ్రతను సాధించగల జనని. సంపూర్ణత కవసరమైన పరిణతక్ర పిని సమగ్రజ్ఞానంతో సాధించగల దివ్యశక్తి, మహాసరస్వతి. చండీపురాణానికి అనుబంధమైన దేవీకవచంలో దేవి నవదుర్గను శైలపుత్రిక అని వర్ణిస్తారు. ఇంకా వివిధ నామాలతో కీర్తిస్తారు. కౌశికి, శాకంబరి, భ్రమరి మొదలైన పేర్లు అనార్యుల దేవతలు, తార, ఛిన్నమస్త, పర్ణశబరి, మొదలైనవారు బౌద్ధదేవీ మూర్తులు.

దీనిని బట్టి ఒకవిషయం స్పష్టమవుతుంది మనకు. అనాదికాలం నుంచి, అన్ని సంప్రదాయాల వారు జననిని శక్తి స్వరూపిణిగా భావించి సేవించేవారు. ఆవిధంగా మాతృదేవతకు (స్త్రీకి) ఉన్నత స్థానమిచ్చారు.

మహామాత దుర్గాదేవి పూజావిధానంలో వంగదేశం ముందంజవేస్తుంది. కాళీమాత వంగీయులకు ఇష్టదేవీమూర్తి. ఆమె చెలికత్తెలైన జయావిజయులు లక్ష్మీ సరస్వతులని చెపుతారు.

చండీమాత గాథ జగజ్జనని యొక్క మహామాయను గురించి మనకు పరిచయం చేస్తుంది. సర్వసృష్టికీ ఆధారమైన మహాశక్తియే ఈ మహామాయకు కూడా మూలకారణం. మహామాయయే మహాశక్తి అని అరవిందుడు వివరించారు.

ప్రతివ్యక్తి, శరీరంలోని ప్రతికణంలోను తాను జీవించడం, చరించడం, దృశ్యాదృశ్యమైన ఆదివ్యశక్తియే అనివిశ్వసించాలి. అదే సాధకుని విధి. ప్రతి వస్తువులోను జగన్మాతను దర్శించగలగడమే సాధనా ఫలితం.

1. ఆమెకోసమే పనియైనా చేయాలి. ఫలాన్ని కోరాలి గాని ఫలితాన్ని కోరగూడదు.
2. సాధకుడు తానాక సాధనం మాత్రమే. అతని శక్తులన్నీ ఆమె వే.
3. నిన్ను నీవు ఆదివ్యమాతలో సంపూర్ణంగా సమైక్యపరచుకోగలుగుతావు.

మాతృదేవత ద్వారా సర్వేశ్వరునికి సంపూర్ణంగా అంకితం కావాలని శ్రీరామకృష్ణ పరమహంస ఆచరణపూర్వకంగా బోధించాడు.

మానవ మాత నుంచి దివ్యమాత రూపొందింది. ఇది ఋషికుల అభిప్రాయం. అందుకే మానవమాత కాంక్షమైన మహిమా ప్రాధాన్యమూ కలిగాయి. ''దివ్యమాత భౌతిక స్వరూపమే మానవమాత'' అన్భావం భారతీయ సంస్కృతికి ఉదాహరణం. ఒకవంగ కవి ఆవిషయాన్ని రమణీయంగా వర్ణించాడు.

''మామూలుగా ఆవు దారివెంట పోతున్నప్పుడు కాసిగిట్టల
తాకిడివల్ల ఏర్పడిన చిన్నచిన్నగుంటల్లో నిలిచిన నీటిలో కూడా
విశాలమైన ఆకాశం ప్రతిబింబిస్తుంది. అలాగే ఆ దివ్యమాత ఈ లోకంలోని
తల్లులందరిలోనూ, పతల్లిలోనైనా సరే, ప్రతిబింబిస్తుంది.''

ప్రతిమాతా జగన్మాతే అన్నభావం, భారతీయ సమాజంలోనూ, గృహంలోనూ స్త్రీకున్న గౌరవస్థానానికి ప్రబల నిదర్శనం. వివాహం కాని బాలికలను కన్యాకుమారిగా, ప్రేమించిన భర్తకోసం తపించే తరుణిని ఉమాదేవిగా భావించడం. స్త్రీలకు గౌరవాన్నియ్యడమే, వారికడి గర్వకారణం.

ప్రపంచంలో మరింకే దేశంలోనూ ఈ మాతృపూజాపరిణామం ఇలా కనిపించదు. ఇది భారతీయ సంస్కృతికి ప్రత్యేకత నిచ్చింది. ఈ మాతృభక్తి ౧౯, ౨౦ శతాబ్దాలలో దేశభక్తిగా పరిణమించింది. భూమాతంటే దేశమాత అనే ఆలోచన అంకురించింది. ॥భూమాత మహామాతకదా!॥

దేశభక్తి మతవిశ్వాసమూ పెల్లుబికించాయనీ, తత్ఫలితమే వంగదేశ కవి బంకించంద్రుని 'వందేమాతరం' అనే జాతీయగీతం ఆవిర్భవించడమనీ స్పష్టమవుతుంది.

రోజులెప్పుడూ ఒకేలాగ ఉండవు. అహోరాత్రాలతో పరిభ్రమిస్తుంది కాలం. కొన్నాళ్లు వెన్నెల, కొన్నాళ్లు చీకటి. ఇది ప్రకృతి స్వభావం. లోకానికి మార్పే జీవితం.

ఈ మార్పు భారతదేశ స్త్రీజీవితంలో స్పష్టంగా ద్యోతకమవుతుంది. వేదకాలంలో స్త్రీల స్థాయి కైలాసశిఖరానికి వ్యాపించింది. ఉపనిషద్యుగంలో కూడా స్త్రీలు శరద్వికాశంలో హాయిగా విహరిస్తూ జీవించారు.

క్రమంగా మేఘాలు కమ్ముకొని, అంధకారాలు పెరిగాయి. స్త్రీలు మరుగున పడిపోయారు. అడుగున పడిపోయారు. అది అంధకార యుగం.

కాని, చీకటిని చెదరగొట్టడానికి కొన్ని నక్షత్రాలు వెలుగును వెదజల్లక పోలేదు. శైవవైష్ణవ యుగంలో దివ్యతారలు కొన్ని వెలుగులోకి వచ్చాయి. ఆ మహిళామణులు సమాజంలో తమ సముచిత స్థానాన్ని నిలబెట్టుకో గలిగారు.

ప్రాచీన యుగానికీ అర్వాచీనయుగానికీ సేతువులైన ఆ వనితామ తల్లుల జీవితాలు భారత మహిళల మహోత్కృష్ట స్థితికి తార్కాణాలు. శైవ వైష్ణయుగంలోని కొందరు సుప్రసిద్ధ స్త్రీలను గురించి కొంచెం తెలుసుకుందాం.

## శైవ వైష్ణవ యుగం - స్త్రీలు

క్రీస్తు శకం అయిదో శతాబ్దం నుంచీ ఆరంభమైన ఆస్తికోద్యమం దక్షిణ భారతంలో పదవ శతాబ్దానికి బాగా వృద్ధి చెందింది. భక్తులూ తత్త్వజ్ఞానులూ అనేకులు జన్మించారు. వారిలో స్త్రీలు కొందరు సుప్రసిద్ధినందారు. వైదిక మత పునరుద్ధారకులు కుమారిలభట్టూ, శంకరాచార్యులూ. మండన మిశ్రుని భార్య సరసవాణి (ఉభయభారతి) మొదటి కుమారిలభట్టు అనుయాయిని, తరవాత శంకరాచార్యుని శిష్యురాలైంది. ఆనాటి విదుషీమణులలో ఆమె అగ్రగణ్యురాలు.

### తిలకవతి

తాను పెళ్ళి చేసుకోవాలను కొన్న సైనికుడు యుద్ధంలో మరణిస్తే, మళ్ళీ పెళ్ళిచేసుకోడాని కొప్పుకోని స్థిరచిత్త. ఒకని కిచ్చిన మనస్సు నింకొకరి కియ్యని

ఆదర్శ జీవి. శివభక్తురాలై జైన మతావలంబియైన తన తమ్మునికి శివాను గ్రహం వల్ల ఆరోగ్యం కలిగించి అతన్ని శివభక్తునిగా మార్చిన మహిమాన్విత. తిలకవతి విగ్రహాన్ని తిరువాడిగై (ఆమె జన్మస్థలం) ఆలయంలో ఉంచడం ఆమె గొప్పతనానికి గుర్తు.

మంగయర్కరాశి

పదవ శతాబ్దంలో మధురను పాలించిన కూన్‌పాండ్య మహారాజు జైనమతావలంబి. అయితే పట్టమహిషి మంగయర్కరాశి శివభక్తురాలు. మధురాధీశుల ఇలవేల్పు సుందరేశ్వరుడు. మంగయర్కరాశి ఆహ్వానం అందుకొని, భక్త సంబందార్ మధుర వచ్చి, కూన్ పాండ్యుని శైవునిగా మార్చాడు. సంబందార్ గేయాలలో మంగయర్కరాశి గుణగణాలు వర్ణించబడ్డాయి. ఆమె కరైక్కాల్ నయనార్లలో ఒకరుగా గౌరవించబడింది. ఆరోజుల్లో భార్యలకు భర్తల మీద చాలా పలుకుబడి ఉండేదని మంగయర్కరాశి జీవితం చాటుతుంది.

కరైకాల్ అమ్మయార్

ఆమె శివభక్తి అసామాన్యమైంది. పరమశివుడామె భక్తికి వశుడై, ఆమె కోరికలను తీర్చేవాడు. అది చూసి, ఆమె భర్త ఆమెను దేవతగా భావించి పరిత్యజించాడు. ఆమె విహాకాలను త్యజించి, కరైకాల్ నుంచి తిరువాలంగాడు వెళ్లి పరమశివుని మహిమలను కీర్తిస్తూ జీవిత శేషం గడిపింది. ఆమె నందరూ ' అమ్మగారు ' అనేవారు, అందువల్ల అమ్మయార్ అయిందికాని, అసలు పేరు పునీతవతి. ''దైవభక్తిగలవారికి, సర్వజగత్తును సృజించే పరమశివుడు, హృదయంలో ప్రకాశించే దివ్యతేజస్సు'' అని ఒక గీతంలో ఆమె చెప్పింది. ' తిరుమురై ' అనే శైవగ్రంథంలో ఆమె పాటలున్నాయి.

అక్కమహాదేవి

వీరశైవ భక్తుల్లో, కర్ణాటక సాహితీవేత్తల్లో మహాదేవి అక్కకు సాటిరా గల స్త్రీలు చాల కొద్దిమందున్నారు. ఉడుతాడిలో పుట్టింది. తల్లిదండ్రుల వద్ద నుంచి

వచ్చిన శివభక్తి ఆమెను పట్టివదల లేదు. వివాహం చేసుకోక, ఐహికాలను త్యజించి, బసవేశ్వరు ననుసరించింది. భక్తి భావాలను మంచి గేయాలుగా ప్రకటించింది. ప్రతిగీతం చివర 'చెన్నమల్లికార్జున' అనే మకుటం ఉంటుంది. ఆమె వాక్కులు సూక్తులయ్యాయి. అవి కన్ఫ్యూషియస్ నీతివాక్యాలను పోలి ఉంటాయి. దైనందిన జీవితాని కతిసన్నిహితంగా, కష్టసుఖాలనూ, మానసికాందోళనలనూ అవి వివరిస్తాయి. ఆమె కవయిత్రి, మూడు గ్రంథాలు రచించింది. ఆమెను గురించి 'మహాదేవియక్కన పురాణ' అనే గ్రంథం రచించబడడం ఆమె గొప్పతనానికి తార్కాణం. భక్తులూ కవయిత్రులూ మాత్రమే కాదు, శిల్పకళాప్రోత్సాహకులు కూడా అనేకులున్నారు.

## రంగపతాక

పల్లవ రాజసింహుని పత్నుల్లో ఆమె ఒకరు. కంచిలోని కైలాసనాథాలయం దేవాలయ శిల్పంలో నూతన విధానానికి నాంది పలికింది. ఆనిర్మాణానికి దోహదమిచ్చి ప్రముఖపాత్ర వహించింది రంగపతాక - అని దేవాలయంలోని పదవ శతాబ్దం సంస్కృత శాసనంలో ఉంది.

## సెంబియన్ మహాదేవి.

చోళరాజ్యాన్ని పాలించిన గండరాదిత్యుని పట్టమహిషి, సెంబియన్ మహాదేవి. ఆరాజు శివభక్తుడు, 'తిరువిశైప్ప' అనే కావ్యాన్ని రచించాడు. అనతికాలంలోనే మరణించాడు. సెంబియన్ భక్తురాలు. శివుని వివిధరూపాలు కంచువిగ్రహాలుగా తయారుచేయించి, వాటికి అమూల్యాభరణాలను సమర్పించింది. ఆలయంలోని కళాకారులను పోషించి వారికి సకలసౌకర్యాలు సమకూర్చింది. తిరుముక్కూడల్‌లో ఆమెపేరిట ఆమె మనుమడొక భవనాన్ని నిర్మించాడు.

ఆనాటి వారికి స్త్రీలను గౌరవించడమెలాగో తెలుసు.

### కుందవాయ్.

మొదటి రాజరాజుని కామె సోదరి. బ్రహ్మదేశ ప్రాంతరాజ ప్రముఖుడైన విశేస్వదేవుని వివాహమాడింది. నేటి దాదాపురం వద్ద వైష్ణవాలయాన్ని కట్టించింది. శైవ జైన ఆలయాలనూ, వైద్యశాలలనూ నిర్మింపజేసి, వాటి పోషణకు విరివిగా దానధర్మాలు చేసింది.

### కుంకుమ మహాదేవి

బనవాసిని పరిపాలించిన ఆలుప రాజైన చిత్రవాహనుని భార్య కుంకుమ మహాదేవి - అని శాసనాల వల్ల వెల్లడవుతుంది. ధార్వార్ జిల్లాలోని లక్ష్మేశ్వర్ దగ్గర ఒక జైనాలయాన్ని నిర్మింపజేసింది. హిరణ్య గర్భదానం చేసి, అమూల్య రత్నాలనూ, గజాలనూ కూడ దానం చేసింది.

### లోకమహాదేవి

బాదామీ రాజైన రెండవ విక్రమాదిత్యుని పట్టమహిషి. ఈనాడు విరూపాక్ష అని పిలువబడే లోకేశ్వర దేవాలయాన్ని నిర్మింపజేసింది లోకమహాదేవి. ఆదేవాలయం శిల్ప నిర్మాణానికి సంతోషించి, ఆగ్రామంలోని శిల్పులకు ఎటువంటి పన్నులు వేయకుండా చేసింది. ''భారతదేశంలోని అత్యున్నత దేవాలయాలలో అది ఒకటి'' అన్నారు ఆనందకె. కుమారస్వామి. నృత్యగాన కళలను ప్రోత్సహించింది లోకమహాదేవి. అచల అనే కళాకారిణి నూతనరీతిని బోధించే నాట్యకేంద్రాన్ని (కళాశాలను) స్థాపించడానికి సహాయంచేసింది.

### దానచింతామణి అత్తిమాబ్బె.

ఈమె రాణి కాదు. మల్లపయ్య అనే గొప్ప విలుకాని కూతురు. చాళుక్య సైన్యాధిపతియైన నాగదేవుని పెళ్లిచేసుకుంది. పతి మరణానంతరం ఆమె జైనమతాన్ని పోషించడానికి కండ్వపించింది. జైనమత గ్రంథాలను రచింపజేసింది.

1500 జైన విగ్రహాలను, అలంకారాలతో సహా దానం చేసి ' దానచింతామణి ' అనే బిరుదు సార్జించింది. అనేక జైన దేవాలయాలను కట్టించి, వాటి పోషణార్థం గుడంకి అనే గ్రామాన్ని దానం చేసినట్లు కనిపిస్తుంది.

### రెబ్బలదేవి

సామాన్యకుటుంబంలో జన్మించింది. బళ్లారి జిల్లాలోని హాంపిహడ్గలి వేదశాస్త్రాలకు నిలయం. రెబ్బలదేవి కూడా పండితురాలు. రాంయవేముడనే సేనా నాయకుని భార్య. అన్నసత్రం కట్టించింది. కళల నభ్యసించి కళలను పోషించింది.

### శాంతలా

హొయసల రాజు బిట్టిగుదే జైనమతం విడిచి, వైష్ణవ మతాన్ని స్వీకరించాడు. ఆయన రాణి శాంతలా మాత్రం జైనమతాన్ని ఆశ్రయించింది. బెళ్గోళాలో శాంతిజినన కాక దేవాలయం కట్టించింది. విష్ణుమూర్తి విగ్రహాన్ని కూడా తయారుచేయించింది.

ఆనాడు స్త్రీలకు ప్రతివిషయంలోనూ స్వాతంత్ర్యం ఉండేది. మతంలో ఎవరి ఇష్టంవారిది. ఆర్థిక స్వాతంత్ర్యం కూడా ఉండేది. స్త్రీకి సహానం ఎక్కువ. మతసహానం కూడా ఎక్కువే. కళాసక్తులు స్త్రీలు. కనుకనే కళలను పోషించే వారు. వారు గౌరవస్థానాన్నాక్రమించారు కనుకనే, భర్తలు వారి ధర్మకార్యాలను ప్రోత్సహించేవారు. వారిదున్నతమైన స్థితి.

### క వ యి త్రు లు

ప్రాచీన కాలం నుంచీ కర్ణాటక దేశంలో విదుషీమణులు, కవయిత్రులు చాలా మంది వెలుగులోకి వచ్చారు.

విజయభట్టారిక ఉత్తమ రచయిత్రి.

## కాంతి

క్రీ.శ. 1100లో హొయసాలరాష్ట్రపు మొదటి బల్లాలుని ఆస్థానంలో కాంతి కవిపండితురాలు. 'కాంతిహంపన సమస్యగళు' అనే పద్యకావ్యం వ్రాసింది. 'అభినవవాగ్దేవి' అనిపిలువబడింది.

## మొల్ల

తెలుగువారిలో పేరెక్కిన కవయిత్రి మొల్ల. ఆమె రచించిన రామాయణం పరిమాణంలో చిన్నదైనా, పరమార్థంలో గొప్పది. సులభమైనది, గంభీర గమనం. ఆంధ్ర సాహిత్యంలో మొల్ల రామాయణానికి ఉత్తమ స్థానముంది.

అవకాశమిస్తే స్త్రీలు సకలకళానిపుణులవుతారు.

## పరిపాలకులు

ఇంతవరకు భక్తులుగా కవిపండితులుగా ఉన్న భారతస్త్రీలలో బహుకొద్దిమందిని గురించి తెలుసుకున్నాం. సమాజంలో వారికి గౌరవం ఉంది. గృహంలో స్వాతంత్ర్యం ఉంది. ఆ కాలంలో వారు హీనస్థితికి దిగజారిపోలేదు.

శక్తి సామర్థ్యాలను గుర్తించేవారు, అర్హులైనవారికి సముచిత స్థానాలు లభించేవి. స్త్రీల జీవితాలు సుఖంగానే సాగేవి. వారికి అధికారాలు కూడా ఉండేవి. సమర్థతతో దేశాన్ని పరిపాలించే శక్తి సంపాదించే రాజకీయరంగంలో స్త్రీలు గొప్పగా రాణించేవారు.

అటువంటి పరిపాలకులలో కొందరిని గురించి కూడా మనం కొంచెం తెలుసుకుందాం.

## శీలామహాదేవి

ధ్రువుడనే రాష్ట్రకూట చక్రవర్తికి శీలాదేవి పట్టమహిషి. శక్తిమంతుడైన ఆరాజు రాజకీయాలలో దేవేరి సలహాలను తీసుకునేవాడంటే, ఆమె ఎంత ప్రజ్ఞావంతురాలో వేరేచెప్పాలా? పతి అనుమతి లేకుండా అనేక దానధర్మాలు

చేసింది. ఆవిషయం ఆమె స్వాతంత్ర్యాన్ని చాటుతుంది. పాంచాల రీతిలో బాణునితో సమానురాలని రాజశేఖరుడు పేర్కొన్న కవయిత్రి శీల, భట్టారిక ఈమెయే కావచ్చు.

### అక్కాదేవి

వనవాసి పాలకుడైన మంకరాజవర్మ భార్య అక్కాదేవి. ఆమె స్వతంత్రంగా కూడా రాజ్యాన్ని పరిపాలించింది. రణరంగంలో భీకరమూర్తిగా విజృంభించిన వీరనారి. అనేక దేవాలయాలను నిర్మించింది. రాజ్యంలో విద్యాభివృద్ధికి ఆసక్తిని ప్రదర్శించింది. ఆమె పరిపాలనా దక్షతను ఇతర రాజులు ప్రశంసించారు.

### నాయకురాలు

ఒక సామాన్య స్త్రీ శక్తి సామర్థ్యాలతో మహోన్నత స్థానమాక్రమించింది. పలనాడును పాలించే అనుగురాజును తనచేతికీలుబొమ్మనుగా చేసింది. మహామేథావీ, వీరుడూ అయిన అమాత్యుడు బ్రహ్మనాయుడు, అతని అణకట్టించింది. అనుగురాజు తరవాత రాజైన నలగాముని కూడా తనచెప్పుచేతల్లో పెట్టుకొని, రాజ్యాన్ని పాలించింది. పలనాటి యుద్ధానికి కారకురాలు ఆనాయకురాలు (అసలుపేరు నాగమ్మ) రణరంగంలో పోరాడి వీరస్వర్గమలంకరించిన నారీమణి. స్త్రీలు అబలలు కారని ఆమె ఋజువు చేసింది.

### రుద్రమాంబ

ఓరుగల్లును పాలించిన కాకతీయచక్రవర్తి గణపతిదేవుని పుత్రిక. కుమారులు లేకపోవడం వల్ల ఆమెనే తనవారసురాలిగా ఆచక్రవర్తి ప్రకటించాడు. స్త్రీపాలనను సామంతులు సహించలేదు. కాని రుద్రమాంబ శక్తితోనూ, యుక్తితోనూ వారినణచింది. యాదవరాజైన మహాదేవుడు ఆమె మీద దండెత్తి వచ్చినప్పుడు రుద్రమాంబ స్వయంగా సైన్యాన్ని నడిపించి, శత్రువులతో పోరాడి, విజయాన్ని సాధించింది. రాజ్యంలో శాంతిభద్రతలను స్థాపించింది. ప్రజాసంక్షేమం కోసం

నిరంతరం కృషిచేసి నిర్మాణకార్యక్రమాలు నిర్వహించింది. ఆమె శివభక్తురాలు. అయినా ఇతర మతాల పట్ల సహనాన్నీ సమానత్వాన్నీ చూపించింది. ఎన్నో దేవాలయాలను నిర్మించింది. దానధర్మాలు చేసింది. కళలను విద్యలను పోషించింది. వీరభద్రుడనే తూర్పు చాళుక్యుని వరించింది. ఇద్దరు పుత్రికల జనయిత్రయ్యింది. మార్కోపోలో అనే గ్రీక్ యాత్రికుడు రుద్రమాంబ రాజ్యంలోని ప్రముఖ వాణిజ్య పరిశ్రమ కేంద్రాలను దర్శించి నాటి దేశోన్నతికి ఆశ్చర్యపడి ఎంతో ప్రశంసించాడు. అవకాశాలిస్తే అతివలు అవనీతలాన్ని పరిపాలించ గలరని రుద్రమాంబ చరిత్ర చాటి చెపుతుంది.

### గణపాంబ

ఈమె రుద్రమాంబ చెల్లెలు. కోట నాయకుల వంశంలో బేతనాయకుడు గణపాంబను వరించాడు. భర్త యుద్ధానికి వెళ్లినప్పుడూ ఆయన మరణానంతరమూ రాజ్యాన్ని దక్షతతో పరిపాలించిందామహారాణి. ఈమె కూడా శివభక్తురాలు. రెండు శివాలయాలను నిర్మించింది.

### గంగాదేవి

విజయనగరాధీశ్వరుడైన రెండవ కంపరాయుని సతి గంగాదేవి. భర్తతో కూడా జైత్రయాత్రకు వెళ్లిన ధీర. ఆమె పండితురాలు, కవయిత్రి, కంపరాయుని వీరగాథలను ''మధురావిజయం'' అనే సంస్కృత కావ్యంగా రచించింది. గంగాదేవి తెలుగువారి ఆడపడుచు, తెలుగురాణి.

### ముస్లింలలో అగ్రగణ్యులైన అతివలు

మహమ్మదీయ ప్రాభవంలోకి వచ్చిన దేశాలలో ఆడవారిని వెనక్కినెట్టడం జరిగింది. జాతీయ జీవనంలోని సాంఘిక, సాంస్కృతిక, రాజకీయాది రంగాలలో ముస్లిం చరిత్రకారులు స్త్రీలకిచ్చిన ప్రాధాన్యం బహుస్వల్పం. పురుషులు చేసిన ప్రతి చిన్నపనినీ పైకెత్తాడు, ~~స్త్రీల కిచ్చిన ప్రాధాన్యత బహుస్వల్పం~~ స్త్రీల విషయం పూర్తిగా వదలివేశారు.

ముస్లింమతం స్త్రీల సమమ స్థితిలో ఉంచినదనుకోరాదు. మహమ్మదీయులకు స్త్రీలు పవిత్రమైన నిధులు, జనానాలో జాగ్రత్తగా కాపాడబడేవారు. అందువల్ల ప్రజాబాహుళ్యం కంటపడకుండా చేశారు. స్త్రీలు చేసే ప్రతిపనీ పురుషులకు ప్రయోజనకరంగా ఉండాలని వారి నమ్మకం. స్త్రీల పేరు చెప్పడం వారి నగౌరవపరచడమన్న అభిప్రాయం పెరిగిపోయింది. ఒకవేళ తప్పని సరిగా చెప్పవలసి వస్తే, ఫలానా వారి పుత్రిక – ఫలానా వారి సోదరి – ఫలానా వారి భార్య అనిచెప్తూ, పేరుకి ముందు ఇస్మత్‌పనా (సమాయకత్వానికి ఆశ్రయం) అనిగాని, ఇఫ్ఫత్‌మాబ్ (పవిత్రాశయం) అనిగాని చేర్చి చెప్పాలి. అందే తమకుగా తాము వేరుపొందడానికి వీలులేదు. వారిని ఇళ్లలోనే ఉంచి, బైటకు రాకుండా చేశారు.

అయినా, ఇంటా బైటా గొప్పపనులు చేసిన ముస్లిం మహిళలు లేకపోలేదు. కాని వారిని గురించిన వివరాలు అరుదుగా దొరుకుతాయి. తల్లిదండ్రుల కోసం, తోడబుట్టువులకోసం, భర్తకోసం, సంతానంకోసం, కుటుంబ గౌరవాన్నీ దేశప్రాభవాన్నీ రక్షించడం కోసం వారెంతో కృషి చేసి త్యాగం చూపించారు, దానధర్మాలు చేశారు. కాని అవివైకి రాలేదు. అక్కడక్కడ కొంత మంది పేర్లు కొద్దిగా కనబడతాయి. అవి తప్పని సరిగా చెప్పవలసి వచ్చింది.

కొందరు మహమ్మదీయులు మనదేశానికి వచ్చిన వారు, పూర్వకాలపు నోమాడిక్ ఆచారాలను తీసుకొనివచ్చారు. నోమాడిక్కులు ఒకచోట స్థిరంగా ఉండేవారు కారు. బయళ్లలో తిరిగేవారు. వారు ఆడవారిని జనానాలో ఉంచడానికి వీలుండదు గదా! తమతో తిప్పుకోవాలి. అందువల్ల కొన్ని కట్టుబాట్లు తగ్గి, స్త్రీలకు కొంత స్వేచ్ఛకలిగింది. వారిని పురుషులతో సమానంగా చూసేవారు. పురుషులు ప్రక్కనే గుర్రాలమీద స్త్రీలు కూడా స్వారీచేసేవారు. విల్లమ్ములు చేపట్టి పోరాడ్డానికి తయారుగా ఉండేవారు. ప్రధానమైన విషయాల్లో స్త్రీల సలహాలను పురుషులు తీసుకునే వారు. గోల్డెన్ హోర్డ్‌ఖాన్ రాణులు అతనితో దర్బారులో కూర్చుని ఆగంతకుల నాహ్వానించే ఇబన్ బటూటా వివరిస్తాడు.

ఉండే వారు విద్యావతులనీ వివేకవతులనీ తెల్లమవుతుంది. వారికి కొంతవరకు స్వేచ్ఛ కూడా ఉండేది.

భారతదేశంలో మొగల్ చక్రవర్తులు రాణులు రాజకీయాలలో ఆరితేరిన వారు కొందరు లేకపోలేదు. బాబర్‌కు సలహాలిచ్చే వారిలో ముఖ్యులు అతని తల్లి ఐతలకె నిగార్, సోదరి ఖాన్ జాదే బేగం. హుమాయూన్ కూడా తనరాణులతో రాజకీయాలను గురించి సంప్రతింపులు జరిపేవాడు. దానికోసం వారానికి మూడు రోజులు కేటాయించేవారు.

వారిలో బహుపత్నీత్వం చాలా ఎక్కువగా ఉండేది. అయినా శక్తి సామర్థ్యాలు గల స్త్రీలు గౌరవస్థానాన్నాక్రమించేవారు. అటువంటి వారిని గురించి క్లుప్తంగా తెలుసుకోవడం అవసరం.

## రజియాసుల్తానా

బానిస వంశరాజైన ఇల్టుట్ మిష్ కుమార్తె. ఢిల్లీ సింహాసనాన్నధిష్ఠించిన ఏకైక స్త్రీ. ఇల్టుట్ మిష్‌కి కొడుకులున్నారు, గాని, తనకు వారసురాలినిగా కుమార్తెనే ప్రకటించాడు. అందుకు కారణం ఆమె శక్తి సామర్థ్యాలే. ఖురానూ, శాస్త్రాలూ రాజనీతీ పఠించింది. ధైర్యసాహసాలు గల వీరనారి. యుక్తితో సామంతులను స్వాధీనం చేసుకుంది. రణరంగాలలో యుద్ధం చేసి తిరుగుబాటు దారుల నణచింది. ఆమె స్వల్పకాలమే రాచరికంలో ఉన్నా, ఆమె పరిపాలనలో ఎవరూ ఎట్టి లోపాలనూ కనుగొనలేదని చరిత్రకారులు వ్రాశారు. కష్టనష్టాలను లెక్కచేయక, అపజయాలకు జంకక, నిరాశపడక, తన స్థానాన్ని తాను నిలుపుకోడానికి ప్రయత్నించిన రజియా ఒక గొప్ప వెలుగు. స్త్రీశక్తికి నిదర్శనం.

## గుల్బదన్ బేగం

బాబర్ చక్రవర్తి పుత్రిక విద్యావతి, భక్తురాలు, తన 52వ యేట మక్కా యాత్ర చేసివచ్చింది. మేధాశక్తి అనుభవ సంపదా గల గుల్బదన్ బేగం "హుమాయూన్ నామా"[1] అనే గ్రంథం వ్రాసి తనపేరు శాశ్వతం చేసుకోగలిగింది.

---

ఫుట్ 1. ఆంగ్లానువాదమున్న పర్షియన్ గ్రంథం. శ్రీమతి ఎ.బివరెడ్జి దానికి 1902 లో నోట్స్ వ్రాసి ప్రచురించింది.

హుమాయూన్ పరిపాలనకు సంబంధించిన అనేక ముఖ్యవిషయాలు ఆగ్రంథం వల్ల బైటపడ్డాయి. ఆమె ఎంతో గౌరవాన్ని సంపాదించింది.

## నూర్జహాన్ బేగం

ఆమెది నిజమైన ప్రేమగాథ. పర్షియాదేశంలోని సామాన్య కుటుంబంలో జన్మించి, జీవనోపాధి కోసం తల్లిదండ్రులతో కూడా భారతదేశం వచ్చి, పాదుషా అనుగ్రహానికి పాత్రురాలైంది. షేర్ ఆఫ్ఘన్ అలీఖులీఖాన్ ఆమె ప్రథమ భర్త. అతడు నిహతుడయ్యాక ఆమె పాదుషాకి భార్య అయింది.

అత్యంత సౌందర్యవతి, వివేకవతి, విద్యావతి, సంభాషణలలో చమత్కారం గలది. అందుకే జహాంగీర్ హృదయాని కధినేత్రి కాగలిగింది. గుర్రపు స్వారీ చేయగలదు, ఆయుధాల ప్రయోగం తెలుసుకుంది. రాజకీయాలలో ఆరితేరింది. పరిపాలనా భారమంతా ఆమెయే భరించింది. ఒక గ్లాసు ద్రాక్షాసారాయానికి తనరాజ్యాన్ని నూర్జహాన్‌కి విక్రయించానని ఛలోక్తిగా జహాంగీర్ అన్నాడు.

గులాబీ అత్తరు కనిపెట్టింది నూర్జహాన్ అంటారు. వంటలలో క్రొత్తక్రొత్త రకాలు తయారుచేయించేది. నగలూ, నాణేలూ కూడా అందంగా తయారుచేయించేది. "జహాంగీర్ ఆనతితో ఆయన జీవిత భాగస్వామిని నూర్జహాన్ పేరుతో బంగారం నూరు రెట్లు అందం సంతరించుకుంది." అని ఒకనాణెం మీద చెక్కారు. రాజకీయంగా ఏర్పడిన కుట్రల నెదుర్కొని, పోరాడి, యుక్తిని ప్రయోగించి, కష్టాల నుంచి బైటపడింది నూర్జహాన్. "మన ఏకాంత సమాధిపై ఏ గులాబులూ పరిమళించవు. వికసించవు. ఏ కోయిలా మధుర గీతి మాలపించదు..." ఈ విధంగా నిరాడంబరంగా ఆమె సమాధి మీద వ్రాత కనిపిస్తుంది.

## జహనారా బేగం

షాజహాన్ ముంతాజ్‌ల కుమార్తె. సౌందర్యమూ, మేధాశక్తీ ఆమెలో మేళవించాయి. సేవాసక్తి కామె తార్కాణం. అనేక మంది మొగల్‌రాకుమార్తెల

వలెనే ఆమెకూడా అవివాహిత. భార్యా వియోగంతో దుఃఖించే తండ్రిని అనునయిస్తూ సేవచేస్తూ జీవించింది. అపారమైన ధనానికి అధికారిణి, పేద సాధులకు దానధర్మాలు చేసింది. భారతీయ సాధువుల నాదరించింది. అన్నదమ్ముల మధ్యవచ్చిన పోట్లాటలను మాన్పించడానికి చాలా పాటు పడింది. కళావంతమైన సమాధిని (ఖ్వాజామొయినుద్దీన్ పేర) కట్టించి అమిత ధనాన్నిచ్చింది. పిల్లలంటే ఆమెకు మక్కువ. నీతి నియమాలతో జీవించింది. ఆగ్రాలోని జామామసీద్ ఆమె కట్టించిందే. తాను నిరాడంబరంగా జీవించింది. తన సమాధిని కూడా నిరాడంబరంగా తయారుచేయమంది.

"నా సమాధిని ఆకుపచ్చగడ్డి తప్ప మరేదీ కప్పరాదు. ఏల? నిరుపేదలైన మర్త్యులకు ఆగడ్డికప్పే శైర్యకవచంబగును."

ఆమాటలామె నిరాడంబరత్వానికీ, జనానురాగానికీ సాక్ష్యంగా కలకాలం నిలిచిపోతాయి.

## జేబున్నీసా

ఔరంగజేబు కుమార్తె. అందచందాలూ, తెలివితేటలూ గల ఆరాకుమారి సాహిత్యాభి రుచిలో మిన్న. ఆమె కసాధారణమైన జ్ఞాపకశక్తి ఉంది. చిన్నతనంలోనే ఖురాన్ నంతనూ కత కంఠస్థం చేసింది. పర్షియన్ అరబిక్ భాషలు నేర్చుకుంది. పండితురాలేకాక కవయిత్రి కూడా అయింది. మఖ్ఫీ అనే కలంపేరుతో ఆ పద్యాలు ప్రకటించారు. ఆమెకాక మంచి గ్రంథాలయము ముండేది. ఆమె కూడా బలవంతంగా అవివాహితగా జీవించింది. కవిపండితులను ప్రోత్సహించి, అనేక గ్రంథాల రచనకు కారకురాలైంది. ఆమె జీవితం వాస్తవంగా కళాత్మకం.

## మతరంగలో ముస్లిం కాంతలు

### బీబీఫతీమాసామ్.

స్వార్థంతో రాజకీయరంగం అల్లకల్లోలంగా ఉన్న సమయంలో స్వార్థ రహితులైన స్త్రీ పురుషులు ఆధ్యాత్మికోన్నతి కోసం కృషిచేశారు. అటువంటి

వారిలో బీబీఫతిమా సామ్ ప్రముఖురాలు. ఆమె భక్తురాలు. కవయిత్రి. అనేక పర్షియన్ గీతాలు రచించింది.

"రాష్ట్రమంత్రులలో కాంత మరాకరికి పాలు పంచగల వానికి,
ఒక గిన్నెడు మంచినీరంతం గలవానికి వేయుండీవన లండుతాయి.
పదివేల ప్రార్థనలతో, ఉపవాసదీక్షలతో పొందలేని ఫలితాన్ని
(దానంవల్ల) అందుకో గలుగుతారు":

ఇటువంటి విశాల దృక్పథం గల భావాలతో ఆమె వ్రాసిన గీతాలు జనానురంజకమైనవి.

## బీబీఫతీజా

నిజాముద్దీన్ ఔలియా అనే భక్తుని కన్నతల్లి, మహిమాన్వితురాలు. ఆమె భక్తి వల్ల కుమారుడు మృత్యుముఖం నుంచి బైటపడ్డాడు. తన చావును తాను ముందుగా తెలుసుకున్న జ్ఞాని.

## ముస్లింలలో వీరనారులు

## చాంద్‌బీబీ

చాంద్ బీబీ (1547–99) అహమద్‌నగర్ సుల్తాన్ హుస్సేన్ నిజాంషా కుమార్తె. బీజాపూర్ నవాబ్ అలీ ఆదిల్‌షాను పెండ్లాడింది. విద్యావివేకములు గల రాకుమారి. సైనిక శిక్షణనంది, జైత్రయాత్రలలో పాల్గొనేది. భర్త మరణానంతరం ఆమె పరిపాలనను సహించని సామంతులు ఆమె మీద కుట్రలు పన్నారు. ఆమె ధైర్యంతో పోరాడి, జయాపజయాలను లెక్కచేయకుండా ముందుకు సాగించి. ఢిల్లీసుల్తానులను కూడా ఎదిరించింది. పరిపాలనా దక్షత, సైనిక శిక్షణా నైపుణ్యం ఆమెకు ప్రధాన సుగుణాలు. ఆమె జీవితం విషాదాంతమే అయినా ఔన్నత్యాన్నీ అధికారాన్నీ అనుభవించింది.

## సాహోజీ

కాబూల్ గవర్నర్‌గా నియమించబడిన అమీర్‌ఖాన్ భార్య సాహోజీ. ఎప్పుడు సంక్షోభాలతో కూడిన కాబూల్ రాష్ట్రంలో శాంతిని నెలకొల్పిన అమీర్‌ఖాన్‌నకు

కుండిభట్టు సాహోక్షించేం. పతిమరణానంతరం కాబూల్ వ్యవహారాలను దక్షతతో నిర్వహించిందా వీరనారి. తిరుగుబాటుదారులపు సంతానాన్ని, భయరానాన్ని శాంగదీసింది. ఆవీరనారి, ధీరచిత్త, యుక్తితోనూ, శౌర్యంగానూ ప్రతిపక్షులను సాధించింది.

వేదకాలంలో స్త్రీలు ఉషః కిరణాల వంటి వారు. తాము వెలుగుతూ తమ చుట్టూ వెలుగునింపేవారు. అన్నిరంగాలలోనూ స్వేచ్ఛననుభవిస్తూ పురోగమించారు. ఉపనిషద్యుగంలోనూ, ఇతిహాసయుగంలోనూ స్త్రీలస్థాయి కొంచెం దగ్గినా గౌరవానికీ సుఖజీవనానికీ లోటులేదు. విద్యాసంపదా, మేధా సంపదా స్త్రీల ఔన్నత్యానికి కారణాలు.

ఉపనయనమూ, వేదవిద్యాభ్యాసమూ స్త్రీలకు నిషేధించడం వల్ల వారి స్థాయీ, ప్రభావమూ దిగజారడం మొదలు పెట్టాయి. ముస్లింల దండయాత్రలూ, ఆక్రమణలూ వచ్చి స్త్రీ జీవితాన్ని అధ్వాన్నం చేశాయి. మానవ సంరక్షణ కోసం స్త్రీల కెన్నో కొత్త ఆచారాలు తెచ్చిపెట్టారు.

బాల్యవివాహం – పరదా – సతి – ఇటువంటివన్నీ స్త్రీల దుస్థితిని చాటుతాయి. ఆడపిల్లగా పుట్టడమే మహాపాపంగా అనుకొనే రోజులు వచ్చాయి.

## సంఘసంస్కరణోద్యమం

భారతదేశంలో స్త్రీల పరిస్థితులను వేదకాలం నుంచీ పరిశీలించాం. అత్యున్నత స్థానం నుంచి స్త్రీల జీవితం క్రమంగా పతనమైంది. ముస్లిం పరిపాలనా కాలంలో స్త్రీలకు దుర్భరస్థితి ప్రాప్తించింది. మానసంరక్షణం కోసం ఆడవారు అనేక నియమనిబంధనలకు లోను గావలసి వచ్చింది. విద్యాలేమి, స్వేచ్ఛలేమి, ఇళ్లల్లో చాకిరీ చేస్తూ పడివుండవలసి వచ్చింది.

పైగా 'సతి' వంటి దురాచారాలు ప్రబలాయి. ఆడపిల్లలను గంగానదిలో పారవేయడం, చిన్నపిల్లలకే పెళ్లిళ్లు చేయడం, బాలవితంతువులు సుఖపడే అవకాశాలేవీ లేకపోవడం – ఇటువంటివి స్త్రీ జీవితాన్ని దుర్భరం చేశాయి.

ఇంతలో ఆంగ్లపాలన వచ్చింది. ఆంగ్ల విద్యాభ్యాసం ఆరంభమైంది. దానితో, పాశ్చాత్యదేశాలలోని పరిస్థితులను భారతీయులు గ్రహించారు. యూరప్ చరిత్రనూ, సాహిత్యాన్నీ పఠించిన యువతరంలో నవీనభావాలుత్పన్నమైనాయి. వారి మనస్సులు వికసించాయి, నూతన చైతన్యం అంకురించింది.

పాశ్చాత్యదేశాలలోని స్త్రీల పరిస్థితులను తెలుసుకున్నారు. అక్కడ వెల్తురు, ఇక్కడ చీకటి. మనమీ చీకటిని పోగొట్టలేమా? వెల్తురును చూపట్టలేమా? ఈ ఆలోచన అంకురించాయి.

ఋగ్వేదకాలంలో సహగమనం కనిపించదు. భారతంలో పాండురాజుతో మాద్రి సహగమనం చేసింది. శ్రీకృష్ణుని నిర్యాణానంతరం ఆయన భార్యలు నలుగురు సహగమనం చేశారు. హర్షుని తల్లి యశోవతి భర్త మరణానంతరం తనదేహాన్ని అగ్నికాహుతి చేసింది. దాసదాసీలు కూడా సతిచేసేవారు. అది ఇచ్ఛాపూర్వకంగా జరిగేది కాని బలవంతంగా కాదు. రాజపుత్ర స్త్రీలు 'జోహార్' (మంటల్లో దూకి ప్రాణాలు విడవడం) చేసేవారు. అదీ ఇచ్ఛా పూర్వకమే. కాని సతిబలవంతంగా జరిపించే దురాచారం. అది బెంగాల్‌లో ఎక్కువ. 1803లో 438, 1815,లో 378, 1817 లో 780, 1818 లో 839 సతులు జరిగినట్లు తెలుస్తోంది. అక్బర్ మొదలైన వారు దానినాపడానికి ప్రయత్నించి విఫలులైనారు.

నరబలులు మరొక దురాచారం. శరీరాన్ని అనేక విధాల బాధపెట్టడం మంచిదని కొందరి నమ్మకం.

ప్రజలలో అజ్ఞానం, నిరక్షరాస్యత, మూఢవిశ్వాసాలూ, ప్రబలడం వల్లనే దురాచారాలు మరీ పెరిగిపోయాయి.

అసలు దురాచారాలు స్త్రీలనే కేంద్రంగా చేసుకుని విస్తరిస్తాయి. వాటిని పోగొట్టాలంటే, స్త్రీలను మంచిదారిలో పెట్టాలి. అదే సంఘ సంస్కరణం.

స్త్రీవిద్య – బాల్యవివాహాల నిషేధం – వితంతు వివాహాల ప్రోత్సాహం – సహగమనాల నివారణం – ఇవి ప్రధాన సంస్కరణలు. కాని, అనేక శతాబ్దాలుగా పాతుకుపోయిన దురాచారాలనూ, మూఢవిశ్వాసాలనూ పెకలించడం సులభ సాధ్యం కాదు. ఏటి ఎదురీత వంటిది.

దానికితోడు సమాజంలో అస్పృశ్యతా కులతత్త్వమూ వెలరేగి దేశాన్ని క్షీణదశకు తీసుకువచ్చాయి. స్త్రీలు వివేకవతులైతే ఈ అనర్థాలను నివారించవచ్చునని కొందరు మహానుభావులు భావించారు. దేశోన్నతినీ జాతీయాభ్యుదయాన్నీ కాంక్షించిన స్వార్థత్యాగులు వారు, ధీరులు. సంఘసంస్కరణకు తీవ్రమైన ఉద్యమాన్నారంభించారు.

సమాజంలో స్త్రీలు కోల్పోయిన స్థానాన్నీ ప్రతిష్ఠనూ, పునరుద్ధరించడానికి వారు దీక్షతో ప్రయత్నించారు. సనాతనుల సవాళ్లనెదుర్కొన్నారు ధైర్య సాహసాలతో. వేదకాలంనాటి స్త్రీల ఆశయాలను పునరుద్ధరించడానికి వారు సంకల్పించారు. వారి కృషి అసామాన్యమైంది. వారు లోకానికే గౌరవనీయులు. వారి సంకల్పమే సంఘ సంస్కరణోద్యమంగా ఆవిర్భవించింది.

అలాంటి సంఘసంస్కర్తలు బహుస్వల్పసంఖ్యాకులు. వారిలో మేటి – మొదటి వాడు రాజారామమోహన రాయ్.

ఆమహనీయుల జీవితాలను స్థూలంగా పరిశీలిద్దాం.

## రాజారామమోహనరాయ్

సంఘ సంస్కరణ నవశక నిర్మాత – భారతీయ పునరుజ్జీవనశక్తి స్రష్ట – రాజారామమోహనరాయ్ వంగదేశంలో ఒక సనాతన కుటుంబంలో 1774 లో జన్మించాడు. బెంగాలీ, సంస్కృతం, అరబ్బీ, పర్షియన్, హీబ్రూ, గ్రీక్, లాటిన్ భాషలు నేర్చుకుని అనేక గ్రంథాల నుంచి అనేక విషయాలు గ్రహించాడు. ఉపనిషత్తులూ పురాణేతిహాసాలూ కూలంకషంగా పఠించి జ్ఞానాన్ని సంపాదించాడు.

స్త్రీలను పైకెత్తడమే ఆయన లక్ష్యం. 'సతి' ని నివారించడం కోసం 1811 నుంచి 1827 వరకు నిరంతర కృషి చేశాడు. సనాతనులతో పోరాడి, ప్రభుత్వాన్ని వేడుకొని, పట్టిన పట్టు విడువకుండా, కష్టనష్టాల కోర్చి కృషిచేశాడు. 1829 లో బెంటింక్ ప్రభువు సతీనిషేధ చట్టాన్ని అమలు పరచడం రామమోహనుని విజయం. స్త్రీజాతికీ భారత జాతికీ అది మహోపకారం, బహుభార్యాత్వాన్ని కూడా రామమోహనరాయ్ వ్యతిరేకించాడు.

1828 లో ఆయన బ్రహ్మసమాజాన్ని స్థాపించి, కులతత్వాన్ని నిర్మూలించడానికి కృషిచేశాడు. భారత సంస్కర్తలకు రాజారామమోహనరాయ్ మార్గదర్శకుడు.

## దేవేంద్రనాథ్‌ఠాకూర్

1817 లో కలకత్తాలో జమీందారీ కుటుంబంలో జన్మించాడు. హిందూ కళాశాలలో విద్యనభ్యసించాడు. సాంఘికంగా సాంస్కృతికంగా, దేశాభివృద్ధికి కృషిచేశాడు. స్త్రీ విద్య, వితంతు వివాహం, బాల్యవివాహ నిషేధం, బహుభార్యాత్వ నిర్మూలనం— ఇవి ఆయన చేపట్టిన కార్యక్రమాలు. 'సమాజోన్నత విధాయినీ సుహృత్ సమితి' ని స్థాపించాడు. స్త్రీవిద్యకోసం తన ధనం విశేషంగా వ్యయం చేశాడు. రామమోహనరాయ్ స్థాపించిన బ్రహ్మసమాజాన్ని అభివృద్ధిచేసినవాడు దేవేంద్రనాథ్ ఠాకూర్.

## ఈశ్వరచంద్ర విద్యాసాగర్

1820 లో వంగదేశాన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించి సంస్కృతంలో అసమాన పాండిత్యాన్ని సంపాదించాడు. కళాశాలలో ఉపన్యాసకుడుగానూ, ప్రిన్సిపాల్‌గానూ పనిచేసి, తన జీవితాన్ని సంఘసంస్కరణ కంకితం చేశాడు. వితంతు వివాహాలను సమర్థిస్తూ ''హిందూ వితంతు వివాహం'' అనే గ్రంథాన్ని రచించాడు. విద్యాసాగరుడు స్త్రీ విద్యకోసం చాలా శ్రమించి 40 బాలికా పాఠశాలలను స్థాపించాడు. బెథ్యూన్ కళాశాల ఆయన కృషి ఫలితమే. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ స్త్రీజాతి సముద్ధరణ కవతరించిన కర్మయోగి.

## స్వామి దయానంద

గుజరాత్‌లోని కథియవాడ్‌లో 1824 లో జన్మించాడు. సంస్కృతంలో అసామాన్య పండితుడు. బాల్యంలోనే సత్యాన్వేషణ మారంభించాడు. వేదాలలోని పరమ సత్యాన్ని గ్రహించాడు, ప్రచారం చేశాడు. సాంఘిక దురాచారాలను నిర్మూలించాలనే సంకల్పంతో ''ఆర్యసమాజం'' స్థాపించాడు. స్త్రీ విద్యను ప్రోత్సహించాడు. బాల్యవివాహాలను వ్యతిరేకించాడు. స్త్రీలు ఉపాధ్యాయ వృత్తి నవలంభించడం వల్ల విద్యవ్యాపిస్తుందని ఆయన విశ్వాసం. దానికోసం కృషిచేశాడు. దయానంద స్వామి ఉదారభావాలు, మతసహనం గల మహనీయుడు, గొప్ప సంస్కారి.

## జ్యోతీబపూర్

ఈయన 1828లో కూలీ కుటుంబంలో జన్మించాడు. కనుక విద్యాభ్యాసానికి అవకాశాలు లేకపోయాయి. 15 ఏళ్లు వచ్చాక మిషనరీల సహకారసానుభూతులతో విద్యనభ్యసించాడు. హిందూమత సంప్రదాయాచారాల పట్ల విమర్శనాదృష్టి ప్రబలింది. బ్రాహ్మణుల ప్రతిఘటించాడు. ఒక బాలికా పాఠశాలనూ, ఒక వితంతు శరణాలయాన్నీ స్థాపించజేశాడు. కేవలం విద్యాప్రాప్తి వల్లనే ప్రజలకు ప్రబోధం కలుగుతుందని ప్రచారం చేశాడు.

## భండార్కర్

1837 లో జన్మించిన ఈ మహనీయుడు 16వ యేటనే సంఘసంస్కరణోద్యమంలో ప్రవేశించాడు. కులతత్వ నిర్మూలనానికి స్థాపించబడిన ''పరమహంస సంఘము''లో సభ్యుడైనాడు. తరవాత మనదేశ సాంఘిక పరిస్థితులను పరిశీలించి, ''భారతీయ సాంఘిక చరిత్ర'' వ్రాశాడు. అందులో కులవ్యవస్థ పుట్టుపూర్వోత్తరాలు వివరించాడు. హిందూ ముస్లిం సమైక్యం దేశానికి శ్రేయస్కరమని ప్రకటించాడు.

ఆయన ముఖ్యంగా స్త్రీల పరిస్థితిని సరిచేయవలెనని ఉద్ఘాటించాడు. స్త్రీలకు ఆంగ్ల విద్యకూడా బోధించడం అత్యవసరమని నొక్కివక్కాణించాడు. బహుభార్యాత్వం కూడదన్నాడు; వితంతువివాహం కావాలన్నాడు. మహిళా విద్యాపీఠానికి ఉపాధ్యక్షుడై స్త్రీ విద్యకోసం కృషిచేశాడు. నిమ్నజాతుల నుద్ధరించడం, అస్పృశ్యతను నివారించడం, రైతులను ఋణబాధ నుంచి విముక్తులను చేయడం – ఇవి భండార్కర్ చేపట్టిన కార్యక్రమాలు. సమాజంలోని దురాచారాలను నిర్మూలించడమే సంఘ సంస్కరణము యొక్క ప్రయోజనమని భావించి, కృషి చేసిన మహనీయుడు భండార్కర్.

## మహాదేవ గోవిందరనడే

ఈయన సంఘ సంస్కర్తలో ప్రముఖుడు. జననం 1842. చిన్నవయసు నుంచే సమాజాన్ని ఎలాబాగుచేయాలా అని ఆలోచించేవాడు. 1861లో ''హిందూ ప్రకాశ్'' వారపత్రిక ఆంగ్ల విభాగానికి రనడే సంపాదకుడుగా ఆహ్వానించబడ్డాడు. ''విధవావివాహ ఉత్తేజక మండలిలో'' సభ్యుడై స్త్రీజనాభ్యున్నతికి కృషిచేశాడు. స్త్రీ విద్యమీద ఆయన కృషి కేంద్రీకృతమైంది. ''ఇంట గెలిచి రచ్చ గెలవా''మన్నట్టు, ముందుగా తన భార్య రమాబాయికి ఆయన చదువు చెప్పాడు. పూనాలో ఉన్నత పాఠశాలనూ, ఫెర్గూసన్ కళాశాలనూ స్థాపించడానికి దోహద మిచ్చిన వాడు రనడే. హిందూ మతాన్ని విడిచిపెట్టడం మంచిది కాదనీ, సంఘంలో దురాచారాలను మాత్రం తొలగించాలనీ ఆయన చాటిచెప్పాడు. రచనల ద్వారా, ఉపన్యాసాల ద్వారా, సంఘ సంస్కరణోద్యమానికి జీవం పోసిన మహనీయుడు మహాదేవ గోవిందరనడే.

## మార్గాన్వేషించిన మానినీమణులు

భారతీయ స్త్రీల పరిస్థితులను మెరుగు పరచాలని యత్నాలు చేసినవారు మొట్టమొదట పురుషులే అయినా, తరవాత కొందరు స్త్రీలు కూడా వారి ననుసరించారు. వారికెదురు వచ్చిన అడ్డుగోడలను పడగొట్టడానికెంతో పాటుపడ్డారు. అలనాటి పోటాపోటీ, కొత్త బలాన్ని పెంపొందించే పాశ్చాత్య – ఆలోచనా ప్రవాహాలను వారు జారవిడుచుకో లేకపోయారు. పాశ్చాత్య విద్యావిజ్ఞానాల ప్రభావం వారి మీద ప్రసరించి, వారికి నూతన చైతన్యాన్ని ప్రసాదించింది. శిథిల సంప్రదాయాలనూ పురాతనాచారాలను ధైర్యంగా ప్రతిఘటించారు. స్త్రీ స్వాతంత్ర్య సాంఘిక పునరుజ్జీవన కార్యక్రమాల నారంభించారు. ఋగ్వేద కాలంనాటి స్త్రీల గౌరవ మర్యాదల్ని పరిశీలించి ఉత్సాహం తెచ్చుకొన్నారు. పాశ్చాత్యప్రజాస్వామ్యం నుంచి ప్రోత్సాహాన్ని పొందగలిగారు. విద్యావంతులైన స్త్రీలు కొత్తదారులు వేయడానికి ముందుకు వచ్చారు. అటువంటి వారిలో పండిత రమాబాయి ప్రముఖురాలు.

### పండితరమాబాయి

1858 ఏప్రిల్ 23 వ తేదీన ఆమె పండిత కుటుంబంలో జన్మించింది. ఆమెకు తల్లిదండ్రులు వేదవిద్యను నేర్పినందుకు ఆకుటుంబాన్ని సనాతనులు బహిష్కరించారు. స్వగ్రామం విడిచి ఆ కుటుంబంవారు పరదేశాలలో పర్యటించారు. నానా కష్టాలూ పడ్డారు. రమాబాయి తల్లిదండ్రులనూ, సోదరునీ, భర్తనూ, కోల్పోయింది. తన జీవితాన్ని స్త్రీ జనాభ్యున్నతికి అంకితం చేసింది. లోకజ్ఞానం, అనర్గళవాగ్ధాటి, ఆమె పాండిత్యానికి సహకరించాయి. స్త్రీవిద్యను ప్రోత్సహించాలనీ, బాల్యవివాహాలను నిషేధించాలనీ ఆమె ప్రచారం చేసింది. 1882 లో పూనాలో మహిళా సమాజాన్ని స్థాపించింది. ' స్త్రీ ధర్మనీతి ' రచించింది. ఆమె ఇంగ్లాండు వెళ్ళింది. క్రైస్తవ మతాన్ని స్వీకరించింది. అమెరికా వెళ్ళివారి మన్ననలకు పాత్రురాలయింది. బోస్టన్‌లో ' రమాబాయి సంఘం ' ఏర్పడింది. 1889 లో ' శారదాసదన్ ' కి పునాదివేసింది, పూనాలో. స్త్రీవిద్యాభివృద్ధికదికేంద్రం. కాని క్రైస్తవ మత ప్రచారానికి

కూడా ఆ సంస్థను పరిపాలించింది. 1900 లో ముక్తిసదన్ అనే విద్యాలయాన్ని రమాబాయి స్థాపించింది. సాంఘిక కార్యక్రమాలలో పాల్గొని నాయకత్వాన్ని సాధించింది. స్త్రీల పునరుజ్జీవనం కోసం కృషి చేసింది.

## రమాబాయి రనడే

(1862-1924) ఒక సనాతన కుటుంబంలో జన్మించిన రమాబాయి మొదట చదువు రానిదే! మహాదేవ గోవిందరనడేకు భార్య అయింది. ఆయన గొప్ప సంస్కర్త. ఆయన ఆదేశానుసారం రమాబాయి (పెళ్లయిన తరవాతనే) చదువు మొదలు పెట్టింది. బహుభాషా పండితురాలయింది. ఆమె స్త్రీవిద్య కోసం స్త్రీసంక్షేమం కోసం కృషి చేసింది. ఆర్యమహిళా సమాజానికి అధ్యక్షురాలై పూనాలో స్త్రీల సాహిత్య సాంఘిక సంస్థను స్థాపించింది. భారతీయ ప్రాచీన సంస్కృతిలోని ఉత్తమ గుణాలనూ పాశ్చాత్యసంస్కృతి లోని ఉత్తమ గుణాలనూ సమన్వయం చేసి, స్త్రీల అభివృద్ధికి దివ్యమార్గాన్ని చూపించింది రమాబాయి రనడే.

## ఆనందీబాయి జోషీ (1865-1887)

బాల్యం నుంచీ అత్యధిక మేధాశక్తిని ప్రదర్శించింది ఆనందీబాయి. గోపాల్‌వినాయక్ జోషీని వివాహమాడింది. భర్తప్రోత్సాహంతో ఆమె విద్యాభ్యాసం ప్రారంభించింది. బాల్యం నుంచీ ఆమె పూర్వాచారాలను తిరస్కరిస్తూనే ఉంది. ఆమె ఏకైక సంతానం బాల్యంలోనే మరణించడం వల్ల మనదేశంలో వైద్యులెంత కరువో తెలుసుకుంది. భర్త అనుమతితో అమెరికా వెళ్లి, డాక్టర్ పరీక్షలో పట్టా తీసుకుంది. అక్కడ చదువుతూన్నంత కాలం స్వజాతి ఆచారాలనూ స్వకుటుంబ ఆహారాన్ని ఆమె విడవలేదు. తిరిగి భారతదేశం వచ్చి, ఆల్బర్ట్ ఎడ్వర్డు హాస్పిటల్‌లో రెసిడెంట్ డాక్టర్‌గా పనిచేసింది. స్త్రీల దుస్థితిని తొలగించాలని చాలా కృషి చేసింది. ఆరోగ్యం చెడి, క్షయవ్యాధికి గురియై అకాలంలో మరణించింది. ఆమె సోదర స్త్రీల కాదర్శప్రాయంగా జీవించింది.

## ఫ్రాన్సీనా సొరాబ్జీ

ఈమె పండిత రమాబాయికి మిత్రురాలు. స్త్రీవిద్యా ప్రచారకులలో అగ్రగణ్యురాలు. పశ్చిమభారతంలో బాలికల పాఠశాలను, పూనాలో మరొకు పెద్ద విద్యాలయాలనూ స్థాపించింది. స్త్రీ విమోచనోద్యమంలో ఈమెకు ఆసక్తి కలిగించిన పండిత రమాబాయితో కలిసి పనిచేసింది.

## ఎమాన్సీ ఎగ్నాషన్

ఈమె 1888 లో ఎడింబరో వెళ్లి డాక్టర్ పరీక్ష పాసై, బొంబాయిలోని ఆసుపత్రిలో హౌస్‌సర్జన్‌గా చేరింది. స్త్రీజాతికనేకవిధాల సేవ చెయ్యాలనుకొంది. కాని ఆమె కోరికను మృత్యుదేవత కొనసాగనియ్య లేదు.

## రుక్మాబాయి

స్త్రీల హక్కుల కోసం పోరాడిన సాహసి. ఆమె వైద్య విద్య నభ్యసించింది. భర్త ఆపసి వద్దన్నాడు. ఆమె వినలేదు. దావాలు జరిగాయి. పుచ్చిచ్చి రాజీపడింది గాని, భర్తతో కాపురానికి వెళ్లలేదు. కాని ఎవరాక్షేపం మళ్లీ పెళ్లిచేసుకోకుండా వుండాలని కోర్టు తీర్పు చెప్పింది. రుక్మాబాయి లండన్ వెళ్లి 1895లో డాక్టరై, తిరిగి స్వదేశంలో వైద్యవృత్తి నవలంబించింది. రాజకోటస్త్రీ వైద్యశాలలో డాక్టర్‌గా పనిచేస్తూ, స్త్రీ జనోద్ధరణకు కృషిచేసింది. స్త్రీ విద్యను ప్రోత్సహించింది.

ఆమహిళామణులు కందుకూరి వీరేశలింగంపంతులుగారికి సమకాలికులు, సనాతన హిందూ సమాజంలోని సంప్రదాయాల నెదిరించి అదేపనిగా పోరాడారు. వారి అల్పజీవితకాలంలో వారు సంకల్పించిన లక్ష్యాన్ని సాధించలేకపోయారు గాని, భవిష్యత్తరాల వారికి మార్గదర్శకులయ్యారు. తరువాతివారు తమ అడుగుజాడల్లో నడిచిముందుకు సాగునట్లు పాటుపడ్డారు. చిరకాలంగా సమాజంలో పాతుకు పోయిన దురాచారాలన్నీ దుస్సంప్రదాయాలనూ కూకటి వేళ్లతో పెకలించడం

సులభసాధ్యం కాదు. అయినా ఈ ప్రముఖ మహిళా సేవకులు నాటిన విత్తనాలు మొలకెత్తి, భవిష్యత్తులో మహావృక్షమై, ఎండవానల తాకిడికల్లాడు వనితలకు నీడ నిచ్చింది. వారి కృషి క్రమంగా ఫలించి, సంఘ సంస్కరణకు కారణమైంది.

ఇంతవరకు చాలా మంది సంఘసంస్కర్తల జీవితవిశేషాలను గురించి పరిశీలించి, వారు తీసుకొని వచ్చిన సంస్కరణలను గురించి తెలుసుకున్నాం. వారు స్వార్థరహితంగా, దీక్షతో స్త్రీజనాభ్యున్నతికి కృషి చేసినవారు. అనేక కష్టనష్టాలను సహించి పదిమంది మేలు కోసం పాటుపడిన వారు. వారు కరదీపికల వంటివారు. ఆరని జ్యోతులు.

అటువంటి సంఘ సంస్కర్తలకు భారతదేశంలో ఆదిపురుషుడు రాజా రామమోహనరాయ్. ఆంధ్రదేశంలో కందుకూరి వీరేశలింగంపంతులుగారు, స్త్రీలోకానికి ఎంతయిన అపారమైన సేవ చేశారు. కవిగా, పండితుడుగా, చరిత్రకారుడుగా, నాటకరచయితగా, నవలాకారుడుగా — సాహిత్యంలో ఉన్నత స్థానమాక్రమించిన పంతులుగారు సంఘ సంస్కర్తగా అగ్రస్థాన మలంకరించారు.

పంతులుగారు సంఘ సంస్కరణలో ఏయే కార్యక్రమాలను తలపెట్టారో, చేపట్టారో, వాటిని సాధించడానికి సాహిత్యాన్ని ఎలాగ సాధనంగా ఆయుధంగా ఉపయోగించారో రాబోయే అధ్యాయాల్లో వివరంగా, విపులంగా పరిశీలిద్దాం.

— : o : —

## కందుకూరి జీవితరేఖలు - ప్రధానకృషి

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి సంఘసంస్కరణ కార్యకలాపాలను వారు పుట్టిపెరిగిన వాతావరణం దృష్ట్యా పరికించడం అవసరం. ఆయన సాహిత్యవేత్తగా ఎలా రూపొందిందీ, ఆసాహిత్యాన్ని సంఘసంస్కరణ కెలా ఉపయోగించిందీ తెలిసికోవాలంటే భౌగోళికంగా రాజమండ్రిపట్టణ ఉనికి, దాని పరిసరప్రాంతాలూ గోదావరిజిల్లాతో సహా కలిపి పరిశీలించాలి. ఆయన జీవితాన్ని కవిగా, సంస్కర్తగా మలచడానికి దోహదంచేసిన పరిస్థితులు. అవతరించిన ఆధునిక యుగోదయం కూడా కొంతవరకు మనకు ఈ విషయాన్ని స్పష్టీకరిస్తాయి.

ప్రప్రథమంగా రాజమండ్రి ప్రత్యేక స్వభావాన్ని భౌతికంగా చారిత్రకంగా పరిశీలిద్దాం.

### రాజమండ్రి భౌగోళిక పరిస్థితులు

సాగరాంధ్ర భౌగోళికపటం చూస్తే కాశీ నుండి రామేశ్వరందాకా సాగిన రాదారిని రాజమండ్రి దగ్గర గోదావరినది విడగొట్టడం కనబడుతుంది. ఈ పట్టణానికి పశ్చిమోత్తరాన్నుంచి దానిప్రక్కగా ప్రవహించి దిగువభాగాన్ని డెల్టాగా విభజిస్తూ ఆపాయల ద్వారా పట్టణాన్ని సముద్రతీరంతో కలుపుతోంది. ఇది నదీమార్గం. రెండోది భూమార్గం. దక్షిణభారతాన్ని ఉత్తరభారతంతో (ఒరిస్సా బెంగాలులతో) కలిపే మార్గం. రాజమండ్రి గోదావరికి తూర్పుగడ్డున ఉన్నది. బంగాళాఖాతం ఈ పట్టణానికి ముప్ఫైమైళ్ల దూరంలో వుంది. ఆగ్నేయప్రాంతం నుంచి దక్షిణాదికి వెళ్లే ప్రయాణీకులు రాజమండ్రి మీదుగా వెళ్లాలి. రాజమండ్రికి పశ్చిమోత్తరంగా పైకి లేచే తూర్పుకనుములు - కొంచెం కిందువాలుగా, హెచ్చుతగ్గులుగా, పైకిలేస్తూ న్నట్లున్న చినచిన్నగుట్టలూ, మిట్టలూ కనిపిస్తాయి.

పర్వతప్రాంతంలో అటవికోత్పత్తులైన వాసం, టేకు మొదలైనవాటిని పడవల మీద రాజమండ్రి పంపుతారు. రాజమండ్రికి ఎగువన ఇరవైమైళ్లలో పోలవరంఅనే పట్టణముంది. అయినప్పటికీ 19వ శతాబ్దం నుంచీ పాశ్చాత్యులకు రాజమండ్రియే కేంద్రంగా ఉంటూవచ్చింది. ఉద్యోగులకూ, ఉద్యోగేతరులకూ కూడా అదికేంద్రం. పర్వతప్రాంతాలవారికీ, భద్రాచలంచుట్టుపట్ల పనిచేసేవారికీ కూడ రాజమహేంద్రవరమే కేంద్రం.

రాజమండ్రికి దిగువభాగాన సారవంతమైన మైదానముంది. వ్యవసాయానికెంతో విలువైన ఒండ్రుమట్టిని నదీప్రవాహం కొట్టుకురావడంవల్ల బంగారు పళ్లెంగా పంటభూమి తయారయింది. అక్కడక్కడ గ్రామాలచుట్టూ కనబడే తాటితోపులు తప్ప, నేలంతా వరిపొలాలతో నిండి ఆకుపచ్చని మెత్తని తివాచీపరచినట్టుగా కంటికెంతో ఆహ్లాదకరంగా ఉటుంది. తాటితోపులకు తోడు ఈతపొదలు, అరటి, కొబ్బరి, మామిడి తోపులు కన్నుల పండువుచేస్తాయి. సుందరతరమైన ప్రకృతినిలయం ఆప్రాంతం [2]

---

1. O.H.K. Spote and A.L.A. Learmonth 'India and Pakisthan; A general and Religious Geography (III Ed. London 1967) 24 Although the author's object to the [illegible] since it covers Geographical features, with little structural uniformality, their substitutions of "Eastern Hills', "Cadapah Ranges" and "Thardi Hills" have yet gained, wide acceptance. Their elucidation of the word 'Ghots' meaning 'steps' or 'terraces' is also relevent to the terms used.

2. Charles Houston - A statistical Atlas of the Madras Presidency (Madras 1895) p. 35.

ఏటేటా గోదావరినది పొంగిపొరలడంవల్ల సారవంతమైన ఒండ్రుమట్టి మైదానాలల్లో, అంటే పొలాలల్లో వచ్చిపడుతుంది. తత్ఫలితంగా రైతులకు సహజమైన ఎరువులు పుష్కలంగా లభించినట్లవుతుంది. దానికి తోడు రాజమండ్రికి దిగువభాగాన ధవళేశ్వరంవద్ద ఆనకట్టకట్టడంవల్ల ఆపొలాలు నిరంతరం నీటితో నిండి, పంటలతో కలకల్లాడుతూంటాయి. ఆప్రాంతం సిరిసంపదలతోతులతూగుతూంటుంది. రాజమండ్రికి ఉత్తరానగల భూములకు మాత్రం ఆనకట్టవల్ల ఉపయోగంలేదు.[1] డెల్టాప్రాంతం కంటె రాజమండ్రిచుట్టూరా మెట్టపంటలు మాత్రమే పండే భూమిగా అయింది. కారణం నీటిపారుదల సౌకర్యం లేకపోవడమే.[2]

---

1. Charles Beuston - A statistical Atlas of the Madras Presidency (Madras 1895) pp 62, 63, 69.
2. Ibid 57 Cf. letter dated 24.4.1861 No.81 from R.E.Morten, Officiating Deputy Director of Revenue settlement, Godavari District, to H.Neorill Director of Revenue Settlement: Papers relating to the schemes and settlement of the Central and Eastern Deltas, and the upper taluks of Godavari District (No.XXX II in the selections of the Madras Government, third series, Madras 1872) et passim.

చరిత్ర

రాజమహేంద్రవరంలోని పురాతనప్రాంతాలు ఆపట్టణ చరిత్రకు ప్రాతినిధ్యంవహిస్తాయి. నదీతీరాన అనేక దేవాలయాలు[1] స్నానఘట్టాలు ఉన్నాయి. భారతదేశంలోని ఇతర నదులకులాగే, గోదావరికి కూడా పవిత్రత ఉంది. ఆనదీతీరాన ఉన్న నగరాలన్నింటిలోను రాజమండ్రి ప్రధానమయిన మతకేంద్రం. మతసంప్రదాయాన్ననుసరించి, తీరాంధ్రప్రాంతం నుంచి కాశీ వెళ్లివచ్చే ప్రతి యాత్రికుడూ తిరుగుప్రయాణంలో తప్పనిసరిగా రాజమండ్రిలో ఆగాలి. కాశీనుంచి తెచ్చిన గంగాజలంతో గోదావరీ జలాన్ని కలపాలి. గౌతమీ స్నానం పరమపవిత్రమైందని అందరూ విశ్వసించేవారు.[2] గోదావరీనదీ స్నానం కోసమే ప్రత్యేకంగా మదరాసు నుంచి కూడా వచ్చేవారంటే ఆవిశ్వాసమెంతగట్టిదో గ్రహించవచ్చు. అలావచ్చే యాత్రికులకు సంపన్నులు వసతుల నేర్పాటు చేసేవారు.[3] మామూలుగా ఏడాది పొడుగునా మతసంబంధమైన కర్మకాండలు జరుగుతూనే ఉంటాయి. అవికాక, పన్నెండేళ్లకొకసారి గోదావరి పుష్కరం జరుగుతుంది. దానికి ప్రధానమైన కేంద్రం రాజమహేంద్రవరం. పితృదేవతలను తృప్తిపరచాలనుకొనేవారు దేశం నలుమూలల నుంచే ఆక్షేత్రాని కాకర్షింపబడతారు.[4]

---

1. A map drawn in the first decade of XX Century shows 3 big temples situated along the river. None have been added since then See F.M. XXVII No.11. November, 1906.

2. F.R.Hening Way - Godavari (Madras District Gazittar Madras 1915) 1, 247

3. ఏనుగుల వీరాస్వామి 19వ శతాబ్దంలో కాశీయాత్రచేసివస్తూ పోలవరం జమిందారు వద్ద రాజమండ్రిలో ఆగారు. (నాకాశీయాత్ర చరిత్ర - దిగవల్లి శివరావు)

4. The Hindu, Sep. 12, 1889.

పదకొండో శతాబ్దంలో జరిగిన రెండు సన్నిహితసంబంధంగల సంఘటనలు మాత్రం రాజమండ్రి పురాతనత్వాన్ని నిరూపిస్తాయి. అందులో మొదటిది నన్నయ్యగారి భారత రచన. అది అర్షమతానుయాయులకు గొప్ప యితిహాసం. తెలుగులో లభ్యమయిన మొట్టమొదటి ప్రామాణిక పద్యగ్రంథం. తెలుగు సాహిత్యంలో దానికి సార్వకాలిక ప్రాధాన్యం ఉంది. తరువాత కవులందరూ నన్నయగారి నెంతో గౌరవిస్తూ వచ్చారు. ఆగౌరవం ఆయనకు ఆదికావ్యానికీ జన్మస్థానమయిన రాజమండ్రికి దక్కింది. సాహిత్యసౌధానికి ఆయన వేసిన పునాదే ఆగౌరవానికి కారణం. [1]

నన్నయగారి సహాధ్యాయమిత్రుడు అయిన నారాయణభట్టు పశ్చిమ చాళుక్యులప్రతినిధి. సంస్కృత, ప్రాకృత కర్ణాట పైశాచికాంధ్రభాషల్లో కవిరాజ శేఖరుడని ఉపశ్లోకితుడు. అతని సాంస్కృతిక రాయబారికన్నమిన్న అనిపిస్తుంది.

" పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు వాసిగరామరవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుడుం దనకిష్టుడున్ సహా
ధ్యాయుడునైనవాడభిమత స్థితిదోడయి నిర్వహింపగాన్ ''

పదకొండో శతాబ్దంలో తూర్పుచాళుక్యరాజయిన రాజరాజనరేంద్రుడు రాజమండ్రిని రాజధానిగా చేసికొన్నాడు, తాత్కాలికంగా.[3] దానితో రాజమండ్రి పండితులకు కేంద్రమయింది. ఆకీర్తితో పోల్చినపుడు ఈ రాజకీయప్రాధాన్యం కేవలం తాత్కాలికం.

---

1. K.A. Neelakanta Sastri - 'A History of South India' Madras III Edition 1966. p. 406.

2. నన్నయ భారతము – అవతారిక పు. 4

3. Telugu Culture (Madras N.D) 26. The vicissitudes of Nannayya Patron. The Eastern Chalukya Kings are described by Sastri (South India 185to186)

### పాశ్చాత్యవిద్య – స్థానికసంస్థలు :-

1854లో కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ మాతృభాషలో ప్రాథమిక విద్యను మంజూరుచేసిన పత్రాన్ని విడుదలచేసినప్పుడు, లండన్‌లో రేఖామాత్రంగా తయారుచేసిన పథకాన్ని అమలు జరపడానికి గోదావరిజిల్లాలో పథకం వేసుకున్నారు.[1] మాతృభాషలో విద్యాబోధనజరగడంవల్ల ఇంగ్లీషుమీడియం కంటె సులభతరంగా పాశ్చాత్యవిజ్ఞానమూ విలువలూ నరనరాలకూ అణువణువునా వ్యాపించడం జరుగుతుందని భావించారు. భారతీయ మహానగరాలలోని ఇంగ్లీషు మీడియం విద్యాలయాలలోకంటే, మాతృభాషలో బోధించే పాఠశాల లెక్కువలాభదాయకంగా ఉంటాయని ఆరోజుల్లో అనుకున్నారు.

భారతీయ విద్యాచరిత్రలో 1854 ప్రకటన ఒక ప్రముఖసంఘటన అయినప్పటికీ, తక్షణ ప్రాధాన్యంమాత్రం భారతీయులను విద్యావంతులను చేయాలనే ప్రభుత్వ గురుతరబాధ్యతపై ఆధారపడిఉంది. ఈ మార్పు యొక్క నిజమైన ప్రభావం కొంతకాలం వరకు కనబడలేదు. దాని అమలు జరపడంలో ఎదురైన అనేక సమస్యల ఫలితం అదికావచ్చు.[2] విస్తృతరీతిలో ప్రజలందరికీ విద్యాబోధన ఏర్పాటు చేయించడానికి ప్రధానంగా వారెదుర్కొనవలసి వచ్చింది ఆర్థికసమస్య. దానికి తగిన మార్గాల నన్వేషించడం కష్టతరమైపోయింది. అయినా, ఆర్థిక పరమయిన వనరుల నేర్పరచడానికి కొంతమెరుగైన పద్ధతులను తయారు చేయడం ఆజిల్లాలోని ప్రత్యేకతగా కనబడుతుంది. అందువల్లనే విద్యారంగంలో ఇతర ప్రభుత్వప్రాంతాలకంటె జిల్లా ప్రాంతాలు ప్రత్యేకంగా కనబడతాయి.

---

1. R.J.Moore "Sir Charles Wood's Indian Policy" (Manchester 1966 : 108-123) (Papers relating to the establishment of Village Vernacular Schools in the Sub-Division of Rajahmundry No.XXVI in the selections from the records of Madras Government, Madras 1858, 25)

2. An Analysis of the despach of 1850 in the Madras Presidency is presented in 'Indian Education Committee' (This report is cited I.E.C. Calcutta 1884) 10-25 Between 1855-1865. Three grant-in-aid codes were drawn up and enacted. Dramatic increases in the student population only occured in 1868, with the introduction of Results grants Scheme:

1853లో జి.ఎస్.థైలర్ దార గోదావరిజిల్లాలో గ్రామీణవిద్యాపథకాన్ని ప్రారంభించారు. ఈ పథకం ముఖ్యంగా రైతులచందాలమీద ఆధారపడింది.[1] ఆయన ఆసమయంలో నరసాపూర్ సబ్‌కలెక్టర్‌గా ఉండేవారు. అదిచాలా సారవంతమైన ప్రాంతం.[2] అక్కడ ఆంగ్లోవర్నాక్యులర్ స్కూల్‌తో ప్రారంభించారు. క్రమంగా ఆవిద్యాలయాల సంఖ్య ఎనిమిది వరకు పెరిగింది. వీనిని 55 గ్రామాలు పోషించాయి. నరసాపురంచుట్టుపక్కలనున్న మూడుతాలూకాలలోని గ్రామాలలో, ఒక విధంగా చెప్పాలంటే, థైలర్‌దారగారి కార్యక్రమాలు వ్యక్తిగత ప్రయత్నాలనే చెప్పాలి. వాని విజయం కేవలం ఆయన ప్రోత్సాహఫలితమే. అధికార నివేదికలు ఆయనకేవుద్దేశాలనూ అంటగట్టకపోయినప్పటికీ, మిషనరీ ఉత్సాహం ఆయన్ని ప్రభావితుణ్ణిచేసిందనడంలో ఎటువంటి సందేహమూ లేదు.

1871లో మదరాస్ ప్రభుత్వం పట్టణాభివృద్ధి చట్టాన్ని, స్థానికనిధుల చట్టాన్ని తీసుకొని వచ్చింది. వీటి లక్ష్యం స్థానిక సంస్థల ద్వారా సహాయాన్ని, సహకారాన్ని అందించడం. మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులూ – ఇవే ఈ స్థానిక ప్రభుత్వసంస్థలు. 1863లోని స్వచ్ఛంద విద్యాచట్టం 6వ పక్కువల్ల, 1871 వరకు స్థానిక నిధుల నుంచి విద్యాలయాలకు సహాయం లభించేది. గోదావరి జిల్లాలోని పరిస్థితులను సరిదిద్దడానికి ఆచట్టం రూపొందించబడింది. గ్రామీణప్రాంతాలలో ప్రాథమిక విద్యకై ప్రభుత్వం ఇంకా గట్టిప్రయత్నం చెయ్యాలని అంటుంది. ఆచట్టం ఈ విధంగా గట్టిగా చెప్పడాన్ని క్రింది విధంగా తెలుపుతోంది.

---

1. I.E.C. 25 Paper relating to Vernacular School 7--22

2. (Benson) A Statistical Atlas 64 of the 13 Taluks in the Godavari District, Narasapur was the second most productive in yielding to Government Land Revenue.

"1871లోని నాలుగోంవరాక్టు గ్రామాలకేంచేసిందో, మూడోంవరాక్టు అదే చేసింది. కాని ఒకటి భేదం. నాలుగోంవరాక్టు విద్యకోసం ప్రత్యేకపన్నును విధించగా, మూడోంవరాక్టు "మునిసిపల్ నిధులు విద్యారంగానికి కూడా సహాయసహకారాలను విస్తరింప చేస్తుంది" అన్నక్లాజును చేర్చింది.[1] తత్ఫలితంగా జిల్లాబోర్డులు విద్యారంగానికి సహాయాన్ని ఉచ్చితంగా అందజేయగలిగాయి. మునిసిపాలిటీలు మాత్రం అందించలేకపోయాయి. నిధులపంపకంలో పట్టణాలలోని ఇతర ప్రధానమైన కార్యక్రమాలతో విద్యాభివృద్ధి పోటీపడవలసివచ్చింది.

1870లో గోదావరిజిల్లాలోని రాజమండ్రిలో ఈ చట్టం యొక్క ఫలితం కనబడింది. విద్యావిషయకం విశ్లేషణసంస్థల యాజమాన్యాలకు నిధులకు గల సంబంధాన్ని సాధించడానికి అవశ్యకమైంది. ఈ పనిలో బ్రిటిష్ ఉద్యోగులు, యూరోపియన్ మిషనరీలు, భారతీయ విద్యావేత్తలు కూడా నిమగ్నులయ్యారు. వీరేశలింగంగారి రాజకీయకార్యకలాపాలు చాలావరకు ఈ సంబంధాల మీదనే కేంద్రీకరింపబడ్డాయి. అంతేకాక ఆయన విద్యాకార్యక్రమాలూ, సంఘసంస్కరణ కార్యక్రమాలూ కూడా విద్యల్లో వెనకబడిఉన్న ప్రాంతాలలో కానసాగలేదని ఆనాటి పరిశీలకుల విశ్వాసం. 1880 నాటికి మదరాసు రాష్ట్రంలో అధికసంఖ్యాకమైన పాఠశాలలు కలిగియున్న ముఖ్యమయిన జిల్లాలలో గోదావరికి నాలుగోస్థానం లభించింది.[2] జిల్లాలోని విద్యాలయాల సంఖ్య ఒక్కదశాబ్దం 1870-71లో 123 నుంచి 1880-81 లో 740కి పెరిగింది. నిధులు లభించడానికీ, పాఠశాలల సంఖ్యపెరగడానికి మదరాసు ప్రభుత్వమే ప్రధానమైన కారణంగాని, మునిస్పాలిటీలుగాని జిల్లాబోర్డులు గాని కాదని తేలింది.[3] అయితే, ఈ అభివృద్ధి అంతా దాదాపు ప్రాథమిక పాఠశాలల్లోనే జరిగింది. మాధ్యమిక పాఠశాలలో 310 నుండి 203కి పడిపోయాయి. ఉన్నతపాఠశాలలు మాత్రం అలాగే ఉన్నాయి. రాష్ట్రమంతటిలో అసంఖ్యాకంగా ప్రాథమిక పాఠశాలలున్న జిల్లా గోదావరిజిల్లాయే.[4]

---

1. I.E.C. 24 - 1
2. I.E.C. (37)
3. Morris (Godavari District 369)
4. Ibid

చర్చ్ ఆఫ్ ఇంగ్లాండ్ బాలికాపాఠశాల రాజమండ్రి బాప్టిస్ట్‌తో 1882లో 30 మంది బాలికలతో ప్రారంభమైంది. క్రమంగా విద్యాలయాలూ విద్యార్థులూ పెరగడం జరిగింది, గాని, విద్యకు సంబంధించిన పద్ధులో ఖర్చుమాత్రం అతిస్వల్పంగానే ఉండేది. విద్యావకాశాలు విస్తృతమవడం, వనరులను బట్టి ఉంటుంది. రాష్ట్రనిధుల నుంచి ప్రత్యేకించి విద్యకోరకు 260 శాతం పెరిగింది. కాని విద్యారంగం అంచనాలు పెంచడానికి రాజమండ్రి పట్టణమునిసిపల్ కౌన్సిల్ వ్యతిరేకించింది. దానికనేక కారణాలున్నాయి. అనేకమైన ఇతర సంస్థలు రాజమండ్రిలో విద్యాబాధ్యతను వహించడానికి సుముఖంగా ఉండడం ఒకకారణం.

కందుకూరి వీరేశలింగంగారి విషయంలో ఆయన భావాలు ప్రథమదశలో ఎలా అవతరించిందీ రేఖామాత్రంగా కూడా లభించడం కష్టతరమని చెప్పవచ్చు. ఇరవయ్యారు సంవత్సరాలప్రాయంలో ఆయన వ్యాసాలు ప్రకటింపనారంభించారు. వానిలో ఉన్నభావాలు కొన్ని యితరులకు గోచరించవచ్చు. కాని అధికభాగం మాత్రం మేధాస్రవంతి స్రవిస్తుందా అన్నట్లుంటుంది. సాలోచనతో సావకాశంగా ఆస్రవంతిని పరికించినపుడు మిషనరీల ఆలోచనలనుండి జనించిన ఆలోచనా స్రవంతులేనని స్పష్టమవుతుంది. అనగా ఆనాటి భావాలను రూపొందిస్తున్న శక్తులను రేఖా మాత్రంగా తెలిసికోవచ్చు. కాని ఆరేఖామాత్రపు పరిశీలన చేయాలన్నా వీరేశలింగం గారి జననకాలానికి పూర్వం దేశంలో నెలకొని ఉన్న సాంఘిక, రాజకీయ, ఆర్థిక మతపరిస్థితుల్ని కొంతయినా అవగతం చేసికోవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది.

## వీరేశలింగం – పూర్వరంగం

చీకటి కడుపునే కాంతిరేఖలుదయిస్తాయి. ఆచీకటికి విసిగిపోవడం వల్లనే కాంతికావాలన్నా ఆకాంక్ష కలుగుతుంది. అజ్ఞానం తిమిరంలో ముసురు కున్నపుడే విజ్ఞాన తేజస్సుక్తై అర్రులు చాపడం జరుగుతుంది. మహార్థత్వం

ముద్దకట్టినప్పుడే కరిగించాలన్నతపన కలుగుతుంది. మార్పు తప్పనిసరి అయినప్పుడే సంస్కర్తలుదయిస్తారు. ఒకవిధంగా చెప్పాలంటే పరిస్థితులే దిగజారిన సాంఘిక పరిస్థితులే మేధాసంపన్నులను వెన్నుచరచి ప్రోత్సహిస్తాయి.

వీరేశలింగంగారి కాలంనాటికి దేశం రాజకీయంగా ఆర్థికంగా సాంఘికంగా మార్పు అవసరమయిన దశలో ఉంది. లోపించిన సంక్షోభావం విశాల దేశంపై ఆధిపత్యాన్ని చిన్నదేశాని కప్పగించింది. ఎక్కడో ఆరువేలమైళ్లదూరాన అనంత సాగరాల కవతల విస్తీర్ణంలో జనసంఖ్యలో మనకంటే ఎంతో చిన్నదేశాన్నుండి ఆంగ్లేయులు వచ్చి మనదేశాన్ని జయించి పాలకులవడం ఈ విశాల విశ్వంలో జరిగే విస్మయాత్మక సంఘటనల్లో కూడ వింతయిన వింతగా పరిగణింపబడుతోంది.[1]

ఇది జరిగింది క్రీ.శ 1740–56 మధ్యకాలంలో. వారు మనదేశరాజకీయాలలో ప్రవేశించింది 1740 ప్రాంతాలలో. క్రమంగా సామదానభేదదండోపాయాలతో ఒకదానితరువాత మరొక ప్రాంతాన్ని ఆక్రమిస్తూ వచ్చారు. చివరకు 1856 నాటికి దేశమంతటినీ ఏకపాలన క్రిందికి తేగలిగారు. సార్వభౌములు కూడ అయ్యారు. తెలుగునాట వారిపాలన ఉత్తరసర్కార్లతో మొదలయింది. టిప్పుసుల్తాన్ మరణంతో రాయలసీమజిల్లాలు, కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి ప్రాంతాలన్నీ నైజాంకు సంక్రమించాయి. వీటిని నైజాం 1800లో ఆంగ్లేయులకు దత్తంచేశాడు. తెలంగాణా నైజాం అధీనంలో ఉన్నా ఆంగ్లేయుల పెత్తనం అక్కడా ఉంది. ఈ విధంగా ఆరంభమయిన ఆంగ్లేయ పరిపాలన రెండు శతాబ్దాలపాటు ఆంధ్రదేశంలో కూడ అవిచ్ఛిన్నంగా సాగి దాన్ననేక మార్పులకు గురిచేసింది.

ఆదిలో కంపెనీ పాలన కేవలం రాజకీయ వ్యవస్థగా మాత్రం స్థిరపడింది. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామానికి ముందే కంపెనీపాలకులు అనేక సంస్కరణలు తీసుకురావాలని యత్నించారు. రైలుమార్గాలు దేశంలో ప్రవేశపెట్టారు. తంతితపాలాల నేర్పరచారు. రహదారులు నిర్మించారు. హైకోర్టు, సుప్రీంకోర్టులు

---

1. మామిడిపూడి వెంకటరమణయ్య, "భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర" పే. 1

స్థాపించారు. ఆవిధంగా న్యాయవిచారణకు నాంది పలికించారు.
ఈ సౌకర్యాలవల్ల దేశంలో సమైక్యత సాధ్యపరచగలిగారు. అంతటితో వారాగలేదు.
మరొకవైపు నుండి కాలువలు త్రవ్వించి నదీజలాల్ని సాగుకు వినియోగించారు.
ప్రజలకిలాంటి సౌకర్యాలను సమకూర్చారు. గోదావరికి ధవళేశ్వరం వద్ద 1852లో, 1855లో కృష్ణానదికి బెజవాడవద్ద అభినవభగీరథుడు సర్. ఆర్థర్ కాటన్ మహాశయుడు ఆనకట్టలను నిర్మించాడు. ఇలాదేశమంతా సస్యశ్యామలమయ్యే అవకాశాలు పెరిగాయి. ప్రకృతివనరులు వినియోగింపబడడంతో ఆర్థికమయిన మార్పులెన్నో ప్రజాజీవితంలో చోటుచేసికున్నాయి.

ఆదిలో 1837 ప్రాంతంలో తంతితపాలా లారంభించిన తపాలా రేట్లు దూరాన్నిబట్టి ఉండేవి. 1840–50 మధ్య గుఱ్ఱబ్బళ్లు, ఎడ్లబళ్లు కూడ టపాలు మోయడానికుపయోగపడేవి. ఆనాడు స్టాంపులేవు. 1857లో అవి అమల్లోకి వచ్చాయి. దూరంతో నిమిత్తంలేకుండా దేశమంతా ఒకేరేట్లు ఏర్పాటు చేశారు.
1851లో కలకత్తా – డైమండు – హార్బరుకు మధ్య తంతీమార్గంపర్పరిచారు.
నాలుగు సంవత్సరాల తరువాత బొంబాయి – మద్రాసు, బొంబాయి – ఆగ్రా, ఆగ్రా – కలకత్తా, ఆగ్రా – పెషావరు మధ్య తంతిమార్గాలేర్పరిచారు.
బొంబాయి – థానాల మధ్య 1853లో ప్రథమ రైలుమార్గం నిర్మింపబడింది.
1857 నాటికి 274 మైళ్ల పొడవయిన రైలుమార్గం దేశంలో నిర్మింపబడింది.
పెరుగుతూన్న నాగరికత నిత్యజీవితంలో ఊహించని సౌకర్యాలతో జాతి జీవనాన్నే మార్చివేసింది. ఎందుకిన్ని పాలకులు? రైలుమార్గాలు, తంతి తపాలా సౌకర్యాలు?
ప్రయోజనం పాలకుల స్వార్థమే కావచ్చు. తమ కార్యనిర్వహణకు గుమాస్తాలు అవసరం కావచ్చు. తమ దేశంకు ముడిసరుకులు చేరాలంటే ప్రయాణమార్గాలవసరం కావచ్చు. తాము పరస్పరం వార్తలందించుకోవడానికి తపాలా ఆఫీసులు అవసరం కావచ్చు. ఊహించిన ప్రయోజన మేదయినా, దేశీయులకు మాత్రం ఈ మార్పులుపయోగించాయనడంలో సందేహంలేదు.

మేధాసంపన్నమయిన బ్రిటిషురాజ్యాధిపత్యం దేశంలో ఆర్థికపరమయిన మార్పులెన్నో ప్రవేశపెట్టింది. వస్తుమార్పిడి క్రమంగా కనబడకుండా పోయింది. వినిమయం జే పెరగ సాగింది. చిన్నవో పెద్దవో ఉద్యోగాలు, రోజుకూలి, లేదా నెలజీతం – ఇలా కష్టానికి ప్రతిఫలం ధనరూపంలో లభించడం ప్రారంభమయింది. గతంలో కంటె వినిమయంలో వచ్చిన మార్పువల్ల ధనం విలువ పెరిగింది. ఆర్థిక వ్యవస్థలో ప్రాథమికమయిన మార్పు వచ్చింది. డబ్బు చేయలేని పనిలేదు. శక్తిమంతమయిన ధనసంపాదనకు మార్గం ఉద్యోగం. ఉద్యోగాల లబ్ధికి ఆంగ్లవిద్య ఒకమార్గమయింది. ధనసంపాదనకు స్వీకరింపబడిన విద్య అయాచితంగానే స్వధర్మాన్ననుసరించి ఏ కొంచెమో భావచైతన్యాన్ని, సంస్కారాన్ని విద్యావంతుల్లో కలిగించింది. ఆరుకాలాలు శ్రమపడి సంపాదించిన వ్యవసాయదారుని కన్నా, సంవత్సరమంతా శ్రమపడి చేసే కులవృత్తుల కన్నా నీడనుండే, పని తక్కువ, ఫలితమెక్కువ అయిన ఉద్యోగాలు అందరినీ ఆకర్షించాయి. ఆర్థికపరమయిన ఈ మార్పు అనుకూలించింది, కూడా కొందరికే. ఆంగ్లవిద్యను చదివి ఉద్యోగాలు సంపాదించిన వారికే యివి వర్తించాయి. బుద్ధిసూక్ష్మత కలిగించే అక్షరజ్ఞానాన్ని తమకే పరిమితం చేసుకొని, వర్ణాశ్రమ ధర్మాలని కంఠమెత్తి ఘోషించిన వారే, ఉద్యోగసంపాదనలో అధర్మాలకు తిలోదకాలర్పించారు. ప్రతి ధర్మమూ తమ కనుకూలమయింది, విస్మరింపబడింది. మానవత్వం మంటకలిసింది కాని నీతిబోధలు పెచ్చుపెరిగాయి. అధికారం, ధనం ఉంటే అన్యదేశీయుడు జాతి, మత, కుల, వివక్ష లేకుండా పూజనీయుడే. అవి రెండూ లేకుంటే స్వదేశసోదరుడయిన బహిష్కృతుడే. అంటరానివాడే. కడజాతివాడే. మిట్టమధ్యాహ్నం, మండువేసవి. ఇసుకనేల. వడగాట్టిపడిపోయినా గుక్కెడు నీళ్లకూ, నీడకూ నోచనివాడే. సమధర్మాన్ని చాటేవి, సమానత్వాన్ని చాటేవి, మంచిని కోరేవి;–

''ఆత్మవత్సర్వ భూతాని'', "నిర్వైర స్సర్వభూతేషు" వంటి ఉపనిషద్వాక్యాలన్నీ ఆలోచనల్లో, ఆచరణలో అడుగంటిపోయాయి. కొందరి స్వార్థం ఆర్థిక అసమానతలను

స్పష్టిస్తే ఎందరో మూర్ఖశిఖామణులయిన పురుషుల అహంకారం, సగం తెలిసిన మతజ్ఞానం జాతికి పట్టుగొమ్మలయిన స్త్రీలను చీకటికొట్లలో బంధించాయి.

మితిమీరిన స్వార్థం రాజ్యంచేస్తుంటే కడుపులోని పసిపాపకే పెళ్లి అనబడే అమ్మకపు వ్యాపారం కొనసాగింపబడింది. వృద్ధపతి – పసిపత్ని సాధారణమయిన జంటగా ప్రతియింటా దర్శనమిచ్చారు.

కాకుంటే జీతంబత్తెం లేని దాసిగా, విధవకూతురు, పకన్నకడుపుకో తప్ప యింటిల్లిపాదికీ కన్నులపండువుగ ప్రతిపనిలో తానే అయి నడుంవిరగ్గొట్టుకోవడం మరీ సాధారణం. ప్రకృతికామె లోబడి, సహజంగా ప్రవర్తిస్తే, సాంఘిక పరిస్థితులు, అసహజరీతిలో హత్యనో, శిశుహత్యనో ప్రేరేపించేవి. లేదా నిందనామె నెత్తిన మరాటగట్టేవి. ఇదేమని ప్రశ్నించే ధైర్యంగాని, పరిష్కారాన్ని ఆలోచించగల విజ్ఞానం కానీ ఆనాటి స్త్రీలలో శూన్యం. బలవంతంగా నెత్తినరుద్దబడిన అన్యాయాన్ని మౌనంగా అనుభవించడమే ఆనాటి స్త్రీకి తెలిసిన విద్య. ప్రశ్నించేవారు లేనంతకాలం అరాచకం కొనసాగుతుంది. స్త్రీవిముక్తి ప్రదాత వీరేశలింగంగారు రంగంలోకి ప్రవేశించే వరకు అది అలా సాగిపోయింది.

మార్పుకు శ్రీకారం చుట్టే తాలివ్యక్తి ఒక్కడే కాని అతడు కోరిన మార్పు ఆచరణలో చూపాలంటే ఒక్కరికే సాధ్యంకాదు. ఆచరణలో కాకపోయినా మాటల్లో ఆలోచనల్లో అయినా బాసటగా నిలచేవారు లేకపోతే, ఎంతసంస్కర్తకీ, సమర్థునికీ అడుగుముందుకు సాగదు. అడుగడుగునా అవరోధాలే. ఆటంకాలే. అయినా వెనకడుగు వేయకపోవడమే లక్ష్యసాధనకు ఏకైకమార్గం.

స్త్రీల కన్నీరు తుడవడానికి, నొసట చెరిగిన తిలకం దిద్దడానికీ ముందుకు చాచిన చేతిని నరికే ప్రయత్నాలెన్నో. కాలంతోపాటు మారలేని, సంస్కారంలేని మతానికే పెద్దపీటవేస్తే సమాజాన్ని అమతం, మఠాధిపతులూ కీలుబొమ్మల్లా ఆడిస్తారు. మాధుర్యం లేకపోతే మతం నిలవదని వారి భయం. అందుకే దైవాని క్కాకుండా రాతిబొమ్మకో, పాషాణహృదయులకో పూజారులుగా వాళ్లు జీవిస్తారు. అందరినీ రాళ్లలాజీవించమని ఆదేశిస్తారు. ఏ హృదయమయినా ఆర్తులను జవాబి

స్పందించబోతే చిదిమివేసే ప్రయత్నాలే చేస్తారు. వారికి దొరికిన ఆయుధం 'వెలి', సంఘబహిష్కారం, సంఘజీవికి సామాజిక సహకారంలోపింపజేయడం.

ధనం, మతం, అధికారం, రాజ్యమేలుతున్న రోజుల్లో ప్రతి అధికారీ తానొక ప్రభువే. తన పరిధిలో, తాను సర్వాధికారి. అధికారం శాశ్వతంగా నిలబడాలంటే సక్రమపద్ధతి, సమర్థత, సద్బుద్ధి కలిగి ఉండడం. ఇవి రెండు అంతగా అందుబాటులో ఉండవు.

కాబట్టి చేతనయిన మార్గంలో పదవిని అధికారాన్ని కాపాడుకోవాలి. లంచగొండితనం, అక్రమాల కంటే బలమయిన ఆయుధాలు మరేవీ లేవు అనిపించాయి ఆనాటి అధికారులకు. ఈ ఆయుధాలతోనే వీరవిహారం చేయ నారంభించారు వారు.

స్వాతంత్ర్యం చచ్చి, భావచైతన్యం శూన్యమై, సౌజన్యం, సహృదయతలు అగమ్యాలై, మౌఢ్యం, నీచత్వం పట్టాభిషేకంచేసుకొని రాజ్యమేలుతున్న కాలం వీరేశలింగంగారి జననకాలం. అందుకే చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోగల సంస్కర్త కాగలిగారాయన.

ఆయన జీవనవిధానాన్ని తెలుసుకోవాలంటే ఆయనకు ప్రధానులయిన వ్యక్తులను తెలుసుకొని వారితో ఆయనకున్న సంబంధాన్ని విశ్లేషించి పరికిస్తే సాధ్యపడుతుంది. ఈ విశ్లేషణతో కూడిన పరిశీలనవల్ల వీరేశలింగంగారు అలాంటి భావాల నెలాసంతరించుకున్నదీ స్పష్టపడుతుంది.

## పంతులుగారి కుటుంబం – పుట్టుపూర్వోత్తరాలు

వీరేశలింగం పంతులుగారు 1848 ఏప్రిల్ 16 తేదీన కీలకసంవత్సరాన చైత్ర శుద్ధ త్రయోదశి ఆదివారంనాడు రాజమండ్రిలో బ్రాహ్మణకుటుంబంలో జనించారు.[1] ఆనాడు గోదావరిజిల్లా మొత్తం మీద బ్రాహ్మణులు 5.8 శాతం ఉండేవారు.[2] అయినా సంఖ్యాబలానికి మించిన ప్రాధాన్యమాత్రం వారికుంది.

1. అక్కిరాజు రమాపతిరావుగారు, "ముఖ్యఘట్టములు" 'యుగపురుషుడు'
2. G.O.I. The Imperial Gazetters of India 223. 26 Volume, New Edition Oxford 1908-1931 XII 287.

వారిలో 50 శాతం వ్యవసాయానికి సంబంధించినవారంటే నమ్మశక్యం కాదు. అందులోనూ 11 శాతం వ్యవసాయకులు. అంటేవారి భూములను స్వయంగా పర్యవేక్షణ జేసుకునేవారన్నమాట. తక్కిన 39 శాతం [1] భూముల మీద నుంచీ వచ్చే ఆదాయంతో జీవించేవారు. ఆ పొలాలు సామాన్యంగా జమీందారీ భూములు; గాని, అగ్రహారాలు గాని అయివుండేవి. భూములపై వచ్చే ఆదాయంతో జీవించే బ్రాహ్మణులు అన్ని జిల్లాలలో కంటే గోదావరిజిల్లాలో ఎక్కువగా ఉండేవారు. జనాభాలెక్కలననుసరించి, బ్రాహ్మణులు క్రమంగా పౌరోహిత్యం, ఉపాధ్యాయవృత్తి, యాచకత్వం నుంచి దూరమై భూస్వాములుగా మారిపోయారు. భూస్వాములతో పోల్చినప్పుడు తక్కిన వృత్తులన్నీవెలవెల పోతూండేవి.[2]

పంతులుగారి కుటుంబానికి కూడా ఒకప్పుడు వంచి భూవసతి ఉండేది. అందువల్ల తండ్రిగారూ పెదతండ్రిగారూ మదరాసు రాష్ట్రప్రభుత్వంలో రెవెన్యూ ఉద్యోగులుగా ప్రవేశించారు.[3] ఆరోజుల్లో గోదావరిజిల్లాలో కేవలం 1.2 శాతం బ్రాహ్మణులు మాత్రం ప్రభుత్వంలో ఉద్యోగాలు చేసేవారు. మొత్తం జనాభాలో 13 శాతం భారతీయులు ప్రభుత్వోద్యోగులు. అయినా గోదావరిజిల్లా బ్రాహ్మణులు గణనీయ సంఖ్యలో ప్రభుత్వోద్యోగులయారన్నమాట.[4] ఈ సంఖ్య సివిల్ ఉద్యోగులలో బ్రాహ్మణుల ప్రాధాన్యాన్ని స్పష్టంగా సూచిస్తుంది. మదరాసు రాష్ట్రం మొత్తాన్ని పరిశీలిస్తే, సివిల్ఉద్యోగాలను కాంక్షించేవారు ప్రయత్నించేవారనా నూటికి 68 మంది బ్రాహ్మణులేనని తెలుస్తుంది. దానితోపాటు ఉన్న ఉద్యోగుల నుండి విద్యాప్రావీణ్యాలను బట్టి ఉన్నతస్థానాలకు పంపేవారిలో 63 శాతం బ్రాహ్మణులేనన్న విషయం కూడా స్పష్టపడుతుంది.[5]

---

1. G.O.I. The Imperial Gazeteers of India 225. 26 Volume New Edition, Oxford 1908-1931 XII 287, Cences of Madras Presidency 71 (Madras 1874) I. 135
2. Ibid, Census for 1871, 1, 135
3. V.SC. I - 17.
4. G.O.I. Census for 1871, 1, 133 - 144
5. G.O.I. Census for 1871, 1, 195 - 197

సంఖ్యాబలం కూడా బ్రాహ్మణ సివిలు ఉద్యోగులు కొన్నిచోట్ల అనుభవించిన అధికారశక్తిని సంపూర్ణంగా వివరించలేదు. పొరుగున ఉన్న గుంటూరుజిల్లాను పరిశీలించినప్పుడు 1849లో బ్రాహ్మణులు సివిల్‌శాఖలో అత్యంతోన్నత స్థానాలనాక్రమించారనీ వారిలాభంకోసం ఉద్యోగ నియమాలను కూడా మార్చగలిగారనీ స్పష్టంగా కనబడుతుంది.[1]

వీరేశలింగంగారు ఉద్యోగుల వంశంలో జన్మించారు. బాల్యంలో ఆయన కూడా సివిల్ ఉద్యోగంలో చేరాలని గాఢంగా అభిలషించారు. కాని, అన్నింటికన్నా తాతగారిమీద గౌరవాభిమానాలాయనకు అపారంగా ఉన్నాయి. ఆయన కత్యంత ప్రియమైన ప్రధానమైన వ్యక్తికూడా ఆ తాతగారే. తాతగారిపేరే ఆయనకు పెట్టారు.[2] తన ఆ తాతగారు ఒకజమీందారని స్వీయచరిత్రలో చెప్పుకున్నారు. పూర్వుల గొప్పతనాన్ననుసరించి గౌరవం లభించాలని కాంక్షించే వ్యక్తికాదాయన. అయినా ఒక విషయం మాత్రం చెప్పకుండా ఉండలేనంటూ, తాతగారి కీర్తిప్రతిష్ఠలకు సంబంధించిన ఒక సంఘటన నాయన స్వీయచరిత్రలో పేర్కొన్నారు. పంతులుగారి మొదటి నవలయైన రాజశేఖరచరిత్రలోని కథానాయకుని పాత్రను తాతగారిని దృష్టిలో ఉంచుకొని సృష్టించిందే.[3] ఆ గ్రంథాన్ని ఆయన 1878లో ప్రచురించారు. తమ స్వీయచరిత్రాన్ని 1902లో ఈ కింది విధంగా ప్రారంభించారు:-

" నా రాజశేఖరుని చరిత్రయందలి రాజశేఖరుని గృహవర్ణన ఇంచుమించు మా గృహవర్ణనమే. పూర్వార్జితమైన అంత విశాలమైన భవనాన్ని కలిగియుండడమే కొంతవరకు మా పూర్వులున్నతస్థితిగతుల్లో ఉన్నవారని చెప్పవచ్చు. ఆభవనాన్ని కట్టించిన మాతాతగారు సుప్రసిద్ధులై, కొంతకాలం సంస్థానాధిపతుల దగ్గర దివానుగా నున్నారట! మా పూర్వీకులు సంస్థానాధిపతులూ దేశపాండ్యులూనై పెక్కు కావ్యములూ శైవ గ్రంథాలనూ కృతులనందినవారై యుండిరి. మా తాతగారు మిక్కిలి ధర్మాత్ములనీ, భూదానాదులు చేశారనీ కీర్తిబడసిరి..." [4]

---

1. Robert Eric Frykenberg's Guntur District 1788 - 1848 (Oxford 1965) 235
2. V.S.C. 1, 2-3.
3. V.S.C.II, 8,9,A translation was published as Fortunies Wheel (Rev.J.R.Hutchinson Tr. London 1887)
4. V.S.C.(III Edition 1954)P.12.The House still existing at

పంతులుగారి జీవనవిధానాన్ని అర్థంచేసుకోవాలన్న ప్రయత్నంలో తాతగారికాయన యిచ్చిన ప్రాధాన్యం కీలక విషయంకావాలి. తాతగారిని గురించి ప్రస్తావిస్తూ ఆయన ధనాన్నెలా వ్యయపరచిందీ పంతులుగారిలాచెప్తారు – ''ఆయన ఆర్జించిన ధనాన్ని విశేషంగా నిల్వచేయలేదు. బంధుపోషణ నిమిత్తం, దానధర్మాల నిమిత్తం, ఎప్పటికప్పుడే ఖర్చుచేస్తూ ఉండెను. పెద్దకుమారుని వివాహము మహావైభవముగ జరిపి, అన్నప్రదానములు మొదలుగా గులవానికి ధనవ్యయము మధికముగా జేసెను. [illegible]రాక్కమధికముగా చేర్చుటకాయన మొదటి నుండియు పెద్దపనులను చేసిన వారు కాదు. చిన్నపనులతోనే ఆరంభించి, స్వసామర్థ్యము చేత క్రమక్రమముగా వృద్ధిపొంది కడపటకు గొప్పసెనికి వచ్చెను. వారు ధనకాములు కాక కీర్తికాములై పండితులనాదరించియు, దానధర్మముల జేసియు, విశేషయశోధనమును సంపాదించిరి.'' [1]

దీని నుండి పంతులుగారి [illegible] ఆశలూ ఆశయాలు వ్యక్తమవుతాయి. తాతగారి సిరిసంపదలకు వైభవాలకు ఆయన ఆనందించినట్లు కనబడుతుంది. దానితో పాటు ఆశ్చర్యంకూడా వ్యక్తమవుతుంది. కాని ఆదుబారా ఖర్చులను చూసి, బహుశా, ఏవగింపుకాని కూడా ఉన్నారేమో! ఆయనలో స్వార్థచింతన లేనందున ఒకవంక ఆనందపడుతూ, నయవంచకుల మోసంలోపడి సర్వమూ పోగొట్టుకొన్నందుకు మరొకవంక జాలిపడేవారు. ఈ భావాలన్నింటివల్ల కలిగిన సంచలన ఫలితమే ఆయన 'రాజశేఖరుని' పాత్ర. రాజశేఖరుడా నవలలోని కథానాయకుడు. కపట బంధుమిత్రులవల్ల, యాచకుల మోసం వల్ల కలిగిన సిరిసంపదలన్నింటిని పోగొట్టుకొని కడుబీదవాడుగా నిలబడ వలసి వస్తుంది. పురోహితులు కూడా అతని ధనమపహరిస్తారు. చివరకు చేత కాసుకూడా లేనివాడై, నిరుపేదగా, దేశమంతటా, సిరిసంపదలు చేకూరువరకు, మానసిక వికాసం కలిగేవరకు, తిరుగాడవలసి వచ్చింది. [2]

---

1. V.S.C. (III Edition 1954) P.9

2. వీరేశలింగంగారి రాజశేఖరచరితము 12[illegible], 130, 175

రాజశేఖరుని చరిత్ర భారతీయ సంప్రదాయానుసారంగా, ప్రత్యేకించి, ఆంధ్రుల సంప్రదాయానుసారంగానే ఉంది. సాధారణంగా భౌతిక సంపదలను కోల్పోయినప్పుడు ఆధ్యాత్మిక చింతన ఆరంభమవుతుంది. భారతీయ సంప్రదాయం అదే.

పంతులుగారి కుటుంబచరిత్ర మూడుతరాల వరకు ఆయన జీవితచరిత్రలో కనబడుతుంది. తాతగారి ఆస్తి సంపూర్ణంగా హరించి పోక ముందే, ఆయన పరలోకగతులయినారు. శేషించిన ఆస్తి వారసులకు దక్కింది.

పంతులుగారికి కేవలం భౌతిక సంపదమాత్రమే వారసత్వంగా లభించలేదు. భావిజీవితంలో గొప్ప సంఘసంస్కర్తగా, మతసంస్కర్తగా నుండదగిన గుణవిశేషం కూడా ఆయన ముత్తాతగారి నుంచి లభించింది. అది కొంచెం కొంచెంగా వారసత్వమై, బీజరూపంలో ఆయనలో ఉన్నదనవచ్చు. ఆయన ముత్తాతగారు ఆరాధ్యశైవకుటుంబానికి చెందిన వారైనా, వైష్ణవాచారంగల యింటి పడుచును వివాహమాడారు. అందువల్ల ముత్తాతగారి నుంచి కొంత సంస్కరణతత్వం ఆయనలో నెలకొన్నదనవచ్చు. తాతగారైన వీరేశలింగంగారు మరొక అడుగు ముందుకువేసి, లింగధారణాన్ని విసర్జించారు. పంతులుగారి కాలంనాటికి, శివకేశవుల అభేద ప్రతిపత్తిని చూపించనారంభించారు.[1] బీజరూపంలో నున్న ఈ సంస్కరణ భావాలు ప్రాయంతోపాటు ఆయనలో మొలకెత్తి, చిగురించి, మొగ్గదొడిగి, పుష్పించి, ఫలించాయని భావించవచ్చు.

పంతులుగారి నాలుగోయేట ఆయన తండ్రిగారు గతించారు.[2] వీరేశలింగంగారి తల్లిగారూ, పెదతండ్రి వెంకటరత్నంగారూ, ఆయన భార్య – వీరే ఆకుటుంబసభ్యులు. పెద్దతండ్రిగారే కుటుంబానికి యజమానుడు. 1861లో పంతులుగారికి వివాహమయింది. అప్పటికాయనకు పదమూడేళ్లు. ఆమె కాటేరు గ్రామకరణంగారి పుత్రిక, పదిసంవత్సరాల బాల. ఆరోజుల్లో

---

1. అక్కిరాజు రమాపతిరావుగారి 'వీరేశలింగంపంతులు – సమగ్రపరిశీలన' విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ ముద్రణ – శివాజీ ప్రెస్, 1732 గంజ్‌బజార్, సికింద్రాబాద్. పే. 14 – 15.
2. స్వీయచరిత్ర 1 ప్రకరణము 18 వది ప్యారాగ్రాఫ్

వివాహాలా వయసుస్సలోనే జరిగేవి. పంతులుగారి ఇంటిలో తల్లీపెత్తల్లుల మధ్య నిరంతరం రామరావణయుద్ధం జరుగుతూండేది. ఆనాటి సమష్టి కుటుంబ వ్యవస్థ, దాని వల్ల కలిగేపరిణామాలు, పంతులుగారికి బాల్యంలోనే అనుభవంలోకి వచ్చాయి. నూతన వధువు ప్రవేశంకూడా తోడికోడళ్ల పోరాటాన్ని ఆపలేకపోయింది. రెండుసంవత్సరాలలో ఆస్తిని పంచాలని పెత్తండ్రిగారన్నారు. పంచిన తరువాత తాను పలూరు వెళ్లిపోవాలని కూడా ఆయన నిర్ణయించుకున్నారు. అలా వెళ్లిన కొద్దికాలానికే ఆయన ఈ లోకం నుంచి కూడా వెళ్లిపోయారు. ఈ విధంగా ఆరెండు కుటుంబాలకు ఏకైక సంతానంగా పంతులుగారు పెరిగారు.[1] తల్లీ, పెత్తల్లీ ఇద్దరూ వితంతువులవడంవల్ల నిరంతరం సమష్టికుటుంబం కలహాలతో సాగిపోతూండేది. అవన్నీ చూసిన పంతులుగారు భారతస్త్రీల, ముఖ్యంగా ఆంధ్ర స్త్రీల సమస్యలను కొంచెం అవగతం చేసుకోవడం మొదలుపెట్టారు.

## పంతులుగారి విద్యాభ్యాసంగం

వీరేశలింగం పంతులుగారి విద్యాభ్యాసంగం ఆనాటి వీధి బడులలోనే ఆరంభమయింది.[2] వ్యాకరణం, పద్యాలు వల్లె వేయడం అక్కడ నేర్చుకున్నారు. 1858లో, అంటే ఆయన పదోయేటనే, బడిని విడిచిపెట్టి, బంధువు ఒకాయన వద్ద పనినేర్చుకోడానికి వెళ్లారు. ఆబంధువు ఇన్నీసుపేటలో ఉన్న తాలూకా కచేరీలో గుమస్తా. ఆయన దగ్గర రెండేళ్లున్నారు. ఒకవంక పనిచేస్తూ, మరొక వంక ఇంటి వద్ద ఒక పండితుని దగ్గర తెలుగూ, పెదతండ్రి దగ్గర ఇంగ్లీషూ లెక్కలూ నేర్చుకుంటూ ఉండేవారు.

తిరిగి 1860లో పంతులుగారు రాజమండ్రిజిల్లా విద్యాలయంలో చేరి చదువు కొనసాగించారు. తెలుగు భాషలో ఆయన సంపాదించిన ప్రతిభాపాటవాలు

---

1. వి.ఎస్.సి. పార్టు-1 పే. 29

2. స్వీయచరిత్రము (హితకారిణీసమాజము 1954) | పే.15

ఆయనకాక ఉపకారవేతనాన్ని లభింపజేశాయి. దానివల్ల ఆయన విద్యాభ్యాసం కొనసాగింది.[1] పంతులుగారు చిన్నతనంలోనే సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లభాషల నభ్యసించి వాటిలో పాండిత్యాన్ని గడించారు. బడికి సరిగా పోకుండా విడిగా గ్రంథాలయాలలోనూ, స్వగృహంలోనూ నిర్విరామంగా చదివి విజ్ఞానాన్ని ఆర్జించుకున్నారు. బడికి వెళ్ళిన రోజులలో కూడా, త్రోవలో పాఠాలు వల్లించుకొని, తరగతిలో అప్పజెప్పేవారట. అలా వల్లించిన వానిని జీవితాంతం జ్ఞాపకముంచుకోగలిగారు. చిన్నతనం నుంచే ప్రతిదానిని నీతి గురించి ప్రశ్నించేవారు. తగిన సమాధానం దొరికే వరకు తీవ్రాలోచన చేసి, చివరకొక నిర్ణయానికి వచ్చేవారు.[2]

1868లో వీరేశలింగంగారు చిత్రపు కామరాజుగారి వద్ద ఇంగ్లీషు గుమాస్తాగా పనిలోచేరి, కుటుంబాన్ని పోషించుకో గలిగారు. జిల్లా కమీషనర్ మొదలైన ఉద్యోగుల దగ్గర నుంచి వచ్చే ఉత్తరప్రత్యుత్తరాలన్నీ చూసుకుంటూ, వాటి బాధ్యత తాను వహించారు. ఆఫీసులో ఆ న్యాయవాది ప్రవర్తన వల్ల ఆయనలో కలిగిన భావాలు ఆనాటి పాశ్చాత్య విద్యాప్రభావాన్ని వ్యక్తపరుస్తాయి.

ఆ న్యాయవాది వేశ్యల సాంగత్యంతో గౌరవప్రదమని భావించే పూర్వ నాగరిక కోటిలోని వాడు. పంతులుగారు కొత్తకొత్త భావాలవల్ల మారుతున్న సమాజానికి చెందినవారు. అందుచేత వేశ్యా విషయంలో భిన్నాభిప్రాయానికి చెందిన నవనాగరిక బృందంలోనివారు. ఇక్కడ మరొక విషయాన్ని కూడా మనం మరవరాదు. పంతులుగారు ఛాందసుడుగా నున్న కాలంలో కూడా అవినీతిని అసహ్యించుకొనేవారు. అంటే దుర్నీతి పట్ల ఆయనకు సహజద్వేషమున్న దన్నమాట.

---

1. స్వీయచరిత్రము (హితకారిణీసమాజము 1954) I పి. 46
2. శ్రీ జి.వి. నారాయణ "శ్రీ వీరేశలింగం పంతులు" 1957 ఏప్రిల్ సంచిక 'భారతి'.
3. స్వీయచరిత్ర (హితకారిణీసమాజం 1954) I పి. 62

దినదినం మారిపోతోంది నాగరిక సమాజం• పంతులుగారు ఆ నవసమాజానికి సంబంధించిన నవీన స్వభావుడు• దానికి కారణం ఏమిటని పరిశీలిద్దాం, రెండు కారణాలు కనబడతాయి• అందులో ఒకటి – 1884లో కేశవచంద్రసేన్ మదరాస్ రావడం• ఆవచ్చిన కేశవచంద్రసేన్ బ్రహ్మసమాజాల నేర్పరమకా మని ప్రజలను ప్రోత్సహించడంతోపాటు, అభావాలను విద్యార్థులలో గూడ రగిలించాడు•[1] ఆయన ఉపన్యాసాలు ముద్రింపబడి గ్రంథరూపంలోకి వచ్చాయి• పంతులుగారాగ్రంథాన్ని చల్లపల్లి రంగయ్యగారి వద్ద నుంచి తీసుకొని అత్యంతాతురతతో చదివారు•[2] అంతవరకు దేవేంద్రనాథ్ టాగూర్ నాయకత్వం కిందవున్న బ్రహ్మసమాజం నుంచి కేశవచంద్రసేన్ విడిపోయాడు• తాను మరొక సమాజాన్నేర్పరచి, పనిసాగించుతూండేవారు• దేవేంద్రనాథటాగూరు హిందూ సమాజము నెమ్మదిగా మారవలసిన ఆవశ్యకాన్ని గురించి నొక్కివక్కాణించారు కేశవచంద్రసేను ప్రాచీనాచారాలను తీవ్రతరంగా విమర్శించి నిర్మూలించ వలసిన ఆవశ్యకాన్ని గురించి నొక్కివక్కాణించారు•[3]

1868లో ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు రాజమండ్రి జిల్లా విద్యాలయం లోనికి ఉపాధ్యాయుడుగా వచ్చారు• వీరేశలింగంగారి భావాలను ఈ విషయంలో ఆయన పెంపొందించారు• లక్ష్మీనరసింహంగారు మచిలీపట్టణం చర్చి మిషన్ పాఠశాల నుంచి వచ్చారు•[4] ఆయన బ్రహ్మసమాజ సిద్ధాంతాలను చర్చించే చర్చా వేదికను రాజమండ్రి విద్యార్థుల్లో ప్రారంభించారు• ఈ చర్చల్లో పంతులుగారూ కనపర్తి లక్ష్మయ్యగారూ చల్లపల్లి సోదరుల్లో ఒకరు కూడా మరికొంత మందితో కలిసి పాల్గొనేవారు•

---

1• బొంబాయి మదరాసులలో పర్యటనను గురించి వివాదాలను తెలిపే ఆయన డైరీ – ఫిబ్రవరి నుండి ఏప్రిల్ 8వ తేదీ వరకు• 1964 (కలకత్తా 1887)
Cf. A Mreneum and Daily News 14 November, 1865.

2• స్వీయచరిత్ర 1 రెండవ ప్రకరణం 60 పే•

3• ది బ్రహ్మసమాజ్ "ఏసుక్రీస్తు, యూరోపు, ఆసియా" 5 మే 1866లోని ఉపన్యాసం – కేశవచంద్రసేనుని ఉపన్యాసములో – (తృతీయముద్రణ–కలకత్తా)

4• గ్రంధి వెంకటసుబ్బారాయగుప్తాగారి "ఆత్మూరి లక్ష్మీనరసింహం సోమయాజీ జీవితచరిత్ర – ఉపన్యాసములతో", (విజయవాడ 1922) 20–21.

## జీవితంలో తొలిదశ

బాల్యంలో ప్రాథమిక పాఠశాలా దశలోనే పంతులుగారు వ్యక్తిగతంగా కొన్ని గుణాలను ప్రదర్శించారు. ఆగుణాలే వారి అనంతర జీవితంలో పెంపొంది స్థిరపడ్డాయి. వ్యక్తిగతంగా ఆయనకు సంభవించిన సన్నివేశాలన్నింటిలోను ఒకదానిని బలీయమైన దానినిగా పురశ్చరణ కావించుకుంటారు. ఆయన జీవితాన్ని చాలవరకు రూపొందించిన గొప్పసంఘటనగా అదేకనబడుతుంది.

ఒకనాడు సాయంకాలం పంతులుగారు కొందరు మిత్రులతోను ఉపాధ్యాయులతోను వాహ్యాళి నిమిత్తం ఊరిబైటకు వెళ్లారు. రెండు మైళ్లు వెళ్లిన తరువాత సూర్యుడస్తమించాడు. అప్పుడు వారందరు వెనక్కుమళ్లారు. కొంత సేపటికి, రెండు పాయలుగా చీలిపోయిన చోటుకి వచ్చారు. ఒకటి అంగళ్లవాడ నుండి, ఇంకొకటి గోదావరిఒడ్డు నుండి పట్టణంలోనికి పోతుంది. ఏదారిని వెళ్లాలి అనే సమస్య వారినెదుర్కొంది. తక్కిన వారందరు విపణివీధి నుండి వెడదామన్నారు. పంతులుగారొక్కరూ గోదావరి గట్టున వెడదామన్నారు. తక్కినవారు, వెనక్కి తిరిగితిరిగి చూస్తూ విపణివీధి నుంచి వెళ్లారు. పంతులుగారు మాత్రం గోదావరిఒడ్డునే వెళ్లి యిల్లు చేరుకున్నారు. మరునాడు కూడా అలాగే జరిగింది. చివరకు లాభంలేదనుకొని తక్కినవారందరూ పంతులుగారి వెంటనదీతీరాన్నే నడిచి వచ్చేవారు. ఎవరు చెప్పినా వినని పట్టుదల పంతులుగారిదని తెలుసుకుని, ఆయన్నను సరించేవారట.[1]

ఒక విషయం దీని నుండి స్పష్టమవుతుంది. ప్రజానాయకుడు కావాలని కాంక్షించేవాడు గాని, సంఘసంస్కరణ కార్యకలాపాలలో పాల్గొనాలని గాఢవాంఛ గలవాడు గాని, తనమనస్సాక్షి ననుసరించే వ్యవహరించాలి. [illegible] ఇతరుల సలహా సంప్రదింపుల పాటించనవసరం లేదని అవగతమవుతుంది. పంతులుగారీవిషయంలో పాఠకులకొక హెచ్చరిక చేస్తారు. సత్కార్యాచరణ ముందు దృఢనిశ్చయము అత్యంతావశ్యకమంటారు.

---

1. కం. వీ. స్వీయచరిత్ర I పే. 59

## సాహిత్య వ్యాసంగం

వీరేశలింగంపంతులుగారు జీవితంలోని తొలిదశలో కూడా ఉపాధ్యాయ వృత్తిని సాహిత్యవ్యాసంగంతో జోడించారు. ఆయన 1868–69లో తెలుగులో కవిత్వం ఆరంభించారు. ప్రప్రథమంగా రెండు శతకాలు రచించారు.[1] ప్రతిపద్యాంతమందు ఒక దేవతను గాని వ్యక్తిని గాని ఉద్దేశించి పలుకుతూ, 100 లేక 101 లేక 108 పద్యాలు గల రచనను శతకమంటారు. సుమతీ, వేమన, దాశరథీ శతకాలు అందరికీ తెలిసినవే. పంతులుగారు మార్కండేయ శతకం, గోపాలశతకం రచించారు. అభాగ్యోపాఖ్యానంలో మొదట వేయడంవల్ల ఈ కింది పద్యమిలాగా నిలిచి ఉంది.[2]

" శ్రీరమణీ హృల్లోలా ..... ..... ..... గోపాలా "

తరవాత 1869–70లో " శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము " అనే అచ్చ తెనుగు కావ్యాన్ని రచించారు. అందులో వచనం ఉండదు; సంస్కృత పదాలుండవు. దానికి తోడు ఓష్ఠ్యాలైన పదాలు కూడా ఉండవు. పూర్తిగా అచ్చతెలుగు మాటలతో వ్రాసిన పద్యాలతో కూడుకున్నది. ఈ కావ్యం పంతులుగారి పాండిత్య ప్రకర్షకు ప్రతీక. ఆయన కవితా వియత్తులో ప్రవేశించి బాలభాస్కరునివలె ప్రకాశింపనారంభించారు.[3]

ఆకాలంలో ఆయన మెట్రిక్యులేషన్ పరీక్షకు చదువుతూండేవారు. 1868లో జిల్లా విద్యాలయము రాష్ట్రపాఠశాల స్థాయికి హెచ్చింపబడింది. అంటే ఎఫ్.ఏ. పరీక్షకు శిక్షణనిచ్చే స్థాయికిXXXX సంపాదించిందన్నమాట. అయినా ఆతరగతి మాత్రం ఏర్పడలేదు.[4]

---

1. అక్కిరాజు రమాకాంతరావు గారి 'పంతులుగారి గ్రంథరచనా ముద్రణముల వివరములు'' వీరేశలింగంగారి కృతుల చరిత్ర 'యుగపురుషుడు' లో (హైదరాబాద్ ఎన్.డి. 206
2. కం.వీ. స్వీయచరిత్ర (హితకారిణీ సమాజం 1954) 1–81
3. అక్కిరాజు రమాపతిరావు ''వీరేశలింగంపంతులు'' 37–38. మోరిస్ – గోదావరిజిల్లా.

ఆనాడున్న సీనియర్ విద్యార్థులలో వీరేశలింగంగారొకరు. ఆయనకప్పుడు 21 వ సంవత్సరం నడుస్తోంది. చాలా మంది విద్యార్థుల కంటే ఆయన వయస్సులో పెద్ద. అందువల్లనే కాబోలు 1870లో కొత్తగా వచ్చిన ప్రధానోపాధ్యాయులు బారోన్‌దార పంతులుగారి దగ్గర తెలుగు నేర్చుకొనేవారు.[1]

అత్యంతాసక్తి, మహోన్నతాశయాలూ, ఆశలూ కలిగిన పంతులుగారి వంటి వ్యక్తికి శిథిలావస్థలోనున్న కోరంగి వంటి గ్రామం ఇవ్వవలసినంత ప్రోత్సాహాన్ని ఇయ్యలేదు. అందువల్ల పంతులుగారు లోయర్‌గ్రేడ్ తెలుగు ట్రాన్స్‌లేషన్ పరీక్ష కూడా యిచ్చి, కృతార్థులయ్యారు.[2] కాని, దానిని ప్రభుత్వోద్యోగం సంపాదించడానికి మాత్రం ఉపయోగించుకోలేదు. ఎందుకంటే, ప్రభుత్వోద్యోగాన్ని స్వీకరించడానికి పంతులుగారి మనస్సు అంగీకరించినట్లు లేదు. బహుశః, కోరంగిలో నెలకు 30 రూపాయల జీతంకాగా, ప్రభుత్వంలో గుమాస్తాకు 15 రూపాయలతో ప్రారంభం కావడమే దానికి కారణమేమో![3] ప్రభుత్వకార్యాలయాలలో పనిచేస్తున్న పంతులుగారి బంధువులతో ఆయనకున్న సంబంధం అంత బలీయంగా లేదేమో![4] సాధారణంగా పరీక్షల్లో గట్టెక్కడమొక్కటే ఉద్యోగ సాధనకు చాలదేమో! కారణమేదయినప్పటికీ, తన సంపదలను తన పని పరిమితులను దాటిన కార్యకలాపాలకు వినియోగించారు పంతులుగారు.

వీరేశలింగంగారి సాహిత్యకృషి సిసలుగా ఇక్కడే ఆరంభమయింది. తెలుగు పండితులకోవలోనికి ఆయన్ని చేర్చడం సంప్రదాయ సిద్ధంగానే జరిగింది. పద్య రచనను మాత్రమే కవిత్వంగా పరిగణించిన ఆయుగంలో ఆయన కూడా పద్య రచనతోనే సాహిత్యవ్యవసాయాన్ని ఆరంభించారు. పద్యరచనలోని భాష వ్యావహారిక భాషకు పూర్తిగా భిన్నం కదా! పంతులుగారు మాత్రం సంస్కృతీకరించని అచ్చతెనుగులో కవిత్వం చెప్పడం ఆరంభించారు. అంటే భాషను సంప్రదాయవ్యాకరణ బద్ధం చేశారన్నమాట.[5] పంతులుగారి సారస్వతసేవ బహుముఖమయింది.[6]

---

1. కం.వీ. స్వీయచరిత్ర 2 146
2. గోదావరిజిల్లా గెజిట్ – 29 మార్చి 1873.
3. అంయిబిడ్ ,, 8 జనవరి 1876
4. కం.వీ. స్వీయచరిత్ర 1—69
5. అక్కిరాజు రమాకాంతరావు, 'వీరేశలింగంపంతులు'
6. జి.వి. నారాయణరావు 'శ్రీవీరేశలింగంపంతులు, భారతిలోవ్యాసం 1957ఏప్రిల్ పే.3

క్రీ.శ 16 శతాబ్ది ప్రాంతంలో క్షీణయుగంలో అడుగుపెట్టిన ఆంధ్ర సరస్వతి 18 శతాబ్దం వరకు కొనఊపిరితో జీవచ్ఛవంలా పడిఉంది. ఆంధ్రభాషావాఙ్మయంలు వాటి దిక్కుచూచేవారు లేక దరిద్రస్థితిలో మగ్గుతూ ఉండేవి. అప్పటికి రామమోహనుని కోర్కె ప్రకారం భారతదేశం నలుమూలలకు చేరింది. చాలామంది ఆంగ్లభారతిని సేవించి ఆనాగరికతకు మానసపుత్రులయ్యారు. పాశ్చాత్యుల ఉచ్ఛదశను పురోగమనాన్ని చూచి తమ జాతికీ అదికళగాలని కలవరించిన ప్రథమ జాతీయవాదుల్లో వీరేశలింగంగారు ఆంధ్రదేశంలో ప్రప్రథములు ఆంగ్లేయుల రాపరికంతోపాటు ఆంగ్లభాషావాఙ్మయాలను నిరసించి మన భాషావాఙ్మయాలవైపు జాతీయవాదులు దృక్కులుసారించారు. వెనక్కు తిరిగి చూచిన పంతులుగారికి కనిపించింది, పట్టి అంధకారం. ఆంధ్ర సరస్వతి గొంతుకలో కొనఊపిరి నిల్చికొని ఉంది. ప్రజల్లో సారస్వత జిజ్ఞాస, పిపాస, సాహిత్యారాధన నశించాయి. ఈ వైపు దృష్టి లేనే లేదు. అప్పటికి మన వాఙ్మయమనే ఎండుమోడుకు కావ్యప్రబంధాలు, చంపూగ్రంథాలు తప్ప మరే శాఖలూ లేవు. అటువైపు పాశ్చాత్యవాఙ్మయం కల్పతరువు కోరిన రీతిలో విస్తారి విరబూసి ఉంది. అందులో కావ్యసంబంధమే కాదు, నాటకలే కాదు. నవలలు, నాటికలూ, ఏకాంకికలు, ప్రహసనాలు, వ్యాసాలు, విమర్శలు, వ్యాఖ్యలు, నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వాలూ, స్వీయచరిత్రలూ, భాషావాఙ్మయచరిత్ర, కవుల చరిత్రలు అన్నీ ఉండి సాహిత్యోపాసకులకు విశ్వరూపసందర్శనాన్ని కలుగజేస్తుంది. దీనంతా ఆకళింపు చేసుకున్న వీరేశలింగంపై నూతనానుభవాలతో ఆంధ్రశారదనలంకరించాలని సంకల్పించారు. తత్ఫలితమే వారి రచనలు.

## నవలలు

కందుకూరి వారి 'రాజశేఖర చరిత్ర' తెలుగులో మొట్టమొదటి నవలని చెప్పొచ్చు. "వికారాఫ్ వేక్‌ఫీల్డు" కు అనుకృతేమో! రాజశేఖరచరిత్రలోని నీలాద్రి దేష్యం, బైరాగి సువర్ణవిద్య, సుబ్రహ్మణ్యం ఛాందస బుద్ధి, కృష్ణగజపతి

ఔదార్యం మరచిపోలేం. కథాకథన శిల్పం కన్నా తననాటి సమాజంలోని వ్యక్తుల మనస్తత్వాలనీ, మూఢవిశ్వాసాలనీ, అజ్ఞానాన్నీ, అమాయకత్వాన్నీ దురాచారాలనీ ప్రతిబిన్న సంఘటనలో కళ్లకు కట్టినట్లు వర్ణిస్తారు. పంతులుగారు తాతగారి సంగతికూడ యింటితో సహాకాంత చెపుతారు. ఈ నవల జాతీయాలతో నుండి ఉమ్మెత్తపువ్వులా అందంగా సలక్షణంగా ఉంటుంది. ప్రపంచవ్యాప్తమయిన అంగ్లభాషలోని కనువదింపబడిన గౌరవాన్ని పొందిన మొదటి తెలుగునవల ఇదే.

పంతులుగారి 'రాగమంజరి' ఆతరువాత 'సత్యరాజా పూర్వదేశయాత్రలు' చెప్పుకోదగిన నవలలు. ఈ రెండో నవలను ఆనాటి సంఘ దురాచారాలను తెగనాడడమే ప్రయోజనంగా పెట్టుకొని రచించారు. ఆడమళయాళమనే రాష్ట్రంలో సర్వహక్కులూ స్త్రీలకే సంక్రమించాయనీ పురుషుల దీనావస్థను, కళ్లకుకట్టినట్లు వ్యంగ్యంగా వర్ణించి స్త్రీలదుస్థితి మనసుకు హత్తుకొని పురుషులు సిగ్గుపడేటట్లు చేశారు.

## నా ట కా లు

మాళవికాగ్నిమిత్రం, అభిజ్ఞాన శాకుంతలం, రత్నావళి, నాటకాలు సంస్కృతానికి పంతులుగారి తెలుగునేతలు. ఈ అనువాదాలుగాక, నాటికలు, ఏకాంకికలు, సంస్కరణమే ప్రధాన ప్రయోజనంగా గల ప్రహసనలు అనేకాలున్నాయి. ప్రహసనాల్లో వంట బ్రాహ్మణాచార్యుల, మతగురువుల, జారత్వం మొదలయిన వానిని కథావస్తువులుగా చేసి కడుపుబ్బనవ్వుపుట్టిస్తారు. అంతేకాక మనసుల్లోని కల్మషాలను కూడ క్షాళనంచేయగల పదును కలిగిఉన్నాయి.

## వ్యాసాలు - విమర్శలు - వ్యాఖ్యలు

పంతులుగారు వీనిని లెక్కకు మిక్కిలిగా వెలువరించారు. మతవిషయాల్లో, భాషావాఙ్మయ విషయాల్లో అనేక పరిశోధనలు చేసి వ్యాసాలు, విమర్శలు, వ్యాఖ్యలు ప్రకటించారు. అంగ్లసాహిత్యంలో ఉన్న వ్యాసం, విమర్శ, వ్యాఖ్యలనే వాని సరళిననుసరిస్తూ ఇవి సాగాయి. సంఘపరంగా, మతపరంగా, వాఙ్మయపరంగా

స్వీయాభిప్రాయాలను వీనిలో నిర్భయంగా ప్రతిపాదించారు. వివేకవర్ధని పత్రికనే గాక, ఆపేరుతో గ్రంథమండలిని కూడా స్థాపించి ప్రచురణలు వెలువరించారు. ఇవి సునిశితాలు, తీవ్రాలు, ప్రజ్ఞాంచితాలు అయ్యాయి. ఇవేగాక స్త్రీలకోసం గ్రంథాలకు గ్రంథాలను పంతులుగారు ప్రకటించారు.

పంతులుగారు అవధానాలు కూడ చేసి కవిపండితుల ప్రశంసలు నందుకున్నారు. స్వీయచరిత్ర [illegible] వాఙ్మయశాఖకు శ్రీకారం చుట్టిన ఘనత పంతులుగారికే [illegible] దక్కింది.

### కవుల చరిత్ర

ఆంగ్లవాఙ్మయ తీరుతెన్నులు పరిశోధించి బృహత్తర వ్యాసపరంపరను పంతులుగారు ప్రకటించారు. దీని అనుబంధకృషే ఆంధ్ర కవుల చరిత్ర సమర్పణం. వీరేశలింగం గారి నాటికి దేశచరిత్రలోగాని వాఙ్మయవిభాగంలోగాని పరిశోధనంత సులభమయిన పనిగాదు. ఈ నాడున్నన్ని అవకాశాలు ఆనాడు మృగ్యం. పరిశోధనావకాశాలేకాదు, పరికరాలుకూడ అతిస్వల్పం. అధిక ధనవ్యయం జీవన ప్రయాసలతో కూడిన పని. అలాంటి కష్టసాధ్యమయిన కార్యాన్ని భాగీరథునిలా ఆయన సాధించి సాంద్ర తమస్సున కానరాని ఆంధ్ర కవుల జాడలను, స్థితిగతులను తనశక్తి కొద్దీ వెలుగుకుతెచ్చారు. భారతదేశచరిత్ర పరిశోధనలో విన్సెంట్ స్మిత్‌లాగా ఆంధ్రభాషా వాఙ్మయచరిత్ర పరిశోధనలో పంతులుగారేప్రప్రథములు.

### కథలు – కథానికలు

క్రీస్తుకు పూర్వమే కాశ్మీరంలో రచింపబడి యింటుమించు క్రీ.శ 5,6 శతాబ్దాల ప్రాంతం దరిదాపుల్లోనే అరేబియా, పర్షియా, గ్రీకు దేశాలకు భారతీయ పంచతంత్రం వెళ్లింది. క్రీ.శ 12 శతాబ్ది ప్రాంతంలో అరేబియన్ల నుండి ఆంగ్లేయులు పంచతంత్రాన్ని గ్రహించి ఆంగ్లానువాదం ప్రకటించుకున్నారు.

అది క్షీతి తారకలుకూడిన వినుల సారస్వతాకాశం. ఈ సంస్కృత పంచతంత్రాన్ని క్రీ.శ 15 శతాబ్ది ఉత్తరార్ధంలో దూబగుంట నారాయణకవి కావ్యరూపంలో ఆంధ్రీకరించాడు. పరవస్తు చిన్నయ్యసూరి దీనినే నీతిచంద్రిక అనేపేర గద్యంలో 'మిత్రలాభం', 'మిత్రభేదం', అనిపూర్తి చేశాడు. మిగిలిన సంధి విగ్రహాల్లో అధికభాగం వీరేశలింగంపంతులుగారు కొంత కాకొండ వెంకటరత్నం పంతులుగారు పూర్తిచేశారు. ఇలా కథలూ, కథానికలు తెలుగు వచనంలో రాయడానికి చిన్నయసూరి మార్గాన్ని చూపగా పంతులుగారు దాన్ని అందుకొని కథాసాహిత్య వైశాల్యాన్ని పెంచారు. పంతులుగారి తరువాతనే వారిననుసరించి కథాసరిత్సాగరాన్ని వేదం వెంకటరాయశాస్త్రిగారు అనువదించారు. తరువాత చిలకమర్తి మొదలయినవారు ఈ మార్గంలో నడిచారు.

ఈ విధంగా పంతులుగారు నవ్యాంధ్ర యుగంలో సంఘ సంస్కరణ విషయంలో రాజారామమోహనులాగే ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసానికి నన్నయలా కృషిచేశారు. ఆయన జిజ్ఞాసుడు, పండితుడు, కవి, విమర్శకుడు, తత్త్వవేత్త. అన్నిటికంటే అమిత ధైర్యశాలి అనే విషయం గమనించాలి. ఉక్కుగుండె కలవాడు, సంఘబహిష్కరణ చేసినా దుర్మార్గులు దుండగాలు తలపెట్టినా లెక్క చేయక ధైర్యంగా నిలబడ్డ వీరుడు. ఆయనది నిర్విరామ జీవితం. అది మహా సంగ్రామమంటిది. అందులో ఆయన విజేత. ఆంధ్రభూమికి వీరేశలింగం చిరస్మరణీయుడు.

1870లో పంతులుగారు 'రసికజన మనోరంజనం' అనే గ్రంథాన్ని ప్రబంధశైలిలో అచ్చ తెలుగులో రచించారు. 1872లో శుద్ధాంధ్ర ఉత్తరరామాయణం అచ్చ తెలుగులో రాసి, 'పురుషార్థప్రదాయిని' అనే పత్రికలో ప్రకటించారు. ఈ పత్రిక మచిలీపట్టణం నుండి ప్రచురింపబడేది. అది ఆనాటి తెలుగు సాహిత్యపు పోకళ్లను ప్రతిబింబించేపత్రిక.

కొక్కొండ వెంకటరత్నంపంతులుగారు ఆంధ్రభాషాసంజీవని అనేపత్రికను 1871లో ప్రారంభించారు. పండితులు పత్రికలు నిర్వహించడం అరుదు. వీరేశలింగంగారు సాహిత్యవ్యాసాలనాపత్రికలో ప్రచురించేవారు. తన రాజకీయ సాంఘికాభిప్రాయాలను తన సహచరులకందచేయడానికి ఆపత్రిక ఎంతగానో ఉపయోగింపబడింది. అది కొన్నిసార్లు బ్రిటిషు విధానాలను విమర్శిస్తూ, హిందూ స్త్రీల అవస్థాన్ని మెరుగుపరచాలని కోరుతూండేది.[1]

పంతులుగారు 1871 నుండి 1874 వరకు కోరంగి ఆంగ్లో వర్నాక్యులర్ పాఠశాలలో ఉన్నప్పుడే మదరాసులోని తెలుగు సాహిత్యం యొక్క పోకడలకు నాంది పలికారు. 1874-75 మధ్య ఆయన ప్రచురణలవల్ల, కోరంగిలోనున్నప్పుడు కొక్కొండ వెంకటరత్నంగారిని మించలేకపోయినప్పటికీ ఆయనతో సమానమైనా కావాలన్న గాఢవాంఛతో తనకాలంలోని అధికభాగాన్ని రచనావ్యాసంగంలో గడిపినట్లు కనబడుతుంది. పంతులుగారు ప్రప్రథమంగా తనరచనలను వెంకటరత్నం గారి పత్రిక – 'ఆంధ్రభాషాసంజీవని' లో ప్రకటించేవారు. కాని, తరవాత వెంకటరత్నంగారి మీద వీరేశలింగంగారు దాడిజరపడం మొదలుపెట్టారు. ఆసమయంలో తన రచనల నాయన మరొక పత్రికలో ప్రకటించుకోవలసి వచ్చింది.[2]

1874లో పంచతంత్రంలో ఒక భాగాన్ని 'నీతిచంద్రిక-విగ్రహము' అనేపేర్లతో ప్రకటించారు పంతులుగారు. 'నీతిదీపిక' అనేపేరతో నీతిపద్యాల సంపుటిని ఆ సంవత్సరమే ప్రకటించారు. ఈ కథలను పంచతంత్రంలోని కథలమాదిరిగానే నడిపించారు.[3]

---

1. ఆంధ్రభాషా సంజీవని ఫ్రెండ్ ఆఫ్ ఇండియా నుండి ఉదహరింపబడినట్లు 24 జులై 1874
2. కం.వీ. స్వీయచరిత్ర-1 74-76. 150 వెంకటరత్నంగారిదాడిని తిప్పికొట్టడం. ఆయన పద్యరూపంలోనేదాడిచేశారు. దానిని 'పురుషార్థప్రదాయిని' లో ప్రకటించారు.
3. రమాపతిరావుగారి 'పంతులుగారి గ్రంథరచన – యుగపురుషుడు' 206 1875-76లో నీతిచంద్రిక విగ్రహము పాఠశాలల్లో పాఠ్యగ్రంథాలుగా మెట్రిక్యులేషన్ పరీక్షకు నిర్ణయించడం ఉపయోగించడం జరిగింది. మదరాస్ విశ్వవిద్యాలయం కాలెండర్ 1875-76 (మదరాస్ 1876) 81.

1875లో మదరాసునందు జరిగిన తెలుగుపండితుల సమావేశంలో తన సాహిత్య విజయాలకు చిహ్నంగా వెండి షీల్డును బహుమతిగా పొందారు. ఆపండిత సమావేశం బహుజనపల్లివారిని గూడ సన్మానించింది. సుప్రసిద్ధ వ్యాకరణ శాస్త్రజ్ఞులు బహుజనపల్లివారు.[1]

మదరాసులోని తెలుగు పండితులుగాని, వీరేశలింగంపంతులుగారు గాని సంప్రదాయ లక్షణాలతో మాత్రం రాస్తుండేవారని నమ్మకం పొరపాటు. ఇతివృత్తాల నెన్నుకోవడంలోగాని, వాటిని రూపొందించడంలోగాని, రెండు లక్ష్యాలు ప్రధానంగా పెంపొందుతూ ఉండడం ప్రస్ఫుటంగా కనబడుతుంది. ఒకటి—తగిన పాఠ్యగ్రంథాలు ప్రభుత్వానికి కావశ్యకమయ్యాయి. అందులోను పద్యరచనకంటె గద్యరచన కెక్కువ ప్రాధాన్యం వచ్చింది. అందువల్లనే, సాహిత్యభాషను విద్యార్థులకు విశదపరచడానికి వ్యాకరణ గ్రంథాల ఆవశ్యకత అధికమయింది. ఈ వ్యాకరణ గ్రంథాలు నిజ సంప్రదాయ సిద్ధంగానున్న పండితుల వ్యాకరణాలవంటివి కావు. కేవలం నిర్వచనాలు కాక, వివరణలతో ఉండవలసివచ్చింది. రెండవలక్ష్యం ఏదంటే, విషయలోలత్వాన్ని ప్రదర్శించే యితివృత్తాలను నిషేధించవలసిన ఆవశ్యకత. అది సంప్రదాయకవిత్వలక్షణాల్లో బలీయమైంది. దానికి బదులు నైతిక వర్తనాన్ని హెచ్చు స్థాయికి కొనిపోగల యితివృత్తాలను గ్రహించాలని భావించారు. ఆనాటి పాఠ్యగ్రంథ కమిటీలలో అధికంగానున్న మిషనరీల భావాలతోను మత ప్రచారకుల భావాలతోను ఇవి ఏకీభవించాయి.[2]

---

1. రమాపతిరావు గారి 'ముఖ్యచరిత్రములు' యుగపురుషుడు 223.
2. John Murduch. Idulations and Immoral teaching of some Government and University Text books in Madras, India (Madras 1872). "Dr. Murdoch Observes that it is most disgraceful that the British Government should permit books and teach them in its schools showing how to overcome by deceit". So far as we can discover (this book) has never at any time been prescribed as a text book for Government schools. We understand however that this book has been used, still in certain Mission Girls Schools. Government of Madras, Repot of the Committee for the Revision of English, Telugu and Tamil School Books in the Madras Presidency (Selections from the records of the Madras Govt. XIV Third Series, Madras 1875) 93.

మాతృభాష నభివృద్ధిచేయాలనే తెలుగు రచయితల మాతృభాషాభిమానంతోపాటు, ప్రభుత్వం నుండి లభించే ప్రోత్సాహం కూడా కొంత తోడ్పడింది. అందువల్ల, ప్రాంతీయభాషల్లో మార్పులుగానిరావాలనే ఒత్తిడి కొంచెం ఎక్కువయిందని చెప్పాలి. ముఖ్యంగా మిషనరీల నుండి ప్రభుత్వపక్షం నుండి, ఒత్తిడి వొచ్చింది. తెలుగు పండితులనే ఉపాధ్యాయులుగా నియమించడం వల్ల, వారికి ఆర్థిక ప్రోత్సాహాన్ని కూడా అందించడం వల్ల, పండితులు కూడా xమార్పులనుx వారి కోర్కెలను అంగీకరించినట్లు కనబడుతుంది. అంతేకాదు అదివారి కర్తవ్యమని కూడా అనేకులు భావించారు.[1] దానికి వీరేశలింగంగారు కూడ అనుకూలురే గాని, వ్యతిరేకులు కారు.

ఈ విధంగా తెలుగు పాఠ్యగ్రంథాలను గురించి ఏర్పడిన కమిటీలను, వాటి నిర్ణయాలను పరిశీలించాంగదా! దీనివల్ల మనకు తెలియవచ్చిందేమిటి?

---

1. Madras Mail, 23 October 1877 and 8 April, 1878

## భాషా సంస్కరణ

పై పరిశీలనవల్ల పాఠ్యగ్రంథాలలో కొంత సంస్కరణను తీసుకురావాలనే ప్రయత్నం ఎంతగానో జరిగినట్లు తెలుస్తుంది. ప్రభుత్వమూ మిషనరీలు ఆసంస్కరణ విషయంలో నిర్వహించిన పాత్ర విద్యార్థులకు సంప్రదాయ గ్రంథాలలోని పాఠ్యాంశాలవల్ల కలిగే నష్టం ముఖ్యంగా అనవసరమయిన విషయవాంఛలు ఇతివృత్తాలుగా గలవానిని పూర్తిగా నిషేధించడం, నీతికథలకు ప్రాధాన్యమియ్యడం. ఇవన్నీ సంస్కరణలే గదా!

దీనికి వీరేశలింగంగారికి గల సంబంధం వారు స్వయంగావాటిలో ఎలా పాల్గొనగలిగిందీ, నీతిచంద్రిక - విగ్రహం రచించడం, వాటిని ప్రభుత్వం కొన్ని ప్రయివేటు సంస్థలు పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించడం - ఇవన్నీ మనపరిశీలనలో కనబడిన విషయంలే గదా! ఆవిధంగా సాహిత్యపరంగా పంతులుగారి సంస్కరణ ఆరంభమయిందనవచ్చు.

## పురాతన అధునాతన సాహిత్య సంప్రదాయాల సమన్వయం!

సాహితీ ప్రపంచంలో పురాతనాధునాతన సంప్రదాయాలను సమన్వయించి అధునాతన ఆంధ్రవాఙ్మయ నిర్మాణంకావించారు పంతులుగారు. ఈ రెంటినీ సమన్వయంచేసిన విధానం గమనిస్తే ఆయన ప్రతిభా విశిష్టతలు గోచరిస్తాయి. ఆదిలో అధునాతన సంస్కృతికి కేంద్రం మదరాసు. తరువాత దానికి రాజమండ్రిని కేంద్రంగా చేసినవారు పంతులుగారు. ఆదియుగంలో నన్నయ, మధ్యయుగంలో శ్రీనాథుడు, ఆధునికయుగంలో వీరేశలింగం రాజమండ్రిలో ఆంధ్రవాఙ్మయాన్ని సుసంపన్నంచేసి చిరస్థాయిగా నిలిచారు. ప్రాచీనాంధ్రకావ్యస్రవంతికి ప్రథమ తీర్థం రాజమండ్రి. వీరేశలింగంగారు నవ్యసంస్కార స్రవంతిని ఆతీర్థంలో సమ్మిళితం చేశారు. గంగా యమునా సంగమంవలె పురాతనాధునాతన స్రవంతులు

---

1. వెంకటరావు నిడదవోలు - "నవయుగ నిర్మాత- వీరేశలింగంకవి" భారతి ఏప్రిల్ 1948

సంగమించి వీరేశలింగంగారి నాడు రాజమండ్రి పవిత్ర సాహితీ క్షేత్రంగా పరిణమించింది.

సారస్వత జీవితంలో మొదట్లో వీరేశలింగంగారు కవిగా పరిగణితులు. రాజమండ్రిలో భావసంవత్సరం నాటికి ముగ్గురే కవులు. పంతులుగారు, వాసుదేవశాస్త్రి, వడ్డాది సుబ్బారాయుడు. వారినే రాజమండ్రి ''కవిత్రయం'' మని తరువాత కాలంవారన్నారు. క్రీ.శ. 1919 వీరేశలింగంగారు మరణించినప్పుడు వడ్డాది సుబ్బారాయుడుగారు ఇలా నీరాజనాలర్పించారు -

> " ప్రాకృత కవిత్రయంబునను రాజమహేంద్రవరంబు నందునెన్నిక
> గనినట్టివారల కనిష్ఠిగ నెక్కిన జేష్ఠు ...... "

ఇది " కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసః " అన్న సూక్తిని స్మరింపజేస్తూ ఆంధ్రసాహిత్యంలో కవిగా పంతులుగారి స్థానాన్ని వ్యక్తంచేస్తుంది.

## ప్రాచీన గ్రంథముద్రణం

ప్రాచీన పఠకంలో వెలసిన ప్రౌఢకృతులెన్నిటినో పంతులుగారు ముద్రించి వ్యాప్తిలోకి తెచ్చారు. ఈ విషయములోను కృషి అమోఘంగా సాగించారు. నాచనసోముని-హరివంశం, కేతన - దశకుమారచరిత్రం, అనంతుని - భోజ రాజీయం, నందిమల్లయ్య, ఘంట సింగనల - వరాహపురాణం, చెరిగొండ ధర్మన - చిత్రభారతం మొదట ముద్రించి వ్యాప్తికి తెచ్చినది వీరే. ఇవేకాకుండా ' చింతామణి ' పత్రిక ద్వారా 'ప్రభావతీ ప్రద్యుమ్నం' నారాయణకవి ' పంచతంత్రం ', కాకుమాని మూర్తి ' పాంచాలీ పరిణయం ', మొల్ల ' రామాయణం ', ప్రబోధ చంద్రోదయం, విజ్ఞానేశ్వరం (కేతన) మొదలయిన వాన్నిముద్రించి ప్రకటించారు.

## గ్రాంథిక వచన రచన

వచన కావ్యాలను ప్రాచీన ప్రౌఢ పండితుల్లా రచించే సామర్థ్యం తనకుండని స్పష్టం చేయడానికి పంతులుగారు చిన్నయసూరి ననుసరించి 'నీతిచంద్రిక', 'సంధి' 'విగ్రహాలను' రచించారు. ఇవి ఈ నాటికీ విద్యార్థి లోకానికి పఠనీయాలే. కానీ ఈ గ్రాంథిక రచన పంతులుగారికి నిసర్గం కాదు. ప్రాచీన సంప్రదాయాలను మన్నిస్తున్నానని జెప్పడానికే యిలాంటి రచనలాయన చేశారు. ఈ అభిప్రాయంతోనే అవధానంచేశారు. ఆశుకవిత్వం చెప్పారు. శతకాలు రాశారు. సాహితీ ప్రౌఢిమను వెలువరించారు. ఈ విధంగా ప్రాచీన పక్షకాన్ని అవిచ్ఛిన్నంగా పాటించే తన సామర్థ్యాన్ని పండితలోకానికి వ్యక్తంచేసి ఆలోకంలో సముచిత స్థానాన్ని సంపాదించారు.

నవీన పక్షకంలో ప్రధానమయింది గద్యరచన. సూక్ష్మతరాలయిన శాస్త్రీయ విజ్ఞానాంశాలను, మహోన్నత భావాలను, సర్వజనులు సులభంగా గ్రహించడానికి అవకాశం కలిగించేది వచనరచన. అలాంటి దానికి సృష్టికర్త పంతులుగారు. ఆరచన సంస్కృత వాసనలు కలిగివున్నా తెలుగుదనాన్ని వెదజల్లడం వల్లనే 'గద్య తిక్కన' అనే బిరుదు ఆయనకు సార్థకమయింది.

''నేనేర్పరచుకున్న భాషాభివృద్ధి మార్గం తెలుగుభాషలో సులభశైలిని సలక్షణమయిన వచన రచన చేయుట'' అని 'వివేకవర్ధనీ' పత్రికాముఖాన ఆయనే తన రచనా పద్ధతిని తెలిపారు.

సంఘసంస్కరణం వల్ల వితంతువివాహాలవల్ల పంతులుగారి కీర్తి రాష్ట్రేతర ప్రాంతల్లో కూడ వ్యాపించింది. తమిళ దేశీయుల జాతీయకవి సుబ్రహ్మణ్యభారతి తన 'చంద్రికై'' నవల్లో వీరేశలింగంగారి పాత్రను చిత్రించారు. సంఘసంస్కర్తగా ఆయనకున్న చిరకీర్తి కంటే సారస్వతంలో ప్రతి ఆధునిక ప్రక్రియకు శ్రీకారం చుట్టిన సాహితీవేత్తగా ఆయనకున్న ప్రతిష్ఠ ఇసుమంతయినా తగ్గిపోదు. ఆత్మవిశ్వాసం, పరిశుద్ధప్రవర్తన అంతఃశుద్ధి మొదలయిన విశిష్టగుణాలతో

ఆధునిక వాఙ్మయం ప్రపంచంలో ప్రకాశిస్తున్న వీరేశలింగంకవిగారు చిరస్మరణీయులు.

## ఆధునికాంధ్రజాతి నిర్మాతలు నాయకులు [1]

వంగదేశానికి రాజారామమోహనుడు, విద్యాసాగరుడు, బంకించంద్రుడు చేసిన మహోపకారాన్ని ఆంధ్రదేశానికి వీరేశలింగంపంతులుగారొక్కరే సర్వతోముఖంగా చేశారు. నాడు నన్నయ, రాజరాజు పవిత్ర గోదావరీ స్రవంతికి కైమోడ్చి ఆంధ్రచరిత్రలో నూతన శకాన్ని సృష్టించినట్లే పంతులుగారు తన సాహిత్యసమాజ సంస్కరణలతో ఆధునికాంధ్ర శకాన్ని సృష్టించి ఆ శకపురుషుడయ్యారు. మన సాహిత్యరంగంలో పంతులుగారితో పాటు చెప్పదగినవారు తిరుపతి వెంకటేశ్వర కవులు, గురజాడ అప్పారావుగారని కోలవెన్ను రామకోటీశ్వరరావుగారి అభిప్రాయం.

బడిలో తెలుగువాచకాలు వీరేశలింగంగారు రాసినవే. కళాశాలలో చదివే కవిజీవితాలూ వారివే. ఇక ఉల్లాసంగా చదివే గ్రంథాలు చదవాలంటే 'సత్యరాజా పూర్వదేశయాత్రలు', 'రాజశేఖరచరిత్ర', 'బ్రాహ్మవివాహం', మహారసపట్టులుగా ఉంటాయి. ప్లీడర్ల ప్రసంగం వస్తే 'వ్యవహారధర్మబోధిని'లోని వీరన్న, దారయ్య సోదర్ల వ్యాజ్యాలు, సూర్యనారాయణ పంతులు దర్పం చిత్రంగా కనిపిస్తాయి. నాటకాలమాట కొస్తే కృష్ణమాచార్యులవారి చిత్రనళీయం, వేదంవారి ప్రతాప రుద్రీయం, తిరుపతి కవుల పాండవోద్యోగం, పంతులుగారి శాకుంతలం మహోన్నత శిఖరాలుగా ఉంటాయి. వారు ప్రహసనాల్లో హాస్యరసాన్ని చక్కగా పోషించినా అహాస్యం వెనక రోషం, క్రోధం తాండవిస్తుంటాయి. పంతులుగారు యోధుడు. చివరోజుల్లో పంతులుగారు కూడ ఒక బహిరంగసభలో వ్యావహారిక శైలికి సుముఖులయినట్లు విన్నికిడి. అయన సంస్కారి.

## సంఘ సంస్కరణ కార్యకలాపాల ఆరంభం

1874లో పంతులుగారు తన నివాసాన్ని ధవళేశ్వరానికి మార్చారు. అది రాజమండ్రికి దక్షిణాన నాలుగు మైళ్లదూరాన ఉంది. తన కుటుంబానికి దగ్గరగా

ఉండవచ్చన్న భావంతో ఆయనక్కడకు మారారు. ఇక్కడ కూడ ఆంగ్లో వర్ణాక్యులర్ పాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగానే వచ్చారు.[1] అక్కడొక బాలికా పాఠశాలను కూడా స్థాపించునట్లు చేశారు. స్త్రీవిద్యను ప్రోత్సహించడంలో ఆయన వేసిన మొదటి అడుగు. ఆ అడుగే సంఘసంస్కరణ కార్యకలాపాలకు కూడ నాంది పలికింది. దానితోపాటు 'వివేకవర్ధని' అనే తెలుగు పత్రిక ఒకదానిని కూడ ప్రారంభించారు. దీనిని ఆయన జీవితచరిత్రకారులు, ఆంధ్రజాతీయ వాదులు, సంఘసంస్కర్తగా జాతీయవాదిగా ఆయన జీవితంలో వేసిన మొదటి అడుగుగా భావిస్తారు.[2] అంతకాదు భారతీయులు పాశ్చాత్యులు కూడ బాలికా విద్యను గురించి బాగా ప్రచారం చేయడంతోపాటు, ఆచరణలో కూడా అనుసరించారు. 1870లో బాలికా విద్యను గురించి హిందువుల్లో ఏకాభిప్రాయం లేదనే చెప్పవచ్చు. కరుడుకట్టిన సనాతనాచారాలను పట్టుకుని పాకులాడేవారు. దానిని నిరసించే పోకడలనే చూపించారు. బాలికలకు ఆవిద్య అనవసరమనీ హానికరం కూడాననీ వారి అభిప్రాయం. మూఢనమ్మకం - కులతత్వం - రెండూకూడా దానిని వ్యతిరేకించాయి.* అయినప్పటికీ విజయవాడ, మచిలీపట్టణం, ఏలూరు పట్టణాలలో పాశ్చాత్యవిద్య.*[3] అప్పటికే నెలకొని ఉన్నది. అగ్రకులాలవారు కూడ వారి బాలికలను క్రైస్తవ మిషనరీల వద్దకు చదువులకై పంపడానికి సంసిద్ధులయ్యారు.[4]* విజయనగరం మహారాజా, పిఠాపురం రాజా, విశాఖలోని గాదెజమీందారులు బాలికా విద్యను ప్రోత్సహించారు. వీరందరూ సనాతన హిందువులుగానే పరిగణించబడ్డారు. మిషనరీలు పెద్ద వ్యతిరేకత లేక, బాలికా పాఠశాలను ఏర్పాటు చేశారు. అనగా ఆనాడు బాలికా విద్యకు వాతావరణం కొంతవరకు అనుకూలంగానే ఉన్నదని చెప్పాలి. అందువల్ల పంతులుగారికి

---

1. వీ.లి.స్వీ. 1 పే.74
2. గురునాథంగారి 'వీరేశలింగం' 29; నార్ల వీరేశలింగం 28, 36, 45.
3. ఎస్.అలగ్జాండర్‌గారి సాంవత్సరిక రిపోర్టు 18 డిసెంబర్ 1877 సి.యం.ఎస్. మిషన్ బుక్స్ 1875 'సి.యం.ఎస్.ఎ.
4. Quinquinniol report of the American Letherin Evangelical Lutherin Mission for 1875-80 (Madras 1881) p. 40

విషయంలో స్థానిక సహకారం కూడా లభించింది. ఆ పాఠశాల అభిమానులు దాసరి రామన్న రాయుడు, ద్రోణంరాజు కృష్ణయ్య, గాదిరాజు ప్రకాశరావు, మొదలైవారు స్థానికులే. పాఠశాల మేనేజరు మల్లాది అక్కన శాస్త్రిగారు వహాత్రం రాజమండ్రి నుండి వచ్చినవారు.[1]

ఆనాడు సమాజంలో స్త్రీల పరిస్థితులందు ఆసక్తి ఉన్నది. 1874లో పంతులు గారు పాఠశాలను నెలకొల్పడానికి ముందే మదరాసులో సంఘసంస్కరణను గురించి విస్తృత ప్రచారం జరిగింది. ప్రధానంగా హిందూ వితంతువుల పునర్వివాహాన్ని గురించి ఆ ప్రచారం ఎక్కువగా జరిగింది. యస్. శేషు అయ్యంగారనే బ్రాహ్మణ న్యాయవాది తిరువాన్కూర్ రాష్ట్రానికి చెందినవాడు. ఆయన, వితంతువైన తన పుత్రికకు 1873లో పునర్వివాహం చేశాడు.[2] తనకు సహకారమందించమని మదరాసులోని భారతీయ నాయకులకు ఆయన విజ్ఞప్తి చేశారు. తన కష్టాలను తొలగించడంలో సాయంచేయమని ఆయన విన్నపం. బ్రాహ్మణులాతన్ని కులం నుంచే కాక అన్నిరకాలుగాను బహిష్కరించారు.[3]

ఆతరవాత, సంవత్సరంలోపుగా, మదరాసులోని సంఘ సంస్కర్త పి.చంచలరావు పునర్వివాహాలలో ఆసక్తిగల వారినందరిని సమావేశపరచాకు. ఆ సమావేశ లక్ష్యం అలాంటి ఆసక్తిగలవారందరిని ఒక సంఘంగా ఏర్పరచాలని. అవకాశమున్నంత వరకు, చేతనయినంతవరకు, సాధ్యమైనంతవరకు, సనాతన హిందూ సమాజ ప్రభావం దానిపై పడనంతవరకు, అలాంటి వివాహాలను ప్రోత్సహించడమే ఆ సంఘలక్ష్యం.[4]

ఈ నూతన సంఘ సభ్యుల్లో అత్యధికులు చంచలరావు గారిని బలపరిచారు. కాని, పి.ఆనందాచార్యులు, ఆర్.రఘునాథరావు సంఘకార్యకలాపాలను కేవలం పవిత్ర హిందూ గ్రంథాలను పరిశీలించి, వితంతు వివాహాలు శాస్త్రీయ సమ్మతమైనదీ కానిదీ కనుగొనడానికి మాత్రమే నని భావించారు. వారి కోరిక ఫలింపకపోవడం వల్ల వారిద్దరూ ఈ సంఘంలో చేరలేదు.[5] వారి లక్ష్యాన్ని గురించి సాహసోపేతంగా

---

1. కం.వీ.స్వీయచరిత్ర I. పే.84
2. Athenaeum and Daily News's 19th May, 1873.
   7th Oct. 1873.
3. Ibid, 3rd Jun. 1874.
4. Ibid,
5. Ibid,

ప్రకటించినప్పటికీ ఈ సంఘం వితంతు పునర్వివాహాన్ని గురించి, దాని ఆవశ్యకతను గురించి కొన్ని కరపత్రాలను ప్రకటించడం వరకే తన కార్యక్రమాలను పరిమితం చేసుకుంది.[1]

ఈ సంఘాన్ని గురించి పంతులుగారికి తెలిసింది. కాల్క్రమేణా అది ఒక ప్రముఖ సంస్థగా రూపొందింది. అయినా, దాని నాయకులు ఆయనను అందులో ప్రాధాన్యమునీ అడగలేదు. పంతులుగారాకారణం చేతనే దానిని తిరస్కరించారు. ఆయన తోటి పండితుడైన పరవస్తు వెంకటరంగాచార్యులు గారిని ఆ సంఘంలో చేరమని వారు కోరారు. ఆయన చేరి, వారితో కలిసి పనిచేయసాగారు. పంతులుగారికన్నా కూడా, తరవాత, మదరాస్ నాయకులను గురించి బాగా తెలియవచ్చింది. కొన్ని సార్లు తప్ప సంఘసంస్కరణయందు వారు మందకొడిగా నున్నందుకు వ్యక్తిగతంగా ఆ సభ్యులను ఎదుర్కొన్నారు.

1974-76లో పంతులుగారు వ్రాసిన తెలుగువ్యాసాల సూపత్రికలో ప్రచురించారు. ఆ వ్యాసాలు నైతిక సమస్యల మీద గాని, సంఘసంస్కరణ గురించి గాని రాయబడుతూండేవి. ఆనాటి రాజకీయవిషయాలను ఈ పత్రిక చర్చించేదికాదు. స్థానిక ప్రభుత్వాధికారులను గూడ ఎదిరించేది కాదు. తరవాత తరవాత మాత్రం వారి నెదుర్కోడం జరిగింది.[2]

పంతులుగారు తమ వివేకవర్ధనిని మదరాసు నుంచి ప్రచురించబడే ఆంధ్రభాషా సంజీవనీలో, మచిలీపట్టణం నుంచి ప్రచురించబడే 'పురుషార్థ ప్రదాయిని' లో నిర్వహిస్తూ వచ్చారు. పండితులకు ఉపాధ్యాయులకు ఆసక్తిదాయకమైన ఉత్తమ సాహిత్యవ్యాసాలను ఆపత్రిక ప్రచురిస్తూండేది.

---

1. పరవస్తు వెంకటరంగాచార్యులుగారి ''స్త్రీపునర్వివాహసంగ్రహము'' (స్త్రీపునర్వివాహమును గురించినచర్చ) మద్రాసు 1875

2. 1874-76ల్లో తెలుగుపత్రికల్లోని భాగాలను మదరాసు ప్రభుత్వం అనువదింప జేసినవాటిల్లో, వివేకవర్ధనిలోని భాగాలు గాని, మరింకేయితర తెలుగుపత్రికల్లోని భాగాలుగాని లేవు. ఎం.ఎన్.ఎన్.ఆర్. 1874-76.

## పంతులుగారిలో ఉదయించిన తాత్త్వికభావాలు

పంతులుగారు 1874లో వ్రాసిన రెండు వ్యాసాలను పరిశీలిస్తే ఒకవిషయం స్పష్టమవుతుంది. ఆనాటి వరకు ఆయన ఆలోచనా ధోరణిని ప్రధానంగా ప్రభావితం చేసింది భారతీయ భావాలూ ఆశయాలూ అన్నదే ఆవిషయం. 'సత్యము' అనే ఆయన వ్యాసంలో, అనుదినము అబద్ధాలాడుతూన్నందుకు హిందువులను తీవ్రంగా ఖండించారు. క్రైస్తవ మతప్రచారకులు కూడ హిందువుల్లోని ఆలోపాన్ని పదేపదే ఎన్నుతూండేవారు.[1] ''సత్యము'' అనే వ్యాసం ఆయన చేసిన ప్రసంగం, దానినే వ్యాసరూపంగా ప్రకటించారు. దానిలో, సత్యం చెప్పడం లేక పలకడం అంటే సత్యాన్వేషణాన్ని చేయడమేనని అన్నారు. ఆరెండింటికి గల సంబంధాన్ని ఆయన ఈ విధంగా స్పష్టపరచారు. సత్యమే నీతికి మూలకారణం. అదిలోపించిన వారిలో సద్గుణమనేదేదీ కూడ ఉండజాలదని అన్నారాయన.[2] 1874 డిసెంబరులో పంతులుగారు ప్రచురించిన

---

1. వీరేశలింగంగారి వ్యాసములు నవంబర్ 1974 కం.వీ.లింగం గారి కృతులు 8 313 – 320 అసత్యమాడినందుకు క్రైస్తవులు తెచ్చిన ఉత్తరవులు జాన్ మర్డాక్ నందుకనబడతాయి. 'ది ఇండియన్ స్టూడెంట్స్ మాన్యువల్' (మద్రాసు, 1875) 201.
2. కం.వీ.వ్యాసములు 1874 కం.వీ.కృతి గ్రంథాలు 8, 313. ఆయన వ్యాసంలోని ప్రామాణికత్వాన్ని లేక సత్యాన్ని చాల మంది రచయితలు పండితులు పరిశీలించారు. పి.ఎఫ్.రమాపతి రావు గారి 'వీరేశలింగపంతులు' మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి 'ఆంధ్రరచయితలు' (రాజమండ్రి 1950) 82. కొన్ని వివేకవర్ధని కాపీలు గౌతమీ గ్రంథాలయంలో ఇప్పటికీ లభించగలవు. అవి వీరేశలింగంగారి సంగ్రహ వ్యాసాలలో లభించగలవు. అవి 1897–98లోప్రచురించబడ్డాయి. అవి ఆ పత్రికలో వానివలెనే ఉన్నాయి. కానీ వివేకవర్ధనిలో ప్రచురించిన వానిలో కొన్నిటిని మాత్రమే ఎన్నుకొని, సంగ్రహ కృతులలో ప్రచురించారు. తరువాత అధ్యాయాలలో ఆ విషయం చర్చించ బడుతుంది.

వ్యాసంలో అహింసను గురించి ముచ్చటించారు. ప్రాణాలు తీయడాన్ని మానుకోవలసిన ఆవశ్యకాన్ని గురించి [1] నొక్కివక్కాణించారు. సత్యం అహింస అనే రెండు భావాలు కూడా సంప్రదాయ సిద్ధంగా వచ్చే భారతీయ నైతిక భావాలనాధారంగా గాని వచ్చినవే. పంతులుగారికి పూర్వమే బ్రహ్మసమాజ నాయకులు చెప్పిన భావాలుకూడా [2] అవే.

1875 జనవరి నుంచి పంతులుగారు దాడిని మరొక వంకకు మరలించారు. పండితులా కాక్కరిని తీసుకుని, వారినెదుర్కొనసాగారు. ప్రపంచంలో దుష్ట పండితులూ కుకవులూ ఉంటే, వారి నుండి వచ్చే ఆపద లేక నష్టం వేలాది నిరక్షరాస్యులు చేసే చెడును మించిపోతుందని వారి అభిప్రాయం.[3]

''చదువు వేరు, సద్గుణము వేరు'' అన్నారు వారు. ఆయన జీవితమంతా ఈ నీతి వాక్యం మీద ఆధారపడిఉంది. దానినే మూలంగా తీసికొని, దానినే ప్రామాణికంగా చేసికొని పంతులుగారు కృషిచేశారు. దానిని తెలుసుకోవడమే పండితుల ప్రత్యేక బాధ్యత. దానిని తెలుసుకోలేకపోవడమే ఆ ప్రయత్నంలో అపజయంగాంచడం. ఈ విషయం మీద ఆయనకు ఆసక్తి కలగడానికి కూడా ఒక కారణముంది. ఆనాటి సుప్రసిద్ధకవి పండితుడు అయిన ఒక వ్యక్తి ఆయన మీద జరిపిన దాడి వల్లనే ఆయనకావిషయం మీద ఆసక్తిరగిలింది. అందువల్లనే పంతులుగారు తన వ్యాసంలో పండితులూ, సంపాదకుల మధ్య సాదృశ్యాలను పొందుపరచారు. వాస్తవిక వాదాలను వారు ప్రక్కకు నెట్టి అసంగతమైన వాటిని కలుపుతూ ఉంటారు. ఆ విధంగా చేయడానికి ఆ మాటలు మంచివి కావని (అసభ్యమైనవనో అసమంజసమైనవనో) అంటూ, లేక వ్యాకరణ దోషాలున్నాయనే మిషతో ఉంచవలసిన వాటినుంచక తొలగిస్తారు. ఆవిధంగా వారి పత్రికలన్నింటిని పనికిరాని చెత్తవార్తలతో నింపుతారు [4] అని పంతులుగారంటారు.

---

1. కం.వీ.కృతి గ్రంథములు 8వ 321 - 325.
2. ది బ్రహ్మసమాజ్ ''ఇన్స్పిరేషన్'' కేశవచంద్రసేనుని ఉపన్యాసముల నుండి 120 ఈ ఉపన్యాసం 25 జనవరి-1873, తేదీన కేశవచంద్రసేనుడిచ్చినది.
3. చదువు వేరు - సద్గుణము వేరు (విద్యకు-సౌశీల్యానికి గల భేదం) కం.వీ.వ్యాసం జనవరి 1875. కం.వీ.కృ గ్రంథం 8. 327
4. కం.వీ.వ్యాసములు జనవరి 1875. కం.వీ.కృ.గ్రంథం 8. 329

వచనరచనను ప్రధానంగా బలపరచాలనీ, అందులోను స్పష్టంగా రాసిన రచనను మరింత ప్రోత్సహించాలనీ ఆయన భావించారు. ఈ సందర్భంలో ఆయన మదరాసు పాఠ్యగ్రంథ నిర్ణాయకసంఘం అభిప్రాయాలను బలపరచుతూన్నట్లు అనుసరించుతూన్నట్లు స్పష్టమవుతుంది. ఈ భావాలనే ఆకమిటీ కార్డికాలం క్రిందట జరిగిన సమావేశంలో తీర్మానించిన నివేదికను కూడా ప్రకటించింది.[1] పాశ్చాత్యుల భావాలను ఆయన ఎంతగా పొగడినా, ప్రత్యేకించి శాస్త్రీయ దృక్పథాన్ని మరెంతగా అభినందించినా, విజ్ఞానార్జనకు ఆయన అనుసరించిన మార్గం మాత్రం పండితులనుసరించే మార్గాన్నే ప్రతిబింబింపజేస్తుంది. విజ్ఞానం భావావేశాలను క్రమబద్ధంచేస్తుంది. తత్ఫలితంగా స్త్రీలు విద్యావంతులు కావాలన్న కాంక్ష ఉద్భవిస్తుంది. దానివల్ల అజ్ఞానంలో ఉన్నప్పుడు వారి మధ్యవచ్చే నిరంతరకలహాలంతంకాగలవు. గృహకృత్యాలను మరింత సమర్థతతో నిర్వహించగలరు. పిల్లలను పాపలను వివేకవంతంగా పెంచి తీర్చిదిద్దగలరు.[2] ఇది కొంత వింతయిన సమస్యంగా కనబడుతుంది. భారతీయ సుగుణాలను విక్టోరియన్ కాలపు ఆలోచనలతో సమన్వయపరచి, గృహంలో స్త్రీపాత్రలు మలవడం, లేక, ఊహించడం వింతగా కనిపించవచ్చు.

పంతులుగారు 1875లో రాజమండ్రిలోని వేశ్యావృత్తి నెదుర్కొంటూ దాని అనుకూలురను నిరసిస్తూ తన పత్రికలో వ్రాశారు.[3]

---

1. జి.ఓ.ఎం.రిపోర్టు ..... స్కూలు బుక్స్ 78-79.
2. ఇలాంటి వాదన అదేకాలంలో మర్డోక్ ' ఇండియన్ స్టూడెంట్సు మాన్యువల్ ' 178 ఎట్ పోజిషన్లో కనబడుతుంది. పంతులుగారాయన నుండి ఈ భావాన్ని గ్రహించినా, దానిని స్పష్టంగా చెప్పడానికి కావలసినంత ఆధారం మాత్రంలేదు.
3. కం.వీ.స్వీయచరిత్ర-1, 88, 102 దక్షిణభారతంలో అనేకమంది తలిదండ్రులు పాఠశాలల్లో తమ పిల్లలను వేశ్యల పిల్లలతో కూర్చోబెట్టడం వైపు అగ్రకులాలవారి దృష్టిమరల్చి, దానికి వారు నిరసన తెలిపారు. Cf. A Minute by Sir William Robinson 4th July, 1877. M.J.P.No.1034. 17th May,1877 and despatch from the Secretary of State 18th July, 1878 M.J.P.No.1934, 21st Sept. 1878 M.R.O.

ఈ విషయం నుంచి పంతులుగారు చాలాకాలం తరవాత గాని తమ దృష్టిని మరల మరల్చలేదు. తరవాత ఇరవైరెండు సంవత్సరాలదాకా ఈ విషయాన్ని ప్రస్తావనే లేదు.[1]

ధవళేశ్వరంలో ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్నప్పటికీ, పంతులుగారికి రాజమండ్రి కార్యకలాపాలమీదనే వాస్తవానికి మక్కువ ఎక్కువని చెప్పాలి. 1875లో గవర్నరు బసవరాజుగారు రాజమండ్రి రాష్ట్ర పాఠశాలలో సహాయోపాధ్యాయుడుగా ఉన్నారు.[2] సమస్యలను గురించి చర్చించడానికి పాఠశాలలో అందుకే చర్చావేదిక నారంభించారు. ఆరోజుల్లో అలాంటి చర్చావేదికలు ఎన్నో పాఠశాలల్లో ఉండేవి. అధికారులు కూడా వాటిని ప్రోత్సహించేవారు. 1875 జూలై నెలలో ఒక సమావేశంలో వీరేశలింగంగారు 'ఐక్యత' పైమాట్లాడారు. రాజకీయ సాంఘికాభివృద్ధికి ప్రధానంగా ముందుండవలసింది ఐకమత్యమని అందులో గట్టిగా చెప్పారు. మదరాసు, రాజమండ్రి నగరాలలో ఆ సమయం చెందిన అనేక సంస్థలను పత్రికలను గూడ ఈ సందర్భంగా అందులో పేర్కొన్నారు.

"ఇక్కడ మనపట్టణంలో 'విద్యాదాయిని' అను మాసపత్రిక [గోదావరిజిల్లా విద్యావేత్త బారో గారు, జిల్లా పాఠశాల ప్రధానోపాధ్యాయులు ప్రారంభించినది] ఏడునెలలు నడచిన తరవాత దాని నడిపించేవారు లేక ఆగిపోయినది. ఇదివరలో ఒక సాహిత్యచర్చావేదిక వారానికి రెండుసార్లు సమావేశమై అనేక విషయాలపై చర్చలు జరిపేది. దాని సభ్యులు ఈ చర్చలవల్ల ఉపన్యాసాలవల్ల లాభపడినప్పటికీ, ఆ ఉపన్యాసాలు హఠాత్తుగా ఆగిపోయాయి. ఇప్పుడా సంస్థ కేవలం నామమాత్రంగానే ఉన్నది.[3]

---

1. కం.వీ. వ్యాసములు 'ఐకమత్యము' జులై 1875. క.వీ.కృ.గ్రం.8, 369.
2. గోదావరి జిల్లా గెజెట్ 17 ఏప్రిల్ 1875.
3. కం.వీ.కృ.గ్రం.369. గవర్నరుగారి సంఘంకూడా అచిరకాలంలోనే పనిచేయడం మానినట్లు కనబడుతుంది. తరవాత ఎన్నడూ దాని గురించిన సందర్భమే కనబడదు.

కార్డిమందితో కూడిన చిన్న సంఘం కూడా, కలిసికట్టుగా ఉంచే, వారి ఫలితమెంత అధికంగా ఉండగలదో చూపుతూ, కలకత్తా బ్రహ్మసమాజాన్ని గూర్చి ప్రత్యేకంగా వ్రాశారు.

ఐకమత్యంపై పంతులుగారి ఉపన్యాసం రెండు రకాలుగా ప్రముఖమయిందని చెప్పు. భారతదేశంలో జాతీయాభివృద్ధి కోసం తీసుకోనవలసిన చర్యలను ప్రోత్సహించవలసిన విధానాలను ఆచరణాత్మకమైన వాటిని సూచించే ప్రథమ ప్రయత్నాన్ని ప్రముఖంగా గుర్తించడం ఒకటి. రెండవది ఆయన స్వీయ విధానాన్ని మూలభావాలను బయటపెట్టడం.

1875లో పంతులుగారు మరొక సివిల్ సర్వీస్ పరీక్షలో కృతార్థుడనయ్యానంటారు. దానితో జిల్లా మున్సబు పదవికి అర్హతను సంపాదించారు. పైన చెప్పినవిగాని, మరియేయితర ఆధారాలు గాని పంతులుగారి కలాంటి ఉద్యోగం వచ్చినట్టు తెలపడం లేదు.[1] పాశ్చాత్యవిద్య నభ్యసించిన వారు వాణిజ్యవ్యాపారాలలోను, ఉద్యోగాలలోను ప్రవేశించి లాభమందగలరని, భారతదేశ ఆర్థికాభివృద్ధికి సాయంపడగలరనీ ఆయన అన్నారు. సరిగా ఆసమయంలోనే ధవళేశ్వరంలోని యజమానులతో పంతులుగారు కలహించి, ఆఉద్యోగాన్ని వదులుకోవలసివచ్చింది.[2] అదే సమయంలో, ముద్రణాయంత్రంలోని భాగస్వాములు కూడా దానిని పూర్తిగా స్వాధీనపరచుకోడానికి ప్రయత్నించేశారు, కాని పంతులుగారు తమ గ్రంథాలవల్ల వచ్చిన సొమ్ముతో దానిని కానివేశారు.[3] ఆయన ఇప్పటి వరకు చేసిన సంఘసంస్కరణలో ప్రముఖమైంది ఒకేఒకటి, అది బాలికా విద్యను ప్రోత్సహించడం. అప్పుడప్పుడాయన బ్రాహ్మణులను కూడా చీవాట్లు పెట్టేవారు. కాని, వారిని తాత్కాలికంగా ఎదుర్కోవడం మాత్రం 1876 వరకు ఆరంభం కాలేదు.[4] బహుశః భాగస్వాములతో ఏర్పడిన భేదాభిప్రాయం

---

1. గోదావరిజిల్లా గెజట్ 1875, 76. కం.వీ. స్వీయచరిత్ర-1, 77
2. కం.వీ.స్వీయచరిత్ర 1 - 94.
3. వైది-1 - 95-99 ఆయన గ్రంథముల నుపయోగించి, ఇంతకు పూర్వమే ధృఢపరచబడింది.
4. కం.వీ.వ్యాసములు "బ్రాహ్మణులు, వారివృత్తులు" జూలై 1876. కం.వీ.కృ.గ్రం.8 - 428-438 "ప్రమాణవిచారము" జూలై 1876 కం.వీ.కృ.గ్రం.8 - 392, 393.

సైద్ధాంతిక విభేదాలవల్ల నేమో! 1875 మధ్య నుండి 1876 లోపల పంతులుగారు గ్రంథప్రచురణ కార్యక్రమంలో నిమగ్నులయ్యారు. ఆసంవత్సరం మూడు వ్యాసాలు మాత్రమే మిగిలిపోయాయి. రెండువ్యాసాలను 1875లో ముద్రించారు. హిందూమతానికి హానికలిగిస్తున్నారని, నష్టపరస్తున్నారని, భావించిన ప్రజాసముదాయం మీద ఒకసారి ఆవ్యాసాల ద్వారా పంతులుగారు దాడిజరిపారు. క్రైస్తవ మిషనరీలను, నాస్తికులైన హిందూయువకులను, విజ్ఞానాధారాలనే [1] గుడ్డిగా లోపరిచే బ్రాహ్మణులను గూడ పంతులుగారు నిందించారు.[2]

మూడవవ్యాసం ఒక సుదీర్ఘమైన వ్యాసం. విద్యావద్ధతిలోని వివిధ పద్ధతులను గురించిన చర్చ అందులో వివరంగా ఉంది. అశాస్త్రీయమైన సంప్రదాయ పద్ధతులకు బదులు, శాస్త్రీయ పద్ధతులను విషయగ్రహణం కోసం ఉపయోగించి చూడాలంటూ ఆ వ్యాసాన్నాయన ముగించారు. వాస్తవాన్ని తెలుసుకోవడంపై పంతులుగారికున్న విశ్వాసం, పాశ్చాత్యులకంటే మనం తక్కువ అనే భావాన్ని ఖండించింది. విజ్ఞానాన్ని గ్రహించాలనే పట్టుదలను, ఆవిజ్ఞానానికున్న శక్తిసంపదలను గురించి పంతులుగారు నొక్కిచెపుతూ, వర్తమాన భారతీయ సమాజాన్ని – అంటే ఆంధ్రసమాజాన్ని కూడా – పునరుజ్జీవం చేయడంలో దానికున్న పాత్రను గురించి కూడా గట్టిగా చెప్పారు.

అశాస్త్రీయ సంప్రదాయాలను హేతువాదాన్ని గురించి పంతులుగారు గట్టిగా చెప్పడం, కేవలం పాశ్చాత్యుల శాస్త్రీయ పద్ధతిని మూఢంగా ఎరువు తెచ్చుకోవడం మాత్రం కాదు. పంతులుగారు హాక్స్లీ గ్రంథాన్ని అనువదించారు. కాబట్టి ఆయన భావాలను కూడా ఇంగ్లాండు నుండి సంపూర్ణంగా గ్రహించారని ఆయన జీవితచరిత్రకారులూహించారు.[3] కాని అసలు విషయం అది కాదు.

---

1. కం.వీ.వ్యాసములు అక్టోబరు 1875 ''ప్రమాణవిచారము'' కం.వీ.కృ. గ్రం.8. 392 – 393.
2. ''ఈశ్వర సద్భావము'' కం.వీ.కృ.గ్రం.8 – 403–404.
3. అక్కిరాజు రమాపతిరావుగారు ''వీరేశలింగం పంతులు'' 448 ఆఫ్ పాసమ్.

అశాస్త్రీయమైన విషయగ్రహణకు, అశాస్త్రీయమైన స్వానుభవంతో కల్పించిన విషయాలనాధారంగా గ్రహించే విషయాన్ని గురించి ఆలోచించిన క్రొత్తక్రొత్త తర్కాలు పంతులుగారికి బాగా పరిచయమైనవే. ''ప్రమాణవిచారము'' అన్న ఆయన వ్యాసంలో ఈ విషయాలు ప్రతిబింబిస్తాయి.[1] ఈ విధంగా అభ్యుదయాన్ని గురించి నాక్కి వక్కాణించే పంతులుగారు భారతదేశాన్ని వర్ధిల్లడానికి సహాయంగా భారతీయసంప్రదాయాల్లో ఉండే అవసరమైన వాని నెన్నుకోవడంలో, సంపూర్ణ భక్తిభావాన్నెన్నుకోవడంలో కేశవచంద్రసేన్ నుండి తీవ్రంగా వేరయిపోయారు.[2]

## నూతనోద్యోగం

పాక్షికంగా ఉద్యోగంలోనున్న ఈ సంవత్సరమంతా పంతులుగారు చేసిన ఉద్యోగం – రాజమండ్రి పాఠశాలా ప్రధానోపాధ్యాయులైన ఇ.పి.మెట్కాఫ్ దొరగారికి తెలుగు నేర్పడమే. పంతులుగారి కున్న తెలుగు భాషా పరిజ్ఞానం బోధనా పటిమ మెట్కాఫ్ దొర హృదయంలో గాఢంగా హత్తుకుపోయాయి. వెంటనే ఆయన్ని రాష్ట్ర విద్యాలయంలో తెలుగుపండితులుగా తీసుకోవలసిందని గట్టిగా సిఫారసు చేశారు.[3] ఈ విధంగా ఆపాఠశాల కళాశాల స్థాయి నందుకునే సమయంలో 1876లో పంతులుగా రందులో ప్రవేశించారు. నూతనంగా కళాశాలగా మారిన ఆవిద్యాలయంలో ప్రప్రథమంగా 1876లో బి.ఎ. మొదటి తరగతి ఆరంభమైంది.[3] పంతులుగారు తన స్వీయచరిత్రలో వేరొకనకి పోయినప్పటికే బసవరాజు గవర్రాజుగారి విషయంలో ఆయన కపారమైన మేలు చేశారు. ఆయన పేరును దొరగారికి గట్టిగా సిఫారసు చేయడంలోను, ఆయన

---

1. కేశవచంద్రసేనుని ' ఉపన్యాసాలు, మార్గాలు ' I లెక్చరర్స్ అండ్ ట్రాక్ట్స్ లండన్ 1870, 220 – 22I
2. కం.వీ. స్వీయ చరిత్ర–I 77–79
3. యం.ఇ.పి.నెం.207.5 జూన్ 1876 యం.ఆర్.ఓ.

తరఫున తాను వకాల్తా పుచ్చుకోవడం ద్వారాను, పంతులుగారి కాయసెంతో తోడ్పడ్డారు. గవర్రాజుగారు పాఠశాలా విభాగంలో సభ్యులు, పంతులుగారి బంధువు. అంతనకు ఇరుగుపొరుగున నివసించేవారు. వారిద్దరు అనేక సంవత్సరాలు కలిసి పనిచేశారు. ఆదర్శ మిత్రత్వానికీ, బంధుత్వానికీ, అభిమానానికీ, [illegible] వారుభయులూ నిదర్శనం.

విద్యాలయంలో తనపనిని ప్రారంభించడానికి ముందు వీరేశలింగంగారు వివేకవర్ధనిలో 'బ్రాహ్మణులు వారి వృత్తులు' అనేవ్యాసాన్ని ప్రచురించారు.[1] అంతన ప్రప్రథమంగా బ్రాహ్మణుల మీద దాడిచేయడం దీనితో ఆరంభమైంది. యాచకవృత్తి నవలంబించినందుకు వారిని తీవ్రంగా ఖండించారీ వ్యాసంలో. ప్రాచీనకాలంలోని బ్రాహ్మణులు యాచకవృత్తిలో సంపాదించడం సమాజమంగీకరించినా, సంక్లిష్ట పరిస్థితుల్లో ఆధునిక యుగంలో మధ్వుని [2] వచనాలవల్ల అది నిషేధింపబడింది.

ప్రాచీనకాలపు బ్రాహ్మణుల మీద, ఆధునిక బ్రాహ్మణుల మీదాకూడా అంతన దండెత్తారు. ''కొంతమంది బ్రాహ్మణులు వేషాలను ధరించి, బలులను సమర్పించి, ధనాన్ని సేకరిస్తారు. అది కేవలం వారి విలాసాల కోసమే.[3] గమనించని సమాజాన్ని బ్రాహ్మణులనేక విధాల మోసగిస్తున్నా'' రంటూ వానిని పంతులుగారు ఏకరువు పెడతారు వరుసగా కడకు, సాధారణ బ్రాహ్మణుల కంటే గురువులే ఈ విషయంలో అధములంటూ ముగిస్తారు.

---

1. కం.వీ.వ్యాసములు జూలై 1876. కం.వీ.కృ.గ్రం.8 – 428–438
2. వైది. 432.
3. కం.వీ. వ్యాసములు జూలై 1876. కం.వీ.కృ.గ్రం.8 – 435.

అదియేమనగా, పంతులుగారు మాత్రం బ్రాహ్మణులను తమ్ముతాము కుదిపరచుకొమ్మంటూ, దేశాన్ని పూర్వమున్న పవిత్ర స్థితిలో నుంచమంటూ మంగిస్తారు.

ఈ మూడు మాటల్లో, అంతకు ముందెంతగానో ఖండించినవ్యక్తికీ, పంతులుగారి పవిత్ర ఆశా, ఆశయమూ వ్యక్తమవుతాయి. ఈ దాడి ఆయన పత్రికా నిర్వహణ వృత్తిలోనే ఒక మలుపు లాగ కనబడుతుంది. అంతకు ముందు ఆయన విమర్శలు, దూషణలు, ఖండనలు తోటి సంపాదకుల మీదా కవుల మీదా ప్రయోగించబడేవి. ఆయన తాను బాగా ఎరిగినవారినీ గౌరవించేవారినీ విమర్శించేవారు. బ్రాహ్మణపురోహితులపై దండెత్తడం ఒకనూతనదశ. బహుశః ఉపాధ్యాయుడుగా ఉండడం వల్ల ఆయన స్థానం సురక్షితమై ఉండవచ్చు. రాబోయే సంవత్సరాలలో పంతులుగారు భారతీయ సమాజంలో ఇతర సమూహాలపై దండెత్తవచ్చు. ఇది ఒకరకంగా ఆయన దృక్పథాలను లేక అభిప్రాయాలను వ్యక్తపరుస్తూ, దానిపై అందరి దృష్టిని మరల్చడానికొక పద్ధతి అయి ఉండవచ్చు. ఆయనకు ఇతరులతో గల భిన్నాభిప్రాయాలను వ్యక్తపరచడానికి కూడా ఉపకరించవచ్చు. ఏమయినా, పంతులుగారివృత్తికి ఉపాధ్యాయుడుగా తన వృత్తిని ముగించారు. సంఘసంస్కర్తగా, ప్రముఖవ్యక్తిగా, రూపొందారు.



## వీరేశలింగం - వితంతువివాహాలు

### వితంతు వివాహోద్యమారంభం

ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క మహాపురుషుడు ఉద్భవించి ఒక్కొక్క సంస్కరణకు అంకురార్పణ చేస్తాడు. సమాజంలో ప్రవర్తిల్లే అక్రమాలను వారు గుర్తిస్తారు. ఉదారస్వభావులు గనక వాటిని నిర్మూలించడానికి శతధా ప్రయత్నిస్తారు. ఉత్తరభారతంలో రాజారామమోహనరాయలు నాటి ఆంగ్లప్రభుత్వాన్ని ఒప్పించి సతీ సహగమనాన్ని నిషేధించేటట్లు చేయగలిగాడు.

ఆంధ్రదేశంలో వితంతు పునర్వివాహాలను సమర్థించి నిర్వహించిన సాహసవంతుడు కందుకూరి వీరేశలింగపంతులుగారు. బాలవితంతువులు పడే ఆరాటాలను గమనించి, వారిని దురవస్థల నుంచి ఉద్ధరించడానికి సంకల్పించాడు. తన సంకల్పాన్ని రచనల ద్వారా ప్రకటించి, వితంతు పునర్వివాహోద్యమాన్ని ప్రచారం చేశాడు. 1880 నాటికి వీరేశలింగంపంతులుగారు చెన్నపట్టణంలోని దేశీయ విదేశీయ ప్రభుత్వోద్యోగులతో సంబంధాలనభివృద్ధి చేసుకోగలిగారు. ఆ కాలంలో హిందువులు కొందరభ్యుదయకాములు నూతన స్వాతంత్ర్యోదయ కాంతులు తమమీద ప్రసరించే సమయుగ మారంభమయిందని గొప్పలు చెప్పుకుంటూండేవారు. చాల మంది వితంతువులు సమాజంలో తిరిగి నూతన జీవితాన్నారంభించగలరంటూండేవారు, అయినా, సనాతన భావాలతో, ఛాందసాచారాలతో నిండిన ఆకాలం మాత్రం వారి ఆశలకనుగుణంగా సాగలేదు. 1881 సంవత్సరపు చివరిరోజు ఆంధ్రప్రజలకు విపరీతమైన ఆందోళనను కొని తెచ్చింది.[1] రాజమండ్రిలోని వితంతు వివాహోద్యమ ఫలితంగా వీరేశలింగంగారి గౌరవ ప్రతిష్ఠలు స్థానికంగానే కాక, సుదూరప్రాంతాలకు రాష్ట్రమంతా వ్యాప్తిచెందాయి. జాతీయస్థాయిలో ఆయనకై అంతగ ప్రాధాన్యతని కిచ్చగించకపోయినప్పటికీ, రాజమండ్రిలోని సంఘ సంస్కరణవాదులు ప్రాధాన్యతానికి మాత్రం ప్రోత్సహించారు. అందున స్వయంగా పురపాలక వ్యవహారాల్లోను,

---

1. మెడ్రాస్ టైమ్స్ - 1882 ఫిబ్రవరి 6

తెలుగు పత్రికా నిర్వహణలను స్థానికంగా పాల్గొనేవారు. అన్నిటికన్నా ఎక్కువగా, రాజమండ్రి వితంతు వివాహోద్యమాన్ని నిర్వహించడంలో లీనమైపోయారు. దాని కార్యక్రమాలు కొనసాగడం కోసం నిర్విరామంగా కృషిచేశారు. "గర్జించెను కవికేసరి సంస్కరణ శంఖమూదెను. భళిర! పతితల యమునాఘల సంకెళ్లు త్రెంచవమనెను'' గేయం.[1]

## ప్రప్రథమ వితంతు వివాహాలు – వాటిఫలితాలు

వితంతువులను వివాహమాడ్డానికి సిద్ధమైన వరులు చాలా అరుదుగా కనిపించేవారు. వారిని సంపాదించడం మాటలు కాదు. అయినా, రాజమండ్రి సంఘసంస్కరణవాదులు చివరకెలాగో వితంతు వివాహం కోసం వధూవరులను సంపాదించినప్పటికీ, ఇంకా చేయవలసిన సన్నాహాలెన్నో మిగిలిపోయాయి. వాటిలో ముఖ్యమైంది పెళ్లితంతు జరిపించే పురోహితుడు దొరకక పోవడం. పట్టణంలోని సనాతనాచారపరాయణులయిన బ్రాహ్మణులు, సమావేశాల మీద సమావేశాల నేర్పాటు చేశారు. ప్రభుత్వానికి మహజర్లు, పిటీషన్లు పంపారు. ఆవివాహాలకు హాజరు కావద్దని యిల్లిల్లూ తిరిగి తీవ్రంగా విజ్ఞప్తి చేశారు. ఆకార్యక్రమం నుంచి విరమించుకోవాలని వీరేశలింగంగారినీ, ఆత్మూరి లక్ష్మీ నరసింహంగారినీ వొత్తిడి చేయడం కోసం కరపత్రాలు ప్రచురించారు. అనేక సభలు జరిపించారు. ఆచార విరుద్ధమైన వితంతు వివాహ కార్యక్రమాన్ని విరమించ వలసిందని ఆవుభయులను అభ్యర్థించారు.[2] కాని, సంఘసంస్కరణ వాదులు మాత్రం తమ కార్యక్రమాన్ని కొనసాగించాలనే దృఢనిశ్చయంతో ముందుకు సాగారు.

ఎన్నో పాట్లుపడి, వందరూపాయలిచ్చి, ఒకపురోహితుని తీసుకు రాగలిగారు. ఆపురోహితునితో వచ్చే బ్రాహ్మణులకు కూడా కొంతడబ్బు ఇస్తామన్నారు. వంట చేసేవారినీ, నీళ్లుమోసేవారిన్నీ కూడా అవిధంగానే తీసుకు రాగలిగారు.[3]

---

1. అడుసుమిల్లి – 'యుగపురుషుడు వీరేశలింగం' పు.104.
2. ప్రకాశరావుగారి 'కాయస్థ సమాచార్' వాల్యూం-2, నెం.6. 542
3. వీరేశలింగం 'రాజమహేంద్రవరచరితము' కె.వి.కె.జి. 7. 20-22.

భయంత్రీలకు కూడా, పెళ్లికి తప్పక వచ్చి వాయించడానికి పొమ్ము వెంత్తాన్నిచ్చామని పంతులుగారు చెప్పకున్నారు. సంస్కరణ విరోధకులు నుంచి వచ్చే బెదిరింపులు, ఆటంకాలు ఎన్నివున్నప్పటికీ, అవి యెంత వుద్ధృతమైనప్పటికీ, 1881 డిసెంబరు డిసెంబర్ 11 వ తేదీన సాయంకాలం సంస్కరణవాదులందరు పోజరంచారు.[1]

ఆసమావేశానికి ముందు దౌర్జన్యకాండలు జరుగుతాయనే భయసాందోళనలు రాజమండ్రి పట్టణమంతా వ్యాపించాయి. అలాంటి దుస్సంఘటనలను నివారించడానికి పంతులుగారు పోలీసు ఉన్నతాధికారుల సహాకారాన్ని సంపాదించ గలిగారు. లూథరన్ మిషనరీలయిన రెవరెండ్ షమిరిట్, రెవరెండ్ ఆర్టేమన్‌లను స్థానిక బ్రిటిష్ ఉద్యోగులతో మాట్లాడి తమపై రాగలవారి నెదురాడ్డానికి కవసరమైన సహాయాన్ని అందజేయమని కోరారు. తగినంత పోలీసు బలగం సంస్కరణవాదులను రక్షించడానికి సిద్ధంగా వచ్చింది. వారిలో చాలామంది, వివాహానంతరం కూడా, పంతులుగారి రక్షణ కోసం రెండువారాలపాటు ఉండిపోయారు.

వివాహం రాత్రి 11.30 గంటలకు ప్రారంభమైంది. ఈ పెళ్లి వేడుకను తిలకించడానికి జిల్లా జడ్జి జాన్ కెల్సాల్, జిల్లా పోలీసు సూపరింటెండెంట్, జిల్లా వైద్యశాఖాధిపతి, మఠాధిపతి కూడా విచ్చేశారు. వివాహంలో ఆశీర్వచనం ఒకతంతు. ఆశీర్వచన మంత్రాలు పఠించే బ్రాహ్మణులు చాలా కొద్దిమంది మాత్రమే అక్కడున్నారు. ఆరోజుల్లో ఆశీర్వచనం చెప్పే ప్రతివాక్యానికీ పావలా సంభావనగా ఇవ్వడం మామూలు. కాని ఒక్కొక్కరికి ఒక్కొక్క రూపాయి యిస్తామని సంస్కరణవాదులు అనగానే, బ్రాహ్మణులు చాలమంది వచ్చారు. సంభావన కాంక్షపడి అనేకులు గొంతెత్తి ఆశీర్వచన శ్లోకాలను పఠించడం వినబడింది.[2]

డిసెంబరు 11వ తేదీ వివాహం నిర్విఘ్నంగా జరిగింది, కాని ఉత్సవ కార్య క్రమాలు చాలారోజుల వరకు జరిగాయి. ఇదే మొదటి వితంతువివాహం.

---

1. వీరేశలింగం 'రాజమహేంద్రవర చరితము' కె.వి.కె.జి. 7  20–22
2. మద్రాస్ టైమ్స్ 16 డిసెంబరు 1881.
   మద్రాస్ టైమ్స్ 6 ఫిబ్రవరి 1882.

రెండవ వివాహం డిసెంబర్ 15వ తేదీని జరపాలని ఆదిలోనే నిర్ణయించారు. ఆ వివాహం కూడా ఆముహూర్తానికే వైభవోపేతంగా జరపబడింది. మొదటి వివాహానికి వచ్చిన బ్రిటిష్ ఆఫీసర్లతోపాటు, రెండవ వివాహానికి కాకినాడ నుంచి జిల్లా కలెక్టర్ కూడా వచ్చి, పెళ్లివేడుకలు తిలకించారు.1

క్రమంగా దౌర్జన్యకాండను గురించిన భయాందోళనలు తొలగిపోయాయి. వివాహమహోత్సవ కార్యక్రమాలలో పతాకగా ఊరేగింపు జరపాలని ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు నిర్ణయించారు. ఊరేగింపులో ఆనాడు ఆచారంగా వున్న భోగంమేళంపెట్టడాన్ని వీరేశలింగంపంతులుగారు వ్యతిరేకించారు. కాని, ఇతర సంస్కర్తలు అంతసమాట సాగనీయలేదు.2 గాస్లైట్లతో ఊరేగింపు బయలుదేరింది. నూతన వధూవరుల జంటలు రెండు, బ్రిటీష్ ఉద్యోగులు, సంస్కర్తల మిత్రబృందం, సంస్కరణవాదులు – వీరందరితో రాజమండ్రి పురవీధుల్లో ఊరేగింపు సాగింది.3 ఆదృశ్యం పంతులుగారిని అమితానందంలో ముంచెత్తింది. సనాతనాచారపరాయణులపై సంస్కరణవాదులు సాధించిన విజయానికది చిహ్నం. ఆసమయంలో నూతన భావోదయకాంతులు తమపై ప్రసరించాయని భావించిన వారిలో పంతులుగారొకరు.

రెండవ వితంతు వివాహం జరిగిన తరవాత కొద్దిరోజులకు సంస్కరణ నిరోధకుల సంఘం ఒక సమావేశాన్నేర్పాటు చేసింది. దానికి 72 మంది హాజరయ్యారు. సంస్కరణవాదుల కార్యాన్ని ఖండించడానికి ఆసమావేశమేర్పాటయింది.4

సి.యజ్ఞనారాయణశాస్త్రిగారు ఆసభకు అధ్యక్షత వహించారు. అనేకులు బ్రాహ్మణ న్యాయవాదులు, ఉద్యోగులు, సరిపల్లి గోపాలకృష్ణమ్మ (వీరేశలింగం గారి ముద్రణాశాలలో భాగస్వామి, మునిసిపల్ వ్యవహారాలలో ప్రముఖవ్యక్తి) ఆ సమావేశంలో పాల్గొన్నారు. సంస్కరణవాదులపై చర్యతీసుకోవలసిందని వీరు జగద్గురు శంకరాచార్యులకొక విన్నపాన్ని పంపుకున్నారు.5

---

1. Madras Times 6 Feb. 1882.
2. వీరేశలింగం ''రాజమహేంద్రవరచరిత్రము'' కె.వి.కె.జి.7.23
3. Madras Times 6 Feb. 1882.
4. Indian Law Review (Madras) VI 384. This law case deals with a suit against Sankaracharya and discusses the events leading to his prosecution.
5. Ibid.

డిసెంబరు 31 వ తేదీని విజయనగరం మహారాజా బాలికా పాఠశాలలో జరిగిన సమావేశంలో శంకరాచార్యులవారి ప్రకటన చదవబడింది. ఆ ప్రకటన ప్రజలను భయకంపితులను గావించింది.[1]

"సి.వయ్యన్నశాస్త్రి అనే న్యాయవాది, మరికొందరు పురప్రముఖులు కలిసి కందుకూరి వీరేశలింగంగారి గృహంలో రెండు వితంతు వివాహాలు జరిగాయని మాకు తెలియపరచారు. ఈ కార్యకలాపాలు వేదాలకు, శాస్త్రాలకు, హిందువుల ఆచార గౌరవాలకు విరుద్ధం. అందువల్ల, ఆవివాహాలకు హాజరయి, విందులు కుడిచి, తాంబూలాలను సేవించిన వారిని, ఆవివాహాలను ప్రోత్సహించి సహకరించిన వారందరినీ కులం నుంచి బహిష్కరించడమైంది."[2]

సంస్కర్తలకు వ్యక్తిగతంగా కూడా వారిని కులం నుంచి బహిష్కరించినట్లు శాస్త్రయుక్తంగా ప్రాయశ్చిత్తం చేసుకుంటేనేగాని వారిని తిరిగి కులంలోకి ప్రవేశించనీయమనీ తిరిగి పవిత్రులని ప్రకటించమనీ తెలియజేస్తూ శ్రీముఖాలు వచ్చాయి. పంతులుగారి పనిమరింత క్లిష్టమైంది. వితంతు వివాహాలు చేసుకున్న వధూవరుల జంటలు రెండు, పంతులుగారి దంపతులిద్దరు, పవిత్రమైన ప్రాయశ్చిత్తం తోను తిరిగి కులంలో చేర్చుకోబడరు, అని తెలియజేశారు. ఈ ప్రకటనలోని గూఢార్థం ఆదిలో స్పష్టమవలేదు. తామందరూ ఒక్కతాడుమీద నిలబడగలిగితే, తమపై విధించబడ్డ బహిష్కరణను ఎదుర్కోగలమని సంస్కర్తలనుకున్నారు. కాని, కులబహిష్కారం వారిపై తెచ్చిన ఒత్తిళ్లతో సంస్కర్తలకు కష్టాలెక్కువయ్యాయి. ఆత్మూరి లక్ష్మీనరసింహంగారిని, వారితాతగారు కట్టించిన దేవాలయంలోకి కూడా ప్రవేశించరాదని నిషేధించారు. ఆయన సోదరులూ, బంధువులూ ఆయన ఇంటికి రావడం మానుకున్నారు. బ్రాహ్మణపురోహితు లాయన గడప తొక్కడం మానేశారు.[3] మిగతా సంస్కర్తలకు కూడా కడగండ్లు తప్పలేదు. గతించిన తల్లిదండ్రు ఆబ్దీకాలు కూడా వారు పెట్టలేకపోయారు, దానికి కారణం పురోహితులు వారిని బహిష్కరించడమే. మునిసిపల్ పాఠశాల ప్రధానోపాధ్యాయుడ్ని అద్దెయింటి నుంచి

---

1. Madras Times 6th February, 1882.

2. Ibid.

3. Indian Law Review VI 385

పంపివేశారు. పనిమానివేయమని ఆతని నౌకర్లతో గట్టిగా చెప్పారు. అంతేందుకు, మునిసిపల్ పాఠశాలే బహిష్కరింపు లేకుండా చేశారు![1]

సంస్కర్తలకు వ్యతిరేకంగా సాధ్యమైనంతవరకు చెయ్యవలసిందని ఒక తహసీల్దారుని సిరస్తాదారు కోరాడు. ఆ తహసీల్దారు గ్రామకరణాలను పిలిపించి, వారి శక్తిమేరకు సంస్కర్తలను బహిష్కరించవలసిందని ఆనతిచ్చారు.[2]

తనచుట్టూవున్న సంస్కర్తలందరకు నైతికబలాన్ని పంతులుగారు సమకూర్చగలిగారు. తన యింటి బావి నుంచి నీటిని వారికి సరఫరాచెయ్యించారు. అన్నివైపుల నుంచి తమమీదికి వచ్చే వాత్తిళ్లన్నిటినీ ఎదుర్కోవాలని వారు నిశ్చయించుకున్నారు.[3]

కులం నుంచి వెలివేయడం ఆరోజుల్లో పెద్దశిక్ష. పనీలుగనివ్వరు. 'నా' అన్నవారెవ్వరూ ఉండరు. ఎన్నెన్నో చిక్కులు వచ్చిపడతాయి. వాటిని గురించి సంఘ సంస్కర్తలూ, వారి అనుయాయులూ, వారిని బలపరిచేవారు ప్రతిక్రియకోసం అనేక విధాల ఆలోచించడం మొదలుపెట్టారు.

అత్మూరి లక్ష్మీనరసింహంగారు శంకరాచార్యులవారి మీద రాజమండ్రి జాయింటు మేజిస్ట్రేటు వద్ద 1882 జనవరి 11వ తేదీని ఒక దావా వేశారు. శంకరాచార్యుల వారు స్మార్తులకు, అంటే అద్వైతులకు మతాధిపతి, అంతేకాని, తనకు సిద్ధమైన మతాధిపతి కాదని ఆరోపించారు. ఎందుకంటే, తాను విశిష్టాద్వైతాన్నననుసరించే వైష్ణవుడు. శంకరాచార్యులకు తనపై ఆధిపత్యంలేదన్నారు.[4] ఈ దావా రాజమండ్రిలో ఎంతో అలజడిని కలిగజేసింది. సంఘసంస్కర్తలకు అనుకూలమైన తీర్పు వచ్చినట్లుయింతే, వారు బహిష్కరణను ధిక్కరించి విజయం సాధించినట్లు కనబడింది.[5]

---

1. Madras Times 6th February, 1882.
2. Ibid.
3. V.S.C. I 196 - 198
4. Indian Law Review VI 385
5. Madras Times 6th February, 1881

1882 ఫిబ్రవరి 27వ తేదీని తీర్పువచ్చింది. అది ఆత్మూరి లక్ష్మీనరసింహం గారికి వ్యతిరేకంగా చెప్పబడింది.[1] అందున గురువు కూడా శంకరాచార్యుల శిష్యులవడం వల్ల అందరూ కూడా శంకరాచార్యుల ఆనతి ననుసరించాలని క్రమశిక్షణకి లోబడి వుండాలని ప్రకటించారు. శంకరాచార్యులు కులబహిష్కారాధికారాన్ని కలిగివున్నారని కూడా అంగీకరించడంతో పాటు ఆచార విరుద్ధంగా ప్రవర్తించే వారిని విచారించి, వారిమీద తగిన చర్య తీసుకోగల హక్కుకూడా ఆచార్యుల వారికి గలదని అంగీకరించారు. ఈ తీర్పు సంస్కరణవాదులను నిరాశాపూరితుల్ని కావించింది. చాలమంది ప్రాయశ్చిత్తం చేయించుకుని తిరిగి కులంలో ప్రవేశించారు.[2]

ఈసారి సంస్కరణ నిరోధకుల సంఘం కొంతవరకు విజయోత్సవాలను కావించుకునే అవకాశం లభించింది. శంకరాచార్యులను గాన్ఫైల్లతో ఊరేగించారు. సంస్కరణవాదులా సమయంలో ఇళ్లలో దాగారు.[3] వీరేశలింగంగారితో సహా కళాశాలోపాధ్యాయులు విద్యార్థులతో, తమకు కలిగిన ఒత్తిళ్లను గురించి, శంకరాచార్యుల మీద వేసిన దావా ఓడిపోవడాన్ని గురించి ముచ్చటించారు.[4] తత్ఫలితంగా మార్చి నెలలో విద్యార్థులకూ పట్టణంలోని ఒక అతిథిగృహంలో విడిది ఏర్పరచుకున్న శంకరాచార్యులవారి శిష్యులకూ మధ్య కొన్ని సంఘర్షణలు చెలరేగాయి. బ్రాహ్మణపురోహితుల వల్ల రెచ్చగొట్టబడిన విద్యార్థులు వారు బ్రాహ్మణులే రెండు వందల మంది సహచరులను సేకరించుకొని, గోదావరిలో స్నానం చేస్తున్న పురోహితుల మీదికి వెళ్లారు.[5] ఆ ఘర్షణలో కొంత మంది పురోహితులకు దెబ్బలు తగిలాయి. వారు దెబ్బలను తప్పించుకుందుకి నదిలో దూకి, ఈదవలసి వచ్చింది. ఇంతలో పోలీసులను రప్పించారు. విద్యార్థులు చెదరిపోయారు. సంస్కరణ నిరోధక సంఘంవారు వీధుల్లో కనబడినప్పుడు వారిని విద్యార్థులవమానిస్తూ వ్యతిరేకనినాదాలు చేస్తూవెళ్లారు.[6] తన మీదికి దండెత్తుతున్నారన్న విషయాన్ని తెలుసుకున్న శంకరాచార్యులవారు భయంతో ఆమరునాడే

---

1. "....Hindu Desabhimani takes exception to Government interference in the Widow Marriage Question, which has taken place at Rajahmundry. It is urged that this is purely a religious matter and that any difference of opinion among the people must be settled by their priest so long as they are under his authority, in a religious point of view" MNNR Oct. 1882-101.
2. ప్రకాశరావు, 'కాంటెస్ట సమాచార్' 8 నెం.4, PP 298-301
3. వైది
4. ప్రకాశం యాత్ర 89
5. సూర్యనారాయణరావు 'సూర్యనారాయణీయము' 167.
6. వైది.

రాజమండ్రి విడిచి వెళ్లిపోయినారు; -ఆ వేగింపు సందడి లేకుండానే![1]

ఈ చిన్ని సన్నివేశం యొక్క తక్షణఫలితం ఏమిటంటే సంస్కరణవాదులకు విశిష్టమైన జీవనాన్ని ఇరుగుతుందనే భయం పోయింది. ఈ సంఘటన వల్ల మరొక ఫలితమేమిటంటే రాజమండ్రిలో సంఘ సంస్కరణ కేవలం బాహుళకమన్న విషయం. 23 సంవత్సరాల తరవాత మరొక సంస్కరణ ప్రయత్నం విస్తృతంగా తలెత్తింది.[2]

శంకరాచార్యులవారి బహిష్కారం వల్ల పంతులుగారికి 1882 ఏప్రిల్‌లో పెద్దనష్టం కూడా కలిగింది. అప్పటి వరకు పంతులుగారికి లభించే ద్రవ్యసహాయంలో అధికభాగం ఆగిపోయింది. సమాజకార్యక్రమాలు సర్వసామాన్యంగా కొనసాగడం ప్రజలిచ్చిన సహాయంతోనే గదా! కాకినాడలోని వణిక్ప్రముఖుడైన పైడా రామకృష్ణయ్య గారు రెండు వితంతు వివాహాల ఖర్చులకని 2000 రూపాయలు ఇచ్చారు. పైగా, పురోహితులను, నౌకర్లను ఆ వివాహసందర్భాల్లో పాల్గొన్న వారిని పోషించడానికి నెలకి 100 రూపాయలు కూడా ఇచ్చారు.[3] కాని రామకృష్ణయ్యగారి మీద కూడా విపరీతమైన ఒత్తిళ్లు వచ్చాయి. రాజమండ్రి పురోహితుల ఒత్తిడికి ఆయన లొంగిపోకతప్పలేదు.[4] పంతులుగారికి ఆర్థిక సహాయం ఆపివేయాలని ఒత్తిడిదారులు షరతు పెట్టారు. రామకృష్ణయ్యగారు ఆ షరతు అంగీకరించడంతో, వితంతు వివాహసంస్కరణ భవిష్యత్తును గురించిన సందేహాల్లో రాజమండి సంఘసంస్కరణ వాదులు మునిగిపోయినారు.[5] పంతులుగారికీ, ఆత్మూరి లక్ష్మీనరసింహంగారికీ కూడా వితంతు వివాహాలను వైభవోపేతంగా జరపగల 'ఆర్థికస్తోమతు' లేదన్న విషయాన్నర్థం చేసుకున్నారు.

---

1. కందుకూరి వీరేశలింగం 'రాజమహేంద్రవరచరితము' కె.పి.కె.జీ.7-32-34.
2. ది ఇండియన్ సోషల్ రీఫార్మర్ 15 జూలై 1906. దీని ప్రయత్నం సమిష్టి భోజనాలు - అందులో పాల్గొన్నవారిని కులబహిష్కారం కావించడంలో విఫల ప్రయత్నాలు.
3. ఎఫ్.యమ్.4 నెం.8 (ఆగష్టు 1883) 1, వి.ఎస్.సి.1, 206
4. కె.కృష్ణస్వామిరావు జాబు. 21 మార్చి 1882. వి.ఎస్.సి.1, 206.
5. వి.ఎస్.సి.1, 204 - 209

## రాజధానితో పంతులుగారి సంబంధాలు

1881 లో వితంతు వివాహాలు రెండు జరిపిన తరవాత, పంతులుగారు మదరాసు వెళ్లాలనుకున్నారు. పి. మహబూబ్‌రావు గారు, ఆయనన్ని రమ్మని ఆహ్వానించారు. రాజమండ్రిలోని సంస్కరణలను గురించి ఉపన్యసించవలసిందిగా కోరారు.[1] కాని, కాకినాడు నుంచి వెళ్లడానికి సముద్రప్రయాణం అనుకూలంగా లేకపోవడం వల్ల ఆయన వెళ్లలేకపోయారు. (అప్పటికింకా మదరాస్‌కు రైలుదారి పడలేదు. మదరాస్ స్టీమరు మీదే వెళ్లాలి) ఆతరవాత జరిగిన సంఘటనలు ఆయన ప్రయాణాన్ని వెనక్కి నెట్టాయి.[2] చివరకు 1882 మే లో ఆరువారాలపాటు రాజధానిలో గడపడానికి పంతులుగారు బయలుదేరి మదరాస్ వెళ్లారు.

పంతులుగారు మదరాస్‌లో తనవుపన్యాసాలను తనలాంటి పండితుల కనుకూలంగా వుండేందుకు మాతృభాషలోనే చేశారు.[3] ఆవుపన్యాసాలలో హిందువుల పవిత్రగ్రంథాలు వితంతు వివాహాలాచరించడానికంగీకరించిన విషయాన్ని నొక్కివక్కాణించారు. ఆనాడు ఆచారాన్ని సమాజం నిషేధించిన విషయాన్ని గురించి వివరిస్తూ, ప్రాచీన భారతంలో దాని నంగీకరించిన ఉదాహరణలను పవిత్ర గ్రంథాలనుంచి యెత్తి చూపించారు. ఈ సందర్భంలో పంతులుగారు రాసిన ''వివేకదీపిక'' అనే నాటకంలో[4] తృతీయాంకం ద్వితీయరంగమందు వీరరాఘవరావు అనే సంస్కర్తపాత్ర వితంతు వివాహాన్ని సమర్థిస్తూ శృతులలో (?) నుంచి యిచ్చిన ఉదాహరణల నిక్కడ వేరొక్కనడం అప్రస్తుతం కాదేమో!

శృతి : ఉదీర్ష్వనార్యభి జీవలోక మితాసు (మేత) ముపశేష ఏహి।
హస్త గ్రాభస్యదిధి షోస్త్వమే తత్పతు ర్జనిత్వమభిసంబభూవ॥

---

1. పెద్దిబాట్ల వెంకటకృష్ణయ్యగారి జాబు. 8 జనవరి 1882
(X) వి. ఎస్. సి. 1. 202
2. మద్రాస్ స్టాండర్డు 17 ఏప్రిల్ 1882
3. మద్రాస్‌స్టాండర్డు 2 జూన్ 1882
4. కందుకూరి వీరేశలింగ కృత గ్రంథములు. రెండవ సంపుటము నాటకములు ''వివేకదీపిక'' పుట 490 (1917 ఎడిషన్)

" ఓ నారీ! గతప్రాణుడైన ఈ పతిని గూర్చి సమీపంలో పడియున్నావు. లే. జీవించియున్న వారి సమూహాన్ని చూచి రా. రెండోమారు వివాహమాడే భర్తకు భార్యాత్వాన్ని పొందు." ఇది తైత్తిరీయస్మృతిలో వితంతువివాహాన్ని అనుమతించారు అలాగే యజుర్వేదంలో –

తస్మా దేకస్య బహ్వ్యో జాయా భవంతి
నైకస్యై బహవ స్సహ పతయః ।[1]

"ఒక పురుషుడికి చాలామంది భార్యలు ఉంటారు, కానీ ఒక స్త్రీకిమాత్రం ఒకే సమయంలో చాలామంది భర్తలు ఉండరు." ఇక్కడ ' సహ ' ప్రయోగంవల్ల స్త్రీలకు భిన్నకాలాల్లో వేర్వేరు భర్తలుండవచ్చని స్పష్టమౌతోంది.

సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః
తృతీయో అగ్నిష్టే పతి స్తురీయస్తే మనుష్యజాః[2]

"ఓ చిన్నదానా! నీకు సోముడు మొదటిభర్త, గంధర్వుడు రెండోభర్త, అగ్నిమూడోభర్త, మనుష్యునివల్ల పుట్టినవాడు నాల్గోభర్త." ఇక్కడ "మనుష్యజా." అనేపదంవల్ల స్త్రీకి భిన్నకాలాల్లో భిన్నభర్తలు ఉంటారని తెలుస్తోంది.

ఉతయత్పతయో దశ స్త్రియాః పూర్వే అబ్రాహ్మణాః
బ్రహ్మచేత్ హస్త మగ్రహీత్ స ఏవ పతి రేకధా।
బ్రాహ్మణ ఏవ పతి ర్న రాజన్యో న వైశ్యః
తత్సూర్య ప్రబ్రువన్నేతి పంచేభ్యో మానవేభ్యః[3]

"స్త్రీకి ముందుగా అబ్రాహ్మణులు పదిమంది భర్త లయినప్పటికి చివరకు బ్రాహ్మణుడు పాణిగ్రహణం చేస్తే అతడే భర్త అవుతాడు. రాజన్యుడుకాని, వైశ్యుడుకాని కారు. బ్రాహ్మణుడు మాత్రమే భర్త. ఈ అర్థాన్నే అయిదు జాతులవారికీ తెలుపుతూ సూర్యుడు తిరుగుతున్నాడని ఈ శ్రుతివల్ల విశద మవుతున్నది.

---

1. వివేకదీపిక – కందుకూరి వీరేశలింగకృత గ్రంథములు, ద్వి. సం. పుట. 490
2. ,, ,, ,, పుట. 490
3. ,, ,, ,, పుట. 491

నిరుక్తమం –

క్వస్విద్రాత్రౌ భవథః క్వదివా క్వాభిప్రాప్తిం కురుథః
క్వవసథః కో వాం శయనే విధవేవ దేవరం. దేవరః కస్మాద్ద్వితీయో
వర ఉచ్యతే.

విధవను దేవరుడు (నియోగము చేతనే కాక) సామాన్యంగా కూడా వరించవచ్చు. దేవరుడు రెండవ భర్త అని చెప్పబడింది.

ఈ విధంగా పంతులుగారు వేదశాస్త్రాల నుంచి స్త్రీ పునర్వివాహానికి అనుకూలమైన వచనాలను చూపించారు. ఎవరెన్ని ఆటంకాలు కల్పించినా, తాను సంకల్పించిన కార్యాన్ని సాధించే ధైర్యస్థైర్యాలు కలవారు పంతులుగారు. గాలిపీల్చుకోవడం, విద్య నభ్యసించడం, వెలుగు చూడగలగడం, సంసారసుఖాన్ననుభవించడం. ఇవి స్త్రీలకూ పురుషులకూ కూడా 'జన్మహక్కులు' వాటిని కాదనడం నేరం. ఇదే పంతులుగారి వాదన.

మదరాస్‌లో పంతులుగారిచ్చిన ఉపన్యాసాల్ని ఒకరు ఖండిస్తూ ఉపన్యసించేవారు. ఆ ఖండించినవారు తెలుగువారే. వేదం వేంకటరాయశాస్త్రిగారో – కంచి సుబ్బారావు గారో – ఇద్దరిలో ఒకరు వేంకటరాయశాస్త్రిగారు పండితోత్తములు, ప్రముఖ సంస్కృత విద్వాంసులు. గొప్ప అనువాదకులు.[1] పవిత్ర గ్రంథాలపై పరిశోధనలు జరిపినవారు. ఆయన ఉపన్యాసాలలో మతం, ముఖ్యంగా మనువు వితంతు వివాహాలను ఖండించి నిషేధించిన సందర్భాలను ఉదాహరించేవారు.[2] బహిరంగ సభల్లో పంతులుగారికి వ్యతిరేకంగా మాట్లాడ్డంతోపాటు, మదరాస్ క్రైస్తవ కళాశాలలో తన విద్యార్థుల ముందు కూడా పంతులుగారిని ఆయన విమర్శించేవారు.

---

1. వేంకటరాయశాస్త్రి – "వేదం వేంకటరాయశాస్త్రి చరిత్ర" 28–49. జీవిత చరిత్రకారుడు ఆయన మనుమడు ఆయనకు సమకాలీనమైన జాబులను పునర్ముద్రించాడు. శాస్త్రిగారు సాధించిన వాటిని కూడ ముద్రించాడు.
2. వేదం వేంకటరాయశాస్త్రి – "స్త్రీపునర్వివాహదుర్వాద నిర్వాపణము" (వితంతు వివాహవిమర్శకుడు) 2వ ఎడిషన్ మద్రాసు 1924. ఇది మొదటి 1883లో ప్రచురించబడింది. పీఠికలో శాస్త్రిగారు ఈ వాదాలను సంఘసంస్కరణ వాదులకు వ్యతిరేకంగా ఉపయోగించినట్లు చెపుతుంది.

పంతులుగారికి మరొక ముఖ్యప్రత్యర్థి కంచి సుబ్బారావు గారు.[1] ఆయన 1877 లో మధ్వ సిద్ధాంతోన్నాహిని సభనుప్రారంభించారు. అది మధ్వ సంఘం, సామూహిక ప్రార్థనలతో దైవపూజలను చేసే విధానాన్ని బలపరచే సంస్థ. అందులో సభ్యులను సుబ్బారావు గారు పంతులుగారి మీదికి ఉసికొలిపారు. అందువల్ల పంతులుగారు ఉపన్యాస మందిరాలకు వెళ్లేటప్పుడు, తిరిగి వచ్చేటప్పుడు తగిన జాగ్రత్తలను తీసుకోవలసివచ్చింది.[2]

పంతులుగారు మదరాస్ కేవలం వితంతు వివాహాలను గురించి ప్రచారం చేయడం కోసం రాలేదు. మదరాస్ స్త్రీ పునర్వివాహ సంఘం తరఫున ఉపన్యాసాలివ్వడంతో పాటు, పంతులుగారిని సన్మానించే అవకాశం ఆ సంఘానికి కల్పించవలసిందని చెంచలరావు గారు ఆయనను కోరారు.[3] ఈ సంఘటన వల్ల ఒకవిషయం స్పష్టమౌతుంది. మదరాస్ సంఘసంస్కర్తలు పంతులుగారి నింకా బ్రాహ్మణునిగానే అంగీకరించి, ఆయనతో కలిసి భుజించగలరన్నదే ఆవిషయం. మదరాస్లో సంఘ సంస్కరణ పట్ల అభిమానమున్న బ్రాహ్మణుల కందరికీ ఆహ్వానాలంపించారు. కాని అయిదుగురు మాత్రమే హాజరయారు. ఆ అయిదుగురు ఎవరంటే – ఆర్.రఘునాథరావు, పి.చెంచలరావు, ఎ.గణపతి అయ్యర్, డి.నరసయ్య, మన్నవ బుచ్చయ్య.[4] వీరిలో గణపతి అయ్యర్ మాత్రం తమిళుడు. రఘునాథరావు మహారాష్ట్రదేశస్థ బ్రాహ్మణుడు, తంజావూరు నుంచి వచ్చినవాడు. తక్కిన ముగ్గురు తెలుగు బ్రాహ్మణులు. వీరేశలింగం పంతులుగారు స్వయంగా "గ్రంథాలలో" చెప్పినదాన్ని బట్టి, పత్రికావార్తలను బట్టి, ఆయన మద్రాస్లో తమిళులతో కలిసినట్టు కనబడదు. సంస్కరణవాదులతో మాత్రమే. అదివేరుగా కనబడుతుంది. చెంచలరావు వంటివారి మీద పంతులుగారు ఆధారపడ్డారు. చెంచలరావు రెవిన్యూబోర్డులో

---

1. J.N.Farquhar, Modern Religious Movements in India.
2. V.S.C.I 222
3. చెంచలరావు గారి జాబు. 12 మార్చి 1882, వి.ఎస్.సి.I 220
4. వి.ఎస్.సి.I 225

సిరస్తాదారు. తరవాత స్టాంపులు స్టేషనరీ ఆఫీసుకి అధిపతి అయ్యారు. పి. ఆనందాచార్యులు అనే ఒక ప్రముఖన్యాయవాది తెలుగుసాహిత్యాభిమాని. భవిష్యత్తులో భారత జాతీయ కాంగ్రెసుకు అధ్యక్షుడైనవాడు. పంతులుగారి అభిరుచుల్ని మదరాసులో అభివృద్ధిచేశాడు.[1]

రాజమండ్రిలోని సంఘసంస్కరణ కార్యకలాపాలకోసం నిధిని సేకరించడం కూడా పంతులుగారి మదరాస్ ప్రయాణానికి కారణం. మదరాస్ వెళ్లడానికి ముందు పంతులుగారూ ఆయనతో సహా సంస్కర్తలూ పైడా రామకృష్ణయ్య గారిని వితంతు వివాహాల కోసం ధనసహాయాన్ని చేయవలసిందిగా మళ్లీకోరడానికి ప్రయత్నించారు. పంతులుగారి మిత్రుడైన న్యాపతి సుబ్బారావు గారు ఈ విషయాన్ని గురించి పైడా రామకృష్ణయ్యగారితో చర్చించడానికి కాకినాడ వెళ్లారు.[2] ఆత్మూరి లక్ష్మీనరసింహం గారు కూడా ఆయన్ని ఒప్పించడానికెంతో ప్రయత్నించారు. కాకినాడలో కంచి కృష్ణస్వామి రావు సబ్‌జడ్జి, మదరాసులో పంతులుగారికి ప్రత్యర్థియైన కంచి సుబ్బారావుగారికాయన సోదరుడు కృష్ణస్వామిరావు గారు వితంతు వివాహాన్ని ప్రోత్సహిస్తూ, వాటికోసం ఆర్థిక సహాయాన్ని కూడా అందించారు. ఆయన కూడా రామకృష్ణయ్య గారితో ఆ విషయాలు ముచ్చటిస్తూ వచ్చారు.[3]

చివరకు రామకృష్ణయ్యగారు ఆర్థిక సహాయాన్ని అందించడానికి ఒకషరతుమీద అంగీకరించారు. రాజమండ్రి సంస్కరణవాదులకు ఆసహాయం అందని పక్షంలో – అన్నదే షరతు. వారు ఆర్. రఘునాథరావు, మద్రాస్ హిందూ వితంతు వివాహ సంఘం నుంచి ధనసహాయం పొందే ప్రణాళికను రూపొందించారు. అందువల్లనే పంతులుగారు మదరాస్ ప్రయాణమయ్యారు. అక్కడ రఘునాథరావు గారితో ఒప్పందం చేసుకుని అక్కడ ఎకౌంట్లు ఏర్పరుచుకొని, రాజమండ్రి వారికి ఖర్చులకు పంపుతూ ఉండే విధానం తయారుచేయడం కోసం పంతులుగారు మదరాసు వెళ్లారు. ఆయన వెళ్లినపని చాలవరకు నెరవేరింది.[4]

---

1. చెంచలరావు జీవిత చరిత్రకు మద్రాసు టైమ్స్ చూడాలి – 6 మార్చి 1901. ఆనందాచార్యుల జీవితచరిత్రకై 'ఆంధ్రదేశంలో స్వాతంత్ర్యపోరాటం' (మా. వేంకటరంగయ్య –ఆంగ్లంలో) ఎడిషన్ (హైదరాబాద్ 1965) I– 235–245 పంతులుగారి రచనల వల్ల ఆనందాచార్యులు గారు పంతులుగారితో పరిచయం సంపాదించుకున్నారు. సి Cf. His comments in Madras Standard 12 Dec. 1879.

వీరేశలింగం గారు మదరాస్ వెళ్లేటప్పటికి మదరాస్ హిందూ వితంతు పునర్వివాహ సంస్థ పునర్వ్యవస్థీకరించబడింది. దాని నాయకుడు ఆర్. రఘునాథరావు గారు. ఆయన అంతకు ముందు వితంతు వివాహాలు గురించి ఉపన్యసించారు. దానికొక సంఘం అవసరమని యిప్పుడు గ్రహించారు. 1882 ఫిబ్రవరి చివరిలో సంఘ సంస్కర్తల సమావేశమేర్పరిచి, పాత మదరాస్ హిందూ వితంతు పునర్వివాహ సంఘాన్ని గుర్తించాలని కోరారు. ఆ సంస్థలో కొత్తగా ఏర్పరిచిన సూత్రాలలో ప్రస్ఫుటమైంది, సభ్యులకు సానుభూతిపరులకు మధ్యనున్న భేదం. ముఖ్యంగా వీరేశలింగంపంతులుగారి వంటివారికి, మద్రాస్ వాస్తవ్యులు కానివారికి స్థానమేర్పరచబడింది.[1]

దీనివల్ల ఒక విషయం స్పష్టమవుతుంది. ఇతర జిల్లాల నుంచి వచ్చే సంస్కరణవాదులు సమావేశాలకు హాజరు కావచ్చు గాని, ఓటు హక్కు మాత్రం వారికి ఉండదు. మరొక ముఖ్యవిషయం సంవత్సరానికి ఆరురూపాయలు సభ్యుల చందా, అనాటి గ్రామాలలో ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుని నెలజీతమన్నమాట![2] ఈ సంఘం సభ్యుల నెక్కువగా చేర్చుకోనేదికాదు. పంతులుగారు వేసవి సెలవులకు మదరాస్ వచ్చినపుడు, ఆయన క్రమంగా ఆ సమావేశాలకు, హాజరయ్యేవారు. ఇతర సంఘ సంస్కర్తలను కలుసుకోనేందుకు ఒకముఖ్యవేదికగా ఇదెంతోగానో ఉపకరించేది. బళ్లారి సభాపతి మొదలియారుగారు కలిసికొనుటకు సమావేశమే కారణం.[3] ఆయన భావాలు పంతులుగారి భావాలతో ఏకీభవించేవి!

---

3. V.S.C.I 228 Sri B.Gavarraju Gari's letter 24th August, 1882.
V.S.C.I 234.

4. The Hindu 24th September 1884 in F.M.IV No.8, (August, 1883)1; for Raghunatharao's confirmation.

1. Madras Mail 2, March, 1882.

2. Ibid

3. వి.ఎస్.సి.I 285. సభాపతి మొదలియారుగారు బళ్లారిలో చేసిన వితంతు వివాహాలపై చర్చలతో పోల్చవచ్చును.
The Hindu 9 February, 1885

వీరేశలింగంగారు రాజమండ్రి తిరిగి వెళ్లిన తరవాత, రాజమండ్రి సంస్కరణవాదులకీ మదరాసు వారికీ వారి కార్యక్రమాల్లోను భిన్న భావాలలోను కేంద్రీకరణ పెరిగిపోయింది. 1882 ఆగస్టులో ఒత్తూరి లక్ష్మీనరసింహంగారు శంకరాచార్యుల మీద వేసిన దావా పైన ప్రభుత్వం హైకోర్టుకు అప్పీలు చేసింది.[1] అలాచేయడానికి ముఖ్యమైనది సలహా కాకినాడ సబ్ జడ్జి కంచి కృష్ణస్వామిరావు గారిది. జిల్లా జడ్జి వాన్ కిలాన్ కూడా ఆ అప్పీలును అంగీకరించి అభిమానించారు.[2] గౌరవనీయమైన మత సంస్థపై ఈ కేసును మదరాసు సంఘ సంస్కరణ వాదుల నాయకులు రఘునాథరావు చెంచలరావు గార్లు తీసికున్నారు.[3]

వితంతు వివాహ వ్యతిరేకత క్రమంగా పెరుగుతూందనే భయంలో కూడా రాజమండ్రి సంస్కరణవాదుల నాయకులు వాటిని జరిపే ప్రయత్నాలను విడవకుండా చేస్తున్నారు. 1882 అక్టోబరులో మరొక వితంతు వివాహం రాజమండ్రిలో జరుపబడింది.[4] ఏప్రిల్ 1883 నాటికి ఆరు వితంతు వివాహాలు జరుపబడ్డాయి.[5] ఈ సమస్య మీద వచ్చిన దాడుల సంఖ్య చెప్పుకోదగినంతగా లేదు కాబట్టి, పాశ్చాత్యులు ఈ సంఘటనల ప్రాధాన్యాన్ని ఎక్కువగా పట్టించుకోలేదు. అయినా, వాటి వల్ల రాజమండ్రి పట్టణం సంస్కరణ కార్యక్రమాల కేంద్రంగా మాత్రం గుర్తింపబడింది. మదరాసు గవర్నరు మౌంట్ స్టువార్టు ఎల్ఫిన్స్టన్ గ్రాంట్‌డఫ్ ఉత్తర సర్కారు జిల్లాలలో తన పర్యటించినప్పుడిలా అన్నారట - ''ఇక్కడ - ఇక్కడే ననుకుంటా - నేను ప్రయాణం చేస్తూన్నప్పుడు వితంతు వివాహాన్ని గురించి విన్న సందర్భం వుంది.''

---

1. ఇండియన్ లా రిపోర్ట్స్ 4 381
2. బసవరాజు గవర్రాజుగారి జాబు 24 ఆగస్టు 1882 పి.ఎస్.సి. 1 234.
3. మద్రాసు మెయిల్ 12 సెప్టెంబరు 1882.
4. ఈశ్వరచంద్రవిద్యాసాగర్ 24 అక్టోబరు 1882
5. మద్రాసు స్టాండర్డు 18 ఏప్రిల్ 1883.

రాజమండ్రి మునిసిపాలిటీ సమర్పించిన స్వాగత పత్రంలో – "మా పట్టణం ప్రస్తుతం గొప్ప మేధాసంపత్తితో కూడిన సాంఘిక కార్యకలాపాలకు కేంద్రంగా ఉంది. అయిదు వితంతు వివాహాలు ఈ మధ్యనే జరిగాయి. వాటిని స్థానిక వితంతు వివాహ సంఘం జరిపించింది. కొద్ది సంవత్సరాలలోనే దక్షిణ దేశంలోని అనేక పట్టణాలను మించకపోయినా వాటితో పోటీగా నిలబడగలదని మహోత్సాహం గట్టిగా చెప్తుంది." 1

ఈ పత్రం బహుశా సంఘ సంస్కర్తల వద్ద నుండే వచ్చివుంటుంది. ఈ వివాహ మహోత్సవాలు మేధాసంపత్తితో కూడిన కార్యకలాపాలమధ్య గల సంబంధంలో వారికున్న విశ్వాసాన్ని బాగా వ్యక్తపరుస్తాయి.

ఈ పత్రం యొక్క స్థిరత్వం 1883 మొదటి భాగంలో జరిగిన రెండు సంఘటనల వల్ల నిలబడేటట్లు కనబడుతుంది. మొదటిది – శంకరాచార్యుల వారిపై వచ్చిన దావా అంశానికి వ్యతిరేకంగా హైకోర్టు నిర్ణయించడం. జస్టిస్ టి. ముత్తుస్వామి అయ్యర్‌గారు హిందువులను కులం నుంచి బహిష్కరించే హక్కు శంకరాచార్యులకు ఉన్నదని సమర్థించారు. కాని ఆయన ఆవిషయాన్ని పోస్టుకార్డుద్వారా వ్యక్తులకు తెలియజేయడం ఆయావ్యక్తులకు పరువునష్టాన్ని కలిగించిందని అందుకు గాను ఆయనకు 200 రూపాయలు జరిమానా విధించారు.[2] ఇక్కడొక విషయాన్ని గమనించాలి. ఆదావా వేసిన ఆత్మూరి లక్ష్మీనరసింహంగారి మీద కంటే వీరేశలింగం పంతులుగారి మీదనే కేంద్రీకరించిన ప్రజల మనస్తత్వాన్ని గమనించాలి.

రెండో విషయం – ఎనిమిదో వితంతు వివాహాన్ని మదరాసులో జరపాలని పంతులుగారు కోరారు. ఆ విషయం రఘునాథరావుగారికి రాశారు. దాన్ని గురించి ఆలోచించడానికి మదరాసు హిందూ వితంతు వివాహ సంఘ సమావేశాన్ని ఆయన ఏర్పాటు చేశారు.[3]

---

1. ఎం.షి.పి.నెం.2372, 5 నవంబరు 1884 ఎం.ఆర్.ఒ.
2. ఇండియన్ లా రిపోర్ట్స్ 4 396
3. ఆర్. రఘునాథరావుగారి జాబు 28 మే 1883 వి.ఎస్.సి.I 260–261

పంతులుగారికి కావలసింది – ఎంత మంది వివాహ మహోత్సవంలో పాల్గొన గలుగుతారు? ఎంత మంది పెళ్లి విందులో పాల్గొన గలుగుతారు? అనేది. రఘునాథరావు గారి జాబు అంత ప్రోత్సాహకరంగా లేదు.

"బ్రాహ్మణ సభ్యుల్లో సమావేశానికి వచ్చిన 30 మందిలో 18 మంది కొద్దిమంది విందులో పాల్గొనడానికి కిష్టపడ్డారు. అదికూడ వారు పెట్టిన షరతుల కొప్పుకొంటేనే! ఆ షరతుల కంగీకరించడం సులభమైన విషయం కాదు. ఈ పరిస్థితుల్లో ఆవివాహం మదరాసులో జరిపించడం అవివేకమనిపిస్తోంది. ఏమైనప్పటికి ఎంత తక్కువ మంది హాజరైనప్పటికి, ఫరవాలేదని మీరు భావించిన పక్షంలో మీరు రావచ్చు. మేము మీకొకవిడిది గృహాన్ని సులభంగా ఏర్పాటు చేయగలము."[1]

పంతులుగారు మదరాస్ వెళ్లారు. కాని, అక్కడ ఏర్పాట్లు ఆయనకు సంతృప్తికరంగా లేవు. రఘునాథరావు ఆయన్ని చూడ్డానికి గాని, ఆయనతో భోజనం చేయడానికి గాని అంగీకరించక ఆయన్ని కించపరచాడు. చెంచలరావు మధ్యవర్తిగా వ్యవహరించి వారి మధ్యనున్న అభిప్రాయ భేదాల్ని పరిష్కరించడానికి ప్రయత్నించాడు.[2] 1883 జూన్ 7వ తేదీన మదరాస్ పరిసరంలోని మైలాపూర్‌లో వితంతు వివాహం జరపబడింది.[3] రఘునాథరావు గారి అభిప్రాయాలు ఎలా ఉన్నప్పటికీ, ఆపెళ్లికి దాదాపు వందమంది అతిథులు హాజరయ్యారు, వారు అనేక సంస్థల నుంచి వచ్చినవారు. వివాహం జరిపినందుకు పురోహిత బ్రాహ్మణులకు 300ల రూపాయలిచ్చారు. 16 చీరలు, ధోవతులు, సూటుగుడ్డలు వధూవరులకు బహూకరించబడ్డాయి.[4] అతిథులనేకులు తాంబూలమే స్వీకరించి ఆసంస్కరణ వివాహానికామోదం తెలిపారు, కొద్దిమంది నూతన దంపతులతో కలిసి విందు భోజనం కూడా చేశారు.

---

1. ఆర్. రఘునాథరావు గారి జాబు. 28 మే 1883 వి.ఎస్.సి.క్ష 1 261.
2. వి.ఎస్.సి.1. 225
3. మద్రాసు టైమ్స్ 11 జూన్ 1883
4. మద్రాసు స్టాండర్డు 11 జూన్ 1883

వివాహానంతరం మూడురోజులకు ఊరేగింపు ఏర్పాటు చేశారు. అది సంస్కరణ వాదులకు మరికొంత బలాన్నిచ్చింది. ఒక ప్రేక్షకుడిలా వ్యాఖ్యానించాడు. "ఈ పెళ్లి ఊరేగింపు చూచినవారు మరికొన్ని వితంతు వివాహాలు జరుగుతాయని విశ్వసించారు" 1

1883 ఆగష్టు, 1884 జనవరి నెలల్లో రాజమండ్రిలో మళ్లీ వితంతు వివాహాలు జరిగాయి. వీటితో కలిపి మొత్తం జరిగినవి పది వితంతు వివాహాలు. వారిలో ఎనిమిది మంది వధూవరులు బ్రాహ్మణుల మధ్య జరిగిన శాఖా భేదవివాహం. కులాంతర వివాహానికి సంబంధించింది ఈ ఒక్క వివాహం మాత్రమే.

"సాంత్వన వాక్యంబుల
చేర జీరితి వనాథ స్త్రీల" 2

---

1. మద్రాసు టైమ్సు 11 జూన్ 1883

2. కాండవీటి కవి – యుగపురుషుడు వీరేశలింగం పు. 73

## వితంతు వివాహాల మీద చర్చ

1884 లో వితంతు వివాహ సంస్కరణానికి బొంబాయి పార్శీ బెహరాంజీ మలబారీ వల్ల విస్తృతంగా ప్రచారం జరిగింది.[1] ఈ సమస్యను గురించి ఆయన కొనసాగించిన పరిశోధనను భారత ప్రభుత్వానికి పంపుతూ, వాటి నంగీకరించవలసిందిగా కోరారు. ఆ తరవాత వాటిని ఆయన పుస్తకంగా ప్రచురించారు.[2] మలబారీ భారతీయ సంస్కర్తలను చైతన్యవంతంగా కదల్చ గలిగారు. నాటి (భారత) ప్రభుత్వం కూడా ఈ విషయంలో చర్య తీసుకోవాలన్న అభిప్రాయానికి వచ్చింది. ప్రముఖ భారతీయ నాయకుల అభిప్రాయాలను ఈ విషయంపై సేకరించమని రాష్ట్ర ప్రభుత్వాలను కేంద్రం కోరింది. సేకరించిన అభిప్రాయాలను కలకత్తా పంపవలసిందిగా కూడా కోరింది. రఘునాథరావును ఆయన మేనబావ, ప్రముఖ సివిల్ ఉద్యోగి అయిన టి. మాధవరావును, చెంచలరావును సంస్కరణను గురించి మాట్లాడమని మదరాస్ ప్రభుత్వం కోరింది. ముత్తుస్వామి అయ్యరు, శేషయ్య శాస్త్రి, ఆనందాచార్యులు వారి అభిప్రాయాల నీయమని కోరబడ్డారు. ఆ అభిప్రాయాలు మలబారీ సూచనలను కొంచెం సంస్కరించగలవని భావించారు.[3] కందుకూరి వీరేశలింగంపంతులుగారికి, ఆత్మూరి లక్ష్మీనరసింహంగారికి గోదావరి జిల్లా జడ్జి జాబు వ్రాస్తూ, ఈ విషయాన్ని గురించి వారి అభిప్రాయాల నీయవలసిందిగా కోరారు.[4] వేర్లపట్టికలో తెలుగువారి వేర్లు చాలా కొద్ది. కృష్ణస్వామిరావుగారి పేరు ఉండి ఉండవచ్చు. కృష్ణస్వామిరావు గారు రాజమండ్రి సంస్కరణవాదులకు సహాయపడిన తరవాత తిరువేండ్రం హైకోర్టు ఛీఫ్ జస్టిస్‌గా నియమించబడి వెళ్లిపోయారు. రాజమండ్రి వితంతు వివాహాల రాజపోషకులైన పైండా రామకృష్ణయ్యగారు ఆయనపేరు సూచించారు. ఆయన లక్షలాది స్త్రీలు వితంతువులుగా వున్నారన్నారు.[5]

---

1. Heimalt "Hindu Social Refarm" 150 et passim

2. 'Infant Marriage and Enforced Widowhood in India' (Bombay) 1887

3. M.P.P. (Madras Public Preceedings) No.2270

4. M.P.P.No.2272 12th December, 1884 (M.R.O)

5. M.P.P.No.2652, 10th December, 1884 (M.R.O)

మలబారీ సూచనలు ఆనాటి బాల వితంతువుల సమస్యల మీదనున్న వివాదాన్ని నాటకీకరణ గావించాయి. మదరాసులోని బ్రిటిష్ ఉద్యోగులు ఇలాంటి సందర్భాలను తగ్గించాలని చూశారు. రామకృష్ణయ్యగారు విషయాన్ని మరింత విస్తృతపరిచారని వారన్నారు.[1] కాని, వారు మరికొంచెం ముందుకు వెళ్లి ''ఈ దేశం ఎక్కువ జనాభాలో ఈ సమస్యవారు చెప్పినంతగా ఉండదు'' అన్నారు.[2] అయినప్పటికీ జనాభా లెక్కలు మరొక సంఖ్య మరొక రూపాన్నిచ్చాయి. మదరాసు రాష్ట్రంలో 21 శాతం స్త్రీలు వితంతువులయినప్పటికి, వారిలో 2 శాతం కంటే తక్కువ మంది యుక్తవయసు రాకపూర్వం వితంతువులైనవారున్నారు.[3] ముప్ఫయేళ్లు రాకుండానే వితంతువులైనవారు 12 శాతం. దానిని బట్టి ఇది నిజంగా ఒక సమస్య అనే విషయం స్పష్టమవుతుంది. కాని ఆసమస్య యొక్క స్వభావమూ, పరిధీ మట్టుకు స్పష్టంకాలేదు. వితంతు వివాహాలను ప్రచారం చేసేవారుగాని, విమర్శించేవారు గాని, బాల్యవివాహాలు – ముఖ్యంగా అగ్రకులాల్లో, అందులోను బ్రాహ్మణుల్లో – జరగడం వల్ల బాలవితంతువులున్నారని నొక్కి చెప్పలేదు. అది వారిలో ఒక వివాదాస్పదమైన విషయమైపోయింది.[4]

1891 జనాభాలెక్కలు ''జనాభాలో 25 శాతం బాల్య వివాహాచారాన్ని పాటించగా, 15 శాతం సాధారణంగా బాల్య వివాహాలు జరుగుతూ వుండగా తక్కిన 60 శాతంలో బాలికకు యుక్త వయస్సు వచ్చేవరకు వివాహాలు చెయ్యడం అరుదు;'' అని వ్యాఖ్యానించాయి.[5] జనాభాలోని కొందరిలో ఈ సమస్య తలెత్తుతూండగా, వితంతువివాహ సమస్య మిక్కిలి సూక్ష్మమైన సమస్య అయిపోయింది. భారతదేశ స్త్రీలు హీనస్థితికి సంబంధించినంత వరకు ఆ వితంతువే మచ్చుతునకగా కనబడుతుంది. భారతీయ సంఘసంస్కర్తల ముందు ఆదీనమూర్తియే సాక్షాత్కరిస్తుంది.

---

1. M.P.P.No.2652, 10th December, 1884 (M.R.O)
2. Ibid
3. Government of India Imperial busus of 1881. (Presidency of Madras)I 71
4. Ibid 72. 1881 మదరాసు రాష్ట్రజనాభా లెక్కలప్రకారం బ్రాహ్మణ వితంతువులలో అత్యధికశాతం ఈ బాల్యవివాహాచారంవల్ల వితంతువులయినవారేనని స్పష్టపడుతోంది.
5. భారత ప్రభుత్వ జనాభా లెక్కలు I మదరాసు రాష్ట్రం I 8 145.

ముంకుల వచ్చినె తరకుండా
ముద్దు ముచ్చట లారిపోతే
వనితనమ్మున నొసటి కుంకుమ
వగచి పెద్దలు తుడిచి వేస్తే
ఒడి పిల్లలు ఆలపించే
ఆర్త గీతుల నాలకించెను

''లలిత నిర్మల లలాటమ్మును
లసత్కాంతులు విసర్జించుట
సుఖ జీవిత మందు పొద్దుటి
సవిత పొడిచి అస్తమించుట.''

అనుచు చిత్తములోన నెంచెను
దిక్కుతోచని దీనవనితల
ప్రక్క నిలబడి బాసటాయెను
కాడమ వయసున కోలుపోయిన
కుంకుమార్వక వారికిచ్చెను.
దురాచారము నిరాచేసుకు
దుఃఖ భాజనమైన బ్రతుకును
పడతి నుదుటను బ్రహ్మవ్రాస్తే
వ్రాలు చెరిపే వీలు చూపెను.
మగువ వైవశ్యత మగువ దైన్యత
మాపి, పొందెను తాను ధన్యత
అభ్యుదయం పంథా కాది పురుషుం
డతని సంస్కృతి కూర్చు సంస్కృతి. [1]

వీరేశలింగంగారి ''వివేకదీపిక'' నాటకంలో కొత్తగా వితంతువైన నప్పటి జానకి మాటలివి – ''నాపెద్ద వదినగారు నాడి దొంగ యేడుపనీ, ఇంట్లోపని చేయవలసి వస్తుందని, మొద్దులాగ తిని, మంచమునడుమెక్కి కూర్చుండి

---

1. ఆరుద్ర, ''యుగపురుషుడు – వీరేశలింగం'' పు. 121.

లేచిరానన్నీ, మంగలాగునే యెల్లకాలమూ కూరాచుండబెట్టి పనిచేయించడం కష్టమనీ, వారి ముండరనూ, వీరి ముండరనూ నాకు వినబడేట్టుగా సణగడం ఆరంభించిననీ, పిల్లి మీసాలా ఎలకమీసనూ పెట్టి నన్ను దెప్పేది. నావ్రాత యిలాగయి పుట్టిల్లు చేరబట్టిగదా ఇద్దరమయినా వాళ్లూ నన్నాడిపోసుకోడానికి సందుగలిగిందని – తెల్లవారిగట్ట కాండంత చీకటి వుండగానే లేచి ఎవరి కంటా బడకుండా లోపలి పాచి అంతా చేసేదాన్ని. తనసొమ్ము తాను తింటూవున్నా గానీ, మగడుపోయి పుట్టింటికి చేరగానే, అన్నలపెళ్లాలకీ తమ్ముల పెళ్లాలకీ వాళ్ల బ్రతుకంటే ఎంతో తేలికగా వుంటుంది. వదినెగార్లూ, మరదళ్లూ ఆడే రోతమాటల కన్నిటికీ తలకాయవాగ్గి, ఒక్కపూట పట్టెడుమెతుకుల కోసం ఎవరేమి కానీ కూతలు కూసినా పడుతూ, నలుగురు నవ్వుకర్లప్పటం. ఇంటిపనంతా చేస్తూ.....అటువంటి నీచమైన బ్రతుకు బ్రతకడం కంటె వురిపెట్టుకుని గుక్కెడు ప్రాణం ఒక్కమాటు పోగొట్టుకుంటే ఈ బాధలన్నీ నిముషంలో విరగడైపోతవి'' [1]

మరో సందర్భంలో ఆదే నాటకంలో సుభద్ర అనే ముత్తైదువ బలవంతపు వైధవ్యఫలితాలను గురించి చెప్పిన మాటలు [2] – ''ఛీ! దిక్కుమాలిన కులము! ఆడపిల్లలు పతురక వాళ్ల యింట్లోనో దూదేకుల వాళ్లయింట్లోనో పుట్టినా, మళ్లీ పెళ్లిచేసుకుని సుఖంగా వుండివుండురు. మనలో మగవాడికి పెళ్లాంపోతే, అరవయ్యేళ్లవాడయినా, శవం యింటికాడి నుంచి కదలకమునుపే, మళ్లీ మూడేళ్లదాన్ని చేసుకోడానికి బేరాలు మొదలు పెడతాడు; మూడేళ్ల దానికి మొగుడు పోయినా సమస్త సుఖాలు వదలిపెట్టి, యావజ్జీవం చచ్చినవాడి జీవానికి వుసూరుమని యేడుస్తూ, కడగళ్లు పడుతూ వుండవలసిందే! ఈ క్రూరాచారం మనలో ఏకాలంలో దయాదాక్షిణ్యాలు లేని యేలికటికి ముండాకొడుకు పెట్టినాడో కాని, మాన్పించే దిక్కులేక బహుఘోరకృత్యాలు జరుగుతూవున్నాయి'' అని ఇంట్లో వున్న విధవ కూతురు కోసం తల్లి బాధపడుతుంది. రెండోపెళ్లి చేస్తే వెలివేసేవారు. వెలివేసినా సరే – వితంతుపునర్వివాహం చాలా అవసరమని ఆ తల్లి గోలపెడుతుంది.

---

1. కందుకూరి వీరేశలింగం కృతగ్రంథములు రెండవ సంపుటము – నాటకములు 1917 ఎడిషన్ ''వివేకదీపిక'' పే. 446.
2. కం.వీ. వివేకదీపిక నాటకం ప్రథమాంకం పు. 441

''రెండో పెళ్లి లేకపోవడం వల్ల జరిగే చెప్పరాని ఘోరపాతకాల కంటే వేయి వెలులయినా మంచిదే! ముండమోసిన పడుచువాళ్లలో జరుగుతూండే అక్రమాలున్నూ రహస్యాలున్నూ మగవాళ్లకు మీకేం బాగా తెలియవు. మీరు మహారోగ్యాలని సంతోషించే దానికి (బాలవితంతువు) వండడానికి, వొంగుడు పోయిన తరవాత ఇదివరకు రెండు కడుపులు వచ్చినవి. నడివయస్సులో వున్నప్పుడు కామాన్ని జయించడానికి ఎవరి తరమవుతుంది?''[1] ఒకేనాటకంలో దానికి తనే వితంతువు తన బాధను తల్లితో ఇలా చెప్పుకుంటుంది.* ''పాపిష్టి యౌవనము నన్ను మోహపెట్టి, మధ్యమధ్య నన్ను తనవలలో వేసుకుని, నాకు వాళ్లు తెలియకుండా వున్న కాలంలో నా చేత కొన్ని కానిపనులు చేయించి మీకు (తల్లిదండ్రులకు) మనోవేదన కలిగేటట్టు చేస్తూన్నది. కార్యం అయిపోయిన తరవాత పశ్చాత్తాపం తెచ్చుకుని, ఇకముందెప్పుడూ మళ్లీ యిటువంటి పనిలో దిగనని నిశ్చయం చేసుకుంటూ వచ్చినా, సమయం వచ్చినప్పుడు నా బుద్ధి భ్రమించి పోయేటట్టు చేసి, కామము తన సమ్మోహన విద్యచేత నన్ను లోబరచు కుంటూ వుంటుంది. వెధవ వాళ్లకు పెళ్లిలేకుండా చేసినందుకు, దేవుడు వాళ్లకు కామం కూడా లేకుండా చేసినట్టయితే, లోకంలో యిటువంటి దుష్కర్మలు లేకుండా, అందరూ ఎంత సుఖపడుతారు.... వెధవ దానికి నాకీ చక్కదనమూ యౌవ్వనమూ బ్రతుకు ఎందుకురా?''[2]

ఇవి నాటకంలో ఒకపాత్ర చెప్పిన మాటలే గాని చెవులొగ్గి వింటే ప్రతి వితంతువు హృదయంలోను స్పందిస్తూన్నట్టు తెలుస్తుంది. పంతులుగారు తాను విన్నవీ కన్నవీ యథాతథంగా నాటకంలో ప్రదర్శించారు. వితంతువు మానసికంగా పడే బాధలూ నాయన గుండెను కదిలించేటట్టు నిరూపించారు.

ఇవి కూడా దానికి నోటనే చెప్పించారు –''నాయీడు వాళ్లు నగలు పెట్టుకున్నా, మంచి చీరకట్టుకున్నా, నారాత ఇలా అయ్యింది గదా అని విచారం కలిగేది. నాయీడు వాళ్లు శుభకార్యాలలో పేరంటానికి వెళుతూన్నా, భోజనానికి వెళుతూవున్నా, నా బ్రతుకు బండలయ్యింది గదా అని దుఃఖం కలిగేది. నాతో

---

1. కం.వీ. వివేకదీపిక నాటకం – ప్రథమాంకం పు.442.
2. డిటో. డిటో. పు. 443

కూడా చిన్నప్పుడాడుకునే వాళ్లు బిడ్డలను కనిపెంచుతూ వుండటం చూసి, నాకటునుంచి వైరాగ్యత పట్టలేను గదా అని కడుపు పగిలిపోయేది. ఏక గర్భవాసమందు పుట్టి నాయందెంతో ప్రేమ గలిగిన అన్నగారే సిద్ధపడడంతో నేనెప్పుడైనా కంటబడ్డయితే 'పొద్దున్నే లేచి వెధవముండ ముఖం చూచినాను నేడేమికీడు మూడునో అనీ, దుశ్శకునమయిందనీ విసుక్కునేవాడు. ఇక పరాయివాళ్లు వెధవల మొగం చూస్తే తిట్టడం ఆశ్చర్యం కాదు.'' వితంతువుల ఇలా మానసిక క్షోభకు పంతులుగారెంత బాధపడ్డారో! మంచికావ్యం బాధలో నుంచే కదా అవతరిస్తుంది.

వితంతువు ఆర్తిని గురించి వ్యాఖ్యానం మాత్రమే కాకుండా, వాటిని పోగొట్టే విధానం గూడా ఆచరణలో చూపించారు పంతులుగారు.

పంతులుగారి లాంటి సంఘసంస్కర్తలు వితంతు వివాహ సమస్య బ్రాహ్మణ వర్గం సంకుచితాచారాల నుంచి తలెత్తిందని గుర్తించారు. కాని, ఆ సమస్య ఎంత విస్తృతమైనదీ లెక్కలు కట్టి నిరూపించడంలో పంతులుగారు ఆసక్తి చూపలేదు. ఆయన వ్యాసాలలో, హిందూ పవిత్ర గ్రంథాలలో వితంతు వివాహాలు జరపవచ్చునని సమ్మతించిన శాస్త్రీయ భాగాలను ఎత్తి చూపించారు.[1] వివిధ ప్రాచీన మత గ్రంథాల నుంచి అనుమతుల నుదహరించి నిషేధిస్తున్నాయనే భాగాలను ఖండించారు.[2]

మనమత గ్రంథాలలో కూడా యుక్తవయస్సు వచ్చిన యువతులకే వివాహం జరిపించినట్టు కనబడుతూందని ఆయన అన్నారు. చిన్నపిల్లలకు పెళ్లిళ్లు చేసినట్టు ఆగ్రంథాలలో కనబడదు.[3] మన హిందూ సోదరులు ప్రాచీన శాస్త్ర సూత్రాలను గురించి తెలుసుకోగలిగినప్పుడు, వాటిని అవగాహనచేసుకోగలిగినప్పుడు, ప్రస్తుతాచారాలు వాటికి విరుద్ధంగా ఉన్నాయని గ్రహించగలరు అని కూడా పంతులుగారన్నారు. అప్పుడు సమకాలీక ఆచారాలను మార్చగలరని ఆయన చెప్పారు. అదేవిధంగా, వితంతువుల దుస్థితిని వివరిస్తూ, మిషనరీలవలె ఆయన కూడా

1. అతిబాల్యవివాహము – నిర్బంధవైధవ్యము – (ఇన్ఫాంట్ మేరేజి అండ్ ఎన్ఫోర్స్డ్ విడోహుడ్) వి.వి.సెప్టెంబరు 1884 కె.వి.కె.జి. 8: 626.
2. కం.వీ. కృతవివేకదీపిక నాటకంలో 490, 491 పేజీలలో ఆరణ్యకశ్రుతి, అథర్వణశ్రుతి, యజుర్వేద, ఋగ్వేదవచనాలను ఉదాహరించి, వాదప్రతివాదులు నిరూపించారు.
3. ''అతిబాల్యవివాహము – నిర్బంధవైధవ్యము'' (Infant Marriage and Enforced Widowhood) V.V.Sept. 1884. K.V.K.G. VIII 629

పురుష భావాలను మార్చడానికి ప్రయత్నించారు. దాని వలన భారతదేశంలోని సాంఘిక పరిస్థితులను మార్చడానికి వీలవుతుందని ఆయన భావన.[1] దీన్ని గురించి రెండు వాదాలున్నాయి. ఒకటి పవిత్ర [illegible] గ్రంథాల నుంచి సేకరించింది. మరొకటి ఆనాటి సమాజం నుంచి గ్రహించింది. రెండు వాదాలు కూడా మార్పునకు స్థానమే మతాలు అనే సిద్ధాంతం మీద నిలబడ్డవే. వీరేశలింగంగారు, రఘునాథరావుగారు, చెంచలరావుగారు మొదలైన సంస్కరణవాదుల నాయకులు సం[illegible]లగారడీల నుపయోగించలేదు. అది సాంస్కృతికంగా వారికి తెలియని వాదం. వారు కేవలం గ్రంథాల నుంచి ఉదాహరించే పద్ధతికి మాత్రమే అలవాటు పడ్డారు.[2]

ఈ సందర్భంలో ప్రభుత్వానికి మలబారీ ఒక సూచన చేశారు వివాహ సూత్రాలను చట్టబద్ధం చేయవలసిందని విజ్ఞప్తి చేశారు. దాని వలన బాల్యవివాహాలు నిర్మూలమవుతాయని, తత్ఫలితంగా బాలవితంతువులు లేకుండా పోవచ్చునని ఆయన భావించారు. అది సంపూర్ణమైన సంతృప్తిని కలగజేసింది. అయితే, 1884 డిసెంబర్ చివరి వారంలో మదరాస్ హిందూ వితంతు పునర్వివాహ సంఘ సమావేశంలో రఘునాథరావు గారు ప్రసంగిస్తూ ప్రభుత్వం యొక్క జోక్యాన్ని నిరసించారు. హిందూ సమాజంలో నుంచే సంస్కరణరావాలని ఆయన ఉద్ఘాటించారు.[2] ఎస్. సుబ్రహ్మణ్య అయ్యర్ అనే సుప్రసిద్ధ న్యాయవాది – తరవాత హైకోర్ట్ జడ్జి పదవి [illegible] నందినవారు, ఈ సమస్యకు సంబంధించిన సరియైన న్యాయసూత్రాలను నిర్ణయించడానికి ప్రభుత్వమొక కమీషన్‌ను నియమించాలని వాదించారు. ఆ కమీషను అవసరమైన శాస్త్రీయ గ్రంథాలను సేకరించి, పండితులతో చర్చించి వాటి కాధారాలు కనుక్కొని, ఒక నివేదికను సమర్పించాలని కూడా ఆయన వాదించారు.[3]

ఈ సమావేశంలో వీరేశలింగం పంతులుగారేమీ మాట్లాడలేదు. అంతకు ముందు కొన్ని నెలల క్రితం ''బాలికలకు పదేళ్ల వయస్సులోపున జరిగే వివాహాలు [illegible]నావాలంటే, మనలో పాశ్చాత్య విద్యనభ్యసించినవారు కొన్ని సూత్రాల నేర్పరచాలి'' అన్నారయన.[4]

---

1. The Hindu 24th September, 1884; The Hindu 12th January, 1885.
2. Madras Standard 30th December, 1884.
3. Ibid.
4. V.V. 'Vivekavardhani' September, 1884 K.V.K.G.VIII 63[illegible].

మరో మాటలో చెప్పాలంటే – శిక్షితులు సమాజానికి నాయకత్వం వహించగల వారు నూతనాచారాలను నెలకొల్పాలి. కాని పాశ్చాత్యవిజ్ఞానాన్ని పొందినవారు సమాజంలో మార్పులు తీసుకురావాలని ప్రయత్నించినప్పుడు చాలమంది హిందువులా ప్రయత్నాలను ప్రతిఘటించి, వారి సూచనలను తిరస్కరించారు.

ఒకానొక రచయిత ఇలా వ్యాఖ్యానించారట – ''ఈరోజుల్లో సంఘాలకు అధ్యక్షులమని చెప్పుకునేవారు ఈ దేశంలో విషయాలకు నాయకత్వం వహించడం పరిహాస్యం. సాంఘిక పాలకులు సమాజంలోని అన్నివర్గాల నుంచి ప్రతినిధుల నేర్పరిచి, సాంఘిక సభలకు తన స్థానానియ్యాలి. ఆసంఘసంస్కర్తలకప్పుడు మంచి అవకాశం లభిస్తుంది. వారు శక్యమైనంత వరకు ప్రాచీనమతంతో జోక్యం కలిగించుకోక, సంస్కరణల కనుమతి నీయవలసిందని అమతాధిపత్యానికి విన్నవించాలి. వీలైనంతవరకు గత చరిత్రతో సమన్వయం కలిగేటట్లుగానే మార్పులు తీసుకురావాలి'' అని వ్యాఖ్యానించారు.[1]

1883 నుంచి వచ్చిన మార్పులు గణనీయమైనవి. చాలమంది హిందువులు సాంఘికమైన మార్పులు తీసుకురావడానికి గవర్నమెంటు లెజిస్లేటివ్ పాత్రను అంగీకరించారు. ఆసమయంలో, 1883 జూన్‌లో వితంతు వివాహం జరిగిన తరువాత, వీరేశలింగం పంతులుగారి పాత విరోధి, సంఘసంస్కరణకు ప్రబల విరోధి అయిన కొక్కొండ వెంకటరత్నంగారు – 'ఆంగ్లప్రభుత్వ రక్షణలో హిందూ వితంతువులు మతాచారమనే నిరంకుశత్వం నుంచి స్వాతంత్ర్యాన్ననుభవించే అవకాశం కలిగింది'' అన్నారు.[2] హిందూ వితంతువుల దుస్థితిని ప్రభుత్వ చట్టం ద్వారా మెరుగుపరచమని రిప్పన్ ప్రభువును వీరేశలింగం గారు ఒత్తిడి చేశారు, బెంటింక్ ప్రభువు 'సతి' సహగమనాన్ని తొలగించినట్లే, వితంతువుల దురవస్థను తొలగించమని ఒత్తిడిచేశారు.[3] భారతీయ సమాజం మీద దెబ్బతీసే ప్రభుత్వ చట్టాల మీద వ్యతిరేకత పెరగడం మొదలు పెట్టింది. అనేకులు అటువంటి

---

1. The Hindu 3rd November, 1884

2. ఆంధ్రభాషాసంజీవని Madras Native News Paper Reports – September 1883.

3. వివేకవర్ధని M.N.N.R. June, 1883.

చట్టాల పట్ల విముఖత చూపించారు. అటువంటి చట్టాలకు అనుకూలంగా మహారాష్ట్రం కష్టమయ్యింది.

1884 డిసెంబరు చివరలో పంతులుగారు రెండు ముఖ్యసమావేశాలకు వెళ్లారు. ఒకటి – మదరాసు మహాజనసభ, మదరాసులో జరిగింది. రెండు – హిందూ పట్టభద్రుల సమావేశం, అదీ మదరాసులోనే జరిగింది. పూనా సార్వజనిక సభ పూనాలోను, భారతీయ ఏసోసియేషన్ కలకత్తాలోను ఏమిచేశాయో ఆ తరహా కార్యాలను మదరాసులో చేయడం కోసం నెలకొల్పబడిన రాజకీయ సంస్థయే మహాజన సభను సమావేశ పరచడం. ఆ ప్రయత్నంతోనే ఈ సమావేశాన్ని మదరాసులో ఏర్పాటు చేయడం జరిగింది.[1] మదరాసు స్థానిక సంఘాన్ని 1850లో ఏర్పాటు చేయడం అట్టి ప్రయత్నాల్లో ఒకటి.[2] 1870లో దాని పునఃప్రయత్నం రెండోది.[3] ట్రిప్లికేన్ సాహిత్య సమాజం 1874లో ఏర్పడి, రాజకీయంగా ఒత్తిడితీసుకురాగల సంస్థగా తయారయ్యింది. కాని దాని ప్రభావం పరిమితం మాత్రమే.[4]

ఆర్.బాలాజీరావు, పి.ఆనందాచార్యులు, జి.సుబ్రహ్మణ్య అయ్యర్, వి.రంగయ్యనాయుడు, ఎం.వీరరాఘవాచార్యులు మొదలైనవారు – అందరూ అనధికారులే. 1884 లో మదరాసు మహాజన సభను ప్రారంభించారు. డిసెంబర్ సమావేశంలో లెజిస్లేటివ్ కాన్‌స్టిట్యూషన్ గురించి వారు చర్చించారు. న్యాయశాఖ, రెవిన్యూశాఖల విభజనా, వాటి పరిపాలనా వేరువేరుగా వుండాలనీ, వ్యవసాయదారుల పరిస్థితిని గురించి, జాతీయసమావేశము, సింహళద్వీప లెజిస్లేటివ్ కౌన్సిల్ గురించి, ఆసమావేశంలో చర్చించారు. తీరాంధ్ర ప్రాంతం నుంచి వచ్చిన ఇద్దరు ప్రతినిధుల్లో పంతులుగారొకరు. అయినా చర్చల్లో ఎక్కువగా పాల్గొనలేదు.[5] అప్పటి నుంచి పంతులుగారు సభాకార్యక్రమాల్లో ఆసక్తి చూపించలేదు. మదరాసులో పంతులుగారి

---

1. మదరాసు మెయిల్ 20 మే 1884. ఇతరప్రాంతాల సంస్థలతో దీన్ని పోల్చడం ఈ వ్యాసంలో జరిగింది.
2. ఆర్.సుందరలింగం. The Madras Native Association – A sketch of one Early Indian Political Organisation Indian Economic. Social History Review IV No.3 (September, 1967) 233 – 253.
3. Madras Standard 29th March, 1878.
4. Its History is narrated in the Hindu 25th July 1898 and the Hindu Weekly Reveiw 19th August, 1909.
5. Proceedings of the Conference of Native Gentlemen held at Patchappa's Hall under the auspices of the Madras Maha Jana Sabha in January 1885 (Madras 1885) The actual conference began on 29th December, 1884. Madras Mail 29th December [illegible]

ప్రస్థాన కార్యక్రమం సంఘసంస్కరణ సమావేశాల్లో పాల్గొనడం. ఈ మహాజనసభలో పాల్గొనడం కూడ కేవలం కుతూహలం వల్లనే గాని హాని లాభాల కోసం మాత్రం కాదు.

హిందూ విద్యాధికుల సమావేశం కేవలం మలబారీ సూచించిన విషయాలను గురించి ఆలోచించడానికి ఏర్పాటయింది. దానితోపాటు సంఘసంస్కరణ కార్యకలాపాలను గురించి సామాన్యంగా చర్చించడం కోసం కూడా సమావేశమైనారు.[1] వీరేశలింగంపంతులుగారికి గాని, రఘునాథరావుగారికి గాని విశ్వవిద్యాలయం డిగ్రీలు లేకపోయినా, సంఘసంస్కరణలో అగ్రనాయకులుగా వారిద్దరు ఆ సమావేశానికి హాజరైనారు. బాలికలకు వివాహవయస్సు కనీసం పది సంవత్సరాలుండాలనే తీర్మానం 1885 జనవరిలో అంగీకరించబడింది. దానితోపాటు వివాహమహోత్సవాని కయ్యే ఖర్చులు తగ్గించాలనీ బాలురకు వివాహపు కనీసవయస్సు 15 సంవత్సరాలుండాలనీ, వితంతు వివాహాలను బలపరచాలనీ, స్త్రీ విద్యాభివృద్ధి చెందాలనీ కూడా తీర్మానించారు.[2] అయితే, ఈ తీర్మానాలను అమలుపరిచిన విధానాన్ని గమనిస్తే, మద్రాస్ సంఘసంస్కరణవాదులు సంస్కరణపట్ల ఎంత అభిమానం కలిగివున్నారో తెలుస్తుంది. విశ్వవిద్యాలయం పట్టభద్రులు సంఘసంస్కరణను బలపరుస్తామని శపథం చేస్తూ సంతకాలు చేసే తీర్మానాన్ని ప్రతిపాదించడాన్ని కూడా వారు ఓడించారు. చివరి తీర్మానం ప్రతి సభ్యుని శక్తివంచన లేక సంస్కరణ కోసం చేయగలిగినంత చేస్తాననమని ఒత్తిడి చేసింది.[3] చెంచలరావుగారొకసారి సంఘసంస్కరణకు బ్రిటిష్ సహాయాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ – ''హిందువులు వారి కార్యకలాపాలకు చేయూతనిమ్మని హైందవేతరులను కోరడం హేయమైన పని'' అన్నారు.[4] ఇక్కడ సంఘసంస్కరణ కనుకూలంగా వున్న పురుషుల సమావేశం నుంచి – ప్రభుత్వచట్టం కావాలన్న మలబారీ సూచనకు తగిన జవాబు వచ్చింది. ఈ సమావేశఫలితాలు మద్రాస్‌లో ఫలితం శూన్యమై అన్న విషయం యొక్క ఛాయలు ముందుగానే కనిపించాయి.

---

1. **Madras Mail 3rd January, 1885**

2. **Madras Mail 3rd January 1885**

3. **Ibid.**

4. **Madras Standard 23rd November, 1885.**

ముఖ్యంగా వివాహవయస్సును గురించిన బిల్లు. ఇరవై సంవత్సరాల తరవాత వచ్చినదానికి పిండరూపంలో అంతా ఉంది.[1] ఈ ఫలితాలు వీరేశలింగం పంతులుగారికి సంఘసంస్కరణ కార్యకలాపాల్లో తానెదురుకొంటున్న వ్యతిరేకతను గురించి సుస్పష్టమైన భావాన్నిచ్చాయి.

1885 జనవరిలో పంతులుగారు ఉపన్యాసాలివ్వడానికి మద్రాసులో ఉండిపోయినారు.[2] రాజమండ్రి తిరిగి వచ్చేయత్నాలను కుదుర్చుకుంటుండగా ఒకముసలి బ్రాహ్మణుడు ఇద్దరు వితంతుయువతులను తీసుకువచ్చి వారికి పెళ్ళిళ్ళు చేయించమని కోరాడు. పంతులుగారు వెంటనే ప్రయత్నించి, ఇద్దరు వరులను పట్టుకోగలిగారు. ఆరెండు పెళ్ళిళ్ళు మదరాసులో జరపాలనుకున్నారు.[3] 1883 జనవరిలో తాను జరిపిన ఎనిమిదో వితంతు పునర్వివాహం తెచ్చిన ఉత్సాహప్రోత్సాహాలు తిరిగి ఈ రెండు వివాహాలు తెస్తాయనుకుని ఆశించారు. కాని, ఆనాటి నుంచి రఘునాథరావు పంచలరావుగార్ల మీద సనాతన బ్రాహ్మణుల ఒత్తిళ్లు తగ్గలేదు సరిగదా, మరీ ఎక్కువయినాయి.

1884 ఆగస్టు, సెప్టెంబరు నెలల్లో మఠ్వశాఖాధిపతిని కలుసుకుని, ఆయన బోధనల నాలకించి, వారు వితంతు వివాహాలను ప్రోత్సాహించడం మానేయడాని కంగీకరించారు.[4] అందువల్ల పంతులుగారి ఏర్పాట్లు ఈ మదరాసు సంఘ సంస్కర్తలకు ఏమాత్రం అభిలషణీయంకాలేదు. వారు మఠాధిపతితో కుదుర్చుకున్న ఒప్పందానికి ఈ చర్యలు వ్యతిరేకంగదా! ఆవధూవరుల జంటలనెక్కడికైన తీసుకువెళ్లి వివాహాలు జరపమని పంతులుగారితో పంచలరావుగారు గట్టిగా చెప్పారు. తాను గాని, రఘునాథరావుగారు గాని ఆవివాహాలకు హాజరుకారు గనక, మదరాసులోని సంఘసంస్కర్తలకు అనవసరంగా అపఖ్యాతి వస్తుంది; గనక, ఆవివాహాలు మద్రాసులో జరిపించవద్దని ఒత్తిడి చేశారు.[5] అప్పుడు బళ్లారి సభాపతి మొదలియారుగారు ఆర్థికసహాయాన్నందిస్తామంటే, ఆవధూవరులను పంతులుగారక్కడికి పంపించారు.[6]

---

1. సుందరలింగం ' రాజకీయవాదాలు – ప్రచారం '' et passim.
2. The Hindu 12th January, 1885.
3. V.S.C.I 283 – 285.
4. The Hindu 27th August, 1884. Madras Standard 12th September, 1884.
5. ~~The Hindu 27th~~ V.S.C.I 285
6. Ibid. The Hindu 9th February 1885.

పంతులుగారి మద్రాసులోని మిత్రుడు మన్నవ బుచ్చయ్య బ్రహ్మసమాజ నాయకుడు, తెలుగు పండితుడు, అంతేకాక బళ్లారి సంఘ సంస్కర్తలతో ఎక్కువగా సంబంధాలున్నాయి. అందువల్ల పంతులుగారు వివాహాలకు అక్కడ జరపడానికి కావలసిన ఏర్పాట్లు చేయించగలిగారు. వీనికి వివాహాలు జరిపే బాధ్యతను బుచ్చయ్యగారు తలపైన వేసుకున్నారు.[1] మద్రాస్ సంఘసంస్కర్తల నుంచి పంతులుగారికి దెబ్బతగిలినప్పటికీ, వారి అసోసియేషన్ సమావేశాలకు అందుకే మద్రాస్ వచ్చినప్పుడు హాజరవుతానే వున్నారు.[2] ఇంతకు తప్ప 1890 వరకు వారి కార్యక్రమాలలో పంతులు గారు ఏమంతకైన పాత్ర వహించలేదు. ఎక్కువగా కలగజేసుకోలేదు.

1884 చివరలో మలబారీ ప్రతిపాదనలతోపాటు, సామ్యూల్ సత్యనాథన్ అనే రాజమండ్రి ప్రభుత్వ కళాశాల అధ్యాపకుని నివేదిక కలిపి, రాజమండ్రి సంఘసంస్కరణోద్యమాన్ని గురించి ఇలా వ్యాఖ్యానించారు.[3] "మొత్తం పది వితంతు వివాహాలు కేవలం వీరేశలింగం పంతులుగారి ఏకైక కృషి వల్ల, అక్కడి సంస్కరణవాదుల సహకారంతో జరిగాయి."

వీరేశలింగం పంతులుగారు అయినకు విధేయుడు విశ్వాసపాత్రుడైన మిత్రుడు, సహచరుడు బసవరాజు గవర్రాజుగారు - వీరు ఇద్దరు ఇంకా కులబహిష్కృతులుగానే ఉన్నారు.[4]

పంతులుగారు 1879లో వితంతు వివాహ సమస్యపై యిచ్చిన ఉపన్యాసాలను పునశ్చరణ చేసుకుని, తరవాత రెండు సంవత్సరాలకు జరిగిన వితంతు వివాహాలు కూడా వాటి ఫలితమేనని చెప్పారు. ఈ సంఘసంస్కరణ కార్యకలాపాలలో విద్యార్థులు పాల్గొనడం - సాంఘిక సమస్యలపై వారికి గాఢాసక్తి కలగడం - భారతీయ మహిళల

---

1. Madras Times 13th June, 1884.
   Madras Standard 20th February, 1885.
2. The Hindu 20th May 1885: At the May meeting, Veeresalingam quarrelled with Raghunatha Rao, who did not want to extend the Association's activities to cover Hindu Widows who were not child widows.
3. Madras Mail 30th December, 1884.
4. Ibid.

Sx

దైన్యస్థితిని నిర్మూలించి వారి అభివృద్ధికి తామె శక్తి వంచన లేకుండా కృషి చేయడానికి నిశ్చయించుకొనడం ఎన్నదగినది.[1]

రాజమండ్రిలో జరిగిన సంస్కరణకార్యకలాపాల ప్రతిష్ఠకు సత్యనాథన్ నివేదిక ఎంతో ఉపకరించింది. ఈ నివేదిక మదరాసు ప్రజలకు ఇచ్చినది. "వీరేశలింగంపంతులుగారు ఏకైక సంఘసంస్కరణ నాయకుడు. ఆయనను వితంతు వివాహాలకు 'కారణం' కాదు, 'ఫలితం' అనిచెప్పాలి." ఈ విధంగా చెప్పిన సత్యనాథన్ గారు వీరేశలింగంగారి ప్రాముఖ్యాన్ని పరిశీలించిన చాలామంది సానుభూతిపరుల్లో ప్రత్యక్షమవుతుంది.

నీ చేతి చలువతో నే వితంతువులు తమ
తలలపై నీలాలు నిలుపుకొన్నారయ్య!
నీ కష్టమే తండ్రి బెరడు గట్టి వా
యింక అనాథల బ్రతుకు చిగురింపజేసినది! [2]

## సంఘసంస్కరణలో భేదాభిప్రాయాలు – వ్యతిరేకత

1884 సంవత్సరంలో రాజమండ్రిలోని వితంతువివాహోద్యమం స్వయం సమృద్ధిగా ఉండగలిగినట్లు కనబడుతుంది. సంస్కరణవాదుల్లో భేదాభిప్రాయాలకు కారణం అప్పుడే మొదలయినట్టుంది. ఉద్యమం సాధారణంగా ప్రతివివాహానికి 1000 రూపాయలు ఖర్చుపెట్టేది. ఈ ఖర్చులో 300 రూపాయలు విలువచేసే నగలు కూడా ఉండేవి. దానికి తోడు సంస్కరణవాదులు వరునికొక ఉద్యోగం చూపించాలి, లేదా స్థిరమైన సంపాదన ఏర్పడేవరకు కొంత భృతి నియ్యవలసిన అవశ్యకత వుండేది. వీటన్నింటి మూలంగా వరునిలో ఆశలు రేకెత్తేవి.[3]

---

1. మద్రాస్ మెయిల్ 30 డిసెంబరు 1884.
2. సి. నారాయణరెడ్డి, 'యుగపురుషుడు – వీరేశలింగం పు. 92.
3. వైండా రామకృష్ణయ్యగారి జాబు మార్చి 5, 1886, వీ.ఎస్.సి. I– 297–298 లో ఉదహరించబడింది. మద్రాసు మెయిల్ 23 నవంబరు 1888తో పోల్చవచ్చు.

1884 జనవరిలో జరిపిన పదో వివాహంతో వారి దగ్గరున్న నిధులు పూర్తిగా తరిగిపోయాయి. అప్పటి నుంచి రాజమండ్రి నాయకులు ధనం కోసం వ్యక్తుల చందాలపై ఆధారపడవలసి వచ్చింది. వివాహితులైన వధూవరులను పోషించాలి, పురోహితులను, వంటవారిని, నౌకర్లను కూడా పోషించాలి. దానికోసం నిధుల అవసరం ఎంతైనా వుంది. పదో వివాహంలోని వరుడు పి. శేషయ్య, తనకు రావలసిన సొమ్ము తగ్గించని వాదించినప్పుడు భేదాభిప్రాయం వచ్చింది.[1] వరులకు వివాహానంతరం ఇచ్చే భృతి అందరికీ సమానంగా వుండక, అవసరాన్ని బట్టి కొందరికి హెచ్చుగాను, కొందరికి తగ్గుగాను, వుండేది. అందువల్ల వారీ విషయం ఫిర్యాదు చేశారు; సంస్కరణవాదుల్లో కొంతమందితో కలిసి పార్టీలు కట్టడం మొదలు పెట్టారు. దాని ఫలితం లోలోపల ఒడుకెత్తడం. దాన్ని నాయకులు గుర్తించారు. అందువల్ల సంస్థను పునర్వ్యవస్థీకరించాలని నిశ్చయించుకున్నారు. అప్పటి వరకు మామూలుగా జరిగిపోయే వాటిని ఒక క్రమపద్ధతిలో జరపాలనుకున్నారు.

1884 జూన్ నెలలో రాజమండ్రి వితంతు వివాహసంఘం పునర్వ్యవస్థీకరించబడింది.[2] అంతకు ముందు సంఘంలోని వారు పదహారు మంది నూతన సంస్థలో సభ్యులయ్యారు. వారిలో నలుగురిని కార్యనిర్వాహక వర్గంగా ఎన్నుకున్నారు. సోమంచి భీమశంకరాన్ని వారెన్నుకున్నారు. అతనప్పుడే కొత్తగా న్యాయవాది పట్టాను పొందివున్నాడు. వీరేశలింగం పంతులుగారు కార్యదర్శిపదవికి తిరిగి ఎన్నుకోబడ్డారు. ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు కోశాధికారి, గవరాజుగారు ఎకౌంటెంటూ, న్యాపతి సుబ్బారావుగారు కార్యవర్గసభ్యులు.[3]

ఇంత జరిగినా, రాజమండ్రి వితంతు వివాహసంఘ కార్యకలాపాలు ధనాభావంచేత ఆగిపోవలసి వచ్చినంతపనయ్యింది. వారు పెద్దగా అప్పులపాలు కాలేదు.

---

1. V.S.C.I 278. P.Seshayya later broke with Veeresalingam Pantulu and transfered his support to Elure Lakshmi Narasimham. cf. Madras Mail 23rd November, 1888.

2. Madras Mail 30th December, 1884.

3. V.S.C.I 279 - 280.

దానికి కారణం పదకొండ్, పన్నెండ్ వివాహాల ఖర్చు బళ్లారి సభాపతి మొదలియారు భరించడమే.[1] 1885లో ఈ సంఘం సానుభూతిపరులకు విజ్ఞప్తి చేసింది - విరాళాలిమ్మని.[2] సి. మాధవరావుగారు రు. 500/-లు విరాళమిచ్చారని, శ్రీయుతులు సి. నాగోజీరావు, కె. వీరేశలింగం, ఆ. లక్ష్మీనరసింహం, న్యాపతి సుబ్బారావు సంతకాలతో ఆ విజ్ఞప్తి విడుదల చేయబడింది. ఈ సంఘసంస్కర్తల ఉదాశీన తారస్థాయి చేరుకున్న విషయం కూడా గుర్తించబడింది. "హిందూ స్త్రీలు పునర్వివాహం చేసుకోడానికి లంచాలిచ్చి ప్రోత్సాహించే పద్ధతి మాకు అసహ్యమే. కాని, ఏదో ఒక రూపంలో సహాయపడ్డం ప్రస్తుత సమాజంలో ఆవశ్యకమైంది". అనివారన్నారు.[3] ఆర్థిక సమస్యలు అంతర్గతమైన చిక్కులతో పాటు రాజమండ్రిలోని సంఘ సంస్కర్తలను పెళ్లిచేసుకున్న వధూవరులను పడిపించడం కూడా విపరీతంగావుంది.

పంతులుగారూహించినట్లు వితంతు వివాహాలకు ధనం ప్రవాహంగా రాలేదు. పంతులుగారి పాతమిత్రులు పి. రంగయ్యసెట్టి, కె. కృష్ణస్వామిరావు, మదరాసు నుంచి డబ్బుపంపారు. అంతేగాని, రఘునాథరావుగారు గాని, చంచలరావుగారు గాని సహకరించలేదు.[4] బళ్లారి సభాపతి మొదలియారు ప్రతివితంతువివాహానికి వందరూపాయలు వాగ్దానం చేశారు. కాని ఆదిలోని పైడా రామకృష్ణయ్యగారి 10,000 రూపాయలు భూరి విరాళానికి సరిరాదు కదా!

అయితే మొదట యిచ్చిన పదివేలు అయిపోగానే మరొక పదివేలు వాగ్దానం చేశారు.[5] కాని, 1885 నాటికా సొమ్ము ఖర్చయింది. రామకృష్ణయ్యగారు మళ్లీయిస్తామన్న సొమ్ము ఇవ్వలేదు.[6] పరిస్థితులిలాగుండగా,

---

1. The Hindu 9th February, 1885.
2. Madras Mail 13th June, 1885.
3. Ibid.
4. Ibid.
5. Madras Mail 13th June 1885.
6. దీనిని పైడా రామకృష్ణయ్యగారి వీలునామాలో సరిచూడుడు. 18 మార్చి 1886. వి.ఎస్.సి.I 326 – 327.

13 డిసెంబర్ 1885లో మరొక వితంతు వివాహం జరిగింది. రాజమండ్రిలో జరపబడింది. సంస్కర్తల వద్ద ధనం లోపించిందని ఈ వివాహాలవల్ల స్పష్టమయింది. విరాళాలను సేకరించిన వారిలో పంతులుగారే ముఖ్యులయ్యారు. అయితే, ఎందుకనోకానీ అంతగా రుజువులేదు. మదరాసులోని ఉదారుల ప్రయత్నాలు నిరంతరమంతం కాలేదు. రాజమండ్రి నాయకులు నాగోజీరావుగారు, లక్ష్మీనరసింహంగారు మొదలైన వారప్పటికే సంవత్సరానికి కొన్ని వందల రూపాయలు విరాళంగా ఇచ్చేవున్నారు.[1]

ఆతర్నూరి లక్ష్మీనరసింహంగారి దగ్గరకు, పైడా రామకృష్ణయ్యగారి దగ్గరకు వరుసు వెళ్లి ఎక్కువ సొమ్మిమ్మని ఒత్తిడి చేశారు.[2] ఇటువంటి చేష్టలను పంతులుగారంగీకరించేవారు కారు; కారణం – కార్యసిద్ధిగా అభ్యాసత తనదే గనక. అంతేకాదు దాని వల్ల యిద్దరు పెద్దమనుష్యులతో తనకు భేదాభిప్రాయం కూడా కల కలగవచ్చు. పంతులుగారు వితంతు వివాహాలు చేయడం వరకే గాని, తరవాత దంపతుల జీవితాలు స్థిరపడ్డాన్ని గురించి అంతగా ఆలోచించరు – అన్న పేరు అప్పటికే రాజమండ్రిలో వచ్చింది.[3] ఈ అంతర్గత విభేదాలు వివాహిత వధూవరులపై ఉండనకున్న హక్కును తగ్గించాయి.

1886 మార్చి 28 తేదీని పైడా రామకృష్ణయ్యగారు కాకినాడలో పరమపదించారు. మరణించడానికి ముందు అందున వీలునామాలో రాజమండ్రి వితంతు వివాహసంఘానికి పదివేల రూపాయలు ఏర్పాటు చేశారు.

ఆ వీలునామాను అమలుపరిచే విషయంలో సంస్థనాయకుల మధ్య కొంత మనస్పర్థలు కలిగాయి. పైడా రామకృష్ణయ్యగారు తానిచ్చిన విరాళానికి ఆతర్నూరి లక్ష్మీనరసింహంగారిని ఏకైక ట్రస్టీగా నియమించారు. దానిని నిర్వహించడం గొప్పసదవకాశం. ఆవీలునామా షరతులను పూర్తిగా అర్థంచేసుకోవాలంటే, ఆ వెంటనే జరిగిన విషయాలను (అంటే రామకృష్ణయ్యగారి మరణానంతరం జరిగిన విషయాలను) కూడా గమనించాలి, లేకపోతే సంపూర్ణంగా అవగాహనకాదు.

---

1. వి.ఎస్.సి. 293 – 294,
2. పైడా రామకృష్ణయ్యగారి జాబు. 16 సెప్టెంబరు 1885, వి.ఎస్.సి I 316–318.
3. మదరాసు మెయిల్ 23 నవంబరు 1888.

మార్చి 21 తేదీ వివేకవర్ధని 'శంకరాచార్యవిలాసము' అనే ప్రహసనాన్ని ప్రకటించింది.[1] ఆ ప్రహసనం ఒక ప్రముఖ న్యాయవాదిని అవహేళన చేసింది. ఆ న్యాయవాది ఒకచేతితో న్యాయాన్ని చేకూరుస్తూ, మరొక చేతితో తన వద్దకు వచ్చిన వారి వద్ద నుంచి కానుకలు తీసుకుంటున్నట్టు చిత్రించబడింది. అందులో పాత్రలో స్పష్టంగా కనబడేది దుష్టత్వమూ, కపటవర్తనమూను. ఆ పాత్ర అత్యంత నైపుణ్యంతో చిత్రించబడింది. అందువల్లనే ఆ వ్యక్తి ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు అనే విషయం గుర్తించబడింది. ఆయన మరెవరో కారు; పంతులుగారి పాతగురువు, సంస్కరణ కార్యకలాపాలలో సహాయకుడు. లక్ష్మీనరసింహంగారు కూడా ఆ ప్రతిని దహించడం ద్వారా ప్రతీకారం చేశారు. అంతటితో ఆగలేదు. వీరేశలింగం పంతులుగారి మీద కోర్టులో దావా వేస్తానని బహిరంగంగా బెదిరించారు కూడా.[2]

రామకృష్ణయ్యగారి మరణమూ, ప్రహసన ప్రచురణమూ, ఇంచుమించు ఒకసారి జరిగాయి. అవి ప్రముఖంగా కనబడినవి. అంతకు ముందు నుంచి, వాస్తవానికి, వారిద్దరిలో కొన్ని భిన్నాభిప్రాయాలున్నప్పటికీ, ఆనాటి నుంచి అవి బహిర్గతమైనాయనవచ్చు. ఈ అభిప్రాయ భేదాలకు మొదటి కారణం – ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు కులబహిష్కారం పొందిన తరవాత ప్రాయశ్చిత్తం చేసుకోవడం. పంతులుగారి కడికోపకారణం. శంకరాచార్యులవారి కేసు ఓడిపోయిన వెంటనే ఆయన ఆపని చేశారు – 1882 జనవరి నెలలో.[3]

1886 నాటికి లక్ష్మీనరసింహంగారు అనేకమత సంఘాలను స్థాపించారు. కొంతమంది ప్రముఖ బ్రాహ్మణ పండితులను అభిమానించి వారి గ్రంథాలను ప్రచురించారు.[4] క్రమంగా ప్రార్థనా సమావేశాలకు హాజరుకావడం తగ్గించారు.[5]

---

1. రమాపతిరావుగారి 'పంతులుగారి గ్రంథరచన' – యుగపురుషుడు 211
2. ఆత్మూరి లక్ష్మీనరసింహంగారి జాబు 6 ఆగష్టు 1886, వి.ఎస్.సి.1 352
3. వి.ఎస్.సి.1 350 మదరాసు గవర్నరు 1883లో ఇరువురు పురుషులు మాత్రమే కులబహిష్కారాన్ని పొందారన్నారు. యం.పి.పి.నెం.2372, 5నవంబరు 1884. ఎం.ఆర్.ఓ. [illegible] 1884లో వారిని వీరేశలింగంగారు, గవర్రాజుగారు అని గుర్తించారు. మద్రాసు మెయిల్ 30 డిశెంబరు 1884.
4. ఆత్మూరి లక్ష్మీనరసింహము – తైత్తిరీయసంహిత (రాజమండ్రి 1886) ఈ గ్రంథంలో లక్ష్మీనరసింహంగారభిమానించిన అనేకసంస్థలయొక్క పండితుల యొక్క పేర్లు ఉదహరించబడ్డాయి.
5. వి.ఎస్.సి.1 350 – 351.

భిన్నాభిప్రాయాలకు రెండు కారణాలు సమాజంలో ఇద్దరు ప్రముఖ వ్యక్తులుండడం. పంతులుగారు రాజమండ్రిలోని సంఘ సంస్కరణ కార్యకలాపాలకు నాయకుడుగా ముందు నిలిచి ఉన్నారు. అయితే, నిజానికి, మరికొందరు కూడా – ప్రత్యేకంగా ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు – పంతులుగారితో సమానంగా పనిచేసినవారే. స్థానిక బ్రిటిష్ అధికారులు మిషనరీలు లక్ష్మీనరసింహంగారి సేవలను గుర్తించారు.[1] అయినా, మద్రాసు పత్రికలు మాత్రం ఆయనని గుర్తించినట్లు లేదు. అందువల్ల ప్రచారం ఒకవిధంగా విరోధానికి దారి తీసింది. వితంతు వివాహ సంఘానికి కోశాధిపతి అవడం వల్ల, వరులు, ఎక్కువ ధనసహాయం చేయమని ఆయన్ని కోరారు. అందుకే కనబడకుండా కొంతమంది వరులకు ధన సహాయం మంజూరుచేశారు. వాటిని కార్యదర్శి అయిన వీరేశలింగంగారు అంగీకరించలేదు. వరులు (సహాయంకోసం) పంతులుగారి దగ్గర నుంచి లక్ష్మీనరసింహంగారి దగ్గరకు వెళ్లడాన్ని గురించి చక్కని ఇతివృత్తం తయారు చేయవచ్చు. ఈ విధంగా ప్రహసనంలో ప్రత్యర్థి గౌరవప్రతిష్ఠ మీద పంతులుగారు దాడిచేసినట్లు కనబడింది.

1886 ఏప్రిల్ 3 తేదీని రాజమండ్రి వితంతు వివాహ సంఘ సమావేశం జరిగింది. రామకృష్ణయ్యగారి వీలునామాను అమలుపరిచే విధానాన్ని గురించి చర్చించడం ముఖ్యాంశం.[2] ట్రస్టీగా నియమింపబడిన ఆత్మూరి లక్ష్మీనరసింహంగారిని ఆవీలునామా రిజిస్టరు చేయించవలసిందిగా కార్యవర్గం ఒత్తిడి చేసింది. ఆరురోజులు తరవాత మరొక సమావేశంజరిగింది. దానిలో ఆభారి విరాళం నుంచి కొంత ధనంవరుల గృహాలను బాగుచేయడం కోసం ఖర్చుపెట్టాలని ప్రతిపాదనలు వచ్చాయి. ఇతరులతో కలిసి నివసించేవారికి ప్రత్యేక గృహనిర్మాణం కోసం మరికొంత సొమ్ముఖర్చుపెట్టాలనే ప్రతిపాదన కూడా వచ్చింది.[3]

---

1. ఎం.పి.పి.నెం.3652, 10 డిసెంబరు 1884, ఎం.ఆర్.ఒ., ఎఫ్.ఎం.4 నెం.6, జూన్ 1883 2
2. వి.ఎస్.సి–1 331
3. వి.ఎస్.సి–1 332.

## సంస్కరణలో నూతన పక్షాలు

భారతీయుల సంస్కర్తల పద్ధతి విసుగెత్తినట్లైంది. వారు మాట్లాడ గలరు, విరాళాల నివ్వగలరు. కానీ వారు వాగ్దానం చేసినదాన్ని చెల్లించడంలో, చెప్పినదాన్ని ఆచరించడంలో విఫలులవుతారు. ఈ పద్ధతి సాధారణంగా జరిగేది కాక పోవచ్చు.

వితంతు వివాహోద్యమం రాజమండ్రిలో కలిగించిన నిరాశానిస్పృహాలు పంతులుగారిని దానిపట్ల విముఖుల్ని చెయ్యలేదు. పైగా, దానివల్ల తాను పరిష్కరించవలసిన సమస్య ఇదమిత్థంగా కనుగొనగలిగారు. ఆసమస్యలలో కొన్ని – సమావేశస్థలాన్ని నిర్ణయించడం మొదలైనవి – ఆచరణీయాలు. వ్యక్తిగత అభిమానం లేకపోయినా, సంస్కరణ కార్యక్రమాలకు ఆర్థికస్తోమత సంపాదించే సమస్యకూడా ఆచరణ సాధ్యమే. తక్కినవి నాయకత్వం మీద కేంద్రీకృతమైన సమస్యలు. సంస్కరణ కార్యకలాపాలమీద వ్యక్తిగతంగా ఆధిపత్యాలను సాధించడం. నైతికబలం మీద ఆధారపడిన నాయకత్వాన్ని ఏర్పరచడం గాని, వ్యక్తిగత లాభం మీద ఆధారపడికాదు. (పంతులుగారి దృష్టిలో ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు, పిలారి లక్ష్మీనరసింహంగారు అటువంటివారు) క్లుప్తంగా చెప్పాలంటే, ఒకరకమైన సంస్థ స్వరూపం సంఘ సంస్కరణ కార్యకలాపాల కవసరమని ఆయన భావించారు. అటువంటప్పుడు వ్యక్తిగత సంఘర్షణలకు వాటి దుష్ఫలితాలకు తావుండదని వారివాదన. అందువల్ల, అటువంటి సమస్యల నెదుర్కొడానికి సంస్థల నేర్పాటు చేయాలని పంతులుగారు ప్రయత్నాలారంభించారు.

మదరాస్‌లో తమకార్యక్రమాల వల్ల గుర్తింపబడి పంతులుగారు కీర్తిప్రతిష్ఠలు సంపాదించారు. 1880లో తనకు మదరాస్‌లో జరిగిన మన్ననలూ, గౌరవాలు పంతులుగారిని మదరాస్ వంకకు ఆకర్షించాయి. మదరాస్ ప్రజాజీవితంతో ఆయన మరింత సన్నిహితులయ్యారు. అంతేకాక, మదరాస్ నాయకులతోను, అఖిల భారత నాయకులతోను సన్నిహిత సంబంధాలేర్పరచుకున్నారు.

1897 నాటికి, రాజమండ్రిలో జరిగిన సంఘటనలు పంతులుగారిని రాజమండ్రిలో తన స్థానాన్ని గురించి ఆలోచించుకొనేటట్లు చేశాయి. మదరాస్ వెళ్లడం సాధ్యమా అన్న ఆలోచన ఆయన మనస్సులో పొటమరించింది. రాజమండ్రిలో తన కార్యకలాపాలు – మదరాస్‌లో తాను కొంతవరకం సాధించగల మింపరాలు ఈ రెండింటి మధ్య ఏర్పడిన మానసిక సంఘర్షణ ఆయనకు మదరాస్ మీద గల ఆసక్తిని కొంతవరకు వివరించగలవు.

## అనిశ్చిత సమయం

పంతులుగారికీ ఆత్మారి లక్ష్మీనరసింహంగారికీ మధ్య ఏర్పడ్డ భేదాభిప్రాయాలమూలంగా వితంతు వివాహాలు ఆగిపోయాయి. లక్ష్మీనరసింహంగారు దూరంగా వెళ్లారు, కాని భేదాభిప్రాయం, వితంతు వివాహోద్యమం, పంతులుగారి మీద పనిచేస్తూనే ఉన్నాయి. 1888 లోని అనేక సంఘటనలు రాజమండ్రి సంఘ సంస్కర్తల మీద ఆయన ప్రభావాన్ని మరింత సన్నగిలజేశాయి.

వితంతు వివాహాల పట్ల, అలావెళ్లిళ్లు చేసుకున్నవారిపట్ల, 1880ల్లో రాజమండ్రిలోని సనాతన సంఘంవారు ఎంతులేని వ్యతిరేకతను ప్రదర్శిస్తూ వచ్చారు.[1] వారి ముఖ్యోద్దేశం ఆ నూతన దంపతుల్ని సమాజం నుంచి బహిష్కరించడమే, వితంతువులను వివాహమాడాలని నిశ్చయించుకున్నవారికి వారి త్యాగం వల్ల వారెందురుకోవలసిన కఠినాతికఠినమైన కష్టాలను చూపించి హెచ్చరించడమే.[2]

---

1. మద్రాసు మెయిల్, 22 మే 1888.
2. గోగులపాటి శ్రీరాములు వితంతువును వివాహమాడిన ప్రప్రథమ వరుడు. 1881 డిశెంబరులో వివాహమయింది. వెంటనే ఆయన తిరిగి విశాఖపట్టణం వెళ్లిపోయాడు. అక్కడ ఈ వివాహంవల్ల ఏవిధమయిన వ్యక్తిగత లాభంపొందలేదు. ఆర్థికలాభం కూడా అందలేదు. కులబహిష్కారం మాత్రం వచ్చింది. చివరకు విసిగి 1888లో ఆయన క్రైస్తవ మతాన్ని స్వీకరించాడు వి.ఎన్.సి.1 380

సనాతన సంఘం యొక్క ద్వేషం. వీరేశలింగం పంతులు, లక్ష్మీనరసింహం చేసే కృషికి బ్రిటిష్ ప్రభుత్వోద్యోగులు సానుభూతి చూపించే వారు. అందువల్లనే వధూవరులను కాపాడ్డానికి తమ సహాయం సహకారాలను అందించేవారు. ఆ సహాయం స్వల్పమైనదయినా, వారి సానుభూతి మాత్రం వీరికి ఎంతో బలాన్నిచ్చింది. లూథరన్ మిషనరీలు కూడా వారికి సహాయపడ్డారు. ముఖ్యంగా వరులకు పాఠశాలల్లో ఉపాధ్యాయవృత్తిని కల్పించడం ద్వారా సహాయపడ్డారు.[1]

హిందువులాచరించే మతకర్మకాండల నాచరించడానికి తమకు వీలుకానందుకు వరులు బాధపడ్డారు. ఆగ్రహించారు. దేవాలయాల్లోకి ప్రవేశించనీయనందుకు శంకరాచార్యుల మీద్రా పూజారుల మీదా దావాలు కూడా వేశారు. 1888 ఏప్రిల్‌లో గోదావరి జిల్లా కోర్టులో వారిదావా తిరస్కరించబడింది. హైకోర్టులో వేసిన దావా కూడా అలాగే తిరస్కరించబడింది. ఇంతవరకు వరులు అభిమానుల అభిమానం మీద ఆధారపడి వుండేవారు. ఇప్పుడు రాజమండ్రి సంఘసంస్కర్తలకు సంఘటించిన ఉపద్రవం వరులను ఎక్కువ స్వతంత్రులిని చేసింది. ఇంతకు ముందు చెప్పినట్లు, పంతులుగారికి వితంతు వివాహాలు జరపడం మీదే ఎక్కువ ఆసక్తి. ఆతరవాత వధూవరుల సంక్షేమం మీద ఆసక్తి అంత ఎక్కువకాదు. రామకృష్ణయ్యగారి విరాళంమీద లక్ష్మీనరసింహంగారికున్న ఆధిపత్యాన్ని అదుపులో పెట్టడం కోసం కృషిచేయడంలో పంతులుగారి శక్తి సామర్థ్యాలింకా హెచ్చించబడుతూనాన్నాయి.[2] పంతులుగారి మిత్రుడైన న్యాపతి సుబ్బారావుగారు మునిసిపల్ కౌన్సిల్ అధ్యక్షపదవిని పలుూరి లక్ష్మీనరసింహంగారి చేత కోల్పోయినప్పుడు, మునిసిపల్ కౌన్సిల్‌లో పంతులుగారి పలుకుబడి మరింత తగ్గింది. పలుూరి లక్ష్మీనరసింహంగారు పంతులుగారి ప్రత్యర్థుల్లో ఒకరు. అన్నిటిని మించి, ఆయన ప్రాణమిత్రుడైన బసవరాజు గవర్రాజుగారి మరణం పంతులుగారి కాక పెద్ద దెబ్బ, అది అనుకోని ఆకస్మిక

---

1. విదేశమిషనరీ కమిటీ ఇవాంజలికల్ లూథరన్ చర్చి కేంద్రకౌన్సిలు నివేదిక (1884-85) 28 లెర్నార్డు శీనెస్ నుండి. పి.241.
2. వి.ఎస్.సి.I 375 - 380.

సంఘటన – 1888 జులై 16వ తేదీ. ఆయన మిత్రుని కన్నుమిన్ను, నమ్మినబంటు, సంస్కరణ కార్యకలాపాల్లో పంతులుగారి పత్రిక ' వివేకవర్ధని 'కి వ్యాపార నిర్వాహకుడు.[1]

మొదటి వితంతు వివాహంలో వరుడు జబ్బుపడినప్పుడు అతనికి పరిచర్యలు చేయడానికి గవర్రాజుగారిని పంతులుగారు నియమించారు. శంకరాచార్యుల మీద దావా వేసినప్పుడు అవసరమైనవన్నీ చేసిన వారు గవర్రాజు గారే![2] పంతులు గారికీ, ఆత్మూరి లక్ష్మీనరసింహంగారికి మధ్య వచ్చిన భేదాభిప్రాయాలు సమసిపోయేట్లు చేయడానికి గవర్రాజుగారెంతగానో ప్రయత్నించారు. జిల్లా కోర్టు సిరస్తాదారుగా గవర్రాజు గారు పంతులుగారిని జిల్లా జడ్జికీ తదితర బ్రిటిష్ ఉద్యోగులకు సన్నిహితులుగా చేశారు. తరవాత గవర్రాజుగారి మధ్యవర్తిపాత్రనూ, ప్రధానపాత్రనూ, పంతులుగారు సంపూర్ణంగా అంగీకరించారు. గవర్రాజుగారిని పంతులుగారు తన బలమైన కుడిభుజంగానూ, సంఘసంస్కరణ కార్యకలాపాలలో రాజమండ్రిలో తన వారసుడుగానూ గుర్తించారు. గవర్రాజుగారి మరణం కొంతకాలంపాటు పంతులుగారి కార్యకలాపాలన్నింటినీ ఆపి, వైరాగ్యజీవితం గడిపేట్టు చేసింది.[3]

1888 అక్టోబర్ 16 తేదీన మరొక వితంతు వివాహం జరిగింది. ఆవివాహాలలో సంఘసంస్కర్తలలోని విభేదం బాహాటంగా కనిపించింది. పంతులుగారి నాయకత్వం పడిపోయిన చాయలు గోచరించాయి.[4] పంతులుగారి కెదురు తిరిగిన ఎన్. కోదండరామయ్య ఇద్దరు వరుల్లో ఒకరు. ఆయన వితంతువును రెండవమారు వివాహమాడాడు – ప్రథమ కళత్రం మరణించడం వల్ల. వివాహితులైన దంపతులు ఆపెళ్లికి హాజరైనారు. పంతులుగారు మాత్రం రాలేదు. ఈ వివాహ విషయం స్వీయచరిత్రలో కూడా ఆయన పేర్కొన లేదు. ఆవివాహాన్ని

---

1. బసవరాజు గవర్రాజు గారి జాబు 1886 మే 28, పి.ఎస్.సి-I P.336
2. డిటో. డిటో 1882 ఆగస్టు 24 పి.ఎస్.సి-I P.234
3. పి.ఎస్.సి.I P.410
4. మద్రాస్ మెయిల్, నవంబరు 23, 1888.

పలివారి లక్ష్మీనరసింహం గారు ఏర్పాటు చేశారు. వివాహ ఖర్చుల కోసం విరాళాలను కూడా ఆయనే సేకరించారు. వ్యక్తిగతంగా ఆయన వితంతు వివాహాలను ప్రోత్సహించారు. అప్పారి లక్ష్మీనరసింహంగారు రాజమండ్రి విడిచివెళ్లిన తరవాత, ఆయన మిత్రులు తమ విశ్వాసాన్ని పలివారి లక్ష్మీనరసింహంగారి మీద నిలిపారు.[1] దీనితో పంతులుగారు రాజమండ్రి సంఘసంస్కర్తల్లో తనబలాన్ని కోల్పోయారు. ఆయన సన్నిహిత మిత్రుడైన న్యాపతి సుబ్బారావుగారు మాత్రమే ఆయనకి వ్యాస మిగిలారు. 1884లో, ఆయన ప్రారంభించిన సంస్థల్లో ఆయనన్ను విడవని ఏకైక వ్యక్తి ఆయనే.

## సంఘసంస్కరణ కార్యక్రమాల్లో పునఃప్రవేశం

1892 నవంబర్లో పంతులుగారు వితంతు వివాహ కార్యక్రమంలోకి తిరిగి ప్రవేశించారు. మృత్యుంజయరావు అనే విద్యార్థి 'ఫీనిక్స్' పత్రిక సంపాదకుడు ఒకరిని ఒప్పించి వివాహానికి సన్నాహం చేశాడు. ఆ వివాహం పంతులుగారి గృహంలో జరిగింది. పంతులుగారే పురోహితుడుగా వ్యవహరించారు. ప్రారంభంలో జరిగిన వివాహాలలోని పద్ధతులన్నింటినీ విడిచిపెట్టారు. ఆర్భాటంగా వివాహాలు జరపడాన్ని పంతులుగారు బహిరంగంగా తిరస్కరించారు. కొంతవరకు వ్యయం తగ్గించడం కోసం. రెండవది – నూతన సంఘాన్నేర్పరచి, నాయకత్వాన్ని గురించిన తగాదాలను పెంచుకోడానికూడా ఆయన ఇచ్ఛగించలేదు. ఆడంబరోపేతమైన ఉత్సవాలకంటే ఆకార్యక్రమంలో గల త్యాగమును, పవిత్రతా దీక్షా ఎక్కువగా ఉండాలని ఆయన నిశ్చయించారు.[2] కొంత వరకు సంఘ సంస్కర్తల దృక్పథం ఆయన చేసేపనిని బలపరచడంకోసం మార్చబడింది.

---

1.

2. పి.ఎస్.సి.1 పు.389

వివాహ వయస్సును గురించిన చట్టం భారతప్రభుత్వం చేసిన తరవాత సనాతన సంప్రదాయ నాయకులు (పూనాలో తిలక్, మద్రాసులో కంచి సుబ్బారావు) తిరిగి సంఘసంస్కర్తల నెదిరించడం మొదలు పెట్టారు. రానురాను సంఘసంస్కర్తలకు సనాతన వాదులకు బహిరంగంగా సంఘర్షణలు చెలరేగాయి. సాధారణంగా ఈ సంఘర్షణల్లో సంస్కర్తలు ఓడిపోయేవారు. ఒక ఉదాహరణకు : మద్రాసులోని హిందూపత్రిక – అందులో [illegible] ఉద్యోగులందరు సంఘసంస్కర్తలైనప్పటికీ – సంఘసంస్కరణ ఉద్యమాన్ని బలపరచడం మానివేసింది.[1] పూనాసార్వజనిక సభలో సంస్కరణ వాదిగా ఉన్నందుకు రనడే మీద పూనాలో దండెత్తారు. రనడే తన ఉద్యమాన్ని గట్టిగా బలపరుస్తూ, యువకులు చేయవలసిన త్యాగాన్ని గురించి నొక్కి చెపుతూ, సంఘ సంస్కరణకి నడుం కట్టవలసిందిగా ఉద్బోధించారు.[2]

పంతులుగారు కూడ నైతికబలం ఎంతో అవసరమని గ్రహించారు. నైతిక వర్తనకు సంస్కరణ కార్యకలాపాలకు మధ్యనున్న సంబంధాన్ని వివరిస్తూ, పంతులుగారు 1896లో తన విద్యార్థి శివునికి వ్రాశారు – ''నీకార్యకలాపాల ఫలితాలను ఒకసారి ముందుకు ప్రతిబింబింప చేసి చూడ గలిగినప్పుడు, అవిసరిగా వున్నవని భావిస్తే, ఏం జరిగినా నీవిక తలొంచనక్కరలేదు. మనం చేసే పనుల్లో మంచి ఉంటే, ఎన్ని కష్టాలు వచ్చినా మనమనస్సు ప్రశాంతంగానే ఉంటుంది. ఊట బాగా లేనప్పుడు తేటనీరెలా ప్రవహించగలుగుతుంది?''[3]

రనడే వలెకాక, పంతులుగారు వితంతు వివాహోద్యమ బాధల ననుభవించారు. సంఘసంస్కరణ కార్యకలాపాలవల్ల వచ్చే బాధలను కేవలం దీక్షతో నైతికబలంతో తట్టుకోడం కష్టమని స్వానుభవంతో పంతులుగారు గ్రహించారు.[4] పంతులుగారికి మృత్యుంజయరావులో గవర్రాజుగారు కనిపించారు, తనతో కలిసి బాగా పనిచేస్తూన్న యువకుడు మృత్యుంజయరావు. ఆదేశాలను

---

1. K. Subba Rao, 'Revived Memories' (Madras 1933) 217
2. M.G.Ranade – Religious and Social Reform (Bombay 1902)
3. వీరేశలింగంగారు 1896 ఏప్రిల్ 25న శివుడు గారికి వ్రాసిన జాబు 'సంస్మృతిలో' ఆయన ఉదహరించారు.
4. వి.ఎస్.సి. 2[illegible]– 79.

సహాయం కూడా స్వీకరించేవాడు. పంతులుగారు వదిలి వెళ్ళిపోయే పక్షంలో, రాజమండ్రి సంఘ సంస్కరణ కార్యక్రమాలకు నాయకత్వం వహించగల సమర్థుడు.[1] వారెదుర్కొన్న క్లిష్టసమస్య - బలాన్ని ఎలా చేకూర్చుకోవడం అనేది.

1893 మేలో వీరేశలింగం గారు మద్రాసు సంఘసంస్కరణ కార్యకలాపాల్లో తిరిగి చురుకుగా పాల్గొనడం మొదలుపెట్టారు. ఈనరాత్తన సంఘసంస్కరణ సంఘంలో రఘుపతివెంకటరత్నంనాయుడుగారు, ఎ. సుబ్బారావు గారు, కె. సుబ్బారావు గారు, సి. సుబ్రహ్మణ్యం అయ్యర్ - హిందూ పత్రికా సంపాదకుడు - కూడా సభ్యులు. వారందరు యువకులు. వీరు రఘునాథరావుగారి నాయకత్వం నుంచి విడిపోవాలనుకున్నారు. రఘునాథరావుగారొక వితంతు వివాహ భోజనానికి రాకపోవడంచేత వారాయనతో తెగతెంపులు చేసుకున్నారు.[2] ఇది కేవలం ఒక వంక మాత్రమే కాని, మతాల సిద్ధాంతాలతో భేదించడంవల్ల మాత్రం కాదు. రఘునాథరావుగారు కుంభకోణం వెళ్ళిపోయారు. యువనాయకత్వం కొత్త నియమావళితో సంస్థకు నూతనత్వం తెచ్చింది. కార్యవర్గాన్ని ప్రత్యేక విభాగాలతో క్రమబద్ధం చేశారు.[3]

మద్రాసు సంస్థానిర్మాణంలోని మార్పులు, నాయకత్వంలోని మార్పులు, వీరేశలింగం పంతులు గారికి సంశయాస్పదమయ్యాయి. 1890లో [illegible] రఘునాథరావు, రామకృష్ణయ్యగారి విరాళాన్ని వినియోగపరిచే హక్కును ఆత్మూరి లక్ష్మీనరసింహంగారికిచ్చి, రాజమండ్రి తగాదాల్లో ఆయన్ని బలపరిచారు.[4]

---

1. వి.ఎస్.సి.2 - 85 - 86

2. Madras Times - 2nd August, 1892 - Madras Times 16th September, 1892.

3. ద్వితీయ వార్షిక నివేదిక (మద్రాస్ హిందూ సంఘ సంస్కరణ సభ) Indian Social Reformer 29th December, 1874.

4. Madras Times 25th February, 1890.

ఇక వీరేశలింగంగారెంత మాత్రం రఘునాథరావుతో మదరాసు సంఘ సంస్కరణ సభ నాయకునిగా వ్యవహరించనవసరంలేదు. అంతేకాదు, ఆ యువనాయకులు వీరేశలింగంగారి సంఘసంస్కరణ కార్యకలాపాలకు అంతన్నెంతగానో గౌరవించసాగారు.[1] ఇతర జిల్లాల నుంచి వచ్చినవాళ్లనే వారికి కూడా పూర్తి సభ్యుల అయ్యేటట్టుగా వారు నిబంధనావళిని మార్చారు. ఇంతకు ముందు మదరాసు వారికే మాత్రమే సభ్యత్వమిచ్చి, జిల్లాల నుంచీ వచ్చేవారిని కేవలం సానుభూతి పరులుగానో పరిశీలకులుగానో రఘునాథరావు అంగీకరించేవాడు. అధికంగా మదరాసువారికి జిల్లాల వారికి తేడా చూపించేవాడు.[2] కాని ఈ నూతన సంఘం అన్ని కార్యక్రమాల్లోను పాల్గొనేవారిని సభ్యులుగాను, కొన్నింటినిమాత్రం వేరుపరిచి వాటిలో పాల్గొని వాటిని బలపరిచేవారిని సానుభూతి పరులుగాను విభజించింది.[3]

వీరేశలింగంగారు మదరాసు హిందూ వితంతు వివాహ సంఘకార్యక్రమాల్లో ముఖ్యంగా 1885 లో వితంతు వివాహం జరపలేకపోయినప్పటి నుంచి చురుకుగా పాల్గొనలేకపోయినా, దానితో సంబంధం మాత్రం నిలబెట్టుకొంటూ వచ్చారు. ఆయన మిత్రుడు మన్నవ బుచ్చయ్యగారు 1888లో రాజీనామా చేసేవరకు, కార్యదర్శిగా కూడా ఉంటూ వచ్చారు.[4]

బ్రాహ్మణుల మీద బ్రాహ్మణేతరులు చేసిన కుట్రకు నిరసనగా బుచ్చయ్యగారు రాజీనామా చేశారు. బ్రహ్మసమాజం నుంచి బ్రహ్మసమాజానికి బ్రాహ్మణ వ్యతిరేక సంస్థ అనేపేరుండేది. బుచ్చయ్యగారి దురదృష్టం మూలంగా పంతులుగారికి నష్టం కలగలేదు. ఆయన శిష్యుడైన రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు సమాజంలో ప్రముఖుడైన నాయకుడుగా ముందుకు వచ్చారు.

---

1. సుబ్బారావుగారి "రివైవ్డ్ మెమొరీస్ 186

2. Madras Mail 2 dd March, 1882.

3. Indian Social Reformer 29th December, 1894.

4. 'Sivudu - Smruthi 38

పంతులుగారి పాతమిత్రులు, కొత్తమిత్రులు బలవంతపెట్టడం వల్ల ఆయన మద్రాసులో ఇల్లు కొనుక్కోవాలని నిర్ణయించారు. 1894లో పరశువాకంలో ఒకగృహం కొన్నారు. అది బుచ్చియమ్మగారింటికి చేరువలోను. ప్రభుత్వకార్యాలయాలకు దూరంగాను ఉంది.[1] ఈ విధంగా పంతులుగారు తమశక్తుల పునాదులను మద్రాసులో గట్టి చేసుకున్నారు.

1894 నవంబరులో పంతులుగారి స్వగృహంలో ఇరవైయెనిమిదవ వితంతువివాహం ఎంతో ఉత్సవంతోనే జరిగింది.[2] వధువు తంజావూరు మధ్వ బ్రాహ్మణ కుటుంబానికి చెందింది. మద్రాస్ హిందూ సంఘసంస్కరణ సభ కార్యదర్శి ఎం. సుబ్బారావుగారి ద్వారా వచ్చింది. అందుతోపాటు, ఇండియన్ సోషల్ రిఫార్మర్ – ఎడిటర్గా వున్న కె. నటరాజన్గారు ఈమెను గురించి వివాహసమయం వరకు జాగ్రత్త తీసుకున్నారు. వరుని సంపాదించింది పంతులుగారే అనవచ్చు. ఇతను ఒకప్పుడు సేలం మద్రాస్ నగరాలలో నివసించిన మధ్యదేశస్థ బ్రాహ్మణుడు. కాని ఆసమయంలో మాత్రం సికింద్రాబాద్లో ఉండేవారు.[3] 1892 వివాహం తరవాత పాత సంఘంపోయి కొత్త సంఘం వచ్చింది. ఆ తరవాత జరిగిన [illegible] వితంతు వివాహమిదే. మద్రాసులో నూతనసంఘసభ్యులందరూ, నాయకులందరూ వివాహానికి హాజరయ్యారు. ఇంచుమించు ప్రతి ఒక్కరూ దంపతులకు చదివింపులు చదివించారు. కాని పంతులుగారు మట్టుకు ఏమీ ఇవ్వక, ప్రత్యేకత చూపించారు. ప్రమాదకరమైన ఆచారాన్ని ప్రోత్సహించగూడదనే ఉద్దేశ్యంతోనే పంతులుగారలాచేశారు. దంపతులు ఆ బహుమానాలమీద ఆశపెట్టుకుంటే, ముందు ముందవి లేకపోయినప్పుడు ఫలితాలు వేరుగా వుంటాయని ఆయన భావించారు. అతిథులకు విందుతో ఉత్సవం ముగిసింది. బ్రాహ్మణేతరులకు పొరుగింట్లో ప్రత్యేకంగా భోజనాలేర్పాటు చేశారు.[4]

---

1. V.S.C. II 84.
2. The Hindu as qeuted in the Indian Secial Refermer 1st December, 1894.
3. Deccan Budget 30th Nevember, 1894. Censulted in the Clippings cellectien ef the Andhra Pradesh State Archeres, Hyderabad.
4. The Hindu as qeuted in the 'Indian Secial Refermers' 1st December, 1894.

తరవాత ఒనెలకు - 31 డిసెంబర్ 1894లో మద్రాసులో ప్రప్రథమ భారత జాతీయ సాంఘిక సభ జరిగింది. పంతులుగారు కూడా దానికి హాజరయ్యారు. ఆ సభ ఆసిలో ఎం.జి.రనడే చేత స్థాపించబడింది. తరవాత ఆయనతో కలిసి రఘునాథరావుగారు కూడా దానికి నాయకత్వం వహించారు. వివాహవయస్సును నియంత్రించిన బిల్లు తరవాత ఆసభ బలం సన్నగిల్లింది. తరవాత తరచు భారత జాతీయ కాంగ్రెస్ సభలతో కలిసి ఆ సభాసమావేశాలు జరుగుతుండేవి. కాంగ్రెస్‌వారు భారతీయ సమాజంలోని లోపాలను గురించి ప్రచారం చేయడానికిచ్ఛగించలేదు. దాని ఫలితంగా దీనికి హాజరయ్యేవారి సంఖ్య క్రమక్రమంగా తగ్గిపోయింది.

మదరాస్ హైకోర్టు జడ్జి సుబ్రహ్మణ్య అయ్యర్ సభాధ్యక్షులుగా ఉన్నారు. పంతులుగారా సభలో వితంతు వివాహాన్ని గురించి తీర్మానం ప్రతిపాదించారు. సంఘసంస్కరణోద్యమ నాయకులు సుమారు పది వితంతు వివాహాలను జరిపినందుకు వారిని అభినందించిన తరవాత, హిందూ బాలవితంతువులు మేలుకోసం గట్టిగా ప్రయత్నాలు చేయవలసిందిగా ఉద్బోధించారు. ఈ విషయంలో తానెదుర్కొన్న కష్టాలనొకసారి గుర్తుచేస్తూ, నైతికబలమూ స్వార్థత్యాగమూ లోపించినప్పుడే భారతమహిళల అభివృద్ధికంతరాయం కలుగుతుందని ఉద్ఘాటించారు. పంతులుగారి తీర్మానాన్ని శ్రీనివాసరావు అనే బళ్లారి నుంచి వచ్చిన సంఘసంస్కర్త బలపరిచాడు. పాశ్చాత్య విద్యనభ్యసించిన పురుషులకు, హిందూ వితంతువులకు, పరస్పర సంబంధం కలపడం ఆచరణీయంగా వుంటుందేమోనని కూడా సూచించారు. తక్కిన తీర్మానాలన్నీ ఏకగ్రీవంగా ఆమోదించబడి, ఇది మాత్రం ఎక్కువవోట్లతో నెగ్గింది.[1] దీనిని బట్టి వితంతు పునర్వివాహాలు సంఘసంస్కర్తలలో కూడా బహుళాదరణం పొందలేదనే విషయం స్పష్టంగదా!

తరవాత 1890ల్లో కూడా పంతులుగారు సంఘసంస్కరణ కార్యకలాపాల్లో పాల్గొంటూనే వున్నారు. ప్రతి సంవత్సరం ఒకటి రెండు వితంతు వివాహాలు జరిపేవారు. 1892 నుంచి ఆయన ఒక కొత్త సంప్రదాయాన్ని నెలకొల్పారు.

---

1. మద్రాస్ టైమ్సు 31 డిసెంబరు 1894.

వరుడు వెళ్లి ఖర్చులో పెట్టుకోవాలన్నదే సంప్రదాయం.[1] మదరాసు సంఘ సంస్కరణసభలో పాల్గొన్నారు. 1895 లో పూనాలో జరిగే తొమ్మిదో జాతీయ సాంఘిక సభకు ప్రతినిధిగా ఎన్నుకోబడ్డారు గాని, దానికి వెళ్ళడం కాలేదు. 1895 చివరి నెలల్లో క్షయవ్యాధితో మరణశయ్య మీదున్న మృత్యుంజయరావును చూస్తూ రాజమండ్రిలో ఉండిపోయారు. 1896లో మృత్యుంజయరావు మృత్యువును జయించలేకపోయాడు. ఆయన మరణంతో రాజమండ్రిలో విశ్వాసపాత్రుడైన అనుచరుని పంతులుగారు కోల్పోయారు. సంఘసంస్కరణలో తనకు వారసుడు కాగలడనుకున్న రెండో వ్యక్తి కూడా దక్కలేదు. తరవాత కొత్తవారి కోసం పంతులుగారు ప్రయత్నించలేదు. రాజమండ్రిలో నూతన సంస్థలేవీ ఆయన ప్రారంభించలేదు.

ప్రప్రథమ రాష్ట్రసాంఘిక సభ మదరాసులో 29 నవంబర్ 1896లో జరిగింది. బొంబాయిలోని సుప్రసిద్ధ సంస్కర్త ఎన్. జి. చందావర్కర్ సూచనతో జరిగిన సభయిది.[2] పంతులుగారు పెద్దవైనన్ని తీర్మానాలను ప్రవేశపెట్టారు. చాలామంది మాట్లాడారుగాని, ఒక్కరు కూడా వితంతు వివాహం ఆచరణీయమైన సంస్కరణమనీ, దానికోసం కృషిచేయాలనీ చెప్పలేదు. సంఘసంస్కర్తల విస్తృతితో కూడినదని సభ ముఖ్యోద్దేశం. సంఘసంస్కరణ సాహిత్యాన్ని ప్రజాబాహుళ్యంలోకి వ్యాపింపచేయాలని సభ్యులంగీకరించారు. పెద్దవైన సభ్యులు భిన్నమతస్థులైనప్పటికి, పంతులుగారు రాష్ట్రసంఘంలో ఉండి, సమావేశాలను జరపడానికంగీకరించారు. సుబ్రహ్మణ్య అయ్యరూ, చందావర్కరూ భవిష్యత్తులో సభలను మదరాసులో కాక, ఇతర నగరాలలో ఒకచోట జరపాలని చెప్పినప్పటికి, వారు తరవాత సభకూడ మదరాసులో జరపాలని నిశ్చయించారు. కమిటీ సభ్యునిగా ఎన్నికయ్యింది; అధ్యక్షులలో పంతులుగారొకరే నన్న సన్నవిషయం గమనింపదగింది.

రెండో రాష్ట్ర సాంఘిక సభ సమావేశం 1897 ఏప్రిల్ 18న మద్రాసులో జరిగింది. ఆర్. రఘునాథరావు తిరిగి వచ్చి, అధ్యక్షత వహించాడు. మదరాస్

---

1. హిందూ జన సంస్కారిణి – జూలై 1893 ఎం.ఎస్.ఎస్.ఆర్. 15 ఆగస్టు
2. మద్రాసు టైమ్సు 30 నవంబరు 1896.

హిందూ సంఘసంస్కరణ సంఘ సభ్యులలోకంటు, పంతులుగారితో సహా, సభకు రాలేదు. న్యాయపతి సుబ్బారావుగారు మాత్రం హాజరయ్యారు. అంతమందానికి, మరెవరూగాని, వితంతు వివాహాలకు ప్రోత్సాహించాలన్న తీర్మానాన్ని ప్రతిపాదించలేదు. మదరాసు హిందూ సంస్కరణ సభాధ్యక్షులు, పంతులుగారి అనుయాయుడు ఎ. సుబ్బారావుగారు మాత్రం హిందూ వితంతువుల పురోగతి నిరోధకమైన కట్టుబాట్లను తొలగించవలసిన ఆవశ్యకతను గురించి మాట్లాడారు.

1890లో వితంతు వివాహాలను గురించి ప్రత్యేక ప్రయత్నాలు పంతులుగారు చేశారు. గోదావరి జిల్లాలో మాతృ సంఘాన్ని స్థాపించడానికి ప్రయత్నించింది కూడా ముఖ్యంగా దీనికోసమే. కాని మృత్యుంజయరావు మరణంవల్ల ఆయన ఆశలు నిరాశలైనాయి.

మదరాసులో వితంతు శరణాలయం స్థాపన.

1898 వసంత ఋతువులో పంతులుగారు మదరాసు హిందూ సంఘ సంస్కరణ సభ ఆధ్వర్యంలో వితంతు శరణాలయాన్ని ప్రారంభించాలని ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదన మొదలుపెట్టినప్పటి నుంచి అపార్థాలతోను, అస్పష్ట లక్ష్యాలతోను నిండి పోయింది. తన సహసంఘసంస్కర్తల మీద ఆయనకున్న అగౌరవంవల్ల మాత్రం అలా కాలేదు. ఈ ప్రతిపాదనకు తగినన్ని నిధులను సంఘం సమకూరుస్తుందని పంతులుగారు ఆశించినప్పటికీ, వారి అసమర్థతవల్ల, అలసత్వంవల్ల, ఆయన నిష్క్రియా చెందవలసివచ్చింది. అదీకాకుండా, వారు దానికి సహాయనిరాకరణ కూడా చేశారు.[1]

ఏలాగైనా శరణాలయాన్ని ప్రారంభించాలన్న ఆత్రంతో పంతులుగారు మిత్రుల దగ్గర నుంచి పూర్వవిద్యార్థుల దగ్గర నుంచి మరాలు ‌‌:నిధులు: వసూలు చేశారు. బళ్లారి నుంచి కె. వెంకటప్పారావు పత్తిమిల్లులో 3000 రూపాయల షేర్లను

1. పి.ఎస్.సి.2 106 – 107

క్లిష్టపరిస్థితుల నెదురుకొనవలసిన స్థితి.

జాతీయ సంఘసంస్కరణ సభానంతరం రెండు అసాధారణమైన వివాహాలు జరిగాయి. మొదటి వివాహంలో వరుడు పి.రామసుబ్బారావు మద్రాసులో కన్నడ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడు. తన సంవత్సరాల వయస్సు. వధువు ఎస్.లక్ష్మీకాంతమ్మ అనాథయైన బాలిక. పంతులుగారూ, ఆయన భార్యా పెంచిన పెద్ద యీమె. రాజమండ్రిలో చదివించిన తరువాత, మద్రాస్ ఎగ్మూర్ ట్రైయినింగ్ స్కూల్లో చేర్పించి చదివించారు. బ్రహ్మసమాజపద్ధతిలో దక్షిణ భారత బ్రహ్మసమాజ అధ్యక్షుని పౌరోహిత్యాన – ఆయనే వధువునిచ్చి వివాహం చేశారు.[1]

అదే రోజున తన స్వగృహంలో మరొక వితంతు వివాహం పంతులుగారి చేత జరపబడింది. ఈ వివాహానికి వధువు తండ్రే కన్యాదానం చేశాడు. ఇది అసాధారణ పరిస్థితి. ఇలా అంతకు ముందు జరగలేదు.[2] ఈ రెండు వివాహాలు అసాధారణమైనవని చెప్పవచ్చు. వధూవరులు నలుగురు – బ్రాహ్మణులలోనే నాలుగు శాఖలకు చెందినవారు.

వీరేశలింగంగారి కార్యకలాపాల వల్ల ప్రభావితులై ఆవేశభరితులై మద్రాస్ హిందూ సంఘ సంస్కరణ సంఘం వారు వివాహ బ్యూరోను ప్రారంభించాలని నిర్ణయించారు.[3] ఆ బ్యూరో సభ్యులు సానుభూతిపరుల నుంచి శాఖాంతర వివాహాలను ప్రోత్సహించే వారి పేర్ల జాబితా తయారు చేయడం ప్రారంభించారు. దీనిని ఇండియన్ సోషల్ రిఫార్మర్ పత్రికలో ప్రకటించారు. ఆ ప్రకటన వితంతు వివాహాలను గురించి ఏమీ చెప్పలేదు. కులాంతర వివాహాలను కూడా తలపెట్టలేదు.[4]

జాతీయ సంస్కరణ సభ జరిగిన నెల రోజులకు వీరేశలింగం పంతులుగారు వితంతు వివాహాల కోసం బహిరంగంగా ప్రకటించడమారంభించారు.[5] ఈ సమయంలో

---

1. Dairy of Veeresalingam Pantulugaru 26th January, 1899.

2. Indian Social Reformer 29th January, 1899.

3. Indian Social Reformer 12th March, 1899.

4. Ibid.

5. V.S.C.II 102 - 103

హిందూ వితంతు వివాహ సంఘం అనే సంఘాన్ని కూడా పంతులుగారు నెలకొల్పారు. దీనివల్ల మదరాసు హిందూ సంఘ సంస్కరణ సంఘంవారికి ఇబ్బంది కలగకుండా, దీనికి విరాళాలు వసూలు చేయవచ్చుననే తలపుతో దీనివల్ల మదరాసు హిందూ సంఘ సంస్కరణ సంఘంవారికి ఇబ్బంది కలగకుండా, దీనికి విరాళాలు వసూలు చేయవచ్చుననే తలపుతో దీన్ని ఏర్పాటు చేశారు. వితంతు వివాహాలకు తెలుగు బాలికలనే పంతులుగారు కుదిర్చేవారు. అందువల్ల – ఒకరు తప్ప – కేవలం తెలుగు వితంతువులకు మాత్రమే ఈ వసతి గృహం ఉపయోగపడుతుందనే భావం కలిగింది. శరణాలయాన్ని నలుగురు బ్రాహ్మణ వితంతువులతో తనగృహంలోనే పంతులుగారు ప్రారంభించారు. ఆయన చేసిన ప్రకటనకు పెద్దగా ఫలితం (రెస్పాన్సు) రాలేదు. దీన్ని గురించి ఇండియన్ సోషల్ రిఫార్మర్ – "ఆయన ప్రయత్నాలు వ్యర్థమయిపోయాయి. ఎవరి కోసం ఆయన ఇంతటి ప్రయత్నాలు చేస్తున్నారో, వారు దాన్ని ఉపయోగించుకోలేకపోతున్నారు." అని అతిసున్నితంగా వ్యాఖ్యానించింది.[1]

1899 వివాహంతో శరణాలయంలోని వితంతువుల సంఖ్య ఒకటికి పడిపోయింది. అది పెద్ద ప్రోత్సాహకరమైన చిహ్నం కాదు. తక్కినచోట్ల జరిగిన ప్రయత్నాలకు దీనికి భేదం స్పష్టంగా తెలిసింది. వంగదేశంలో బెనర్జీగారి వితంతు శరణాలయంలో ఒకేసారి 24 మంది ఉన్నారు. వారి వసతి కోసం ఒక పాఠశాల కూడా ఏర్పరచబడింది.[2] పూనాలో పండిత రమాబాయిస్ శారదాసదన్ (వితంతుశరణాలయం) 1890లో స్థాపించబడింది. డి.కె.కార్వే గారి వితంతు శరణాలయం 1896లో ప్రారంభించబడింది. తిలక్‌వంటి స్థానిక హిందూ నాయకులు వ్యతిరేకించినప్పటికీ, అది విజయవంతంగా నిర్వహించబడుతూండేది. వాటితో పోల్చినప్పుడు పంతులుగారి యత్నాలు అత్యల్పాలనిపిస్తాయి.

---

1. Indian Social Reformer 5th March, 1899.

2. Report of National Indian Association (Calcutta) Indian Social Reformer 22nd April, 1901. National Indian Association - Supported from the starting (1865) to the Closing day (1901)

## కోస్తా ఆంధ్ర మీద పునరాసక్తి

మద్రాసులోని ఒత్తిడి పనుల వల్ల పంతులుగారు 1897 నుంచి 1900 వరకు మద్రాసులోనే స్థిరనివాస మేర్పరచుకోవాలని నిర్ణయించుకున్నారు. కాని ముఖ్యంగా రాజమండ్రి సంఘసంస్కరణ కార్యకలాపాలతో ఆయన చురుగ్గా పాల్గొనడానికి కుదరలేదు.[1] అంతేకాని, పంతులుగారికి వితంతు వివాహాల పట్ల ఆసక్తి తగ్గలేదు. మద్రాసులోని వితంతు శరణాలయంలోని వితంతువులు తెలుగువారవడం చేత, వారి వివాహాలు రాజమండ్రిలో జరిపిస్తే దాని ప్రభావం రాజమండ్రి మీద పడుతుందని భావించారు.

ఈ వివాహాల్లో మొదటిది, క్లిష్టతరమైంది, న్యాపతి శేషగిరిరావు వివాహం. అతడు న్యాపతి సుబ్బారావు తమ్ముడు. సుబ్బారావుగారు పంతులుగారి పాత స్నేహితుడు. 1900 సంవత్సరం ఫిబ్రవరిలో ఈ వివాహం జరిగింది. రాజమండ్రిలోని కలతలకు ఈ వివాహం కారణమయింది. శేషగిరిరావు ఆసమయంలో అబ్కారీశాఖలో సాల్టు ఇన్స్పెక్టరు. కొద్ది కాలం క్రితం ఆయనకు భార్యావియోగం సంభవించింది. నూతన వధువు పంతులుగారి మద్రాస్ వితంతు శరణాలయంలో సభ్యురాలు. వసతిగృహం ప్రారంభించిన వెంటనే – 1898లోనే ఆమె శరణాలయానికి వచ్చింది.[2] వివాహం రాజమండ్రిలో జరగలేదు. శేషగిరిరావు పనిచేస్తూన్న విశాఖపట్టణంలో జరిగింది. ఈ వివాహంలోని మరొక అసాధారణమైన విషయం దాన్ని రహస్యంగా వుంచడం.

అన్నగారైన న్యాపతి సుబ్బారావుగారికీవిషయం చెప్పి, ఆయన ఆమోదాన్ని శేషగిరిరావునే తీసుకోమని పంతులుగారు చెప్పారు.[3] కాని శేషగిరిరావు తాను చెప్పలేనందుకు ఎప్పటికప్పుడే ఏవో సాకులు చెప్తూ వచ్చాడు. పంతులుగారు మాత్రం ముందుగా సుబ్బారావుగారికి తెలియజేయడానికేవిధమైన ప్రయత్నమూ చెయ్యలేదు. సుబ్బారావుగారు వీరేశలింగంపంతులు

---

1. V.S.C.II 119-121 Madras Times 28th January, 1902.
2. Indian Social Reformer 4th March, 1900.
3. V.S.C.II 110-115 'Chilakamarthi Sveya Charitra' 216

గారిని ఎదిరించినప్పటికి, సంఘసంస్కరణలో ఏనాడూ చురుగ్గా పాల్గొనలేదు. అందువల్ల ఎవరి దగ్గర నుంచి కాంతి సంఘర్షణావచ్చినా పంతులుగారు భావించారు, ఎలాగా వెళ్ళి ముందుగా నెలకొనేస్తే సరిపోతుందనుకున్నారు. సుబ్బారావు గారితో పంతులుగారికున్న మైత్రిని పురస్కరించుకుని, పంతులుగారు సుబ్బారావు గారితో చెప్పడం ధర్మమని, మర్యాద అని పంతులుగారి మిత్రులు కూడా భావించారు.[1] పంతులుగారు చెప్పలేదంటే - బహుశః, సుబ్బారావు గారి వివాహాన్ని తీవ్రంగా వ్యతిరేకించనున్నారని ఎరుగక భావించి ఉండవచ్చు. అందువల్లనే పంతులుగారు విశాఖపట్టణం వెళ్ళి ముందుగా వివాహం జరిపించారు. ఈ వివాహోపకరణాలు ఇంగా ఆహ్వాన రీతిలో వచ్చాయి. సుబ్బారావు గారి కోపానికి అంతులేదు. ఆవివాహానంతరానావిస్తంగా ఎందుకు ఉండునంటి వచ్చిందో పంతులుగారు వివరీకరించడానికి ప్రయత్నించినప్పుడు సుబ్బారావు గారు కసిరికొట్టారు, వ్యక్తిగతంగా పంతులుగారి మీద ద్వేషం వహించారు.[2]

ఇంతలో రాజమండ్రి పట్టణంలో వితంతు వివాహోద్యమం వెనకబడింది. 1897లో పంతులుగారు మద్రాసు వెళ్ళినప్పటి నుంచి 1902 వరకు ఒకే ఒక వితంతు వివాహం జరిగింది.[3] దానికి కారణం పంతులుగారు లేకపోవడమేనని సంఘసంస్కర్తలు మొదట్లో అనుకున్నారు. ఆయన లేకపోవడం తెలుగునాటికి నష్టమనీ, తెలుగు దేశాభివృద్ధి పాతికేళ్ళు వెనక్కి పోయిందని భావించారు.[4] సంస్కరణ కార్యకలాపాలు గోదావరి జిల్లాను విడిచి, కృష్ణా జిల్లాను కేంద్రంగా చేసుకున్నాంతరా ఉత్సాహం కొందరిలో ఉడుకెత్తించింది. రాజమండ్రి చర్చించని సంస్కరణ సమస్యలేనే లేదు. ఆపట్టణం పాల్గొనని సంస్కరణ కార్యక్రమమే లేదు. కాని, ఆనగరం ఇప్పుడు గాఢనిద్రలో మునిగినట్టయింది. పంతులుగారిని బలపరచేవారనేకులు రాజమండ్రిలో వున్నప్పటికి వారిలో కొద్దిమంది మాత్రమే బలమైన నాయకులు.

---

1. Indian Social Refermer , 8th March, 1904.
2. V.S.C.II - 115.
3. Indian Social Refermer 27th May, 1900.
4. Indian Social Refermer 13th May, 1900.

ఒకప్పుడు మద్రాసు హిందూ సంఘ సంస్కరణ సంఘానికి కార్యదర్శిగా వున్న శ్రీ వి.సుబ్బారావు ప్రస్తుతం రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో ప్రొఫెసర్‌గా వున్నారు. అయితే ఆయన రాజమండ్రిలో సంఘాన్నేర్పరచలేదు. సంఘ సంస్కరణను ప్రోత్సహించనూ లేదు. సంఘ సంస్కరణను గురించి వ్యాసాలు పరంపరగా రాసి, "ఇండియన్ సోషల్ రిఫార్మర్"కు పంపుతూ వున్నారు. వాటిల్లో తన కార్యకలాపాన్ని రాజమండ్రికి మద్రాసుతో పోల్చిరాసేవారు.[1] రాజమండ్రి సంస్కరణ వాదుల కార్యకలాపాలు సనాతన సంప్రదాయవాదులచేత తీవ్రంగా ఎంక పరిహాస్యానికి ఆయన భావించారు. బహిరంగంగా పంతులుగారితో కలిసి ఖండించడానికి భయపడిన రాజమండ్రి సంస్కరణ వాదులను ఆయన పేర్కొన్నారు. పాశ్చాత్య విద్యాప్రభావం వల్ల సంస్కరణ భావాలు వారిలో కొంచెం ప్రవేశించి వుండవచ్చునని ఆయన చెప్పారు.[2] మద్రాసు సంఘసంస్కరణ పరిస్థితిని గురించి పంతులుగారు భావించినట్లే, రాజమండ్రి పరిస్థితిని గురించి సుబ్బారావు గారీవిధంగా తెలియచేశారు.

1902 చివరలో పంతులుగారు గుంటూరులో వితంతువివాహం కోసం మరొకసారి ఆంధ్రానికి వచ్చారు. అది వైభవోపేతంగా జరిగిన వివాహం. గుంటూరు సంఘసంస్కర్త విశ్వనాథశాస్త్రిగారు పంతులుగారిని అధ్యక్షత వహించడానికి ఆహ్వానించినప్పటికీ, ఆ వివాహాన్ని ముఖ్యంగా నిర్వహించినవారు ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు.[3] ఆయన స్థానిక నాయకుడు. అప్పుడే రాజకీయాలలో ప్రవేశించి సంఘ సంస్కరణలో పాల్గొంటూ, పేరు తెచ్చుకుంటున్నారు. గతంలో వితంతు వివాహాలను తీవ్రంగా ప్రతిఘటించడంలో ప్రసిద్ధిగాంచిన గుంటూరు. అనేక సభల్లోను సమావేశాల్లోను వితంతు వివాహ సమస్యను అన్నివిధాలా తలెత్తకుండా గుంటూరు ప్రతినిధులు ప్రయత్నించారు. ఆనాడు

---

1. ఇండియన్ సోషల్ రీఫార్మర్ 15 డిసెంబరు 1901.
2. ఇండియన్ సోషల్ రీఫార్మర్ 29 జూన్, 1902.
3. వి.ఎస్.సి.2 127.

కృష్ణాజిల్లాలో సనాతన సంప్రదాయానికి గుంటూరు కేంద్రమైనప్పటికీ విద్యావంతమైన సనాతనత్వం కొంతవరకు తెచ్చుగాక్షే స్వభావం గలిగివుండేది.[1]

కృష్ణాజిల్లా సంఘసంస్కరణ సభ ఏర్పడినప్పటికి, గుంటూరు సంస్కరణవాదులు ఈ వితంతు వివాహాన్ని 1902 అక్టోబర్ 11వ తేదీని జరపడానికి ప్రారంభించారు. మరునాడు మధ్యాహ్నం గుంటూరు నాటక కళాసమితి పంతులుగారి అనువాదమైన 'శాకుంతలం' నాటకాన్ని ప్రదర్శించారు. మరునాడు పంతులుగారు ఆంధ్రభాషాసమాజ సమావేశానికి గౌరవ అతిథిగా వెళ్లినారు.[2] ఈ ఉత్సవాలన్నింటిలోను పంతులుగారికి గౌరవమర్యాదలెక్కువగా జరిగాయి. ఆయన పెద్దరికాన్ని అందరు అంగీకరించారు. వివాహానికి వెళ్లిన ఒక యువకుడు తనభావాల నీవిధంగా తెలియజేశాడు –

''ఆయన తెలుగులో రచించిన గ్రంథాలన్నీ చదివాను. 1902లో గుంటూరు పట్టణంలో (ఆ వివాహం మూలంగా) ఆయనను దర్శించాను. (ఆవివాహం జిల్లా అంతటిలోను సంచలనం కలిగించింది) అంతకు ముందు ఆయన మితవాదిత్వాన్ని సంస్కరణభావాలను ఆయన రచనల ద్వారా గ్రహించాను. దసరా సెలవలకు ఆయన దివ్యత్వాన్ని పూజించడానికి గుంటూరు వెళ్లాను. ఆకారంలో శారీరకంగా ఆయన ఏమంత ఆకర్షణీయమైన వ్యక్తికాదు. అప్పటికే వయసు మీరిపోయింది. కాని మానసికంగా మాత్రం ఆయన చాలా మెలకువతో ఉన్నట్టు కనబడుతుంది.

నాగుంటూరు యాత్ర నావ్యక్తిగత జీవితచరిత్రలో ఒక ప్రధానమైన (ఘట్టం) మలుపు అని నిశ్చయంగా చెప్పవచ్చు. తరవాత జీవితంలో ఆదర్శాలను ఏమాత్రం మచ్చరానీయకుండ అనుసరించాను. పంతులుగారి జీవితం, వారి బోధనలు, నాలోను నా సమకాలీనులనేకుల్లోను దివ్యతేజస్సుతో విప్లవాత్మక భావాలను ప్రసరింపజేసినందుకు వారికెంతో కృతజ్ఞులం!''[3]

---

1. ఇండియన్ సోషల్ రీఫార్మర్ 16 నవంబరు 1902.
2. పంతులుగారి డైరీ – 11, 12 డిశెంబరు 1902. ఆంధ్రభాషాసమాజం స్థానిక సాహిత్య సంఘం.
3. పున్నయ్యగారి 'త్రివేణి' 19 నెం. 9, 10. 483–484.

కృష్ణాజిల్లాలో సనాతన సంప్రదాయానికి గుంటూరు కేంద్రమైవుండేది. విద్యావంతమైన సనాతనత్వం కొంతవరకు రెప్పగాక్షే ప్రభావం గలిగివుండేది.[1]

ఈ స్థానిక వ్యతిరేకత ఉండినప్పటికీ, గుంటూరు సంస్కరణవాదులు ఈ వితంతు వివాహాన్ని 1902 అక్టోబర్ 11వ తేదీ జరపడానికి ప్రారంభించారు. ఆమరునాడు మధ్యాహ్నం గుంటూరు నాటక కళాసమితి పంతులుగారి అనువాదమైన ' శాకుంతలం ' నాటకాన్ని ప్రదర్శించారు. ఆమరునాడు పంతులుగారు ఆంధ్రభాషాసమాజ సమావేశానికి గౌరవ అతిథిగా హాజరైనారు.[2] ఈ ఉత్సవాలన్నింటిలోను పంతులుగారికి గౌరవమర్యాదలెక్కువగా జరిగాయి. ఆయన పెద్దరికాన్ని అందరు అంగీకరించారు. ఆ వివాహానికి వెళ్లిన ఒక యువకుడు తనభావాలు నిర్భయంగా తెలియచేశాడు –

''ఆయన తెలుగులో రచించిన గ్రంథాలన్నీ చదివాను. 1902లో గుంటూరు పట్టణంలో ‘ఆ వివాహం మూలంగా’ ఆయనను దర్శించాను. ‘ఆ వివాహం జిల్లా అంతటిలోను సంచలనం కలిగించింది.’ అంతకు ముందు ఆయన మితవాదిత్వాన్ని సంస్కరణభావాలను ఆయన రచనల ద్వారా గ్రహించాను. దసరా సెలవలకు ఆయన వివృతాన్ని పూరించడానికి గుంటూరు వెళ్లాను. ఆకాలంలో శారీరకంగా ఆయన ఏమంత ఆకర్షణీయమైన వ్యక్తికాదు. అప్పటికే వయస్సు మీరిపోయింది. కాని మానసికంగా మాత్రం ఆయన చాలా మెలకువతో ఉన్నట్టు కనబడుతుంది.

నాగుంటూరు యాత్ర నావ్యక్తిగత జీవితచరిత్రలో ఒక ప్రధానమైన ‘మలుపు’ అని నిశ్చయంగా చెప్పవచ్చు. తరవాత జీవితంలో ఆదర్శాలను ఏమాత్రం మధ్యరాసీయకుండ అనుసరించాను. పంతులుగారి జీవితం, వారి బోధనలు, నాలోను నా సమకాలీనులనేకుల్లోను దివ్యతేజస్సుతో విప్లవాత్మక భావాలను ప్రసరింపజేసినందుకు వారికెంతో కృతజ్ఞులం!'' [3]

---

1. ఇండియన్ సోషల్ రీఫార్మర్ 16 నవంబరు 1902.
2. పంతులుగారి డైరీ – 11, 12 డిసెంబరు 1902. ఆంధ్రభాషాసమాజం స్థానిక సాహిత్య సంఘం.
3. పున్నయ్యగారి ' త్రివేణి ' 19 సెం.9, 10. 483–484.

గుంటూరు సంస్కరణవాదులు డా. ముద్దువారి అనుభవాన్నే పొందారు. వివాహానికి హాజరైన వారందరికీ కులబహిష్కారం ప్రాప్తించింది. అయినప్పటికి ఈ ప్రథమ వితంతు పునర్వివాహం గుంటూరులో కొనసాగిన సంఘసంస్కరణ కార్యకలాపాలకు ప్రారంభం అయింది.[1]

గుంటూరులో సంఘ సంస్కరణ ఉత్తేజితం కావడం ప్రాంతంలోని బ్రహ్మసమాజం మూలాన. వెంకటరత్నంనాయుడుగారు బ్రహ్మసమాజానికి చెందిన సంస్కర్త. ఆయన నోబుల్ కళాశాలలో అయిదు సంవత్సరాలు - తుపాకీ గుళ్లు పేలడానికి ముందు - ఉపన్యాసకుడుగా ఉండి, విద్యార్థిలోకాన్ని ఉత్తేజపరచ గలిగిన ధీశాలి.[2]

పాశ్చాత్యప్రభావంతో పడిన భారతీయులు సనాతనత్వం మీద ఆయన జరిపిన దాడులు చూసి, ఆనందించారు. ఆయన గురువైన శివనాథశాస్త్రిగారి ఉపన్యాసాలకు ఒకప్పుడెలా పరవశులయ్యేవారో, ఇప్పుడాయన ఉపన్యాసాలకు వారదేవిధంగా మైమరచిపోయేవారు. వీరేశలింగంపంతులుగారి లాగానే పాల్‌గారు, కూడా సంస్కరణను జాతీయతతో ముడిపెట్టారు. ఆవిధంగా ఆయన ఉపన్యాసాలు వినేవారికి రెండు అభివృద్ధిదాయకాలైన ఉద్యమాలుగా స్ఫురించాయి.

పంతులుగారికి గుంటూరుతో సంబంధం వితంతువివాహాల ద్వారానూ, బ్రహ్మసమాజం ద్వారానూ, బిపిన్‌చంద్రపాల్, విద్యార్థులు, మద్రాస్ వెళ్లినప్పుడు పంతులుగారు వారిని కలుసుకున్నారు. తీరాంధ్రప్రాంతం నుంచి మద్రాస్ పట్టా పరీక్షకు వచ్చిన విద్యార్థులతో పంతులుగారు సంబంధం పెట్టుకున్నారు. సంఘసంస్కరణ కార్యకలాపాలల్లో వారు పాల్గొనేటట్టు చేయడానికి ఆయన ప్రయత్నించేవారు.[3] [4]

---

1. ఇండియన్ సోషల్ రీఫార్మర్ 16 నవంబరు 1902.
2. క్రిస్టియన్ ఇన్‌టెలిజెన్సార్, ఆగస్టు 1898 592-597.
3. పంతులుగారి డైరీ 29, 30 మార్చి 1901.
4. అయ్యదేవర కాళేశ్వరరావు - నా జీవితకథ - నవ్యాంధ్రము, విజయవాడ 1959.

ఈ సమయంలో పంతులుగారు మరొక వ్యక్తిగత విషాదాన్ని కొని తెచ్చుకున్నారు. అదికూడా వితంతు పునర్వివాహాలపై కేంద్రీకరించడం వల్ల వచ్చినదే. 1903 సంవత్సరారంభంలో ఆయన దత్తపుత్రుడు గోగులపాటి వీరేశలింగం ఆయన మీద తిరుగుబాటు చేసి, ఆయన చెప్పింది వినడం మానేశాడు. గోగులపాటి వీరేశలింగం, గోగులపాటి శ్రీరాములుగారి పుత్రుడు. శ్రీరాములు గారు పూర్వపక్షము వితంతు వివాహానికి నిర్ణయమైన వరుడు. పెళ్ళి తప్పిపోయినప్పుడు ఆయన క్రైస్తవ మతాన్ననుసరించాడు. పంతులుగారూ, ఆయన సతీమణి రాజ్యలక్ష్మమ్మ గారూ ఆయన బిడ్డను పెంచారు.[6]

తనకు కొంత కట్నమిస్తామని చెప్పినట్లుగా గోగులపాటి చెప్పాడు. పంతులుగారు మాత్రం మరొకలాగ అనుకున్నారు. ఆయన ఆస్తి, ఆయన గ్రంథాల మీద వచ్చేరాబడి వితంతు వివాహాశ్రమానికి వినియోగించాలని ఆయన అభిలాష. అందువల్ల వరులనుభవించే కష్టాలను తనదత్తపుత్రుడు కూడ ఎదుర్కోవాలని పంతులుగారు భావించారు.[7] ఈ ఆర్థిక వ్యవహారం మీద జరిగిన తీవ్ర వాగ్వివాదాలతో, దత్తపుత్రుడు ఆయన్ని వదిలి బెంగుళూరు వెళ్ళడం జరిగింది. అక్కడ వితంతువు కాని కన్యను వివాహమాడాడు. ఈ సంఘటన వల్ల పంతులుగారి హృదయం పగిలినట్లయింది. అటువంటి పరిస్థితుల్లో దాని ప్రభావం కొంత ఆయన వితంతు పునర్వివాహాలపై కనబడింది.[8]

ఆచార్య రంగాచార్యులు ఒకప్పుడు రాజమండ్రిలో పంతులుగారిని గట్టిగా బలపరిచారు. కాని, తరవాత ఆయనకు వ్యతిరేకంగా నిలబడ్డారు. ఆయన 1904లో అష్టవర్షప్రాయురాలైన తన కుమార్తెకు వివాహంచేసి మదరాస్ హిందూ సంఘసంస్కరణ సంఘాన్ని కెంతగానో హానిచేశారు. కృష్ణస్వామి అయ్యరు, అనిబిసెంట్ కూడదాన్ని తీవ్రంగా ఖండించారు.[9]

---

4. Indian Social Reformer 3rd July, 1903.
5. Indian Social Reformer 19th April, 1903.
6. V.S.C.II 267 - 268
7. V.S.C.II 269
8. వీరేశలింగంగారి జవాబు ఏప్రిల్ 1903 శివుడు స్మృతి 92-93.
9. Indian Social Reformer 19th June 1904

1904లో నూతన మదరాస్ హిందూ సంఘం కూడా వచ్చబడిపోయింది. కానీ, న్యాపతి సుబ్బారావు గారు మాత్రం రాజమండ్రిలో పంతులుగారితో ఘర్షణ పెట్టుకోలేదు. ఈ సమయంలో ఆయన వితంతు పునర్వివాహానికి పూర్తిగా వ్యతిరేకులై, ఆమోదించే అంతరించిపోతుందని కూడా ఒక ఉపన్యాసంలో వక్కాణించారు.[1] వితంతు వివాహాలు హిందువులకు చెందినవి కావనేంతవరకు కూడా ఆయన వెళ్లారు. హిందూ వివాహాల్లో స్వయంగా ఎన్నుకోవడం కూడా తప్పన్నారు. పంతులుగారితో ఆయన సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి.

## రాజమండ్రి వ్యవహారాల్లో పునఃప్రవేశం

1904 ఏప్రిల్ మొదటి రోజుల్లో పంతులుగారు పదవీ విరమణ చేశామని ప్రకటించిన తరవాత, మొదటిసారి రాజమండ్రి వచ్చారు. ఆయనరాకను పురస్కరించుకొని, నాలుగురోజులపాటు ఉత్సవాలు జరిగాయి. ఏప్రిల్ 10 తేదీని ఏ. సుబ్బారావు గారి తైలవర్ణ చిత్రపటాన్ని పురమందిరంలో పంతులుగారు ఆవిష్కరించారు. ఏప్రిల్ 11 తేదీని తనపూర్వవిద్యార్థిచేసే బహిరంగోపన్యాసానికి అధ్యక్షతవహించారు. అనర్గళ వాగ్ధాటిగల లక్ష్మీనరసింహంగారు పంతులుగారి గుణగణాలను మృదుమధురశైలిలో ముచ్చటగా వర్ణించారు.[2] ఏప్రిల్ 13 తేదీని ఎం.అమ్మిరాజు పంతులుగారిని ఆహ్వానించి గౌరవించారు. ఆయన స్థానిక న్యాయవాది, సుప్రసిద్ధ ధర్మదాత. పంతులుగారి పూర్వవిద్యార్థి. రాగోరిన వారినందరినీ రమ్మని అన్నదానానికాయన ఆహ్వానించారు.[3] ఈ విధంగా రాజమండ్రి పట్టణంపంతులుగారిని హృదయపూర్వకంగా ఆహ్వానించి గౌరవసన్మానాలు చేసింది.

సంఘసంస్కరణ కార్యకలాపాల అవకాశాలు కూడ ఆసక్తిదాయకంగా ఉన్నాయి. పంతులుగారు వచ్చిన తరవాత హిందూ సంఘ సంస్కరణ సభ పునర్వ్యవస్థీకరించబడింది. సుబ్బారావుగారి మరణానంతరం డి.పి.బాపయ్య అనే ఆయన దాని బాధ్యతలను స్వీకరించారు.[4] టి.శ్రీరాములు అనే మరొక ఉపాధ్యాయునితో కలిసి దాని

---

1. ఇండియన్ సోషల్ రీఫార్మర్ 27 మార్చి 1904.
2. పంతులుగారి డైరీ 11 ఏప్రిల్ 1904.
3. ఇండియన్ సోషల్ రీఫార్మర్ 1 మే 1904
4. ఇండియన్ సోషల్ రీఫార్మర్ 21 ఫిబ్రవరి 1904

నాయకుడై నిర్వహించేవారు. శ్రీరాములు గారు 'కర్లంయువిజయన్ (రాజమండ్రి)' అనే పత్రికకు సంపాదకుడు. ఈయన టంగుటూరి ప్రకాశం పంతులుగారి సోదరుడు. ప్రకాశం పంతులుగారానాడు మునిసిపల్ కౌన్సిల్ అధ్యక్షులు. హిందూ సంఘ సంస్కరణసభ సభ్యులందరు సంఘ కార్యక్రమాల్లో పాల్గొంటామని శపథం చేయడం నాయుడయ్యగారు కొత్తగా ప్రారంభించారు. వితంతు వివాహాలను పునరుద్ధరించారు.[1] శ్రీరాములు గారు సుబ్బారావులాగ ప్రతివారం స్త్రీల కోసం ఉపన్యాసాలు ఏర్పరిచారు.

మరొక అనుకూలమైన విషయం కాకినాడలోని పిఠాపురం రాజా కళాశాలకు కొత్త ప్రిన్సిపాల్‌ను నియమించడం. 1904లో కొంతకాలం ఆ పదవిలో ఎవరూ లేరు. కొత్త ప్రిన్సిపాల్‌ను ఎన్నుకోవాలని మేనేజింగ్ కమిటి నిర్ణయించింది. దానికభ్యర్థులు ఇద్దరు. వారిలో ఆర్. వెంకటరత్నంనాయుడుగారొకరు. అభివృద్ధికరమైన సంఘ సంస్కరణవాదుల వ్యక్తి పంతులుగారి గాఢాభిమాని గుఱ్ఱము వెంకటరత్నంగారు నాయుడుగారిని గట్టిగా బలపరచారు.

కాకినాడ, రాజమండ్రి, మదరాసు బ్రహ్మసమాజాలు కూడ నాయుడు గారిని బలపరిచాయి. లౌకిక జ్ఞానానికి, క్రైస్తవ మతాన్ని తట్టుకొని నిలబడ్డానికి విద్యార్థులకు నైతిక బోధ అవసరమని పంతులుగారిలాగే నాయుడుగారు కూడా భావించారు. పంతులుగారిలాగే నాయుడుగారు కూడా భావించారు. పంతులుగారు ఆయన్ని బలపరిచి, దానికోసం చాలాసార్లు కాకినాడ వెళ్లారు. గుఱ్ఱము వెంకటరత్నంగారి అల్లుడైన పట్టాభి సీతారామయ్యగారు కూడ నాయుడుగారిని బలపరచారు. ఎన్నిక ప్రజాస్వామ్య పద్ధతిలో జరిగింది. ప్రతిపక్షానికి కూడా బలమైన అభ్యర్థే ఉన్నాడు. ఆయన వి.ఎస్. శ్రీనివాసశాస్త్రిగారు.

శ్రీనివాసశాస్త్రిగారు మదరాస్ ట్రిప్లికేన్ ఉన్నత పాఠశాలలోని విద్యావేత్త. జన్మతః శాకాహారి (బ్రాహ్మణుడు) సాంఘిక పరివర్తనపట్ల సానుభూతి కలవాడే కాని, థియసాఫికల్ సొసైటీ ప్రకారం ప్రాచీన భారత ఆచారాలననుసరించి పోవాలనే

---

1. ఇండియన్ సోషల్ రీఫార్మర్ 21 ఫిబ్రవరి 1904.

భావాలు కలవాడు. మిగిలిన విషయాల్లో సహకరించాలని ఉభయులూ చెప్పేశారు. కాని, ఇద్దర్నీ బలపరిచిన భాష్యం అయ్యంగారనే సుప్రసిద్ధ హైకోర్టు న్యాయవాది మాత్రం ఉన్నారు. న్యాపతి సుబ్బారావుగారితో కలిసి ఆయన కూడా శ్రీనివాస శాస్త్రిగారిని బలపరిచారు. ఎన్నికల్లో నాయుడుగారు ఒకవోటుతో నెగ్గారు. 1905 ఫిబ్రవరిలో ఈ ఎన్నిక జరిగింది. నాయుడుగారు ప్రెసిడెంట్‌గా విజయవంతంగా పనిచేశారు.

26 మే 1904న మద్రాసు రాష్ట్ర సాంఘిక సభకు పంతులుగారు హాజరయ్యారు. ఇది రాణీపేటలో జరిగింది. ఇక్కడ కూడా నాయుడుగారు దిగ్విజయంగా ఎన్నికయ్యారు. ఈ సభలో వితంతు పునర్వివాహ తీర్మానం ఏమాత్రం వ్యతిరేకత లేక ఆమోదించబడింది. పంతులుగారు తిరుచ్చి ప్రతినిధులతో కలిసి పని చేయడం మొదలుపెట్టారు.

కాకినాడ సంఘ సంస్కరణ కార్యకలాపాల ఉత్సవాలకు పంతులుగారు వెళ్లారు. సి.శేషగిరిరావు పంతులుగారనే సుప్రసిద్ధ న్యాయవాది, జిల్లాబోర్డులోని ప్రముఖ వ్యక్తి, బి.సుబ్బారావు అనే మరొక న్యాయవాది పంతులుగారిని ఆహ్వానించారు. దానికి కారణం – పంతులుగారి పూర్వవిద్యార్థి, మిత్రుడూ అయిన డి.వి.ప్రకాశరావు ఒక ప్రత్యేకమైన పని చేయడం. కాకినాడలో ఇప్పటి వరకు వెలిలో ఉంచబడిన వితంతు పునర్వివాహం చేసిన వారినీ, సంఘ సంస్కర్తలను, పంతులుగారినీ విందుకాహ్వానించారు. ఇది సాహసోపేతమైన కార్యమే ఆనాటి. మరొకటి, విందుకు హాజరైనవారి పేర్లను స్థానిక 'రవి' పత్రికలోను, మచిలీపట్టణం 'కృష్ణాపత్రిక'లోను ప్రకాశరావుగారు ప్రకటించారు. దాని ఫలితం – సంఘ సంస్కరణాన్ని ఇప్పటివరకు రహస్యంగా అభిమానించినవారూ బహిర్గతమయ్యారు. ఈ బయట పడ్డం సంఘసంస్కరణ వ్యతిరేకవాదుల్లో అలజడి కలిగించింది.

## సాంఘిక సంస్థలు

రాజమండ్రిలో స్థిరపడ్డం కోసం రెండవసారి వచ్చిన పంతులుగారు, తిరిగి వచ్చినప్పుడు ప్రత్యేకించి ఉత్సవాలు జరిగే అవసరం లేకపోయింది. కానీ ఆయన రాకవల్ల కొన్ని నూతన సంస్థలు మాత్రం వెలిశాయి. ప్రత్యేకంగా పంతులుగారి సమక్షంలో వృద్ధ వితంతువులకు తగిన వసతి ఏర్పరచవలసివచ్చింది. వితంతువులు కాక విద్యాలయాన్ని ప్రారంభించాలని 1904 సెప్టెంబరులో పంతులుగారనుకున్నారు. వారితో పని చేయడానికి ఉపాధ్యాయినులు కావాలని ఆయన ప్రకటించారు. తత్ఫలితంగా – 10 నవంబరు 1904లో విక్టోరియా బాలికా పాఠశాల ఆయన స్వగృహంలో ప్రారంభించబడింది. ఇతర ప్రభుత్వ బాలికా పాఠశాలలు రెండింటిలా కాకుండా, ఈ పాఠశాల యుక్తవయస్సు వచ్చిన బాలికలకు, వితంతువులకు, ఏర్పరచబడింది. నలుగురు విద్యార్థినులతో మొదలు పెట్టబడిన ఈ విద్యాలయం 1906నాటికి ముప్పైముగ్గురుతో నిండి వెలిగింది. అప్పటికింకా మరెక్కడా విద్యావ్యాప్తి ఆదరణ పొందలేదు. నలుగురు వివాహిత యువతులు, ముగ్గురు వితంతువులు మాత్రం ఆవిద్యాలయంలో ప్రవేశించారు.[1] 1881 లో పంతులుగారు స్థాపించిన బాలికా పాఠశాలకంటే ఈ విద్యాలయం మెరుగనిపించింది.

### రాజమండ్రి సంఘసంస్కరణలో పంతులుగారి నూతనస్థానం :

మొట్టమొదట తానక్కడున్నప్పుడుండే పరిస్థితులకి ఇప్పుడున్న పరిస్థితులకీ ఎక్కువ పోలికలున్నప్పటికీ, చాలాకాలంగా పంతులుగారి స్థానానికి స్థానికంగా నూతనత్వం వచ్చిందనవచ్చు. బహిరంగ కార్యక్రమాల్లో అభిప్రాయాల్లో ఆయన పాత్ర ప్రముఖమైంది.

ఆయన గౌరవార్థం 16 ఏప్రిల్ 1905లో పురప్రముఖులు ఆయన జన్మదినోత్సవం తలపెట్టారు. ఆసందర్భంలో రఘుపతివెంకటరత్నంనాయుడు గారిని

---

1. విక్టోరియా పాఠశాల నివేదిక – రాజమండ్రి.

అధ్యక్షత వహించవలసిందని ఆయన హిందూ సంఘం కార్యదర్శి ఉపన్యసించాడు. ప్రార్థనా సమాజంలో స్త్రీలు కూడా ఒక శాఖ సంవత్సరంలో ఏర్పరిచారు. స్త్రీల విషయంలో పంతులుగారు చేసిన సేవను గురించి నాయుడుగారు మాట్లాడారు. ఆ తరువాత ఆయన ఉపన్యాసము తరువాత, ముందుముందుగా వ్యాఖ్యాతలైనవారు నాయుడు అయిన కె.వి.రెడ్డి నాయుడుగారు కూడా మాట్లాడారు. పంతులుగారి మేధా సంపదను గురించి సాహిత్య సేవను గురించి ఎన్నో విధాల ప్రశంసించారు. ఆ ప్రసంగంలో – "ఇటీవలి – ప్రాచీన – మధ్యంతరయుగకవుల్లో సాధనలో ముందు తప్ప పంతులుగారిని మించిన, మించగలవారు లేరు, ఆధునికుల్లో లేనేలేరు. తెలుగులో నవలారచనను ప్రారంభించింది పంతులుగారే. గద్యసాహిత్య విషయంలో, ఆయన ప్రహసనాల్లో వున్న సులభశైలి, నిర్దుష్టమైన భాష, సునిశితమైన హాస్యం మరెక్కడా కనబడదు. విద్యాలయాల్లో మతబోధ కూడా ఉండాలనే ప్రతిపాదనలు బాధ్యతగల వారి వద్ద నుంచి, ప్రెసిడెన్సీ కాలేజి వంటి ఉన్నత విద్యాసంస్థల నుంచి వినవచ్చింది. కాని పంతులుగారి విద్యార్థి కావడం వల్ల ఆ లోపం నాకు కనిపించలేదు. అవకాశం లభించినప్పుడంతా విద్యార్థుల సునిశితమైన మనస్సుల మీద నైతిక సూత్రాలను పంతులుగారు గాఢంగా ముద్రించడానికి పూనుకున్నారు. ఇటువంటి ఆదర్శ ఉపాధ్యాయులు, నిర్మలశీల సంపన్నులు లోపించడం వల్లనే మతవిద్యకావాలనే ఆందోళన తలెత్తడం సంభవించింది."[1] శ్రీ వెంకటరత్నం నాయుడుగారు తమ ఉపన్యాసంలో వితంతు వివాహావశ్యకాన్ని గురించి కూడా వివరించారు.

"వితంతువుల పరిస్థితుల్ని మెరుగుపరిస్తేనేగాని, వారికి పునర్వివాహాలు అమలు పరిస్తేనేగాని – అభ్యుదయం ఫలించదు. అలా జరక్కపోతే, వితంతువుల జీవితాలు దురదృష్టమనే అగ్నికి ఇంధనాలైపోతాయి. ఆడదాన్ని 'సతి' ని చేసిన దహనం అవుతుంది. ఇటువంటి జీవితాంత దహన జ్వాలలనే రాకాసి కోరల నుంచి వారిని కాపాడాలి. ఆమహోత్తర కృషినే వీరేశలింగంగారు చేయడానికి ప్రారంభించారు. దిగ్విజయాన్ని సాధించారు".[2]

1. కె.వి.సుబ్బారావుగారి 'రెడ్డినాయుడు జీవితము – కాలము' రాజమండ్రి 1957.
2. ఇండియన్ సోషల్ రీఫార్మర్ 30 ఏప్రిల్ 1905.

ఈ ఉపన్యాసం పంతులుగారికి ఎంతగా గౌరవమిచ్చింది. కాని, ఆయన సాధించిన విజయాలను నిర్దుష్టంగా వివరించలేదు, ఆయన ఆశయాలను పేర్కొనలేదు. పంతులుగారు సంస్కరణ కార్యకలాపాలకు చిహ్నంగా నిలిచారు. అటువంటి పంతులుగారిని గురించి వెంకటరత్నంనాయుడుగారు తన ఉపన్యాసాల ద్వారా అందరికి అతిస్పష్టంగా అర్థమయ్యేటట్టు చేశారు. ''భారతీయులకు అత్యంత ప్రధానమైన బాధ్యత జాతి మహాపురుషుల పట్ల తమకున్న విధులను నిర్వహించడమే. ఈ నైతిక ఆధ్యాత్మిక బాధ్యతల నిర్వహణను పంతులుగారిని దివ్యపురుషుల కోవలో చేర్చింది. ఆ మహానుభావుడు ఉన్నత శిఖరాగ్రమందున్న దివ్యజ్యోతి'' [1]

సన్మాన సభల ముగింపు రోజున సభలో ఒకరు లేచి, ''పంతులుగారి తరవాత సంస్కరణ అంతరించిపోతుందా?'' అని నాయుడుగారిని ప్రశ్నించారు. అప్పుడాయన ఇలా జవాబు చెప్పారు – ''అలాంటిదెన్నటికీ జరగదు. ఆ మహానుభావుడు సంస్కరణ బీజాలను దేశమంతటా వెదజల్లాడు, అవి అనేకుల హృదయక్షేత్రాల్లో మొలకెత్తి వేళ్లు లోతుగా నాటుకుంటున్నాయి. మహాత్ములకున్న దివ్యశక్తి పంతులుగారి కుంది. ఆయన కృషి ఎప్పటికి నిరర్థకం కాదు. ఆయన ప్రయత్నాలు సఫలీకృతమై తీరతాయి. దివ్యపురుషుల జ్ఞాన జ్యోతి, నైతిక శక్తి శాశ్వతమైనవి. ఆ తేజః కిరణాలు సర్వత్రా సర్వదా ప్రసరిస్తూనే ఉంటాయి.''

నాయుడుగారి ఆ జవాబు ఒకరకంగా పంతులుగారి నతిగా పొగిడినట్లున్న అప్పటికి, ఆయన విజయాలను గురించి మాత్రం గట్టిగా ఉద్ఘాటించడం కూడా జరిగింది. ఆయన పంతులుగారి కృషిని చక్కగా వివరించారు. అన్నిటితోపాటు, వితంతు పునర్వివాహాలకు పంతులుగారు చిహ్నంగా నిలబడిన విధానాన్ని సుస్పష్టంగా విపులీకరించారు. ప్రజాభిమానాన్ని సంపాదించిన నాయుడుగారి వంటి ప్రముఖులు పంతులుగారి కార్యకలాపాలను, తమ సహజగంభీర ధోరణిలో విశదీకరించడం ప్రధానమైన విషయం. పంతులుగారు కూడ అనేక సభల్లో పాల్గొంటూ, దేశకాలపరిస్థితుల ననుసరించి అభ్యుదయకరమైన మార్పులవసరమని భావించి, ఆమేరకు తాముకూడా కృషిచేస్తూ వచ్చారు.

---

1. Indian Social Reformer 30th April, 1905.

## వితంతు శరణాలయం – హితకారిణీ సమాజం

పంతులుగారు మద్రాసు నుంచి తిరిగి వచ్చినప్పటి నుంచి దానవాయి పేటలో అనేక స్థలాలను కొంటూ వచ్చారు. అప్పటికా ప్రాంతం రాజమండ్రి పట్టణానికి వెలుపలవున్న కుగ్రామం. అప్పుడప్పుడే పట్టణం కలిసిపోతోంది. అందున కొన్న స్థలాల్లో ఒక పురాతన గృహం కూడా వుంది. 1908 సెప్టెంబరులో పంతులుగారు దంపతులు పట్టణంలోని తమ సొంతయింటిని వదిలి, ఈయింట్లో ప్రవేశించారు.[1] అందువల్ల ఒత్తిడి కొంత తగ్గుతుందని, దానవాయిపేటలోని యిల్లు వితంతువులకు సరిపోయేటంత విశాలంగా వుంటుందని భావించారు. కాని, తీరా యిల్లు మారిన తరవాత ఆయన అభిప్రాయం మారింది. వితంతు శరణాలయాన్ని కూడా అక్కడికే మారిస్తే బాగుంటుందని అనుకున్నారు.

ఆగృహమూ, వాతావరణమూ పంతులుగారి కెంతగానో నచ్చాయి. ఆయన కొన్న స్థలం కొన్ని ఎకరాలుంది. దానికది ఒక పెద్దదివిగా ఉన్నప్పటికి, పంతులుగారు దానినొక ఆరామంగా భావించారు.[2] దానిప్రక్కనున్న స్థలాన్ని కూడా కొనదలచుకుని, ఎం. అచ్యుతరామయ్యగారిని కలుసుకున్నారు. అచ్యుతరామయ్య న్యాయవాది, ధర్మాత్ముడు. ఆయన తన స్థలాన్ని పంతులుగారికి అమ్మడమే కాకుండా, దానిలో నాలుగు కట్టడాల నిర్మాణాని కూడా ప్రయత్నం చేశారు. వాటి విలువ ఆరువేల రూపాయలని పంతులుగారన్నారు.[3] అచ్యుతరామయ్య తనపూర్వ విద్యార్థికావడమే ఆ ఔదార్యానికి కారణమని పంతులు గారు భావించారు. కాని, ఆయన స్థానిక మిషనరీ బాలికా పాఠశాలకు కూడా దాన మిచ్చిన ఉదారుడు.[4] ఆయన యిచ్చిన భూరి విరాళాలు పంతులుగారి వలె ప్రచారాభిలాషతో చేసినవి కాక, సంప్రదాయానుసారం వచ్చినవి.[5]

---

1. వి.ఎస్.సి. 2. పు– 286
2. వి.ఎస్.సి. 2. పు– 286–287.
3. వి.ఎస్.సి. 2. పుటలు 297–300. పంతులుగారి 'వీలునామా' వి.ఎస్.సి. 2 అపెండిక్స్ బి – 13.
4. వి.ఎస్.సి. 2 –300.
5. చిలకమర్తి లక్ష్మీనరసింహం – స్వీయచరిత్ర 254.

1907 ఫిబ్రవరిలో పంతులుగారు తనతోటలో చేసిన విందుకు విశిష్ట కులాలవారినీ, వివిధ మతాలవారినీ, అనేకుల నాహ్వానించారు.[1] సందర్భం ఏమిటంటే – వితంతు శరణాలయం ప్రధాన భాగ నిర్మాణం పూర్తవడమే. ఈ సంస్థను నిర్వహించడంలో వీరేశలింగం పంతులుగారికి సహాయపడ్డానికి ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులిద్దరు గుంటూరు నుంచి వచ్చారు.[2] మద్రాసులో పంతులుగారు స్థాపించిన వితంతు శరణాలయాన్ని చూసి, ఉన్నవ లక్ష్మీనారాయణగారు గుంటూరులో ఒక వితంతు శరణాలయాన్ని ప్రారంభించినప్పుడు పంతులుగారు సహాయపడ్డారు. ఉన్నవ వారిప్పుడు పంతులుగారి సంస్థల నిర్వహణలోను, సంఘసంస్కరణ కార్యక్రమాలలోను సహాకరించడానికి వచ్చారు.

వితంతు శరణాలయం నిర్మాణం పూర్తికావడానికి ముందుగానే, తన ఆస్తిని, సంస్థలను నిర్వహించడం కోసం 'హితకారిణీ సమాజము' అనే సంఘాన్ని పంతులుగారు స్థాపించారు. 1908 మే 2వ తేదీని తాను తయారుచేసిన ట్రస్టుడీడు ప్రకారం ఆస్తి వివరాలు – ఆయన పూర్వీకుల నుంచి లభించిన రాజమండ్రిలోని పురాతన గృహం. మరి మూడు రాజమండ్రిలోని ఇళ్లు – పురమందిరం, దానితో నున్న ప్రార్థనా సమాజం – అమృతరామయ్యగారి తోటలో కట్టించిన నాలుగు గృహాలు.[3]

ఆ సమాజంలో 36 మంది సాధారణ సభ్యులను, కార్యనిర్వహణ సంఘంలో 11 మందిని పంతులుగారు ఏర్పరిచారు. సంఘ నియమావళిని రెండు లక్ష్యాలతో ఆయన తయారు చేశారు. తాను జీవించి ఉన్నంత వరకు నిర్వహణ తన అదుపాజ్ఞల్లో ఉండేటట్టు, తదనంతరం సంఘమే నాయకత్వం వహించి కార్యకలాపాలను నిర్వహించేట్టట్టు దాన్ని ఏర్పాటు చేశారు. రాజమండ్రి ప్రార్థన సమాజం నుంచి, తీరాంధ్ర సంఘ సంస్కరణ సంఘం నుంచి, ఆ సభ్యులను తీసుకున్నారు. పూనాలోని గోఖలే గారి సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ ననుసరించి పంతులుగారీ సమాజాన్నేర్పరచలేదు. ఆ సొసైటీలో – జీవితాలను సంఘసేవ కంకితం చేసినవారే

---

1. చిలకమర్తి లక్ష్మీనరసింహం – స్వీయచరిత్ర 254
2. వీరేశలింగం పంతులుగారి డైరీ 29 అక్టోబరు 1906.
3. వి.ఎస్.సి.2 అపెండిక్స్–బి 15–16.

సభ్యులుగా ఉండేవారు. పంతులుగారి సమాజానికి ఆర్థిక సమస్యలుత్పన్నం కాకుండా వుండడానికి, వారసత్వపు తగాదాలు రాకుండా వుండడానికి, ముఖ్యంగా 1881 లో రాజమండ్రి, వితంతు పునర్వివాహ సంఘం విఘటించ బడినట్లు కాకుండా వుండడానికి ఏర్పరచారు. సమాజ అధ్యక్షులు వీరేశలింగం పంతులుగారే. ఉపాధ్యక్షులు వెంకటరత్నం నాయుడుగారు. కార్యనిర్వాహక వర్గంలో పరీక్షిత్ శాస్త్రి మొ॥ సభ్యులు పంతులుగారి పట్ల విశ్వాసంగలిగిన సంఘసంస్కరణాభిమానులు, కార్యకర్తలు.[1] ఈ కమిటీని 1897 లో ఏర్పడిన పురమందిరం కమిటీతో పోల్చిచూస్తే వ్యక్తిప్రాముఖ్యంగా ఉంటుంది. అందులో ఉన్నవారి పేర్లను ఇందులో చేర్చలేదు. వారి నివాసస్థానాలు కేవలం దీనికి కారణం అనడానికి లేదు; రాజమండ్రిలో లేనివారిని కూడా పంతులుగారిందులో చేర్చారు గనక ఈ కమిటీకేవలం వ్యక్తిగత సంబంధాల ననుసరించి మాత్రమే ఏర్పాటయింది. పంతులుగారి కొకప్పుడు అభిమానులైన న్యాపతి సుబ్బారావు పోలవరం జమీందారు మొదలైనవారిని, వారి అనుయాయులను పంతులుగారి కోపస్వభావం, ఏకపక్షాశ్రిత కార్యకలాపాలు, దూరంచేశాయి. పంతులుగారు బ్రహ్మసమాజ మతాన్ని స్వీకరించడం కూడా దానికి కొంత కారణమయింది.[2] అనేక కారణాలవల్ల పురమందిర కార్యనిర్వాహక కమిటీ సభ్యులందరు పంతులుగారి నుంచి విడిపోయారు. మరొక కారణం – బాపయ్యగారి ననుసరించిన యువక సభ్యులు ముగ్గురు బ్రహ్మమతాన్ని స్వీకరించడానికి రాకపోవడం. ఈ ముగ్గురు హితకారిణి సమాజానికి చెందినవారు. అయితే బాపయ్యగారు మాత్రమే కార్యనిర్వాహక కమిటీలోకి తీసుకోబడ్డారు.[3] దీనివల్ల స్పష్టమయిందేమిటంటే ఆశయాలను బట్టి అభిరుచులను బట్టి కాక, సభ్యత్వం పంతులుగారితో వారికున్న మైత్రీబంధం మీద, వారిమీద ఆయనకున్న విశ్వాసం మీద ఆధారపడి వుందని.

తోటలో భవనాలు పూర్తయిన తోడనే, విశ్వసనీయులైన కార్యకర్తలను వాటిలో వుంచే అవకాశం పంతులుగారికి కలిగింది. బాపయ్యగారి ననుసరించి బ్రహ్మమతాన్ని స్వీకరించిన ముగ్గురు యువకులకు పట్టణంలో వసతి గృహాలు

---

1. రాజమండ్రి హితకారిణీ సమాజ వినతి పత్రాన్ని చూడుము.
వి.ఎస్.సి.2 అపెండిక్సు 1-2.
2. ఇండియన్ సోషల్ 'రిఫార్మర్ 22 జూలై 1906
3. వి.ఎస్.సి.2 'అపెండిక్స్ నెం-2.

దారకము కష్టమైపోయింది. అయినప్పటికీ పంతులుగారు హాలిని తాళ్లోకి వచ్చి వుండమని వ్రాసినారు. వారిలో ఒక్కరు రాముండి, ట్రయినింగ్ కాలేజీలో చదివ్వారు. అమాంశము కేవలం పోతికా పాఠశాలలో పనిచేయు టకొరకు సంసిద్ధిలో విద్యార్థులు లభ్యాలు కాకపోవడంలో పంతులుగారు బాధపడ్డారేమో! [1]

పంతులుగారు అయిదు సంవత్సరాలకు పూర్వం మద్రాసు రాష్ట్ర సాంఘిక సభలో ఉపన్యసిస్తూ – ''వ్యక్తిదేశకత లేకుండా సమష్టికార్యమునా సిద్ధించదు, ప్రతి సత్కార్యము బాలాసార్లు తలకిందులైన నయానూనే, ఎంతో ప్రయత్నంలో, సఫలీకృతమవుతుంది.'' అన్నారు.[2]

సంఘ సంస్కరణకు అంతిమ విజయం లభింపగలదనే విశ్వాసం ఆయనలో కలగడానికి బహుశా ఈ భావమే ఆధారమై వుండవచ్చునేమో! అందువల్ల హితకారిణీ సమాజం వంటి ధర్మ సంస్థలను, సంఘసంస్కరణ కార్యకలాపాలను నిరంతరం కొనసాగించడానికి అంకితమైన యువకుల బృహత్సమాజ ఉపసంఘాలను, భవిష్యత్కార్యక్రమాలు ఆశాజనకాలుగా విశ్వసించదగినవిగా గోచరించాయి. క్రమంగా స్థానిక సనాతన సంప్రదాయవాదుల ప్రభావం, సంస్కరణకు వ్యతిరేకమయిన ప్రభావం, తగ్గిపోవడం పంతులుగారు గమనించారు.

1908 లో పంతులుగారు వ్యక్తిగతంగా కొన్ని నిరాశలకు నిస్పృహలకు లోనయ్యారు. జాతీయ కార్యక్రమాలప్పటికి క్రమంగా హెచ్చాయి. దానితో, సంఘసంస్కరణ కార్యకలాపాలకు కొంత దెబ్బతగిలింది. ఆయన నిరాశకు మొదటి కారణం దేశిరాజు పెదబాపయ్య గారి మరణం. 1908 మార్చిలో ఈ సంఘటన పంతులుగారికి పెద్ద ఆఘాతమయింది. తనతరవాత తన సంఘ సంస్కరణ కార్యకలాపాలకు-ఆయన వారసుడవుతాడన్న ఆశ నిరాశయింది. 1907 చివరలోనే బాపయ్య గారికి వ్యాధి ప్రవేశించింది. చికిత్సకోసం మదరాస్ వెళ్లారు. కాని లాభం లేకపోయింది. పంతులుగారికి వారసుడుగా నిలబడే వారింకెవరూ లేకపోయారు.

---

1. వీ.ఎస్.సి.2 306–307 పుటలు
2. వీ.ఎస్.సి.2 306 – 307 "

దారకపం కష్టమైపోయింది. అందువల్ల పంతులుగారు వ్రాసిన తాలూకి వచ్చి వుండమని ఆహ్వానించారు. వారిలో ఇద్దరు రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజీలో విద్యార్థులు. ఒకనాటి వారు తమ నాలికా పొరపాటులో [illegible] ఉపకారాలు చేయడానికి సమ్మతించిన విద్యార్థులకంటే పొరపాట్లు చేసినవాళ్లు కావచ్చని పంతులుగారు భావించారేమో! [1]

పంతులుగారు ఎనిమిది సంవత్సరాలకు పూర్వం మద్రాసు రాష్ట్ర సాంఘిక సభలో ఉపన్యసిస్తూ – ''వ్యతిరేకత లేకుండా ఏమహాకార్యమును విజయము పొందదు; ప్రతి సత్కార్యము చాలాసార్లు తలక్రిందులైన తరువాతనే, ఎంతో ప్రయత్నంతో, సఫలీకృతమవుతుంది.'' అన్నారు.[2]

సంఘ సంస్కరణకు అంతిమ విజయం లభించగలదనే విశ్వాసం ఆయనలో కలగడానికి బహుశా ఈ భావమే ఆధారమైవుండవచ్చునేమో! ఇందుకు హితకారిణీ సమాజం వంటి శాశ్వత సంస్థలతోను, సంఘసంస్కరణ కార్యకలాపాలను నిరంతరం కొనసాగించడానికి అంకితమైన ఇరువురు బ్రాహ్మణ యువకులతోను, భవిష్యత్కార్యక్రమాలు అనుకూలంగా విశ్వసనీయంగా గోచరించాయి. క్రమంగా స్థానిక సనాతన సంప్రదాయవాదుల ప్రభావం, సంస్కరణకు వ్యతిరేకమయిన ప్రభావం, తగ్గిపోవడం పంతులుగారు గమనించారు.

1908 లో పంతులుగారు వ్యక్తిగతంగా కొన్ని నిరాశలకు నిస్పృహలకు లోనయ్యారు. జాతీయ కార్యక్రమాలప్పటికి క్రమంగా హెచ్చాయి. దానితో, సంఘసంస్కరణ కార్యకలాపాలకు కొంత దెబ్బతగిలింది. ఆయన నిరాశకు మొదటి కారణం దేశిరాజు పెదబాపయ్య గారి మరణం. 1908 మార్చిలో ఈ సంఘటన పంతులుగారికి పెద్ద ఆఘాతమయింది. తనతరవాత తన సంఘ సంస్కరణ కార్యకలాపాలకాయన వారసుడవుతాడన్న ఆశ నిరాశయింది. 1907 చివరలోనే బాపయ్య గారికి వ్యాధి ప్రవేశించింది. చికిత్సకోసం మదరాస్ వెళ్లారు. కాని లాభం లేకపోయింది. పంతులుగారికి వారసుడుగా నిలబడే వారింకెవరూ లేకపోయారు.

---

1. వి. ఎస్. సి. 2 [illegible] 207 పుటలు
2. వి. ఎస్. సి. 2, [illegible] – 207 "

సహకారాన్ని పంతులుగారికి కిచ్చాడు.[1] పూనా కూడ ముందు పంతులు గారు బొంబాయి వెళ్లి 800 రూపాయలు సేకరించగలిగారు.[2] రెండువైపుల నుంచి కూడా తాను ఆశించినంత సహాయం పంతులుగారికి లభించలేదు. తన వెనకటి సంఘసంస్కరణ సంబంధాలను బాగుపరుచుకొని, రెండు ప్రాంతాలలోను తనకృషిని విస్తృతంగా ప్రచారంచేసి, సభ్యులకు స్పష్టపరిచారు.

పంతులుగారు పిఠాపురం యువరాజా గౌరవ మర్యాదలకు పాత్రులై, ఆయన వద్ద నుంచి 1910 ఫిబ్రవరి ఆరంభంలో భూరి విరాళాలను 4000 రూపాయలు మొదలు కాని 8000 రూపాయల వరకు పొందినట్లు[3] కనబడుతుంది. మొత్తం మొత్తం 80000 వరకు సహాయం లభించింది.[4] దాంతో పంతులుగారు విద్యాలయభవన నిర్మాణాన్ని పూర్తిచేయడంతో పాటు సంఘ సంస్కర్తలకు బ్రహ్మమత ప్రచారకులకు వసతి కూడా కల్పించగలిగారు.

ఇటువంటి ప్రోత్సాహకంలో పంతులుగారు నిమగ్నులైన సమయంలో అనుకోని విషాద సంఘటన ఒకటి సంభవించింది. 11 ఆగస్టు 1910లో పంతులుగారి సతీమణి రాజ్యలక్ష్మమ్మగారు తమ దేహాన్ని చాలించారు. అప్పటి వరకు ఆమెను గురించి పంతులుగారు స్వీయచరిత్రలో చెప్పింది చాలా తక్కువ. కాని, ఆమె మరణం వల్ల దుఃఖ విహ్వలుడైన పంతులుగారు ఆమెను గురించి అతి దీర్ఘంగా వివరించారు. దాన్నిబట్టి ఆమె ప్రాధాన్యమాయనకెంతగావున్నదీ, ఆమె ప్రభావమాయనపై ఎంతగా వున్నదీ, స్పష్టమవుతుంది. ఆమె మరణంతో తాను చేస్తూన్న పనులన్నిటిని విడిచిపెట్టి, సర్వంత్యజించి, ఏకాంతంగా కాలం గడపాలని కూడా ఒకదశన భావించారు.[5]

ఇంతలో మరొక సమస్య తలెత్తింది. దాని నెదుర్కొవలసిరావడం వల్లనేమో, పంతులుగారి ఆలోచనలు ఆచరణాత్మకం కాలేకపోయాయి. పత్నీవియోగం పొందిన పంతులుగారు వితంతుశరణాలయం ఆవరణలో ఉండడం కొన్ని అపవాదులకు దుష్ప్రచారానికి అవకాశమియ్యవచ్చు గనక, ఈ సంస్థలను వదిలి వెళ్లమని

---

1. పంతులుగారి డైరీ 30 అక్టోబర్ 1909.
2. ఇండియన్ సోషల్ రిఫార్మర్ 31 అక్టోబర్ 1909
3. పంతులుగారి డైరీ 8 ఫిబ్రవరి 1910
4. వి.ఎస్.సి.2 342.
5. వి.ఎస్.సి.2 407 ఎట్ పాసిమ్.

మిత్రులనేకులు ఆయనను వత్తిడి చేశారు.[1] కాని వారి సూచనను ఆయన తిరస్కరించారు. తన జీవితాన్ని అంకితం చేసుకున్న విషయం నుంచి తాను పరారం కాలేనని వారి కన్యాశ్రమం ద్వారా మెరుగుపడాలని అన్నారు. ఆసందర్భంలో - ''దైవం మీద భారం వేసి నేను చేయవలసింది చేస్తున్నాను. దయామయుడీ క్లిష్ట పరిస్థితుల్లో నన్ను వదలడని నా విశ్వాసం. బాలానాథుడు అంతటి సంపూర్ణ విశ్వాసం నాకు కలగలేదని విలపించినప్పటికి, ఈ సమయంలో ఇటువంటి మహావిపత్తును భరించగల మనోబలాన్ని మాత్రం నాకనుగ్రహించాడు. నా భార్య మరణించినప్పుడే నేనొక నిర్ణయానికి వచ్చాను. నా శేష జీవితాన్ని ప్రజా సేవలోను దైవ ధ్యానంలోను గడపాలని నిశ్చయించుకున్నాను. ఆశ్రమాన్ని పేరిట ప్రారంభించిన సత్కార్యాల నిర్వహణలో నిర్వహించగలనని ఆశిస్తున్నాను.[2] నేను నడుపుతున్న ఈ స్త్రీశరణాలయ గురించి లోకమంతా కలిసి నామీద ఎన్ని అపవాదులు వేసి, నన్ను బాధించి, వేధించి, బహిష్కరించినా, ఇందులో ఒక బాలిక ఉన్నా నిలబడి వున్నంత వరకు నేను దీన్ని విడిచిపెట్టను. ఇది ముమ్మాటికీ నానిశ్చయం.'' అన్నారు[3] పంతులుగారు.

ఆయన స్త్రీ ఉపాధ్యాయినులలో ఒకరికి విద్యాలయాన్ని నిర్వహించడానికి నియమించి, మరొకరికి తన గృహ వ్యవహారాలు చక్కబెట్టవలసిందిగా కోరారు. ఈ ఏర్పాట్లు అనతి కాలంలోనే వివాదాస్పదాలుగా పరిణమించాయి.[4]

నూతనోత్సాహం తెచ్చుకుని, భవన నిర్మాణం పూర్తి చేసి, పంతులుగారు, తన సంఘసంస్కరణ కార్యకలాపాలతో పాటు విద్యాలయ నిర్వహణ కూడా తన పెత్తనంలోనే ఉంటుందని ఆశించారు. సమాజ అభ్యర్థులుగా, ఉపాధ్యాయుల మీద ఆయనకు ఆదుపాజ్ఞలుండేవి. ఆయన ఆశలూ కన్న కలలూ ఫలించే రోజులు సమీపించినట్లనిపించింది.

పంతులుగారి పూర్వమిత్రులు సహచరులు కొందరు ఆయన మీద ఎదురుతిరిగి, పత్రికాముఖంగానూ, వేరువిధాలా ఆయన నడతను గురించి తమకు గలిగిన అపోహాలు వెల్లడించడం మొదలుపెట్టారు. ఇందువల్ల పంతులుగారికి

---

1. లక్ష్మీనరసింహం స్వీయచరిత్ర. ఉంది శివుడు, 'స్మృతి' పు. 40.
2. పంతులుగారి జాబు 5 సెప్టెంబరు 1910 శివుడు 'స్మృతి' లో దాన్ని ఉదహరించారు
3. శివుడు స్మృతి పు. 111 గుంటూరు 1931.
4. వి.ఎస్.సి.2 – 348 – 354.

మరెందరు అభియోగాలకు పాల్పడుతారని భయపడి, ఆవిధాలుగింపనం తమ వెళ్లే ఆశ భాసించి, వెంకట శివుడుగారొకనాడు రాజమండ్రి వెళ్లారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారింటికి వారితో కలిసి నాళం కృష్ణారావు గారింటికి వెళ్లి, వారితో రెండు మూడు గంటలు సంభాషించారు. శ్రీ వీరేశలింగంగారి మీద వేసిన నిందారోపణలు నిరాధారమైనవని, అబద్ధాలని, వారిద్దరు గట్టిగా చెప్పారు.[1] అవసరమైతే పంతులుగారిని కార్యరంగం నుంచి విరమింపచేయడానికి ప్రయత్నిస్తామన్నారు. ఆమహామహుడు మాతృభాషకు, సంఘ సంస్కరణోద్యమానికి, తద్వారా స్త్రీజనోద్ధరణకు చేసిన అమూల్య సేవను గుర్తించి అయినా అంతటి మీద నిందమోపడం మంచిదికాదని వారు నొక్కివక్కాణించారు. అయినా కృష్ణారావుగారు ఒప్పుకోలేదు. పంతులుగారి శీలాన్ని గురించిన యథార్థ రహస్యం ఆయన కళ్లకు కనబడింది! సత్యప్రకటనమే తన ఉత్కృష్ట ధర్మంగా స్వీకరించారు! ఆ చనువు వీరేశలింగం గురువు దగ్గరే తాను నేర్చుకున్నాడు! ఈ విమర్శనాలు విన్నాక, వెంకటశివుడుగారేమీ మెదల్చలేక తిరిగి గుంటూరు వెళ్లిపోయారు.

1913 నుంచి 1915 వరకు వెంకటశివుడు గారు రాజధాని కళాశాలలో ఎం.ఏ. పరీక్షను చదవడానికి కలకత్తా వెళ్లారు. ఆసమయంలో పంతులుగారి మీద అభియోగాలు వచ్చాయి, న్యాయస్థానంలో ప్రత్యర్థులతో పంతులుగారు పోరాటం సాగిస్తున్నారు. ఈ విషయాలను గురించి వంగదేశీయులు కొందరు వెంకట శివుడు గారిని ప్రశ్నిస్తూండేవారు, కే. శే. శశిపాద బెనర్జీగారొకనాడు పంతులుగారిని గురించి తెలిసిందంతా చెప్పమని శివుడుగారి నడిగారు, ఆయన తనకు తెలిసినంతా చెప్పారు. ఆయన పూర్తిగా విని, తటాలున – ''నాకు దీని రహస్యం ఇప్పుడు బోధపడింది. పత్నీవియోగం సంభవించిన తరవాత పంతులుగారా ఆశ్రమంలో ఉండి స్త్రీల సంస్థకు పాటుపడ్డం – శరణాలయంలోని యువతులు వారికిభోజన సౌకర్యాలు కలిగిస్తూండడం – ఇవే గుణగరిష్ఠులైన మహాపురుషుల మీదనైనా ఎన్నో నిందలు పడ్డానికి కారణాలు –'' అని విస్మయం ప్రకటిస్తూ అన్నారు.[2] ఆయన బహుకుటుంబీకుడు కలకత్తాలో వితంతు శరణాలయాన్ని చాలాకాలం జయప్రదంగా నిర్వహించారు.

---

1. శివుడు ''స్మృతి'' పు.111.
2. శివుడు ''స్మృతి'' పు.112 – 113.

కాని – ఆ కరడాలరతం ఒప్పుడశలో ఉన్నప్పుడు హాన్ని ఉపయోగారం. కారణం – ఇంకు కేవం గలిగిన భార్యా పుత్రికల వింతేనాగము. అన్నో అన్న ఒక్క కహాతురు మరణించిన తరువాత, పిల్లలను సందర్శి పలిసో మంచి వరాన్వేషించి, మగనాళ్లను పెట్టుకున్నారు – వెర్రి

" వచ్చిన నిందలు పోగొట్టుకోడానికి నానాపాట్లు పడ్డం కంటే, మొదటే నిందలకు ఎడమివ్వకుండా ప్రవర్తించడం మంచిది కదా! సంఘ సంస్కర్త దూషణ భూషణాలకు అతీతుడుగా ఉండాలన్న మాట వాస్తవమే. ఆ పట్టుదలతో అభిప్రాయ భేదాలుండే ఉండవచ్చు గాని – అతని నిర్మల ప్రవర్తనను గురించి మాత్రం సంశయం లేశమైనా ఉండగూడదు " అన్నారాయన.

పంతులుగారు వితంతువులను దుర్గతి నుంచి ఉద్ధరించడానికి ప్రయత్నించినప్పుడు కొందరాయన్ని వ్యతిరేకించారు. అలా వ్యతిరేకించిన వారిని గురించి పంతులుగారు చెప్పిన పద్యాలు ఎంతో ఆకర్షణీయంగా ఉంటాయి. ఉదాహరణకు ఒక పద్యం.–

మగడు పోయిన భామ మరల పెండ్లాడుచో
సొత్తు దక్కదటంచు సోలునాకడు
పతిపోయిన యువతి పరిణీతయైనచో
జనికత్తె లేదంచు వగరు నాకడు –
శవుబాయు కాంత యుద్వాహంబు నాడుచో
పారత్వ పెండ్లింపు సుంగునాకడు
భర్తృహీనాంగన భర్త గైకొన్నచో
ప్రత్యయము లడగునంచు గాసిలుకు నాకడు –
మృత పతిని సాక్షిగా శిశువేశంరాగ
మహాలక్ష్మిణ పోసంచు మహాల్గునాకడు –
వీరు పూర్వనాగరికులౌ పెద్ద లిపుడు
దుష్కులాచార రక్షణోద్యోగులకట!

ఏమంటే పత్రికా ప్రయోజనాలు ఎక్కువగా ఉంటాయి. గొప్పవారి
జీవిత చరిత్రలు ఎక్కువగా చదవాలి. వీరేశలింగం పంతులుగారు గొప్పవారు.
అందుకే తెలుసుకోవాలి కార్యక్రమం మంచిది. అందుకే అందరి మీద ప్రభావం ఉంటుంది
నేనే చదివిన చరిత్రలో ఎక్కువగా ఉన్నాయి. ఎవరైనా ఎదుటి వారిని చూసి
మనిషి కాదు. "స్త్రీలంటే పిల్లల్ని కాన్పు చేసే యంత్రాలు కాదు స్వతంత్రులై
పురుషులతో సమానంగా ఉండాలని" మనకు చెప్పారు
వీరేశలింగం పంతులుగారు. తాను నమ్మిన దానిని ఆచరించిన
వ్యక్తి ఎవరైనా తెలుసుకోవాలి అనేదే నా వ్యక్తి. అందువల్ల
వారి కృషిని మనం అందరం గుర్తుంచుకోవాలి. పంతులుగారు ఒక మహోన్నత
వ్యక్తికి నిదర్శనం. వాస్తవానికి వారు చేసిన పని గొప్ప కృషి.

## ముగింపు

చీకటి గాడాంధకారంలో కొట్టుమిట్టాడే నారికి వెన్నెల తెన్నులను చూపించే వారు చాలా తక్కువ మంది ఉంటారు. అటువంటి వారు కరదీపికల వంటివారు. వారందించే వెలుగు ఎందరికో మేలుబాట. కందుకూరి వీరేశలింగంపంతులుగారు తమ జీవితాన్ని పరోపకారం కోసం అంకితం చేశారు. వితంతువుల పాలిట జీవితాలలో నూతన శోభ వికసించడానికి – పంతులుగారు చేసిన కృషి అపారం, అపూర్వం. నవయుగానికి నాంది పలికిన వైతాళికులు పంతులుగారు, వితంతు పునర్వివాహాలు సంఘసంస్కరణ తత్పరతకు తార్కాణం. బహుముఖంగా వ్యాపించిన పంతులుగారి సంస్కరణ కార్యక్రమాలలో ప్రధానమైంది వితంతు పునర్వివాహం. స్త్రీలు నిర్భయంగా తమ పని కొనసాగించుకున్నారనుకుంటే. అయన వెలిగించిన జ్యోతి దీపం ఎప్పుడూ ఆరకుండా అఖండంగా వెలుగుతూనే వుంటుంది. ఆవెలుగు వున్నంతకాలం **కందుకూరి వీరేశలింగంగారు** నిలిచిఉంటారు.

అజ్ఞానపు చీకటిలో – అలమటించు స్త్రీజాతికి
కాంతినిచ్చు దివ్వెగా– విజ్ఞానపు వెలుగుగా
నిలచిపోయెను నింగిలో కలకాలం తారంకై.

—: ooo : —

# వీరేశలింగం - స్త్రీవిద్య

## మారుతూన్న సమాజంలో వస్తున్న మార్పులు

వీరేశలింగం పంతులుగారు జన్మించిన యిరవై సంవత్సరాలకు దేశమంతటా తీవ్రమయిన మార్పులు వచ్చాయి. ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా మతవిషయకంగా - అనేక రంగాలలో వచ్చాయి. ఆ మార్పులు, స్త్రీలోకానికి భయంకరమయిందీ, భారతజాతికే అవమానకరమయిందీ ' సతీ సహగమనం '. ఆదురాచారాన్ని మాన్పించారు రాజారామమోహనరాయ్. సమాజంలోని అసమానతలను రూపుమాపడానికి ఎన్నోవిధాల ప్రయత్నించారు. అనేక మూఢవిశ్వాసాలను తొలగించడానికి కృషిచేశారు. ఆంగ్లవిద్య నభ్యసించమని దేశీయులను ప్రోత్సహించారు. ప్రజలకు రాజ్యాంగ పరిజ్ఞానం కలగడానికి దోహదం చేశారు. ఈ పునరుజ్జీవనోద్యమం మూలంగా ఎన్నో మార్పులు వచ్చాయి. వాటిలో ఎండకన్నెరుగని యువతులు - బాలికలు - పాఠశాలల్లోకి వెళ్లి చదువు నేర్చుకోవడం అతిముఖ్యమయిన మార్పు. ఆడపిల్లల కోసం వేరే బడుల నేర్పాటు చేయడం వల్ల స్త్రీవిద్యకు ఎంతైనా ఉత్సాహప్రోత్సాహాలు కలిగాయి.

## ఆంధ్రదేశంలో స్త్రీవిద్య

కొత్త వెలుగులందుకోవడంలో తెలుగువారెప్పుడూ ముందడుగు వేస్తూనే ఉన్నారు. బాలికల విషయంలో కూడా అంతే అనవచ్చు! ఆంధ్రదేశం ఈ శాన్యదిశను విశాఖపట్టణంలో స్థానికులయిన శ్రీమంతుల పూనికతో 1869 నాటికే బాలికా పాఠశాల స్థాపించబడింది. "ఇటువంటి పాఠశాలలు మన దేశంలో అపూర్వమనాలి. ప్రాచీనకాలం మాట అలాఉంటితే ఆధునిక యుగంలో, మన దేశంలో ఆడపిల్లల బడులు చాలా అరుదు. ఇంతకు ముందు కాశీలో మాత్రం ఉండేవి." అని లింగం లక్ష్మాజీగారు బాలికా పాఠశాలారంభోపన్యాసంలో అన్నారు.[1]

1. The Journal of Education - 1869.

అయితే మద్రాసులోని కోమలేశ్వరపురంలో 1852 కి ముందే ఒక బాలికా పాఠశాల స్థాపించబడింది. దానిని శ్రీనివాస పిళ్లే అనే ఉదారుడు నిర్వహించాడు; విద్యాభివృద్ధికోసం 75 వేలరూపాయలు విరాళమిచ్చిన వదాన్యుడు. ఆవిరాళం మహాలింగానే పచ్చయప్ప కళాశాల కనుబంధంగా ఈ పాఠశాల రూపు కట్టింది.

"ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్" అనేకవివాక్కు ఆనాడు తెలుగునాటను విస్తరించింది. విశాలభావాలు కలవారందరు బాలికలకు విద్యనేర్పించడం న్యాయమనీ, శ్రేయమనీ గ్రహించారు. దాని కోసం కృషి కర డ ఆరంభించారు. 1873 లో ఒక బాలికా పాఠశాల కాకినాడలో స్థాపింపబడింది. ఆడపిల్లలను చదివించాలనే అభిప్రాయం నాగరులకు, ఉద్యోగులకు ముందుగా కలగడం వల్లనేమో – పట్టణాలల్లో బాలికా పాఠశాలలు తలెత్తడం మొదలు పెట్టాయి.

పంతులుగారు ఉపాధ్యాయుడుగా కోరంగిలోని ఆంగ్లో వర్నాక్యులర్ పాఠశాలలో ప్రవేశించేనాటికి దేశపరిస్థితుల్లో ఎన్నో పరిణామాలు వచ్చాయి. కొత్తవింత, పాతరోత. ప్రజలకు పూర్వాచారాల మీద విసుగుపుట్టడం మొదలయింది. నూతనాచారాల మీద పరదా పెరిగింది. భావవిప్లవం బయలుదేరడానికది నాందియని చెప్పవచ్చు. కొన్ని కట్టుబాట్లను లెక్కకాని కొందరు స్వేచ్ఛగా విహరించడం ప్రారంభించారు. దీనికి కారణం పాశ్చాత్యనాగరిక ప్రభావం కావచ్చు.

ముత్తెపు చిప్పలో బడ్డ స్వాతివాన నీటిబొట్టు మాత్రమే ముత్యమవుతుంది. అలాగే ఏవెలుగయినా కొందరిని మాత్రమే కదిలిస్తుంది. పెను నిద్దుర వదలిస్తుంది. అలా కదిలినవారే వైతాళికులయి నిద్రాణమయిన లోకాన్ని మేలుకొలుపుతారు. పంతులుగారి మీద ఈ నవీన నాగరికతా ప్రభావం ఎక్కువగానే పడింది. తాను తెలుసుకొన్న విషయాలను పదిమందికి వెల్లడించాలనుకున్నారాయన. 1874 అక్టోబరు "వివేకవర్ధని" పత్రికలో మూఢవిశ్వాసాల గురించి రాయడం ఆరంభించారు.

అప్పటికే విభిన్నభావాలను ప్రచారం చేసే రెండు పత్రికలు ఆంధ్రావనిలో ప్రచురించబడుతుండేవి. స్త్రీవిద్యామండనం చేసే 'పురుషార్థప్రదాయిని' స్త్రీవిద్యాఖండనం చేసే, 'ఆంధ్రభాషాసంజీవని' ఈ రెండు పత్రికల్లోను వాద ప్రతివాదాలు జోరుగా సాగుతుండేవి. పంతులుగారు 'ఆంధ్రభాషాసంజీవని'లో వచ్చేవాదాలను 'పురుషార్థప్రదాయిని'లో ఖండిస్తుండేవారు.

## సంప్రదాయకవిత్వం నుండి సంస్కరణకోసం రచనా వ్యాసంగం

సులభసాధ్యంకాని కార్యనిర్వహణం పంతులుగారి ప్రత్యేకత. నాల్గవ తరగతి నుండే తెలుగురచనలో నిష్ణాతులుగా గుర్తింపబడ్డారు. ఎందరిచే గుర్తింపబడెటట్లు "కందము వేసినవాడు కవి" అనేనానుడికి గురిగా మార్కండేయ, గోపాలశతకాలను కంద పద్యాలలో రచించారు. తరువాత ప్రథమ ప్రయత్నంలోనే, 'ర' కారప్రాసతో "శ్రీరాజమహేంద్రవర పురీగోపాలా" మకుటంతో మరొక శతకాన్ని రచించారు. ఎవ్వరూ చేయని పనిచేయాలని, పూర్వులందరి కష్టతర ప్రయోగాలనీ సమ్మిళితం చేసి, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమనే గ్రంథాన్ని రచించారు.[1] ఇలా ఒక్కొక్క ప్రయోగం చేస్తూ రసికజనమనోరంజనం, శుద్ధాంధ్రోత్తర రామాయణము సంగ్రహ వ్యాకరణము, నీతిదీపిక మొదలైన సంప్రదాయ సాహిత్య రచన చేశారు. కాని ఈ సమయంలో ఆయనలో చిన్నమార్పు. తెలుగులో సరైన వచన గ్రంథంలేని లోటు కనిపెట్టి చిన్నయసూరి అసంపూర్ణ పంచతంత్రానువాదాన్ని "విగ్రహం", 'సంధి' రచించి పూర్తిచేశారు. మరలా దృక్పథంలో మార్పు. 'విగ్రహం' పండితులకే గాని, సామాన్యులకర్థం కాదన్న అవగాహన ఆయనలో కలిగింది. అదే సంస్కరణ సాహిత్యానికి బీజావాపన మయింది.

1. వి.ఎస్.సి. 2 – పు. 141.

రాజశేఖర చరిత్రకు శ్రీకారం చుట్టబడింది. హిందువాగ్వాదీవసంభాసి మతాభిప్రాయాలూ, ఉపాసనా పద్ధతులూ, మూఢవిశ్వాసాలూ, స్త్రీలఅవస్థలూ, అన్నీ విపులంగా కథారూపాన చర్చించబడ్డాయి. ఆనాటి హిందూ పత్రిక రాజశేఖరచరిత్రలోని పంతులుగారి రచనారీతిని ఇలా అభివర్ణించింది.

"క్లేశప్రదమును, కఠినమును గాక, సంస్కారహీనమును గ్రామ్యమును గాక, ఇరాంతుని శైలి మనోహరముగాను, ప్రాతింపముగానూ ఉన్నది.... తెలుగు వాఙ్మయమనెడి వంధ్యమైన ఎడారి ఇకముందాక ఫలవంతమైన ప్రదేశమును నిర్మింతురనియు మేము మనఃపూర్తిగా గోరుచున్నాము." [1]

విగ్రహము, సంధి – రచనానంతరం, పంతులుగారిలో మరొక ప్రశ్న ఉదయించింది. ముందుతరాల వారికి సులభంగా తమ భావాలను తెల్పడమే భాషాప్రయోజనమనుకున్నారు. కలిగిన ఈ అభిప్రాయాన్ని పత్రికా ముఖాన వెల్లడించారు. వ్యతిరేకత కనబడింది పండితుల్లో. అయినా లెక్కచేయకుండా మొదటిసారి హాస్య సంజీవని పత్రికలో సంభాషణారూపాన బ్రాహ్మవివాహాన్ని వ్రాసి ప్రకటించారు.[2] దీనితో పంతులుగారి సాహిత్యం, సమాజసంస్కరణ కంకితమైపోయిందని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఆసంస్కరణకూడా బాధిత స్త్రీజాతి కొరకే కేంద్రీకరింపబడింది. సాహిత్యం తన ప్రయోజనాన్ని నెరవేర్చుకుంది.

"సాయుధ విప్లవాలతో
సాధించలేని
సంఘ సంస్కరణ
సాహితీ సౌరభాలతో
సాధించిన కీర్తిశృంగం
కందుకూరి వీరేశలింగం." [3]

---

1. వి.ఎస్.సి.2 పు.167
2. వి.ఎస్.సి.2 పు.175
3. జె.బాపురెడ్డి 'పంతులుచెప్పిన పాఠాలు'
Sri Kandukuri Veeresalaingam 122 Birthday Celebrations Commemoration Souvenir P. 55.

## స్త్రీ విద్యను ప్రోత్సహించడం

ఇదే సమయంలో – ' మనుష్యులకు విద్యయే పెద్దకార్యమనుట ప్రసిద్ధి ' అని స్త్రీ విద్యామండన వాదాన్ని పద్యరూపంలో వెలయించారు పంతులుగారు. 1875లో ధర్మాత్మకమయిన వ్యాసాలను – స్త్రీ విద్యను గురించి – పురుషార్థ ప్రదాయినిలో ప్రచురించారు.

స్త్రీలను ఉత్తమ సంస్కారవతులుగా చేయడం కోసం ' సతీహితబోధిని ' రాయడం ప్రారంభించారు. ఇది కాస్త పెద్దవారికోసం తలపెట్టింది. చిన్నతరగతి బాలికలకోసం ' స్త్రీనీతిదీపిక ' అనే శతకాన్ని 1889 సంవత్సరానికి పూర్వమే రాశారు.

' చక్క దనమునకును జోడు చదువు కూడ
గలిగియుండిన, నందమే యలరునకును
దావి గలిగిన పడువున దనరుమండ్రు
పూవుబోండ్లు విద్యాగంధమునను గరము! '

ఇలాంటి సులభశైలిలో అపద్యాలు నడిచాయి, చిన్నపిల్లలు కూడా చదువుకోవడానికి ఇంపుగా సొంపుగా వుండడం వల్ల, ' స్త్రీనీతిదీపిక 'ను బాలికలకు పాఠ్యగ్రంథంగా విద్యాశాఖవారు నిర్ణయించారు.

' సతీహితబోధిని ', ' పత్నీహితసూచని ', ' స్త్రీనీతిదీపిక ' అనేపేర్లతో పరంపరగా వారు ప్రచురించిన వివిధ విషయాలు స్త్రీలకు కరదీపికలే. ''చదువెఱుగని స్త్రీలు తమ బిడ్డలకు శత్రువులు'' అనేవ్యాసంలో ''తల్లి చదువెఱుగని మూఢురాలయిన పక్షమున చదువు నిమిత్తము తండ్రి కూకలు వేసినప్పుడును, శిక్షించినప్పుడును, తల్లి కల్పించుకొని యడ్డము వచ్చి కామాళ్ల చదువుకూడా చెడగొట్టి వాండ్రను ఎందుకునకుంబనికిరాని వారినిగా జేయును. తల్లి విద్యావతియయినయెడల బిడ్డల చదువును తాను స్వయముగా క్రమముగాని యింటి వద్ద పాఠములు చెప్పి చదివించి వారిని శీఘ్రకాలములో విద్యాబుద్ధుల యందు ప్రవీణులనుగా దిద్దును'' [1] అని ఉదాహరణపూర్వకంగా వివరిస్తారు.

---

1. ' సతీహితబోధిని ' – పు. 2

పంతులుగారనేక విధాలుగా స్త్రీవిద్యను ప్రోత్సహించారు. 'సత్యవాదిని' అనేపత్రికలో ప్రచురించిన హాస్యసంభాషణలు స్త్రీవిద్యను గురించినవే. ఆపత్రికలో ప్రచురించిన 'స్త్రీవిద్య' అనే ప్రహసనంలో సరస్వతి పాత్ర తండ్రిగారి పాత్ర ద్వారా ఇలాచెప్పించారు.- "పురుషులు తామేమో స్వతంత్రులమని, తెలియక మాటలలో విర్రవీగడమే కాని, నిజానికి పురుషుడెప్పుడూ, క్రియలలో స్త్రీలకు దాసానుదాసుడే! స్త్రీ చదువుకున్నదై మంచిదయిన పక్షంలో, చెడ్డవాడయినా పురుషుడు సహవాస పుణ్యంచేత తానుగూడా బాగుపడతాడు. స్త్రీమూర్ఖురాలయి చెడ్డదయిన పక్షమున మంచివాడయినా పురుషుడు సహవాసదోషంచేత చెడిపోతాడు. పురుషులను మనసు వచ్చినట్లు ఆడించే శక్తి స్త్రీలచేతిలో ఉంది. పురుషులెప్పుడూ స్త్రీలు చేసినట్లవుతారు. విద్యావంతులయినను, విద్యావిహీనలయిన స్త్రీలతో సహవాసంచేసేవారు తత్తులుల్యలయి, మూఢాచార పరాయణులవుతారు. విద్యాగంధంములేనివారైనను, విద్యావతులయిన స్త్రీలతో సహవాసం చేసేవారు తత్తుల్యలయి, సదాచార పరాయణులవుతారు. ఏదేశం ఎప్పుడు బాగుపడినా, స్త్రీల మూలమునసే బాగుపడవలెను. దేశమునందలి స్త్రీలస్థితిని బట్టియే దేశముయొక్క స్థితి బోధపడుతుంది. కాబట్టి మనమెల్లప్పుడు విద్యామహిమచేత స్త్రీలనున్నత స్థితికి తెచ్చి తన్మూలమున మనమున్నతస్థితికి పాటుపడవలెను. స్త్రీకి విద్య చెప్పి బాగుపరిచి, పురుషుడు తానుకూడా ఊర్ధ్వగతికైనను పోవలెను. లేదా స్త్రీకి విద్యమాన్పి మూఢురాలిని చేసి దానితో తానుగూడా అధోగతికయినా పోవలెను. అంతేకాని స్త్రీనిమూఢత్వ సముద్రములో ముంచి తాను పైకితేలి సుఖించెడు మధ్యమార్గమెప్పుడును నుండదు." [1]

విద్యావతి అయిన స్త్రీ యెలా ప్రవర్తిస్తుంది?

చదువుకున్న స్త్రీ ఎందుకూ పనికిరాకుండా పోతుందని భాషించే ముసలి భర్తతో, ఆమె చదువు వల్ల కలిగే ప్రయోజనాలను వివరించి, చదువును కొనసాగించ నీయుమని ఉద్బోధిస్తాడు సరస్వతి తండ్రి. చదువుకుంటే స్త్రీ స్వభావమే పూర్తిగా

---

1. 'సత్యవాదినీ' కం.వీ. పు.68

మారిపోతుందని అంటూ ఉన్నప్పుడు, విద్యావంతుల్లో మంచి మార్పును తెస్తుందనీ, చదువులేని మూఢురాళ్లల్లో వెతికినా కనబడని నమ్రతా, పరోపకార బుద్ధీ, గర్వరాహిత్యం మొదలయిన సుగుణాలు విద్యావతి అయిన తన భార్యలో ఉన్నాయని చెపుతాడు. ఆమె తనమాటకెన్నడూ వ్యతిరేకంగా నడవదనీ, గృహకృత్యాలన్నీ చక్కగా నిర్వర్తిస్తుందనీ, దాసదాసీ జనానికి జీతబత్తెలిచ్చి, వెచ్చాలు తానే తెచ్చుకొని తనకాభారం లేకుండా చేస్తుందనీ, జిహ్వకింపుగా పాకం చేసి వేళకు భోజనం అమరుస్తుందనీ, అందువల్ల తమ యిల్లు భూతల స్వర్గంలాగ సర్వసుఖప్రదంగా ఉంటుందనీ చెప్పి విద్యస్త్రీల కెంత అవశ్యకమో విశదీకరిస్తాడు.

స్త్రీలకు స్వాతంత్ర్యం పనికిరాదనీ, జననమాది మరణ పర్యంతం పురుషుల రక్షణలోనే ఉండాలనీ మను ధర్మశాస్త్రం చెపుతుంది.

''పితారక్షతి కౌమారే భర్తా రక్షతి యవ్వనే
రక్షంతి స్థావిరే పుత్రాః నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి''

అన్నదే ఆమను వచనం. అయినా తండ్రీ, భర్తా, పుత్రులూ స్త్రీని రక్షించే వారకాని శాసించేవారు మాత్రం కాదన్న విషయం కనబడుతోంది గదా! నిజానికి పురుషులను శాసించి నడిపేవారు మాత్రం స్త్రీలే. అందువల్ల –

'మాతా శాసతి కౌమారే భార్యా శాసతి యవ్వనే
స్నుషా శాసతి వార్ధక్యే పుంసో నాస్తి స్వతంత్రతా'

అనే శ్లోకం ఉన్నట్లయితే వాస్తవానికి దగ్గర్లో ఉండేదేమోననిపిస్తుంది! అని [1] చెపుతూండగానే ఆ ముసలి భర్త చెవులు మూసుకొని ''హరిహరీ'' అంటూ వెడతాడు.

ఇలాంటి రచనలవల్లా, ప్రసంగాల వల్లా తన మనసులో స్త్రీవిద్యావశ్యకతను గురించి ఉన్న అభిప్రాయాలను ప్రజలకు నచ్చేరీతిలో మనసున హత్తుకొనే తీరులో వ్యక్తపరచి నిరంతరం వాటిని ప్రచారం చేయడం వల్ల ఆభావాలకు అనుకూలంగా

---

1. ''సత్యవాదిని'' కం.వీ. పు.69

ప్రజాభిప్రాయాలను మార్చాలనే పంతులుగారి అభిప్రాయం. కాని ఆనాడు గ్రాంథిక భాష సామాన్యంగా చదువుకున్నవారికి కూడా సులభగ్రాహ్యం కాదు. అందువల్ల సులభంగా, సామాన్యవిద్య గలిగిన స్త్రీలకు కూడా అర్థమయ్యే రీతిలో పత్రికల ద్వారా, 'సత్యవాదిని', 'వివేకవర్ధని', 'హాస్యసంజీవని', 'పురుషార్థప్రదాయిని', మొదలయిన వాటిల్లో తన రచనలను ప్రచురించి అభ్యుదయ భావాల నతివేగంగా వ్యాపింపచేశారు పంతులుగారు. ఆప్రహసనాలు బహువేగంతో ప్రచురప్రచారంలోకి వచ్చేవి. ఏయింటి అరుగమీద చూసినా, వాటిని చదువుకుని ఆనందించే వ్యక్తులు కనబడేవారు.

పంతులుగారు ఆంధ్రీకరించిన రత్నావళి నాటకం పీఠికలో ఇలావ్రాశారు – 'ఇందు చెప్పబడిన సంగతుల్లో స్వభావ విరుద్ధమయిన దేదీ లేదు. దీనివల్ల పూర్వకాలంలో హిందూ సుందరులెంత స్వాతంత్ర్యం ఉండేదో, వారెంత నాగరికురాండ్రుగా, విద్యావతులుగా ఉండి; భర్తలతో కూడ సభలకు సహితం వెళ్లే ఆచారాన్ని కలిగి వుండే వారో స్పష్టపడుతోంది.'' అని. ఈ వాక్యాలు పంతులుగారు సంస్కరణాసక్తినీ, స్త్రీ విద్యాభిమానాన్నీ వెల్లడిస్తున్నాయి.

## హరిశ్చంద్ర నాటకం

1884 లో పంతులుగారు 'హరిశ్చంద్ర' నాటకం రాశారు. ఆ కథను యథాతథంగా నిర్మించక, స్త్రీల కుపయోగించు పద్ధతిలో రచించారు. స్త్రీజనోద్ధరణ పంతులుగారి లక్ష్యంగదా! చంద్రమతి కథ నాధారంగా చేసికొని, స్త్రీవిద్యను ప్రోత్సహించడం కోసం ఆ రచన సంకల్పించారు. ఈ నాటకంలో చంద్రమతి విద్యావతి. ఆమె తండ్రి ఉశీనర మహారాజునకు స్త్రీవిద్య అంటే ఎంతో ఆసక్తి. కుమార్తెకు యుక్తవయసు రాగానే విద్యాసముద్ర పండితుని దగ్గర విద్యలు నేర్పించాట్ట! ఇది పంతులుగారి కల్పన. చంద్రమతి తల్లి సునంద కూడ విద్యావతి. విద్యవల్ల ప్రయోజనాలామె గ్రహించి, కుమార్తెకు విద్యమీద అభిరుచి కలిగించింది. చంద్రమతి విద్యనమితశ్రద్ధాసక్తులతో అభ్యసించి, సాహిత్య

విద్యావంతురాలయింది. ఈ విషయం పంతులుగారు రచించిన నాటకం తృతీయాంకంలో స్పష్టమవుతుంది. హరిశ్చంద్రాదులు ఘోరారణ్యంలో దావాగ్ని మధ్య చుట్టుకోబడినపుడు, చంద్రమతి, "నాకు తల్లిదండ్రులు చెప్పించిన విద్య సార్థకమవునట్లు, ఆశుకవిత్వాన దండకమొకటి చెప్పి యింపు హవ్యవహుని మెప్పించెద" అని అప్పటికప్పుడాక దండకం చెప్పి, అగ్నిని మెప్పించి, ఆ ప్రమాదాన్నుంచి తప్పించుకొన్నట్లు కల్పించబడింది. ఈ కల్పన పంతులుగారిదే. దీనివల్ల హరిశ్చంద్రుని కెన్నికష్టాలు వచ్చినా చివరకు వాటి నధిగమించి గట్టెక్కడంటే విద్యావతి అయిన సతీమణే కారణమని పంతులుగారు దీనిద్వారా నిరూపించారు. ఇలాంటి స్త్రీ విద్యాప్రోత్సాహకరమయిన విషయాలనూ, వాదాలనూ ఎన్నిటినో పంతులుగారు తమ రచనల ముఖంగా వెల్లడించి ప్రకటించారు.

## సత్యరాజా పూర్వదేశయాత్రలు

ఈ గ్రంథాన్ని గురించి పంతులుగారు, 1891 లో తమ స్వీయచరిత్రలో ఇలా రాశారు – "1891 వ సంవత్సరమందు స్త్రీల విషయమును మనవారు చేసిన అన్యాయములు తెలుపబడునట్లుగా వ్యాజరీతిని సత్యరాజా పూర్వదేశ యాత్రల యొక్క ప్రథమ భాగమును రచించి ప్రకటించితిని."[1]

ఆడమళయాళంలో 'సర్వహక్కులు' స్త్రీలకే సంక్రమించాయంట. పురుషులకే అవమానం ఉండదట. ఆ దేశం మంత్రతంత్రాలకు ప్రసిద్ధి చెందిందట. ఈ విషయాలు లోకంలో వ్యాపించి ఉన్న జనశ్రుతి నాధారంగా చేసికొని పంతులుగారు హాస్యరస ప్రధాన మయిన కల్పనలు శిల్పించి, వ్యాజరీతిలో ప్రహసన రచన చేశారు. ఇందులో తెలుగు దేశంలో వేళ్లు పాతివున్న ఆనాటి సాంఘిక దురాచారాలను తీవ్రంగా ఆక్షేపించారు. ఆనాటి సమాజంలో హక్కులనీ పురుషులవే. విద్యావివేకాలకు దూరమయిన స్త్రీలు పురుషుల దురహంకారానికీ, దురన్యాయాలకు, క్రౌర్యాలకు, మౌఢ్యాలకు గురికాబడి, నిస్సహాయులయి దుస్థితితో వుండేవారు.

---

1. వి.ఎస్.సి.2 – పు.205.

మన సమాజంలోని స్త్రీపురుషుల స్థానాలను తారుమారుచేసి పురుషులకు స్త్రీల స్థానాన్ని నిరూపిస్తూ ఈ చిన్న పుస్తకంలో పంతులుగారు వ్యంగ్యంగా స్త్రీల అధోగతిని వర్ణించారు. పురుషుడేకాకిగా, నిరాశ్రయుడయి, జీవితంలో వంచింపబడి నప్పుడు పడే మానసిక వేదన ఎలాంటిదో కళ్లకు కట్టించారు. పంతులుగారి చుట్టూ వికటాట్టహాసం చేస్తూ సాక్షాత్కరించే ఆనాటి సాంఘిక దురాచారాలను పంతులుగారు గొప్పగా చిత్రించారు.

ఆరచనలో మలయాళదేశంలోని పురుషులు వధువు కోరాదు. అపత్నీకులు - అంటే భార్యమరణించినవారి ముక్కులు కోసేయాలి. భోగపురుషులు - మన భోగస్త్రీలవంటివారు - మాత్రమే సంగీతసాహిత్యాల నభ్యసించాలి. అపత్నీకుల నాసికాకృంతన కర్మకాండను పీఠాధికారిణులు దగ్గరుండి జరిపించాలి. కనకవారు దేశమంతా పర్యటిస్తూ ఉంటారు. తమ ఆజ్ఞలను పూర్వాచారాలను ఉల్లంఘించినవారికి పీఠాధికారిణులు శ్రీముఖాలు పంపుతుంటారు. ఎటువంటి పాపాలు చేసినా పరిహారంగా దండుగలు విధిస్తారు. కాని, అలా శిక్షపొందిన వారాహ్వానిస్తే ఈ పీఠాధికారిణులు వెళ్లి, వారి యిళ్లల్లో భిక్షలంగీకరిస్తారు. పిండివంటలతో షడ్రసోపేతంగా భిక్షలు స్వీకరించి వారిని జాతి బహిష్కరణ నుంచి తప్పిస్తారు. పాపకూపం నుంచి రక్షిస్తారు.

ప్రధానకథాపాత్రగా రూపొందించబడ్డ సత్యరాజాచార్యులు వారు ఆడమళయాళంలో ప్రవేశించినప్పుడు అక్కడ రక్షకభటులు (స్త్రీలే) అతనిని పట్టుకుని బంధిస్తారు. తరువాత 'షాండీభంగీ' అనే రాజకీయోద్యోగి అనుగ్రహాన్ని సంపాదించి ఆమె యింటనే నివసించాడు. ఆమె ఆదేశంలోని సంస్కర్తల సంఘానికి చెందినది. ఆమె భాగేఘండే అనే విద్వాంసురాలితో దేశాచారానికి విరుద్ధంగా సత్యరాజాచార్యులకు చదువు చెప్పించింది. పురుషులకు విద్యకూడదనే దేశాచారం పాటింపబడుతుండా దేశంలో. అందువల్ల పురుషులు స్వాతంత్ర్యపరులయి పాడయిపోతారని వారి విశ్వాసం. దానిని పరదేశస్థులు జయించి దేశీయాచారాలను సంస్కరించ ప్రయత్నిస్తున్నారట. వారు ఆడమళయాళంలో పురుషుల కోసం పాఠశాలలు స్థాపించి వారిలో

విద్యను వ్యాపింపజేయడానికి ప్రయత్నిస్తున్నారట. అయినా పారసీయులయిన కుటుంబాలవారి బాలురెవ్వరూ వాటికి పోతున్నారట. ఈ గ్రంథంలోని నవరత్నాలను గాంచినవారికి పంతులుగారి వ్యంగ్యరచనా సామర్థ్యం అవగతమవుతుంది. దానిలో పద్యాలు చమత్కారాలుగా నుండడమే గాక హిందూ సమాజంలో పురుషులు, స్త్రీలనలాంటి దుస్థితిలో పడద్రోసిన విషయాన్ని గ్రహించి సిగ్గుపడతారు. ఆ పద్యాలలో కొన్నిటిని చూద్దాం.

పురుషున కిమ్మహి పత్నిం
బరమంబగు దైవతంబు పత్నీసేవన్
నిరతము చేసెడి పురుషుడె
పరమున నిహమున సుఖమ్ము బడయును నమ్మా.

కుష్ఠురోగిణియైనను గ్రుడ్డిదైన
బధిరవికలాంగియైనను ముసలిదైన
పత్ని యెంగిలి భుజియింప వలయు సతము
పుణ్యలోకంబు గాంక్షించు పురుషవరుడు.

పురుషుండు గార్ధభమ్మును
స్థిరమగు దండనము లేక చెడిపోవు రిలన్
గరుణ దలంపక నెలకొక
సరింపైనన్ గొట్టవలయును బత్ని పురుషునిన్.

ఈ సూక్తులు పంతులుగారి వ్యంగ్యరచనా వైభవానికి నిదర్శనాలు. మలయాళ దేశంలో భార్య మరణిస్తే ఆమె శవంతో పాటు సజీవుడయిన భర్తనుకూడ పూడ్చిపెట్టేవారట. ఇది మన ‘ సతి ’ లాంటిదన్నమాట. ఈ విధంగా వ్యంగ్యంగా, హాస్యంతో మనదేశంలోని స్త్రీల దురవస్థలను చిత్రిస్తుందా గ్రంథం.

## సత్యవతీ చరితము

ఇది మరొక మంచి రచన. ‘ విద్యా విహీనః పశుః ’ అనే సూక్తి స్త్రీలకూ, పురుషులకూ సమానంగా వర్తిస్తుందని పంతులుగారు నిర్ద్వంద్వంగా ప్రకటించారు. స్త్రీలకు విద్యలేకపోవడం కుటుంబంలో

సర్వానర్థకాలకు మూలకందమని నిష్కర్షించారాయన. అవిభక్త
కుటుంబంలోని చదువుకోని ఆడవారు గృహాన్ని నరకకూపంగా చేస్తారు.
దీనికి నిదర్శనంగా తన వివాహాలు జరిగిన తరువాత తనపెదతండ్రిగారి భార్యకూ,
తన తల్లికి మధ్య చెలరేగిన అనవసరపు తగవులాటను వర్ణిస్తారు, పంతులుగారు.
"ఈ కలహప్రియత్వమునకు ప్రధానకారణము స్వప్రయోజనపరత్వముచేత
పూర్వాచారాలచేత పట్టుబడినవారు తమ తరుణీమణులను విద్యాగంధవిహీనురాండ్రనుగా
చేయుట వలన వారినాశ్రయించియున్న మౌఢ్యభూతావేశ దోషమే కాని
సహజమలమైన స్త్రీస్వభావము కాదు." [1] వారి మూర్ఖత్వంవల్ల
సంసారంలో శాంతి సౌఖ్యాలుండవు. అత్తలు కోడళ్ల మీద ఎక్కడలేని పెత్తనాలు
చెలాయిస్తుంటారు. కోడంట్రికాలు పెడుతూంటారు. ఆడపడుచుల
అధికారాలు సరేసరి. "ఆడపడుచు అర్థమొగుడు" అనే నానుడి ప్రారంభమైంది.
ఆడపడుచుల సాధింపులకు అంతూపొంతూ ఉండదు. స్వర్గంగా తీరవలసిన
అత్తవారిల్లు నరకంగా తయారవుతుంది. మగవారికక్కడా నెమ్మది ఉండదు.
స్త్రీలను విద్యావివేక విహీనలుగా చేసి, అజ్ఞానాంధకారంలో ఉంచితే, పురుషులు
పురోభివృద్ధి సాధించలేరని పంతులుగారు చాటి చెప్పారు. స్త్రీజాతి నుగబాక్కడం
ఉత్తమ సంస్కారాన్ని పొందలేకపోవడమే. చదువులేక తెలివి తక్కువదయిన స్త్రీ
ఏ యింట్లో ఉంటుందో ఆయిల్లు ఎన్నటికీ పైకిరాదు. పురుషులు తమ కోసమైనా
స్త్రీలకు విద్యాబుద్ధులు చెప్పించాలి, లేని పక్షంలో వారే అధోగతి పాలవుతారు.
సంసారజీవనానికి స్త్రీలకవసరమయిన [illegible] విద్యావివేకాలను 'సత్యవతీ చరితం' లో
పంతులుగారు చక్కగా వివరించారు. ఈ పుస్తకం ఆనాటి పాఠకులనెంతగా
ఆకర్షించిందంటే – కొందరు తమ యిళ్లల్లో పుట్టిన ఆడపిల్లలకు 'సత్యవతి' అనే
పేరుపెట్టుకొనేవారట!

చదువు లేకపోవడం వల్ల కొన్ని అనావశ్యకభయాలు పిచ్చినమ్మకాలు
అర్థం పర్థంలేని ఆచారాలు తలెత్తుతాయి. తమ స్వీయచరిత్రలో పంతులుగారిలా
చెప్పారు. "ఆ కాలములో ఎల్లవారికి దయ్యములయందలి విశ్వాసము లత్యధికముగ
నుండెడిది. రోగమయినను మందుభూతవైద్యుని దగ్గరకో, లేక సోదెవాని

---

1. రా.వీ.స్వీ.చ.I. పు.3.

ఒయ్యంటిలో పరుగెత్తువారు'' [1] ఇలా చెయ్యడం కొంత వరకు తెలిపి ఎక్కువ తనమనే చెప్పాలి. దానివల్ల వారెన్నెన్నో కష్టనష్టాల పాలుకావలసివచ్చేది. ఈ అజ్ఞానాన్ని స్త్రీల నుంచి తొలగించాలంటె వారిని విద్యావతులుగా చేసి తీరాలి. విద్యవల్ల వివేకం వస్తుంది. అజ్ఞానాంధకార నిర్మూలనకు అత్యంతావశ్యకమయింది వివేక సూర్యోదయం. చదువులేనిదే బతుకేలేదు.

## కథాకథనం ద్వారా విజ్ఞాన వ్యాప్తి

పంతులుగారికి మనస్తత్వం బాగా తెలుసు. ఆశాస్త్రాన్ని తనలక్ష్యసాధనకు వినియోగించారు. ఎలాగంటె – ఎవరికేనా కథలంటే సరదా గదా! స్త్రీలు చదివి ఆనందించడానికి, వారికి పుస్తకపఠనం మీద ఆసక్తి కలగడానికి, కథలను రాయడం ప్రారంభించారు. స్త్రీలకుపయోగించే కథలెన్నో రాశారు. అవి అయిదు సంపుటాలుగా ప్రచురించబడ్డాయి. పంతులుగారి కథల్లో చెప్పుకోదగింది; 'సత్యసంజీవని' ఆ కథ ఆంగ్లమూలానికి అనుసరణ. అసత్యవాదం వల్ల కలిగే అనర్థాలాకథలో చక్కగా నిరూపించబడ్డాయి. సత్యసంజీవని – కథాసంపుటిలో 'మాణిక్యం కథ' తలమానికం వంటిది. కరుణరసభరితమయిన ఈకథ పఠితల మనస్సును కదిలించివేస్తుంది. అందుకే అది బాలబాలికలను అమితంగా ఆకర్షించింది.

విషయమేమిటో గ్రహించడానికి సులభంగా ఉంటాయి పంతులుగారు రచించిన కథలు. ప్రచారం కోసం చేసిన రచనలలాగె ఉండాలి మరి! అవి వినోదంతో పాటు విజ్ఞానాన్ని కూడా కలిగిస్తాయి. చదవాలనే ఆసక్తిని రేకెత్తిస్తాయి. స్త్రీలనాకర్షిస్తాయి.

పంతులుగారు ప్రచురించే 'వివేకవర్ధని' ముఖ్యంగా స్త్రీ విద్యను ప్రోత్సహించడానికే స్థాపించబడిందని ఇంతకు ముందె సూచితం. ఆసంస్కరణకు అనుకూలమూ, అవసరమూ అయిన స్వీయాభిప్రాయాలను లోకాన ప్రకటించడం కోసమే ఆపత్రిక ఆవిర్భవించింది. అని పంతులుగారు స్వీయచరిత్రలో చెప్పారు. [2] పంతులుగారికీ, కొక్కొండ వెంకటరత్నం పంతులుగారికీ స్త్రీవిద్యా

---

1. కం. వీ. స్వీ. చ. 1 పుట. 11
2. కం. వీ. స్వీ. చ. 1 పుట. 78

విషయంలో వాదోపవాదాలు జరిగినప్పుడు, పంతులుగారు తమ వాదాలను, ''వివేకవర్ధని'' లో సమర్థిస్తుండగా, వెంకటరత్నంగారు ' ఆంధ్రభాషా సంజీవని ' లో వాటిని ఖండించేవారు. ' స్త్రీలకు విద్యకరాదను ' అనే వ్యాసాలు ''ఆంధ్రభాషా సంజీవని'' లో కనబడగానే ఆయన తానే రచయిత్రులనే స్వీకరించి, ' పురుషులకు శిరోజ్ఞకశాజనిత విద్యకరాదను' అని వ్యాసాలు వ్రాసి ' హాస్య సంజీవని ' లో ప్రచురించేవారు. ' సతీహిత బోధిని ' ముఖపత్రం మీద పంతులుగారి శ్లోకాన్ని ప్రచురించేవారు –

''అరక్షితా గృహేరుద్ధాః పురుషైరాప్త కారిభిః
ఆత్మాన మాత్మనాయాస్తు రక్షేయుస్తా స్సురక్షితాః''

''ఆప్తులయిన పురుషుల చేత గృహాలలో నిర్బంధింపబడిన స్త్రీలు సురక్షితలుకారు. ఏ స్త్రీలు తమ ఆత్మను తామే కాపాడుకుంటారో వారె సురక్షితలు'' అని దానిభావం. – మనుస్మృతి – 9 అధ్యాయం–12 వ సంఖ్య.

స్త్రీలు విద్యావతులయి ఆత్మవిశ్వాసంతో జీవించాలి. 1905 మార్చి ఒకటో తేదీ నుంచి పంతులుగారు ' సత్యవాదిని ' అనేవారపత్రికను ప్రారంభించారు. అందులో గ్రేస్ డార్లింగ్, జోన్ ఆఫ్ ఆర్క్, లేడీ జేన్ గ్రే, మేరీ కార్పెంటర్ మొదలయిన ఉత్తమ స్త్రీల చరిత్రలను ప్రకటించేవారు.

తరువాత నిర్వహించిన ' తెలుగు జనానా ' అనేపత్రికను కేవలం స్త్రీ విద్యాభివృద్ధికే వినియోగించారు. ఆ పత్రిక 1893లో స్థాపించబడింది. 1894 నుండీ రాయసం వెంకట శివుడు గారు దానిని నిర్వహిస్తూ వచ్చారు. ఆయన పూర్వగురువులు మల్లాది వెంకటరత్నంగారు ఆపత్రికను నెలకాళ్ళవరకీ, వారు దానిని విరమించడానికి ఉద్యమించి, ' నీ వద్దాసి గైకొని సాగిస్తావా? ' అని రాయసం వెంకట శివుడు గారికి రాశారని శివుడు గారు పేర్కొన్నారు.[1]

1876 లో స్త్రీకళాకల్లోలిని బెంగుళూరులో ప్రచురించబడింది. అది మూడుభాగాల గ్రంథం. మొదటి భాగం స్త్రీకళాకల్లోలిని, రెండవ భాగం

---

1. రాయసం వెంకట శివుడు, ఆత్మచరిత్రము, పుట.228, 1933.

స్త్రీ విద్యామణి అనే శీర్షికతో వెలువడింది. దీనిలో 69 వ్యాసాలున్నాయి. ఇవి పంతులుగారి నెక్కువగా ప్రభావితం చేసినట్లు ఊహించవచ్చు. కర్త జియ్యరు సూరి, బెంగుళూరులోని పాఠశాలాధ్యాపకుడు.

ప్రాచీన వ్యాసకర్తలలో ప్రముఖులుగా పేరొందదగిన వ్యక్తులలో ఆయన ఒకరు. వీరేశలింగం పంతులుగారిని స్త్రీ విద్యావిషయంలో పరోక్షంగా ప్రబోధించిన వ్యక్తి శ్రీ జియ్యరు సూరి. ఈ వ్యాసాల పరమార్థం స్త్రీవిద్యా విజ్ఞానాభివృద్ధుల ఆవశ్యకతను నొక్కిచెప్పడమే. వ్యాసాల పేర్లు – ''స్త్రీలకు విద్య ఆవశ్యకం, చదువని వారికి చదివిన వారికి గల భేదం, విద్య స్త్రీలను చెరపదు, స్త్రీలు చదివితేని బిడ్డలకుపయోగం, స్త్రీలు చదివితేని పురుషులకు సహాయం, స్త్రీధనం, పతంతు నిర్భాగ్యం.'' ఇలా ఉంటాయి.

విద్యావిహీనురాలయిన సహచరితో సంసారం జోడు గుర్రాలు లాగవలసిన బండిని ఒకే గుర్రం లాగే విధంగా భారాన్ని కలిగిస్తుందన్నారు. ఈ ఆలోచనలే పంతులుగారిలో వేళ్లు తన్నుకొని నిలిచాయి. జియ్యరు సూరి వ్యాసాల వల్ల వీరేశలింగం పంతులుగారెంతో ప్రభావితులయ్యారు. వ్యాసాల శీర్షిక నామాలను కూడా కొన్నింటిని సమానార్థమిచ్చేవానిగా, మరికొన్నింటిని వానినే గ్రహించారు.[1] స్త్రీ విద్యావతికాకపోతే అవిద్యాశిరోమణిగా ఉండి పిల్లలను సక్రమంగా పెంచలేదు. గుడ్డివానికి గుడ్డివాడు త్రోవ చూపినట్లు కుంటివానికి కుంటివాడు భరతనాట్యం నేర్పినట్లుంటుంది. ''మూఢుని అస్తి మొండెడికే నాస్తి'' అన్నట్లు మూఢురాలైన భార్యవలన ఆస్తిహరించుకు పోతుందన్న జియ్యరు సూరి వ్యాసాల సారాంశం వీరేశలింగంపంతులుగారి అణువణువులో జీర్ణించుకు పోయింది. ఉత్తమ స్త్రీల చరిత్రం ఈ భావాలను మరింత స్పష్టంచేస్తూ పంతులుగారిచే రచించబడిన గ్రంథం.

పోతం జానకమ్మ అనే విదుషీమణి 1874లో ఫిబ్రవరి 24న విదేశయాత్రను గురించి వ్రాసింది. 'ఆంధ్రభాషాసంజీవని 'లో ప్రకటించింది. 'ఆంధ్రదేశము

---

1. శ్రీ తిరుమల రామచంద్ర – తెలుగువ్యాసము – నూరుసంవత్సరాలు, పు. 8.

సందలి స్త్రీ విద్య'' అనే శీర్షిక క్రింద బ్రహ్మశ్రీ కాశీభట్టు బ్రహ్మయ్య శాస్త్రిగారు రాశారు.[1]

స్త్రీలు విద్యావతులు కావాలని పంతులుగారెంతో కృషిచేశారు. వారిని విద్యాసంస్కారాలు గలవారిగా చేస్తేనే కాని, దేశానికి సాంఘికోన్నతి కలగదని పంతులుగారి గాఢవిశ్వాసం. వారికోసం ప్రత్యేకపత్రికలు నడిపారు. పుస్తకాలు రాసి ప్రచురించారు. వారికి విద్యమీద ఆసక్తి కలగడానికి కథలు రాశారు. 19 శతాబ్ది పూర్వార్థంలో ఆంగ్లేయుల విద్యాసంపర్క ప్రభావం వల్ల మన సాంఘికాచారాలు విశ్వాసాలు వేషభాషలూ మారడం మొదలెట్టాయి. ఆంగ్లవిద్యాధికులయిన మహానీయులు స్త్రీ విద్యను ప్రోత్సహించే ప్రయత్నాలు చేశారు.

ముఖ్యపట్టణాలలో బాలికా పాఠశాలలు స్థాపించారు. మైసూరునగరం మహారాజావారి ఔదార్యం వల్ల ఆంధ్రదేశంలో అనేక పట్టణాల్లో బాలికా పాఠశాలలు వెలిశాయి. వీటికి పూర్వమే మదరాసులో మిషు బాలికాపాఠశాలలు వెలశాయి. వీటికి పూర్వమే మదరాసులో వెలసినట్లు అధ్యాయంప్రారంభంలోనే చెప్పుకగదా!

విద్యాసంస్థలు జనసామాన్యానికి చెందవలసిన సహాయం కులస్త్రీల లోను, సామాన్య జనంలోను విద్యాభివృద్ధి చేయడమేనని పంతులుగారి ఉవాచ.[2] ఆడవారిని, పారుగువారిని విద్యాధికులతో సమానమయిన తెలివితేటలు గలవారిగా తయారుచేయకపోతే మనం విద్యాలాభం వల్ల కలిగే సంతోషాన్ని పూర్తిగా పొందలేం, అంతేకాదు, వారి మూఢత్వం వల్ల మనమనేక కష్టాలు పడవలసివస్తుంది. వారికి సద్విద్య నేర్పితే అనేక దురాచారాలను వారే తొలగించుకుని, దేశక్షేమానికి తోడ్పడగలుగుతారు. అనేక కష్టాలనంతరింపజేసి, హృదయాల నానందపరవశంచేసి, మానవకాంతలను దేవకాంతలు గాను, గృహాలను స్వర్గధామాలుగాను మార్చగల అద్భుతశక్తి సంగీత విద్యకుంది. ఆగానకళను కులాంగనలకు నేర్పిన

---

1. ఆర్యమత బోధిని సం.౨, సెప్టెంబరు 1913.
2. పంతులుగారి ఉపన్యాసములు – విద్యాధికుల ధర్మములు పు. 22, 23.

కుటుంబాలు ఒకేజాతీయవరాలతో విలసిల్లుతాయి. అలాంటి అమృతోపమానమయిన ఉత్తమ విద్యను పండువంటి సంసార లతను పాడుచేయడానికి కంకణం కట్టుకున్న, మానవజాతికే ఘోరావమానాన్ని తెచ్చిపెట్టే, వేశ్యలనే పురుగుల వెసుభరాంతాల చేతుల్లోంచి విడిపించడానికి ప్రయత్నించడం దేశాభిమానం లేశమయినా ఉన్నవారికందరికీ ముఖ్యకర్తవ్యం అంటారు పంతులుగారు.

## స్త్రీలకు నీతివిద్య - ఆవశ్యకత

తల్లిగా పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పవలసింది, గృహానికి రాణియై కుటుంబాన్ని పరిపాలింపవలసింది మహిళయేగదా! తన ప్రవర్తననుచూసి బిడ్డలు సద్వర్తనం నేర్చుకొని సన్మార్గంలో ప్రవర్తించేట్టు తల్లిచేస్తుంది. మహాధర్మాలు మాని పతీశ్వరోపాసన చేస్తూ, సమస్త సద్విషయాల్లోనూ భర్తతో పక్షవహించి, లోకోపకారకార్యాలన్నిటిలో పతికి సాయమయిన సహధర్మచారిణిగా ఉండాలి. సంసారాన్ని సంసారంగా చేసుకోవాలనుకొనే ప్రతిపురుషుడు గృహిణికి విద్యనేర్పించాలి. ఈ స్త్రీవిద్యావశ్యకతను పంతులుగారు పదేపదే అనేక విధాల బోధిస్తూ వచ్చారు.

భర్తకు భార్య అర్ధశరీరమన్నది నిర్వివాదాంశంగదా! ఆఅర్ధశరీరం విద్యాగంధంలేకపోవడం వల్ల పక్షవాతరోగపీడితమయినట్లు కదల్లేక మూఢత్వభారం చేత ఎప్పుడూ కిందికి లాగుతూండడం వల్ల, విద్యావంతుడయిన భర్త సంసార సముద్రంలో సుఖంగా తేలలేక, అజ్ఞానాంధకారంతో విచారావర్తాలలో బడి తలకిందులుగా మునిగిపోతాడు. అలాగాక, ఆఅర్ధాంగమున్నూ విద్యావతి అయిన పక్షంలో పరిపూర్ణ శక్తి సంపన్నుడయి, వివేకంతో సహచరితో కలిసి సంసార సాగరాన్నీదుతూ జ్ఞానతేజస్సుతో ఆనంద ద్వీపాన్ని చేరి తరిస్తాడు. కాబట్టి విద్యాధికులయినవారు తమభార్యలకు, తోడబుట్టిన పడుచులకు, కొమార్తెలకు సద్విద్యచెప్పించి తమతో సమానమయిన వివేకంగలవారినిగా తీర్చిదిద్దడానికి

సమస్త హృదయతాపాలు పోకార్చి. అజ్ఞానాంధకారంలో పడి, జ్ఞానజ్యోతి దర్శనంలేని మనదేశ కులాంగనల కన్నులు తెరిపించి, విద్యాదీపంతో వారికి పదార్థవిజ్ఞానం కలుగజేసి, అననుభూతపూర్వమయిన నూతన సుఖాన్ని లభింపజేయడం పురుషనామధారులందరికీ పరమధర్మం.

“కుటుంబ సౌఖ్యానికి దేశాభివృద్ధికి, స్త్రీవిద్య అత్యంతావశ్యకము. స్త్రీలు చదువుదాని ఉద్యోగములు చేసెదరా - ఉత్తీర్లు పొందగా యుండియుందు, చదువుకున్న స్త్రీలు, గృహకృత్యములననాదరము చేయుదురనియందురు, విటులకుత్తరములు వ్రాయుదురనియందు రాసించు మహానుభావులకీ దేశములో విద్యాధికులలోనే పాండరున్నందున విద్యావంతులట్టి సందర్భప్రాయములను తొలగించి, స్త్రీ విద్య సర్వవిధముల వర్ధిల్లునట్లు చేయవలెను. విద్యావంతులు తమ సతులను బానిసల వలె చూడక, కలిసిమెలసి, పగలు, సంభాషించుచు నేకపంక్తిని భోజనము చేయుచు, వారిని గదులలో మూసి యుంచక వారికి స్వాతంత్ర్యము నిచ్చి సహధర్మచారిణులుగా చూడవలెను:’ 1

## గుంటూరు సాంఘిక సభ - అగ్రాసనాధిపత్యం

1903 వేసవిలో గుంటూరులో జరిగిన కృష్ణామండల సాంఘిక సభకు పంతులుగారు అగ్రాసనాధిపత్యం వహించారు. ఆయన ఉపన్యాసం వినాలనే కుతూహలంతో వందలాది ప్రేక్షకులు వచ్చారు. అప్పటికి కొన్నివేల రూపాయల వ్యయంతో హిందూవితంతు శరణాలయానికి గృహం నిర్మించారు. తరువాత నెలనుండీ తాము పదవీ విరమణ చేయబోతున్నామనీ, ఆరోగ్యస్థితి మళ్లీ బాగుపడితే స్త్రీ విద్యను గురించి యింకా పాటుపడతామనీ, 1904 మార్చి నెల ‘ జనానా ’లో శివుడు గారు రాశారు. స్త్రీజనాభివృద్ధే వారి ముఖ్యకర్తవ్యమనీ, ఆకారణం చేతనే ‘ జనానా ’ పత్రికను తమ ముద్రాక్షరశాలలో xxxx ముద్రింపిస్తూ, ముద్రణకయ్యే ఖర్చుల్లో కొంత సదుపాయాన్ని భరిస్తున్నామనీ వారన్నారు.

---

1. పంతులుగారి ఉపన్యాసములు - విద్యాధురీణుల అర్వాకృత్యములు పు. 55. పటమటలంక గ్రంథాలయ పుస్తకశాల 1945.

ఒక ఉత్తరంలో శిష్యుడు గారికి పంతులుగారిలా రాశారు.
''జనానా పత్రిక వల్ల లాభంలేదని తోచిన మీరు దానిని నిలుపుచేయవచ్చు. ఇక నాసంగతి యడిగినచో నాశక్తి కొలది హిందూ స్త్రీల యుపయోగార్థము కొఱకు పుస్తకములు, వ్యాసములు, వ్రాయుచుండవలెననియే నాకోరిక....''

పంతులుగారికి, శిష్యుడుగారికి కూడా స్త్రీవిద్యాభివృద్ధిని గురించి ఏకాభిప్రాయం ఉండడం వల్లనే 'జనానా' పత్రికను వారు కొనసాగించారు.

## స్త్రీలకు ఉపయోగపడే పత్రికలతో సంబంధాన్ని కోరడం

18 జులై 1904 మరొక జాబులో పంతులుగార్కి రాశారు.
''భారత ఖండమున కత్యంతావశ్యకమగు స్త్రీ విద్యాభివృద్ధి నిమిత్తమయి నాంతరావచ్ఛక్తులను వినియోగింపవలసియున్నది.....స్త్రీలకుపయోగపడు పత్రికతో నేనిక ముందు కొంత సంబంధము పెట్టుకొనవలయును. ప్రాత పత్రికకు పోటీగా క్రొత్త పత్రికను స్థాపించుట నాకిష్టము లేదు.'' ఇలారాస్తూ కలిసి పనిచేయడానికి కొన్ని షరతులు సూచించి, అంగీకారాన్ని తిరుగుటపాలోనే తెలియచేయమని రాశాడు. దీనిని బట్టి తెంపులేని వారి షరతుల సరళి, 'తిరుగుటపా' అనడం వల్ల వారి ఆతురత వ్యక్తమవుతున్నాయి.

తరువాత సెప్టెంబరు నెలనుంచి, 'తెలుగు జనానా పత్రిక' మరియు సతీహితబోధిని అనే శీర్షికతో ఉభయుల సంపాదకత్వాన ప్రకటింపబడింది. ప్రథమ సంచికలో 'స్వవిషయము' అనేశీర్షికలో 'నాశక్తికొలది స్త్రీలకు, బాలికలకు నుపయుక్తమగు విషయములను గురించి వ్రాయనుద్దేశించి యున్నాను. సర్వకారుణ్యమూర్తియగు పరమేశ్వరుడు నాసంకల్పమును నెరవేర్చి పత్రిక సర్వవిధముల స్త్రీల జ్ఞానాభివృద్ధికి తోడ్పడునట్లనుగ్రహించుగాక.' అని రాశాడు. కొన్నాళ్లు నడిచి 1907 జులై నుంచి ఆపత్రిక ఆగిపోయింది.

## గృహమె స్వర్గసీమ – ఎలా?

గృహం భూలోక స్వర్గంలా ఉండాలంటే గృహిణీ గృహస్థు ఎలాంటి వారు కావాలి? సుఖప్రదమనుకొన్న గృహంగా మారాలంటే దంపతులిద్దరూ విద్యావివేక సంపన్నులు, సత్యసంధులూ, ధర్మనిరతులూ, నీతిపరులూ, సుగుణవంతులూ అయి ఉండాలి.[1] అయితే గృహిణి ఎలావుండాలి? భార్య విద్యావతి అయితే భర్త అదృష్టవంతుడు. పంతులుగారు పురుషుల నుద్దేశించి ఇలా అన్నారు, ''భూతల స్వర్గంలా మీ గృహాలను రూపొందించుకోవాలంటే మీ వామాంగులను విద్యావతులుగా చేయడానికి సర్వవిధాలా ప్రయత్నించండి. అజ్ఞాన సముద్రములో మునిగేవారిని విద్యాప్లవమంత తేలిస్తే మీరు తెలిసి దరిచేర గలుగుతారు. స్త్రీల బాగుగులే పురుషుల బాగుగులు. వారికి ఒక్క విద్యాదానం మీరు చేయగలిగారా, విద్యాప్రభావం చేత వారు సమస్త ఆరోగ్యతలను పొంది మీ గృహాలను భూతల స్వర్గంగా చేయగలుగుతారు.''[2]

## ఉత్తమ స్త్రీల చరిత్రములు

ఈ గ్రంథాన్ని పంతులుగారు రచించి ప్రచురించారు. ఉత్తమ స్త్రీలు స్త్రీలకోసం, దేశంకోసం, మానవాళికోసం చేసిన అవిరళకృషిని, వారి జీవితాలను సులభశైలిలో రచించారు. ఆ మహిళామణుల జీవితాలు అన్యస్త్రీల నుత్తేజపరచాలనీ, వారిలో చదువుకోవాలనే ఆసక్తి పెరగాలనీ తద్వారా అజ్ఞానాంధకారం నుంచి విజ్ఞాన కాంతిలోకి వారిని కొనిరావచ్చనీ పంతులుగారి ఆకాంక్ష.

'ఉత్తమ మాత' ద్వారా మాతృదశకంటె మరేదశలోను స్త్రీకి ఎక్కువ గణ్యత కలగదన్నారు. సకలభాషల్లోను శ్రావ్యతరమయిన పదం 'అమ్మ' అనీ, దానిని మించిన మధురపదం మరొకటి లేదనీ, శిశువు ప్రప్రథమంగా నేర్చుకొనేదీ, జీవితాంతంవరకు మరువలేనిదీ ఆపదమేననీ అంటుంటారు. 'తల్లి' అనేపదానికి

---

1. 'సత్యవాదిని', కం.వీ. పుట.56.

2. వైది. పుట. 58.

అదృష్టాలు కాగానే ఇదివరకెన్నడూ ఎరగని సుగుణ సంపద స్త్రీలో కనబడుతుంది. తనలోని ప్రేమ మరింత అధికమయి, నిర్మలమయి, ప్రతిఫలరహితమవుతుంది. అంతవరకు పైకి కనబడకుండా లోపల దాగి ఉన్న స్వాభావిక సద్గుణాలన్నీ వికసిస్తాయి. ఆనాటి నుంచే స్త్రీ సహజమయిన 'అబలత' 'సబలత'గా మారుతుంది. భీరుత్వం ధీరత్వమవుతుంది. నిర్మలప్రేమ, నిరంతర సహనం, నిరుపమాన స్థిరచిత్తం, బుద్ధివిశేషం అప్పటి నుంచి ప్రస్ఫుటమవుతాయి. విద్యావతి అయిన స్త్రీ సద్గుణాలను సంతరించుకున్న మాత అయినప్పుడా గృహం ఎంత శోభిస్తుంది. ఎంతో సమైక్యానికీ, సంతోషానికీ తల్లే మూలమవుతుంది. చరిత్ర విశ్వంలో మహాపురుషులయిన వారి మహోన్నత జీవితాలకు మూలం వారి తల్లులే అన్న విషయాన్ని విద్వాంసులందరు గ్రహించారు. బిడ్డలపై ప్రేమ, బంధుప్రీతి, పేదలపై సానుభూతి మొదలయిన సద్గుణాలకు మనదేశంలోని మహిళామణులు ఆదినుంచీ సుప్రసిద్ధులేగదా!

మనదేశంలో స్త్రీలెంత సుగుణవతులయినా విద్యాభావం వల్ల కొన్ని అనర్థాలుత్పన్నమవుతున్నాయి. బిడ్డల మీద అతిప్రేమ వల్ల వారిని సరియైన అదుపాజ్ఞల్లో పెట్టలేకపోవడం, తత్ఫలితంగా వారు చెడిపోవడం, బంధుప్రీతివల్ల చుట్టపక్కాలకెక్కువ సాయపడ్డం, తత్ఫలితంగా వారు సోమరులుగా తయారవడం, పేదల మీద జాలిపడి దానధర్మాలు చేయడం వల్ల, దృఢకాయులు గూడ బిచ్చగాళ్ళుగా పనిపాటలు మాని తిరగడం — ఇలాంటి దుష్ఫలితాలు సంభవిస్తున్నాయంటారు పంతులుగారు. వీటికి కారణం కూడా స్త్రీలల్లోని విద్యావిహీనతే అనాలి. గృహానికి రాణిగా నున్న తల్లి విద్యావిహీనురాలయినప్పుడు ఆమె గృహాన్నెలా పరిపాలించగలుగుతుంది? తనకే తగిన పరిజ్ఞానం లేని తల్లి, బిడ్డలనెలా జ్ఞానాధికులను చేయగలుగుతుంది?

పిల్లలను దృఢగాత్రులనుగా తీర్చిదిద్దడం, సద్వర్తన నేర్పడం, జ్ఞానవంతులుగా చేయడం — తల్లుల ముఖ్యకర్తవ్యాలు. పిల్లలు దృఢగాత్రులవ్వాలంటే

తలిదండ్రులు దృఢగాత్రులు కావాలి. ప్రాచీనంలో అతిబాల్య వివాహాలు సర్వసామాన్యం. అందువల్ల పిల్లలకు దృఢగాత్రులయ్యే భాగ్యం అపురూపమనే చెప్పాలి. అది గ్రహించిన పంతులుగారు ఇతర విధానాల వల్ల పిల్లలను బలిష్ఠులుగా చేయవచ్చునన్నారు. వాసగృహాన్ని శుభ్రంగా ఉంచడం వల్ల, మంచి గాలివెలుతురు లోపలికి వచ్చేటట్లు చేయడంవల్ల, స్నానపానాదులకు నిర్మలోదకాన్ని ఉపయోగించడంవల్ల, ఆరోగ్యకరమయిన ఆహారాన్నిచ్చి, శుభ్రమయిన బట్టలు కట్టడం వల్ల, తగినంత దేహ పరిశ్రమ కలిగించడం వల్ల పిల్లలు దృఢగాత్రులవుతారు. ఇందులో సందేహం కూడ లేదు.

నిరంతరమయిన ఆరోగ్యవిధానాల నవలంబించకపోవడం వల్ల, ఆరోజుల్లో ఇతర దేశాలలో కంటె మనదేశంలో పిల్లలు పురిటిలోనే మరణించేవారు ఎక్కువగా ఉండేవారు. బ్రతికినవారు కూడా దుర్బలశరీరులై, నిరంతర వ్యాధిపీడితులు లయ్యేవారు. దానికి కారణం సూతికా గృహాల్లో పరిశుభ్రతా, ఆరోగ్య పద్ధతీ అవలంబించక పోవడమే. గాలీ, వెలుతురూ సరిగా రాని, కిటికీలు లేని, ఇరుకుగదుల్లో పురుళ్లు పోసేవారు. గది తలుపులు మూసేవారు. చూడవచ్చిన అమ్మలక్కల మూలంగా ఉన్నగాలి కూడ చెడిపోవడం, [illegible] కుంపట్ల పొగతో ఉక్కిరిబిక్కిరి కావడం – ఇలాంటి పరిస్థితుల్లో తల్లీ, బిడ్డా బతికి బయటపడడం వింతగాని మరోవిధంగా అవడం వింతకాదు![1]

పురిటిలో బిడ్డ చనిపోతే, అసలు కారణం తెలుసుకోక మూఢులు నొసట రాసిన రాత అనీ, ఆయువులేదనీ, పూర్వజన్మ పాపఫలమనీ ఎన్నెమ్మ నెత్తికొట్టిందనీ అనేక కల్పిత కారణాలతో మనస్సుకు సమాధానం చెప్పుకుంటారు. దుర్గంధం వల్ల పుట్టుకొచ్చే వేడపురుగుల్ని ఎన్నెమ్మ అనేవారు. తల్లులు విద్యావతులయితే తప్ప ఈ అనర్థం ఎలా తొలగుతుంది? అందుకే పూర్వం నెపోలియన్ చక్రవర్తి దేశాభివృద్ధికి మంచితల్లి కావాలన్నాడట!

విద్యాగంధం లేని తల్లులు తమ పిల్లలకు విలువయిన మంచి కొత్తదుస్తులను ధరింపజేస్తారు. కాని విమలమయిన వస్త్రాలను తొడగాలనుకోరు.[2]

---

1. ఉత్తమ స్త్రీ చరిత్రములు, పు. 87.
2. వైది. పు. 70.

•237•

మంచిగాలిలో తిప్పక పిల్లలను గదుల్లో దాచి ఉంచుతారు. రెండేళ్ల వయసువరకు ద్రవపదార్థాలతో పెంచవలసిన పిల్లలకు ఆరో నెల్లోనే అన్నప్రాశన చేసి పప్పులతో అన్నం పెడతారు. ఎవరి దగ్గరా తినిపిస్తారు. అందువల్ల అజీర్ణం చేసి దుర్బలులవుతారు. శరీరాల నిండా ఆభరణాలతో గంగిరెద్దులా అలంకరిస్తారు. ఆరోగ్యానికన్నా శరీరానికి అలంకారమే ముఖ్యమైంది. ఈ విషయం గ్రహించడానికి విద్య విజ్ఞానం కావాలి. అలాంటి స్త్రీలు తమ నగలను చూసుకొంటూ ప్రపంచాన్నే మరచిపోతారు. ఈ సందర్భంలో ఒక కథ గుర్తుకు వస్తుంది.

ఇటలీ దేశంలో కార్నీలియా అనే ఉత్తమ మాత ఉండేది. ఒకనాడామెను చూడ్డానికి ఒక ప్రభువు భార్య వచ్చిందట. 'నగలు చూపమ్మా' అని ఆమాత నడిగిందట. ''ఒక నిమిషమాగండమ్మా చూపుతాను'' అని ఆమె అన్నదట. ఇంతలో దృఢగాత్రులయిన యిద్దరు సుందర బాలకులు బడి నుండి వచ్చారట. ''ఇవే నా అమూల్యాభరణాలు'' అని ఆమె చెప్పిందట. ఆ ప్రభువు భార్య సిగ్గుపడి వెళ్లిపోయిందట! ఈ విషయాన్ని ఉటంకించడంలో పంతులుగారి అభిప్రాయం ఈ దేశంలో తల్లులందరు అలా మారాలనే గదా!

ఇక పిల్లలను సద్వర్తనులుగా ఎలా చేయాలి? ''తల్లిని చూచి పిల్లను తీసికోవాలి'' అనే నానుడి ఉండిగదా! పిల్లలు సద్వర్తనులు కావాలంటే ముందు తల్లులలాంటి వారు కావాలి. సహనం, శాంతం, సత్యం, మృదుభాషణ వారిలో నుండాలి. అవే పిల్లలకు గుణపాఠాలవుతాయి. వందమంది ఉపాధ్యాయుల కంటే ఒక సన్మాత ఎక్కువని పెద్దలనడంలో అంతరార్థమిదే. తల్లి అజ్ఞానురాలయి దుష్ప్రవర్తనలో ఉంటే ఆపిల్లలనే ఉపాధ్యాయుడూ బాగుపరచలేడు.

## తల్లి నేర్పవలసిన మొదటిపాఠం – విధేయత

విధేయత లేనినాడు ఇతర సుగుణాలేవీ అలవడవు. తల్లులు చెప్పినట్లు కాక, తమ యిచ్ఛారీతిని ప్రవర్తించాలనే పిల్లలను గమనించి వారి పంతాలు సాగనీయక

అవసరమయింతే పండనితనయినా తాముచెప్పినట్లు నడుచుకొనేటట్లు చెంచరాలి. తమమాట నెంగదని పిల్లలు తెలుసుకొన్న తరువాత ఎన్నడూ తలిదండ్రుల మాట వదరారు. అయితే తమమాటను పరిపాలించడానికి తలిదండ్రులు పిల్లను బతిమాలడం గాని, బెదిరించడం గాని చేయరాదు. అంచాలిచరుడం అనేది పనికిరాదు. చెప్పింది చేయడం వృక్షమ కర్తవ్యం. ఎన్నడూ దానికి భిన్నంగా చేయరాదు. పిల్లలలాంటప్పుడు తలిదండ్రులు చెప్పేదానికి నిజమయిన అర్థాన్ని గ్రహించి అనుసరిస్తారు. విధేయత సమస్త సద్గుణాలను నేర్చుకొనేటట్లు చెస్తుంది.

చెప్పింది చేసినప్పుడు సత్యానికి వేరే అర్థం చెప్పనక్కరలేదు. తలిదండ్రులు నిజం పలాల్గడమే పిల్లలకు నిజాన్ని నేర్పడం. నిజం చెప్పడం నిజమయిన గొప్పతనం. అమెరికా అధ్యక్షుడు వాషింగ్టన్ తనదేశానికి మహోపకారం చేసి గొప్పపేరు తెచ్చుకొన్నవాడు. పసివాడుగా ఉండగా అయనకు కొకరు ఒక పోటకత్తిని బహూకరించారు. అసంతోషంతో అతను తోటలోకి వెళ్లి చెట్లకొమ్మలు నరుకుతూ తండ్రిగారికి ప్రియమయిన ఒకపూలమొక్కను మొందలంట నరికాడు. మరునాడు తండ్రిగారది చూచి, బాధపడి తోటమాలిని ఎవరు చేశారని తిట్టడం ఆరంభించారు. అది విన్న బాల వాషింగ్టన్ అపనిచేసినది తానేనని తండ్రిగారితో నిజం చెప్పాడు. కుమారుని సత్యసంధతకు తండ్రి అమితానందాన్ని పొందాడు. వేయిమెండిపూలు, బంగారు ఫలాలు కాంచినంత ఆనందం కుమారుని సత్యవాక్యం వల్ల కలిగిందని చెప్పి, అసత్య వాక్యాలనాన్ని ప్రోత్సహించారాయన. తల్లిగారు అలాంటి సత్యసంధురాలు, సద్వర్తనురాలు అవడం వల్లనే అ బాలుడు అసుగుణాల నలవరచుకొని మహానాయకుడయ్యాడు.

## దుష్టవర్తను లెలా అవుతారు?

విద్యావిహీనులయిన కొందరు తలిదండ్రులు అతిగారాబంచేసి నాన్నను కొట్టమనీ, అమ్మను తిట్టమనీ పిల్లలకు అనుచిత కార్యాలను

చెయ్యమని ప్రోత్సహిస్తారు. ఆలోచిస్తే పూర్వపు మహర్షులు సంతోషిస్తారు. దానివల్ల పిల్లలకు పెద్దల పట్ల ఉండవలసిన మన్ననా మర్యాదలను మంచి గలుపు తున్నారని స్థానం వారి కుండదు. ఇలాంటివి ముఖ్యంగా విద్యాగంధం లేనిచోటే సంభవిస్తాయి.

దేశానికి ప్రాణాలయిన బాలల ప్రవర్తనలోను, పెరుగుదలలోను విద్యావిహీనత ఎంత నష్టం కలిగిస్తుందో దాని వల్ల ఎంత ప్రమాదకరమయిన స్థితి ఏర్పడుతుందో పంతులుగారు స్పష్టపరుస్తారు. ఎంత కృషిచేసి, తన సాహిత్యవ్యవసాయం ద్వారా సత్ఫలాలను సాధించాలని తపించారు. ప్రజల్లో చైతన్య కలుగజేసి, స్త్రీ విద్యావశ్యకతను స్పష్టపరచి బాలికాపాఠశాలలను స్థాపించి క్రమంగా బాలికలను చదువులకు పంపేట్లు చేయవలసి ఎంతగానో ప్రయత్నించారు. పంతులుగారి స్త్రీవిద్యాప్రచారంలో ముఖ్యమొకపద్యం.–

ఉ॥ చింతగ వాదమేల? అవివేకుల పోలిక? స్త్రీల విద్య సి
ద్ధాంతము చేసినారు మనుష్యులు పూర్వులు, వేదమొక్కటే
యింతులు మాడ గూడదని రింతె, పురాణచయంబు స్త్రీలకై
యెంతయు చేయుటల్ స్మృతులు నెల్లపురాణము లాత్తిచెప్పవే!

## ధవళేశ్వరంలో ఉపన్యాసాలు

స్త్రీ విద్యను గురించిన వాదప్రతివాదాలు వివిధ పత్రికల్లో ప్రచురించబడేవని ఇంతకు ముందు చెప్పుకున్నాం గదా! ఖండన వాదం 'ఆంధ్రభాషాసంజీవని' లో మండనవాదం 'పురుషార్థప్రదాయిని' లో బయలుదేరి 'వివేకవర్ధని' ని చేరాయి.[1] పత్రికా ముఖంగా మాటల పోరాటం బయలు దేరింది. దాని ఛాయలు ధవళేశ్వరంలోని మహాజనుల మీదికూడా పాకాయి. ఆవాదం అతివేగంగా ఫలప్రదమయింది. బాలికా విద్యాభ్యాసం గురించి పంతులుగారు ధవళేశ్వరంలో అనేక పర్యాయాలు ఉపన్యసించడం వల్ల – మొదట్లో పండిత వృద్ధులలో కొంత వ్యతిరేకత కనిపించినా – బాలికలకు విద్య ఆవశ్యకమనే నిశ్చితాభిప్రాయం అక్కడి ప్రముఖులనేకుల్లో కలిగింది. దృఢనిశ్చయం

1. సం. వీ. స్వీ. చ. I పు. 83

కలిగిన తరువాత కర్తవ్యతా విషయంలో తడవుండదు గదా! అందువల్ల అక్కడి ప్రముఖులు తలా కొంతా చందా వేసుకొని 1874 సెప్టెంబరు నెలలో ఒక బాలికా పాఠశాలను స్థాపించారు. బ్రహ్మశ్రీ అప్పన్న శాస్త్రిగారిని ప్రధానోపాధ్యాయులుగా నియమించారు. ఆసరి రామన్నాయుడుగారు, పోణం రామకృష్ణయ్యగారు, గాదిరాజు ప్రకాశరావుగారు మొదలయినవారు పాఠశాల ప్రధాన పోషకులు. తరువాత క్రమంగా, స్థానిక పరిపాలన సంఘం వారి సంరక్షణ కిందకు వచ్చింది. పురుషుల్లో కూడ విద్య అల్పంగా ఉన్న ఆరోజుల్లో, ఒక చిన్న గ్రామంలో వారు, చందాలతో బాలికా పాఠశాల నెలకొల్పి నడిపించుకోవడం కొంత ఆశ్చర్యకరమయిన విషయమే. కాని, సత్కార్య ప్రభావాన్ని తలచినప్పుడు అసాధ్యమయిందేదీ ఉండదు.

కొందరు పెద్దలు స్త్రీలకు విద్య పనికిరాదనడం వారి స్వార్థం కోసమేనని పంతులుగారు పద్యాల్లో వాడి చెప్పారు. దానికి ఉదాహరణగా ఒకపద్యం.-

సీ॥ నీరజాక్షి చదువు నేర్చుచో నరవరాంస
        విక్రయం బెట్లందు వెరచు నాకడు
    మానవతి విదుషి యైనచో వెర్రినా
        ముఖము పట్టు టెట్లందు పొక్కు నాకడు
    కమలాక్షి సద్విద్య గరపుచో నను దేవు
        నిక నెంచు టెట్లందు పొగులు నాకడు
    పికవాణి పాండితి బెరయంగచో దెబ్బలు
        పడుట యెట్లంచును వగచు నాకడు

    హాసంతరాన విద్యావతి యయ్యెనేని
    ప్రతిమలను గొల్పుటెట్లందు బెదరు నాకడు
    పేరు పూర్వ నాగరికులో పెద్దలిపుడు
    దుష్కులాచార రక్షణోద్యోగులకట!

కొక్కొండవారు స్త్రీవిద్యకూడదు అని 'ఆంధ్రభాషా సంజీవని'లో ఒకవ్యాసం ప్రకటించగా దానికి ప్రతిగా కందుకూరి వారు పురుషులకు విద్యకూడదు అని 'వివేకవర్ధని'లో భాగమయిన 'హాస్యసంజీవని'లో రాశారు.

మనుష్యులకాంతయును ఉండనివాదం చూడండి.— "పురుషులకు విద్యకూడదు — మా పూర్వులెప్పుడున్నూ విద్య చదువుకోలేదు. కాబట్టి విద్యాభ్యాసము పూర్వాచార విరుద్ధము. పూర్వాచారవిరుద్ధమైన పని ఎన్నటికిన్ని చేయరాదు. ఇయ్యుక్తి చేత చూచినా, విద్యనేర్చుకోవడం వల్ల చాలా కష్టాలు కలుగుతూవున్నవి. ఇప్పుడు కోర్టులలో పుట్టే తప్పుడుదస్తావేజులున్నూ, దొంగపత్రములున్నూ చదువు మహాత్మ్యముగానే కదా పుట్టుతూవున్నవి. ఎవరూ చదువుకోని పక్షమందు తప్పుడుదస్తావేజు లేలాగుపుట్టునో బుద్ధిమంతులకు కందరకూ తెలుసును. కాబట్టి మేము ఈ విషయములో విస్తరించి వ్రాయవలసిన పనిలేదు. ఈ ఒక్క దృష్టాంతమే పురుషులకు విద్యకూడదనుటకు చాలినంత ప్రబలయుక్తిగా నున్నది. విద్య చదువుకోవడంవల్ల ప్రయోజనమేమి? పూర్వకాలపు వారందరూ విద్య చదువుకోకపోయినందుచేత చెడిపోయినారా? చదువుకోకపోతే జీవనం జరగదా? కాలుమీద కాలువేసుకొని కలిగిన మాన్యంలో సుఖంగా కాలక్షేపం చేయనలేక, తీరికవారలుండి విద్యపేరు పెట్టుకొని వృథాగా శ్రమపడడం ఎందుకు? దొరతనంవారు మన గ్రామాలలో బళ్లుపెట్టించి పిల్లవాళ్లను పాడుచేస్తూవుండగా దేశాభిమానులంగల వారందరూ చూస్తూ ఊరుకోవడం న్యాయమా? దొరతనం వారికి అందరూ చేరి మాకు విద్యవద్దని మహాజరు అర్జీలను పంపించుకోరాదా? పెద్దలందరూ సభచేసి, మనశిష్టాచారానికి విరోధంగా చదువుకొనేవారిని వెలివేస్తామని గట్టిగా కట్టుదిట్టములు యేర్పరచి విద్యమాన్పరాదా? ఇంగ్లీషువారు చదువుకొని బాగుపడలేదా అంటారేమో, వారు తెల్లని వారు, మనము నల్లనివాళ్లము." [1]

ఈ విధంగా నడిచింది ఖండన. ధవళేశ్వరం విడిచిన తరువాత 1876లో రాజకీయ పాఠశాలలో తెలుగులో ద్వితీయోపాధ్యాయ పదవి నిస్తామని మెట్కాఫ్ దొరగారు ఫారసీ శ్రీనివాసరావుగారిచేత కబురు పంపారు. ప్రథమంలో నిరాకరించినా సహృదయులయిన బంధుమిత్రుల సలహాలననుసరించి పంతులుగారు ఒప్పుకోక తప్పలేదు. ఈ కాలంలో బుర్రా రామలింగం శాస్త్రిగారు చిరకాల మిత్రులు చల్లపల్లి బాపయ్యగారు ధవళేశ్వరంలో నున్నప్పుడు మిత్రులయిన బసవరాజు గవర్రాజుగారు, ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు పంతులుగారి కాప్తులయి పత్రికా నిర్వహణలో సహాయపడుతూ ఉండేవారు.[2]

1. కం.వీ.స్వీ.చ. 1—పు.98.
2. కం.వీ.స్వీ.చ. 1—పు.100.

## రాజమండ్రి ఇన్నీసుపేటలో బాలికా పాఠశాల

పంతులుగారి సంస్కరణ కార్యకలాపాల వల్ల ఉపన్యాసాల వల్ల ఉత్తేజితులయిన శాస్త్రి పాఠశాలా విద్యార్థులు రాజమండ్రి ఇన్నీసుపేటలో బాలికా పాఠశాలను స్థాపించాలనుకున్నారు.[1] అలా అనుకొన్నవారిలో పెద్దిభొట్ల వెంకటప్పయ్యగారు ముఖ్యులు. వారు పగలు పాఠశాలలో పనిచేసేవారు; విద్యార్థులు గనుక. అదే కారణం వల్ల ధన సహాయం కూడా చేయలేరు. అందువల్ల వారి భావాలకు రూపమిచ్చే భారం పంతులుగారు వహించారు. చందాలు వేయించి 1881లో ఆ పాఠశాలను స్థాపించారు.

మెట్కాఫ్ దొరగారు అడగడం వల్ల పిఠాపురం రాజాగారు ఆ పాఠశాలను కొంతకాలం తమ సత్రంలో నడపడానికి అంగీకరించారు. పంతులుగారు నగర పారిశుద్ధ్యవిచారణ సంఘంలో సభ్యులవడం వల్ల మొదట 10 రూపాయలు, మరు సంవత్సరం 15 రూపాయలు మూడో సంవత్సరం 20 రూపాయలు సహాయం ద్రవ్యమిప్పిస్తూ వచ్చారు.[2] దొరతనంవారు కూడా వేరుగా కొంత సహాయపడుతూ వచ్చారు. సత్కార్యాలను చూసి సహించలేనివారు సమాజంలో ఏకాలంలోనూ ఉంటారు గదా! అలాంటి వారు విఘాతాలు కలిగించడానికి ఎంతో ప్రయత్నం చేసి నిర్వాహకులను బాధపెట్టగలిగినా అలాంటి ప్రయత్నాలు చివరకు నిష్ఫలమవడం కూడా తప్పదు. ఆ బాలికా పాఠశాల ప్రభుత్వం వారిచే స్వీకరించబడి స్థిరపడిపోవడంతో బాలికా విద్యాభ్యాసానికెంతో ఉపయోగకరమయింది.

1880-81 రాష్ట్రవిద్యాధికారి నివేదిక ననుసరించి స్త్రీ విద్యాభివృద్ధి ఈ క్రింది విధంగా కనబడుతుంది. స్థానికుల అభిప్రాయానుసారం బాలికలకు స్త్రీ ఉపాధ్యాయినుల ఆవశ్యకత ఎక్కువగా కనబడింది. ఉపాధ్యాయినులయితే బాలికలను బడికి మరింత ఉత్సాహంతో పంపాలనే కోరిక తలిదండ్రుల్లో కనబడింది. అందువల్ల ట్రైనింగు పాఠశాలల ఆవశ్యకత కూడా ఏర్పడింది. స్త్రీలే ఉపాధ్యాయినులయితే బాలికలు పెరిగి పెద్దవారయినా నిశ్చింతగా బడికి పంపి చదువు కొనసాగించవచ్చునని వారనుకున్నారు. విశాఖపట్టణం, విజయనగరం, రాజమండ్రి, ధవళేశ్వరం,

1. కం.వీ.స్వీ.చ.1 పు.168.
2. పైది.

కాకినాడ, మచిలీపట్టణం మొదలయిన చోట్ల బాలికాపాఠశాలలు ఈ వరకే స్థాపించబడి పురుషుల చేత సమర్థంగా నిర్వహించబడుతున్నాయి. ఇందులో ముఖ్యంగా చెప్పుకోవలసింది రాజమండ్రి పాఠశాల – నియమయిన వయసు, విద్వత్త, సమర్థత కలిగిన స్త్రీలు ఉపాధ్యాయినులుగా రావడానికి ఇంకా వ్యవధి కావాలి.

అప్పటికి రాష్ట్రంలో ప్రభుత్వానికి ఏమీ ప్రతిఫలం లేని బాలికా పాఠశాలల్లోని బాలికల సంఖ్య బాలుర పాఠశాలల్లోని బాలికల సంఖ్య పరిశీలిస్తే వారి అభివృద్ధిని గురించి ఒక అభిప్రాయము ఏర్పడుతుంది.[1]

| మతం | 1878-79 | 1879-80 | 1880-81 |
|---|---|---|---|
| హిందువులు | 9,218 | 16,487 | 18,442 |
| స్థానిక క్రైస్తవులు | 6,285 | 9,331 | 9,772 |
| ముస్లింలు | 381 | 700 | 958 |
| యూరేషియన్లు | 2,302 | 2,398 | 2,542 |
| ఇతరులు | 207 | 504 | 522 |
| బాలుర పాఠశాలల్లో బాలికలు | 8,359 | – | – |
| మొత్తం | 26,752 | 29,419 | 32,236 |

<u>రాష్ట్రంలో తీరాంధ్రంలో బాలికా విద్య</u>

1881 లో డైరెక్టరు గారు ఆడపిల్లల శాతాన్ని పెంచిన విద్యాలయాలకు ఉపకారవేతనాల ప్రణాళికలను కూడా ప్రతిపాదించారు.

ఈ విధంగా ప్రభుత్వం కూడా ఉత్సాహవంతులు, సంస్కరణాభిలాషులు అయిన స్థానికుల ఉత్సాహానికి ప్రోత్సాహమివ్వడం ముదావహం. బాలికలకు తెలుగు, లెక్కలతో పాటు ప్రాథమిక భూగోళం, విజ్ఞానశాస్త్రం, చరిత్ర, కుట్టుపని బోధించబడుతుండేవని ఇనస్పెక్షన్ రిపోర్టువల్ల తెలుస్తుంది.[2] అయితే ఆ నివేదికలో విజయనగరం

1. Report of Director of Public Instruction 1880-81.
2. Report of Elementary Education 1868-69 - Female Education.

లోని మహారాజావారి బాలికా పాఠశాలకు ఆనాడు ప్రథమ స్థానమిచ్చారు. ఇది రాజకుటుంబాలవారికి బ్రాహ్మణ బాలికలకు పరిమితమైంది; 1868-69 నాటికి 185 మంది బాలికలున్నట్లు అందులో 25 మంది బ్రాహ్మణ బాలికలు, తక్కినవారు రాజపుత్ర వంశంవారని తెలుస్తుంది. వారందరు రాజావారి సహాయంతోనే విద్యనభ్యసించారు. విద్యాలయం వ్యయం నెలకు సుమారు 1000 రూపాయలు. ఆవిద్యాలయాన్ని సెయింట్ జోసఫ్ సిస్టర్సు నిర్వహించేవారు.

విశాఖపట్టణంలోని బాలికా విద్యాలయం దానికంటె కొంచెం వెనుకబడింది. 150 మంది విద్యార్థినులు 12, 13 సంవత్సరాల లోపువారు, అన్ని కులాల వారు ఉన్నారు. ఆంగ్లవిద్యకై బడసిన అనకాపల్లి తాలూకా ప్రొప్రయిటరు గారి సతీమణి ఔదార్యం వల్ల ఆపాఠశాల నెలకొల్పబడింది. భవనాన్నికూడ ఆమె సహాయంతోనే ఏర్పరిచారు. దాన్ని కూడ సెయింట్ జోసఫ్ సిస్టర్సు సహాయంతో నిర్వహించేవారు.

రాజమండ్రిలో కూడా మహారాజా సహాయంతో స్థాపితమైన ఉత్సాహవంతులు బాలికా పాఠశాల నేర్పరిచారు. గపంతులుగారు పర్యవేక్షణలో ఇన్స్పెక్షన్ రోజు 71 మందికి 63 మంది హాజరయ్యారట. ఈ పాఠశాలలో ప్రధానంగా పేదపిల్లలు కనబడ్డారు. ఉద్యోగుల పిల్లలు, వర్తకుల పిల్లలు ఎక్కువగా అగ్రకులాలవారే ఉన్నారు. విద్యాప్రమాణాలు బాగున్నాయి. కుట్టుపనేర్పడానికి [illegible] ఉపాధ్యాయినులను ఉగ్రకులాల నుంచి ఏర్పరిచారు, కాని, తగిన పరికరాలను, బట్టలను వారికందించలేదు. కాకినాడలో మరొక బాలికా పాఠశాల ముఖ్యంగా కె. జగన్నాథం పంతులుగారి కృషి వల్ల స్థాపించబడినది. పిఠాపురం రాజావారు కూడా దానికి సహాయమందించారు. ఆనాటి కందులో ఉన్న 24 మంది విద్యార్థినుల్లో 14 మంది బ్రాహ్మణ బాలికలు, 1 వైశ్య బాలిక, 9 మంది శూద్రబాలికలు, అందరు 5, 12 సంవత్సరాల మధ్య వయసువారే.-- ఈ నివేదిక నాధారంగా చేసికొని గవర్నరు జి.ఓ.నెం.396, దీ 26.11.1868 తేదీన విజయనగరం మహారాజావారి ఉదార సహాయానికి అభినందనలు తెలిపారు.

## రాజమండ్రి కార్యక్రమాల్లో పునఃప్రవేశం

1900 సంవత్సరారంభంలోనే పంతులుగారు మదరాసు నుంచి వచ్చారు. వెంకట్లో ఆ పట్టణమాంతయినకు కొంత కొత్తగా కనబడింది. ఇదివరలో లాగా పాఠశాలా విద్యార్థులు లేరు. ఉన్నవారు పంతులుగారికి కొత్త. ఆయన బోధనలు వారెరుగరు. అందువల్ల సంఘసంస్కరణోత్సాహం వారిలో లేదు. పట్టణ ప్రముఖుల్లో కూడ ఆనాటి సంస్కరణోత్సాహం తగ్గిపోయింది. విద్యార్థికులు కూడా రెండు పక్షాలయినారు. సంఘసంస్కారపట్ల అనాదరంగలవారి సంఖ్య పెరిగిపోయింది. పురమందిరానికి 'హిందూ సంస్కార' పత్రిక చెప్పించడం కూడ నిలిపివేయబడింది. న్యాయవాదులు కూడ పంతులుగారికి కొత్తవారే. అయినా దేశిరాజు బాపయ్యగారిలాంటి నూతన మిత్రులు లభించారు. సంస్కారాభిమానులయిన పూర్వమిత్రులతోను, నూతన మిత్రులతోను కలిసి పంతులుగారు తిరిగి కార్యక్రమాల కుద్యమించారు.

## విక్టోరియా బాలికా పాఠశాల ఆవిర్భావం

1905 జనవరి 16 వ తేదీన విక్టోరియా బాలికా పాఠశాల పంతులుగారి స్వగృహంలోనే ప్రారంభమయింది.[1] తాము ఉపయోగించుకొనే చిన్నభాగం తప్ప నెలకు 30 రూపాయల అద్దె వచ్చే ఆ ఇల్లంతా పాఠశాలకే వినియోగించారు. ఈ పాఠశాలకు పంతులుగారధ్యక్షులు, దేశిరాజు బాపయ్యగారు కార్యదర్శిగా నియమితులయ్యారు. వితంతు శరణాలయానికి అనుబంధంగానే పంతులుగారు దీనిని స్థాపించారు. మదరాసులో విక్టోరియాగారాణి వితంతు శరణాలయమేర్పరచి వితంతువులను చదువు కోసం ట్రైనింగు పాఠశాలకు పంపుతున్నట్లు రాశారు కదా. పంతులుగారు మద్రాసు వదలి రాగానే ఆ శరణాలయం అంతరించింది.[2]

---

1. వి.ఎస్.సి.2 పు. 273

2. పైది పు. 274.

అంతరించిందనడం కంటే వారితోనే రాజమండ్రి తరలి వచ్చిందనడం సుబేమో!
పంతులుగారితో పాటు ఇద్దరు, ముగ్గురు బాలవితంతువులు రాజమండ్రి
శరణాలయానికి వచ్చారు. వారికోసం పాఠశాల కావలసి వచ్చింది. మదరాసులో
లాగా స్త్రీలను పంపడానికి తగిన పాఠశాల రాజమండ్రిలో లేదు. కేవలం
ముగ్గురు నలుగురు వితంతువులకు మాత్రమే గాక సామాన్యంగా
విద్యాభిరుచి కలిగిన కులాంగనల కోసం కూడా ఈ పాఠశాల ఉద్దేశించబడింది.
అందువల్ల కొందరు గృహస్థులు తమ భార్యలను పంపారు. బయట నుంచి
ఒకరిద్దరు బాలవితంతువులు కూడ చేరారు. వృద్ధుడయిన ఒక ఉపాధ్యాయునితో
నలుగురు బాలికలతో ఆరంభమైన పాఠశాల వర్షం రోజుల్లోనే 49 మంది
విద్యార్థినులతో పెంపొందింది. ఒక సంవత్సరానికల్లా విద్యార్థినుల సంఖ్య 150
వరకు పెరిగింది. మొదటి సంవత్సరాంతానికి ముగ్గురు ఉపాధ్యాయులు,
ముగ్గురు ఉపాధ్యాయినులు పనిచేస్తున్నారు. పాఠశాల కవసరమయిన
మార్పులు చేయడానికి బల్లలు వగైరాలను కొనడానికి, జీతభత్యాలకు
సుమారు 2,000/-లు రూపాయలు పంతులుగారు వ్యయంచేశారు.

పూర్వవిద్యార్థి అయిన పోలవరం జమీందారు గారికి ఒక వెయ్యి
రూపాయల చందా యిమ్మని పంతులుగారు ఒత్తిడి చేశారు.[1] బళ్లారి
కె.వెంకటరావుగారి చందా, మదరాసు అయన్.రంగయ్య చెట్టిగారి చందా
ఒడిలో మదరాసు శరణాలయం కోసం మయినా ఈ నూతన పాఠశాలకు
మార్చారు.[2] మునగాల జమీందారుగారి దగ్గర నుంచి మరికొంత చందా
వచ్చింది. మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థులైన మనాడు సంవత్సరాలపాటు
విద్యాలయంలో పనిచేయడానికి శిక్షణ పొందే హైందవ స్త్రీలిద్దరికి ఉపకారవేతనాన్ని
వారు ప్రకటించారు.[3]

---

1. వి.ఎస్.సి.2 పు.280
2. ఇండియన్ సోషల్ రిఫార్మర్ 26 మార్చి 1905
3. వైది.

ఈ విక్టోరియా విద్యాలయం ఆరంభించిన ఆరునెలల్లోనే [1] పంతులుగారు మునిసిపల్ కౌన్సిలులో స్థానం సంపాదించారు. ఆయనను నామినేట్ చేసింది ప్రభుత్వం. మునిసిపల్ ఛైర్మన్ సి. వెంకట్రామయ్యగారు "పంతులుగారి పాఠశాల స్త్రీ విద్యాభివృద్ధికొఱకేర్పడిన ప్రత్యేకసంస్థ. అభిరుచికోసం వేసిన ముందడుగు. దానిలోని విద్యార్థినుల హాజరు, విద్యాప్రమాణాలు ప్రోత్సాహకరంగా ఉన్నాయి." అన్నారు.[2] తమ పాఠశాల సహాయం పొందడానికి అర్హత కలిగినదని ఇతర సభ్యులను కూడా అంగీకరింపజేశారు, పంతులుగారు.[3]

ఆస్తిక పాఠశాలను నడపాలన్నది పంతులుగారి చిరకాలవాంఛ. శ్రీ పిలకమర్తి లక్ష్మీనరసింహంగారు పట్టణంలో నడుపుతున్న మాధ్యమిక పాఠశాలను పంతులుగారి కోరిక మేరకు హితకారిణీ సమాజానికిచ్చారు. దీని సున్నత పాఠశాలగా మార్చాలన్నది పంతులుగారి ఆశయం. పుల్లు నారగారి సహాయంతో హాంటరు దొరగారితో మాట్లాడి ఆస్తికోన్నత పాఠశాలా స్థాపనావశ్యకతను వివరించారు. ప్రతిపక్షుల అభ్యంతరాలనధిగమించి విద్యాశాఖాధిపతుల సహకారంతో ఆస్తిక పాఠశాల సంపూర్ణోన్నత పాఠశాలగా రూపొందింది.

ఆ పాఠశాల భవనానికి పిఠాపుర సంస్థానాధిపతులైన శ్రీరాజా కుమార మహీపతి సూర్యారావు బహదూర్‌గారు మునిసిపాలిటీ భవననిర్మాణం వారి అంచనామేరకు 20 వేల రూపాయలిస్తామని వాగ్దానం చేశారు. కానీ కట్టడం ప్రారంభమయిన తరువాత రు.20,000 ల అంచనా రు.40,000లకు పెరిగి రు.60,000 లు అయింది. అయినా భవన నిర్మాణానికి సహాయం చేస్తానన్న మాటకు కట్టుబడి ఉదారబుద్ధితో రాజాగారు రు.60,000.లు ఆనందంగా అందించారు. పెరటి చెట్టులా సహాయంగా నిలచిన రాజాగారి ఔదార్యాన్ని మహాత్మము వ్యర్థంచేయలేదు పంతులుగారు వెచ్చించిన ప్రతి పైసా తాను స్వయంగా చెమటోడ్చి సంపాదించినదా అన్నంత విలువగా, జాగురూకతతో ఖర్చుచేశారు. మహాపరులకు లక్షకుపైగా [4] ఖర్చయివుంటుంది

---

1. G.O.M. Madras Civil List October, 1905 (Madras 1905)
2. Municipal Chairman's (Venkatramaiah) Letter to the Secretary, Local Beard & Muncipal Councils on 15th May, 1906 No.1488 on 16th August, 1906.
3. Ibid.

అన్పించే భవనం, రు.60,000 లకే పూర్తయింది. ఆ పట్టణానికి అందాన్ని కల్గించేలా నిలనిండా భవనం. "శ్రేయాంసి బహూని విఘ్నాని" అన్నట్లు ఎన్నో ఆటంకాలు కలిగాయి. అన్నింటినీ దాటి పాఠశాలా భవనం రూపొందింది.

జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులవి. వందేమాతరం నినాదంతో దిక్కులు పిక్కటిల్లిపోతున్నాయి. దేశభక్తులు, జాతీయనాయకులుగా గుర్తింపబడినవారికి, నూతనాదర్శాలు, పాటింపవలసినవి ఎన్నో కళ్లముందు కదలాడాయి. కాని ఎంతమందిలా నినాదాలతో సరిపుచ్చుకుండా, ఆచరింపవలసిన ఆదర్శాలని, క్రియాత్మకంగా చూపిన జాతీయనాయకుడు దేశభక్తుడు వీరేశలింగంపంతులుగారు. హరిజనోద్ధరణోద్యమాన్ని మహాత్ముని పిలుపు కన్న ముందే అందుకున్నారు. ఆస్తిక పాఠశాలలో హరిజనులకు ప్రవేశమే కాదు ఉచిత విద్యనందించారు పంతులుగారు. స్త్రీలకు ఉచిత విద్యనూ సహవిద్యనూ మొట్టమొదటి సారిగా ప్రవేశపెట్టిన వివేచనా శక్తి పంతులుగారిది. అంటరానితనం నిర్మూలనమే మహోద్యమంగా సాగుతున్న రోజుల్లో అనుమన్నకన్నా ఎంతో ఎత్తుగా హరిజనులకు ఉచిత విద్య అన్నది, ఆరోజుల్లో ఏసంస్కర్తకైనా ఊహించని సదాశయం. స్త్రీవిద్య ప్రోత్సాహకంగా మిగిలిన కాలంలో 'సహవిద్య' అన్నది ఊహాకందని దృఢనిశ్చయం. అన్నింటినీ అవలీలగా సాధించింది పంతులుగారి నిర్దిష్ట కార్యదీక్ష. ఈ రంగంలో పంతులుగారికున్న యుక్తి నైపుణ్యాలు వారి వంశస్థులవల్ల గాని వారు మధ్యలో కొంతకాలమక్కడ ఉండక పోవడం వల్లగాని కొనసాగబడలేదు.

"అమ్మో! ఆడది చదువుకుంటే ఇంకేమన్నా వుందా?" అని ఆరోజుల్లో పెద్దపెద్దలే అనుకునేవారు. నిద్రమత్తులో ఉన్న జనం ఈ పెద్దలకు తాళం వేస్తూ ఉండేవారు. [illegible] ఏతావతా స్త్రీ విద్య క్షీణించింది.

"అయ్యో! ఆడది చదువుకోకపోతే ఇంకేముంది! అన్నారప్పుడు పంతులుగారు. మెలకువ తెచ్చుకున్న జనం పంతులుగారు చెప్పినట్లు చేశారు. స్త్రీవిద్య కంకురార్పణ మైంది.

వీరేశలింగం పంతులుగారు లోపల అనుకున్నది పైకి అనేవారు. పైకి అన్నది చేసితీరేవారు. ఎన్ని అడ్డంకులొచ్చినా పక్కకు నెడుతూ, వీటి నుంచి దాటుతూ ముందుకు ముందుకు పోవడం పంతులుగారి సహజ గుణం. అందుకే అంతటి అసామాన్య వ్యక్తిగా మన్ననలందుకున్నారు.

సృష్టికి మూలం శక్తి. ఆ శక్తిని ఆదిశక్తిగా స్త్రీగా భావించి సంభావించారు పూర్వులు. క్రమక్రమంగా దేవతగా పూజించడమే మిగిలింది కాని మనిషిగా గౌరవించడం మరచిపోయింది జాతి. మూలబలంలోనే లోటు ఉంటే, పునాది రాళ్ళే బీటలు వారితే పర్యవసానము గ్రహించలేని అంధత్వమావహించడంతో దివ్యసౌధాన్ని చేతులారా పడగొట్టుకున్నారు, కోల్పోతున్నామన్న స్పృహ లేకుండా. జాతిని తీర్చి దిద్ది, తన అడుగు జాడల్లో సంతానాన్ని నడిపే తల్లి తప్పటడుగు వేయకూడదు. సక్రమ పంథాన నడిపేది విద్య. ఆ విద్యకు స్త్రీని దూరం చేయడం తమ పతనానికి తామే నాందీవాచకం పలకడం. అందుకే వ్యక్తినాశనం జరుగుతున్న సమయంలో తమ తోడివారికి కర్తవ్యబోధచేసి బాధ్యతలు గుర్తుచేసి తామాచరించి మార్గదర్శకులై వీరేశలింగంపంతులుగారు రంగంలో ప్రవేశించారు.

స్త్రీ విద్యాభివృద్ధికోసం ఉపన్యాసాలిచ్చారు. అనేక గ్రంథాలు రాశారు. పాఠశాలలు స్థాపించారు. ప్రచారానికి పత్రికలు ప్రకటించారు. తమ ఇల్లొక బడిగా మార్చారు. అనాథల జీవితాల్లో వెన్నెల వికసింపచేసినట్లే అజ్ఞానుల మనస్సుల్లో వేకువ వెలుగురేకలు ఉదయింపచేశారు. ఆయన మున్ముందుదారి చూపించే కరదీపిక. మంచిదారి వేయించే మార్గదర్శి. ఆ కరదీపిక వెలుగులో ఆనాడు నిర్మించిన బాటలో పయనించి ఈనాటికి అభ్యుదయ పథంలో సాగిపోతోంది స్త్రీజాతి. ఈ విధంగా పంతులుగారు తల్లి ఋణం తీర్చుకున్నారు. కాని గతంలో పురుషాహంకారం, అవిద్యలవల్ల తాము పడిన బాధలు మరచినట్లే విముక్తి కల్పించిన మహనీయునికి ఋణపడి ఉన్నామన్న విషయమూ మరచిపోతోంది స్త్రీజాతి.

''తరుణీ సంఘము లెప్పుడెవ్వని మహోత్సాహ! యుద్యమ్ముగ బం
గరు పూర్ణంబుగా వాఙ్మనః క్రియంబుల కర్తవ్యంబు సంధించి యం
క్షర మాలన్ గళమందు నింపగను దీక్షాదక్షులై భామినుల్
శిరముల్ వంచి వినమ్రలై నిలచి రాశీర్వాదముం జేయవే![1]

—: 000 :—

1. శ్రీ కాండపీటి వేంకట కవి, యుగపురుషుడు - వీరేశలింగం, పు.74.

## మూఢవిశ్వాసాలూ - దురాచారాలూ

ప్రకృతి పరిణామశీలం. అది తనంత తాను మారుతుంది. ఇతరుల ప్రమేయంవల్లా, ఋతుధర్మానుసారులైన మార్పులవల్ల సైతం అది మార్పులకు లోనవుతుంది. సస్యశ్యామలసీమలో మానవకల్పితమారణాయుధప్రయోగాలమూలంగా రుద్ర భూములుగా మారవచ్చు. నూతనవైజ్ఞానికసాంకేతికపరిజ్ఞానం వల్ల ఈ ఘోరక్షేత్రాలు సుందరనందనవనవాటికలుగా రూపొందవచ్చు.

మానవుడు సంఘజీవి. సంఘమూ, సంఘంలో ఏకదేశమైన వ్యక్తీ పరస్పరం రూపొందించుకున్న విధినిషేధాలతో కూడిన కట్టుబాట్లకు లోబడి కృషిచేస్తేనే పురోగతి ఉంటుంది. లక్ష్యమూ, లక్ష్యసాధనకు ఉపకరించే సాధనాలూ, అమలుపరిచే విధానాలూ, ప్రతి సమాజానికి నిర్దిష్టాలయి ఉంటాయి. లక్ష్యం మారినా మారకపోయినా విధానాలూ, సాధనాలూ కాలక్రమాన మారకతీరదు. ఎప్పటి కప్పుడు పునరాలోచనా, పునర్వ్యాఖ్యానమూ సాగకపోతే ఆ సమాజం ప్రగతివైపు పయనించలేదు.

కట్టుబాటు లన్నవి నిత్య నిర్దేశకసూత్రాలు కావు. వాటిని ఉయుంగించయగానికీ మార్చుకోవచ్చు. మారుతున్న విలువల కనుగుణంగా పెరుగుతున్న అవసరాల కనుకూలంగా ఈ కట్టుబాట్లు మారకతప్పదు; కట్టుబాటు కూడదనికాదు. స్వేచ్ఛ వేరు, స్వైరవిహారం వేరు. సంఘ పురోగతికి వీటిని మలచుకోక తప్పదు. అడ్డురానంత వరకు వ్యక్తిస్వేచ్ఛను ప్రగతిశీలదృక్పథం గల ఏసమాజమయినా హర్షిస్తుంది, ఆమోదిస్తుంది, ఆచరణలో అనువదిస్తుంది. న్యాయయుమైన వ్యక్తిస్వేచ్ఛను సంకుచితపరిచే చట్టమన్నా, సంపూర్ణంగా హరించే శాసనమన్నా స్వాగతించవలసినవి కావు.

అయితే, అనుశాసనపదం అధిష్ఠించినవ్యక్తులలో, తెగలలో సంకుచిత దృష్టి యేర్పడడంవల్లనో, సదవగాహన సన్నగిల్లడంవల్లనో, స్వార్థపరత్వం పెచ్చుపెరగడంవల్లనో రూపొందించబడే సాంఘిక నియమనిబంధనలు సంఘపురోగతికి గుదిబండలుగా తయారవుతాయి. ఒకానొక వర్గానికి ఆధిక్యాన్ని కట్టబెట్టడానికో లేక ఒకానొక తెగను అదుపాజ్ఞలలో పెట్టుకోడానికో ఏర్పడ్డ దురుద్దేశ ప్రేరిత నిబంధనలు సామాజిక చరిత్రలో కోకొల్లలుగా కనిపిస్తాయి. అంతే కాదు, సదుద్దేశంతో తలపెట్టినవి సైతం క్రమక్రమంగా దుర్వ్యాఖ్యానాలకు లోనయి గాని, ఆశయానికీ, ఆచరణకూ పొత్తుకుదరక కాని వెర్రితలలువేసిన సంఘటనలుకూడా మస్తుగా గోచరిస్తాయి.

అజ్ఞానంవల్లగాని, స్వార్థపరులు కల్పించడంవల్లగాని ప్రకృతివైపరీత్యాలను చూసి భయపడడంవల్లగాని మానవ సమాజంలో మూఢవిశ్వాసాలు రూపొంది పెంపొందుతుంటాయి. మరి సంఘంలో ఇలా ఇన్నిన్నిరూపాల వేరుకుపోయిన అనాచారాలకూ, దురాచారాలకూ అంతమెక్కడ? మూఢవిశ్వాసాలనూ, మూర్ఖాచారాలనూ, మొదలంట తొలగించే దెవ్వరు? అవినీతినీ, ఆశ్రితపక్షపాతాన్నీ అరికట్టే దెప్పుడు? ప్రసన్నవివేకంగలవారూ, లోకకల్యాణకామనకలవారూ చేతులు ముడుచుకు కూర్చోరు. చుట్టూఉన్నలోకం నందించినా, నిందించినా లెక్కచేయక నడుంకట్టి కార్యరంగంలో దూకి అసహాయ శూరుల్లా విజృంభిస్తారు.

ఇది మంచి, ఇది చెడు అని చెప్పిచెప్పినా వినిపించుకోని సమాజంలో సమాజానికి ఎదురీదడమంటే, ఎన్ని చిక్కుల నెదుర్కొవలసి వస్తుందో ప్రపంచచరిత్రలో సంస్కర్తలగాథలను పరిశీలిస్తే విశదమవుతుంది. సాధారణంగా సంస్కారప్రియులు సంస్కరణగా రూపొందే ప్రతి మార్పునకూ లోలోపల ఇష్టపడతారు. కానీ ఆచరణలో అనువదించడానికీ, అనువదించినవారిచర్యను ఆమోదించడానికీ జంకుతారు. ధైర్యంగా ముందడుగు వేసే కార్యశూరులున్నా కూడా వెనకడుగు వేయించే ప్రయత్నమే చేస్తారు. ఒకోసారి అంతతో ఆగరు. వెన్నుపోటు పొడవడానికి వెనుదీయరు. పైకి చెప్పలేకపోయినా తమ కంగీకారయోగ్యమయిన మార్పుల్ని

చేయలేని మనపెద్దలు, మంచివయినా తామంగీకరించని మార్పులను, సమాజంలో ఎలా ప్రవేశింపచేస్తారు? ఇక సంప్రదాయవాదులమాట చెప్పనక్కర లేదు.

ఏ కాలంలో చీకటి వ్యాపించినా, దానిని పారద్రోలాలనే ఉబలాటం, పక్షంభిత హృదయాన్ని చూచినా కళ్లోలితమయ్యే మనస్తత్వం, కారు చీకట్లు కమ్ముకువచ్చినవేళ, గోదావరిలా అర్తులకన్నీరు వరదలై పారుతున్న సమయాన నిశ్చబ్దంగా నీరవంగా తనకు పట్టనట్లు ఊరుకోగలుగుతుందా? ఏ చిన్న అవకతవకనూ సహించలేని సంస్కారహృదయం నీచత్వంతో నిండిన సమాజానికి ప్రబోధం చేయకుండా మనగలుగుతుందా? కేవలం ఉపన్యాసాలూ, ప్రబోధాలూ చాలని దశకు, ఎన్ని కష్టనిష్ఠూరాలెదురయినా కార్యక్షేత్రంలో దూకడం కర్మవీరుల జీవలక్షణం.

వీరేశలింగంపంతులుగారు మహామేధావి. అంతకంటె ఎక్కువగా సహృదయులుకాబట్టి ఒకటి కాదు, రెండు కాదు, అంతులేని అవలక్షణాలతో చివికి పోతున్న సమాజాన్ని సంస్కరించడానికి, దీక్షాకంకణం ధరించారు. అచంచలధైర్యవిశ్వాసాలు కవచంగా ప్రబోధపరమయిన సాహిత్యం ప్రధానాయుధంగా ఆయన సంస్కరణరణరంగంలో వీరవిహారం చేశారు.

<u>సంస్కారబీజం</u> –

సాంఘిక దురాచారాలూ, మూఢవిశ్వాసాలూ, అవినీతి, లంచగొండితనం, వంచన, దంభాచారాలూ, మతమౌఢ్యాలవంటి దరిలేని దుష్టలక్షణాలతో కొట్టుమిట్టాడే సమాజాన్ని సంస్కరించడానికి దీక్షాబద్ధుడయిన ఈ మహామనీషికి ఎవ రందించా రీ సందేశం? తల్లిదండ్రుల సంస్కారమా? తాతముత్తాతల ప్రభావమా? ఇరుగుపొరుగు సీమలలోని హేమాహేమీల ప్రబోధమా? తాతముత్తాతల ప్రభావం, ఏ రకం కావచ్చునేని వీరేశలింగంపంతులుగారే అంటారు. ముత్తాత వీరశైవుడయినా స్మార్తులకన్యను వివాహంచేసుకున్నారట. తాతగారు

లింగధారణ త్యజించారు.[1] ఈ కాలం కంటే ముందుగా కదముతొక్కే పదునైనహృదయం పంతులుగారిది. మతోన్మాదం రాజ్యమేలే ఆ రోజుల్లో, శాఖాదురభిమానం రాజ్యమేలే ఆరోజుల్లో శాఖాంతర వివాహం, లింగధారణ ఉపసంహారణలు చేసిన తాతముత్తాతలు పంతులుగారి సంస్కారోద్యమానికి ఉద్బోధకం కావడం ఆశ్చర్యంకాదు.

అయితే వంశపారంపర్యంగా వచ్చేలక్షణాలుమాత్రమే ఏ వ్యక్తినీ పరిపూర్ణసంస్కర్తగా మూర్తి కట్టించగలవని గట్టిగా నిష్కర్షించలేము. సమాజాన్ని పరికించి, దాన్ని హృదయంతో చూచి స్పందించి ఇతరసీమలలోని సమకాలిక సంస్కర్తలప్రభావంచే ఉత్తేజాన్ని పొంది అపూర్వశక్తిమంతుడుగా ముందుతరాలకు ఆదర్శవ్యక్తిగా నిలుస్తాడు.

వీరేశలింగంపంతులుగారితో సంస్కారపరమయిన వ్యక్తిత్వం రూపుదిద్దు కుంటున్నరోజుల్లో సహాధ్యాయునితో సాగిన చర్చలవల్ల బ్రహ్మసమాజవాసనలు సోకి సమదర్శనానికీ సమతాసమాజ సందర్శనానికీ అంకురార్పణ జరిగింది. అప్పట్లో దేశంలో కొత్తగా వీస్తున్నగాలి బ్రహ్మసమాజభావనలతో నిండి కేశవచంద్రసేన్, ఈశ్వరచంద్రవిద్యాసాగర్, దేవేంద్రనాథటాగూర్ వంటి మహామహుల ఉత్తమోదాత్త రచనలు ఉపన్యాసాలు, పంతులుగారి కర్తవ్యనిష్ఠను ఆమ్రేడితంచేశాయి. పంతులుగారి కార్యక్రమాలకు వలసిన అర్థబలం అందజేసినవారు పిఠాపురంరాజాగారు. బాలికాపాఠశాలకు తమ సత్రాన్ని, ఆరువేలరూపాయలను, టవున్‌హాల్ నిర్మాణానికి గొప్ప విరాళం ఇచ్చి సంఘసంస్కరణకార్యకలాపాలకు విశేషించి దోహదం చేశారు.[2]

బ్రహ్మసమాజకార్యకర్తల ఉపన్యాసాలు పంతులుగారిలో విప్లవబీజాలు నాటాయి. వాటికాక ప్రాపునూ ప్రోపునూ కలిగించి విస్పష్టరూపం ధరించడానికి మూలకారకులయ్యారు పిఠాపురంరాజాగారు.

---

1. వీ. స్వీ. చ. 1వే. 6
2. వీ. స్వీ. చ. 2వే. 382.

1870 వరకు పంతులుగారు పూర్వుల అడుగుజాడల్లో నడిచారు, చిన్న జుట్టుముండి, వారంవారం కత్తిరించుకోడం, జంధ్యం మొదలయిన వాటిల్లో. 1877 వరకు ఆయనసంస్కరణ కేవలం బాలికాపాఠశాలను స్థాపించడమే ఆచరణలో, వ్యాసాలు, ఉపన్యాసాలు, పుస్తకాలకు పరిమితమయింది తక్కిన సంస్కరణల్లో, ఆయన దురాచారాలను, మూఢవిశ్వాసాలను విమర్శిస్తూ పత్రికల్లోరాసేవారు. సభల్లో ఉపన్యాసాలుచేసేవారు. కాని నిర్మాణాత్మకమైన కార్యక్రమం పాఠశాల స్థాపన తప్ప ఏదీవుండేది కాదు. కానీ 1877 నుంచి 1881 వరకు ఆయన జీవితంలో అత్యంతక్లిష్టదశ అనుభవం. అప్పటినుంచి ఆయన నిర్మాణాత్మకకార్యక్రమాలను చేపట్టారు. మొట్టమొదటి వితంతువివాహం జరిగింది 1881లోనేకదా! అందువల్లే సంఘంలో ప్రతిబంధకాలధికమయ్యాయి. అన్నిటినీ ఎదుర్కొని ఒక్కొక్క కార్యక్రమాన్ని ప్రారంభిస్తూ 1882 నాటికి పట్టణంలో ప్రముఖసంస్కర్తగా రూపొందారు.

సంస్కరణాభిలాషకు సంస్కారోద్యమానికి పాదైన మూడవకారణం నాటి సామాజిక పరిస్థితి. హృదయమంటూ వుంటే ద్రవించకుండా ఉండడానికి సాధ్యంకానివి ఆనాటి బాలవితంతువుల కడగళ్ళు. ఇన్నెన్ని సంఘటనలు కలిసి ఆయనను చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయే సంస్కర్తనుచేశాయి. కాబట్టే "దృఢచిత్తంతో తనలోనిలోపాలను కూడా సుగుణాలుగా మార్చుకున్నారు. తనకోపాన్ని ఆనాటి సమాజంలోని చిలిపిఅంధవిశ్వాసాల మీద, కరుడుకట్టిన మూర్ఖత మీద అసహనంగా మార్చుకున్నారు. ఆయనలోని మరోవ్యసనం ప్రతిదానిలో తనమాటే నెగ్గాలనుకోవడం. దానిని ఒకప్రత్యేక పద్ధతిలో ప్రతిభావంతమయిన ధోరణిలో విజయసాధనకు ఉపయోగించుకున్నారు. తుకతుకలాడే తనకోపంలో భగభగమండే ఖడ్గాన్ని రూపొందించి మర్యాదామన్ననలను మట్టిచేస్తున్న ప్రతిఅన్యాయంపై, అమానుషాలపై పోరాడ్డానికి వినియోగించుకున్నారు"[1].

---

1. 'యుగపురుషుడు – వీరేశలింగం', వార్ల పే. 12.

" తిరోగామిలగు ప్రగతిద్వేషుల
కరకుగుండెలను ఖండించుటకై
కలమును కత్తిగ ఎత్తాడు " 1

మూఢవిశ్వాసాలు -

లెక్కకు మీరిన మూఢవిశ్వాసాలు ప్రజాజీవితాన్ని శాసిస్తున్నకాలమది. ప్రతియింట్లో ఒకదయ్యంపట్టినమనిషీ, ప్రతివీధికి ఒకభూతవైద్యుడూ సామాన్య మయ్యారు. ఆ సమయంలో

" తెలుగుజాతిని తెరలుతెరలుగ
కారుచీకటి క్రమ్మినప్పుడు
మూఢభాండపగాఢరుగ్మత
మూలుగుల్లో చొచ్చినప్పుడు
కాంతిఖడ్గము, కరుణవైద్యము
కార్యవాదిగ కావ్యశీలుడు
జాతిజనుల సముద్ధరించగ " 2

వీరేశలింగంగారు కార్యరంగంలో ప్రవేశించారు. 1872 నాటికి పంతులుగారికి పూర్వవిశ్వాసాలు కొన్నిమారిపోతున్న ట్లనిపించింది. దయ్యం పట్టినవాళ్లదగ్గరకు తరచు వెళ్లి వారిచేష్టలు, నటనలు పరిశీలించడంవల్ల మంత్రవేత్తలు చేసే కుతంత్రాలు అర్థమయ్యాయి. నిరంతరశోధనలో వాటిపైన నమ్మకం నశించింది.

ఆసమయంలోనే జ్యోతిశ్శాస్త్రంలో ముహూర్త, జాతకభాగాల్లో శకునాలు మొదలయినవాటిల్లోకూడ ఆయనకు నమ్మకం సడలింది. నమ్మకంలేనిదాన్ని నటించడమంటే ఆయన స్వభావానికి విరుద్ధం. నమ్మకంలేనిదాన్ని లేదనిచెప్పడం చెప్పిందాన్ని చేసిచూపడం ఆయన సహజస్వభావం. ఆయన అవిశ్వాసాన్ని

---

1. ' యుగపురుషుడు - వీరేశలింగం ', దాశరథి 'నీరాజనం' పే.68.
2. ' యుగపురుషుడు - వీరేశలింగం ', ఆరుద్ర పే. 121

శోకానికి మూపడానికి అతివేగంగా ఆయనకు చక్కటిఅవకాశం చిక్కింది. వాదిదాడ్డిలోని అరటిచెట్టు ఒకటి వేప తరిగిన కారణంగా కాననుంచి గెలవేయక, చెట్టునడుమ నుంచి చీల్చుకొని పువ్వుపైకి వచ్చి గెలవేసింది.[1] ఇలా చెట్టుమధ్య నుంచి గెలవేయడం అరిష్టదాయకమనీ, వెంటనే చెట్టుకొట్టి వేయాలనీ, అమ్మలక్కలు, బంధుమిత్రులు, పెద్దలు, సలహాలిచ్చారు. ఎవరెన్ని విధాల చెప్పినా ఆయన మాత్రం దాని నలాగే ఉంచారు. అదిలో జనులు గుంపులు గుంపులుగా వచ్చి చూచి వెళ్లేవారు. కొన్ని నెలలకు కాయలెదిగి కూరకు అక్కరకు వచ్చాయి. అప్పుడాకాయలు కోసి చెట్టును కొట్టారు, పంతులుగారు దగాటకోసం. సరిగా ఆసమయంలోనే ఇంటిదూలంకాసనున్న తార్రులో తేనెపట్టు పట్టింది. అది కూడా అశుభసూచకమని దాన్ని కూడా తీసివేసి దోషపరిహారార్థం బ్రాహ్మణులతో శాంతికర్మ చేయించాలని అందరూ చెవినిల్లు కట్టుకొని చెప్పారు. అయినా పంతులుగారు మొండికేశారు. ఏ మాత్రం చలించక మహామేరువులా నిలిచారు. తల్లీ, ముత్తవ్వ కూడా చెప్పి చూశారు. ఫలితంలేక విసిగిపోయారు.[2]

ఇక 1872లో కోరంగి ఆంగ్లోవర్నాక్యులర్‌పాఠశాలలో ప్రధానోపాధ్యాయ పదవి లభించింది. అపనికి వెళ్లేటప్పుడు మంచి ముహూర్తంలో వెళ్లమని బంధుమిత్రు లంతా నచ్చజెప్పాలని చూశారు. ఇంట్లోవారుకూడా బలవంతంచేశారు. అయినా లక్ష్యంచేయక అమావాస్యనాడు పనిలో ప్రవేశించారు. పాఠశాలకార్యనిర్వాహకు లిద్దరిలో ఒకరు పంతులుగారితాతగారిదగ్గర పనిచేసిన వారి పుత్రుడూ బంధువుడూ, సముద్రశుల్కపర్యవేక్షకుడు అయిన బళిజేపల్లి నారాయణమూర్తిగారు. వెళ్లగానే వార్లిల్లో దిగారు పంతులుగారు. ఆయన కూడా అమావాస్య నాడెందుకు వచ్చావన్నారు. ఈశ్వరుడు అన్నిదినాలను సమంగా చేసినపు డీరోజైతేనే మన్నారు పంతులుగారు[3]. దానిమీద జ్యోతిశ్శాస్త్రంగురించి ఆఇద్దరకూ చర్చ జరిగింది. కొన్నాళ్లకు నారాయణమూర్తిగారికికూడా ముహూర్తాలమీద విశ్వాసం సడలింది. అప్పట్లో ప్రతియింటా సాధారణమయిన పిశాచభ్రమ వీరేశలింగంగారితల్లిగారికిన్నీ ఉండేది. కాని పంతులుగారు తరచు నచ్చజెప్పడంవల్ల 1876 తరువాత మాత్రం

---

1. వీ.స్వీ.చ. 1, పే, 68.
2. వీ.స్వీ.చ. 1, పే, 69.
3. వీ.స్వీ.చ. 1, పే, 70.

అభ్రిమ కలుగలేదు. అది వచ్చినప్పుడు తాత్కాలికంగా ఏదో తంత్రం చేయిస్తూ వస్తే కాని పనికాకుండేది. కోరంగిలో కూడా ఒకసారి ఇలాంటిసన్నివేశ మొకటి తటస్థపడింది. అక్కడివారు ఒక గొప్ప భూతవైద్యుణ్ణి పంతులుగారి వద్దకు తీసుకొచ్చారు. గడ్డం, గోళ్లు పెంచి పావుకోళ్లు తొడిగి చేతబెత్తం పట్టి కాషాయాంబరాల్లో నుదుట కుంకమతో చూడ్డానికే భయంకరంగా ఉన్నాడాతడు. ముప్ఫై, నలభైసంవత్సరాలమధ్య వయసువాడు. అతనికి భోజనసదుపాయాలు కలిగిస్తానని, తల్లిగారికి స్వస్థత చిక్కినతరువాత ఏమైనా ఇస్తాననీ అన్నారు పంతులుగారు. అతడు కళ్లెర్రజేసి పంతులుగారి వంక క్రూరంగా చూడ నారంభించాడు. పంతులుగారు లెక్కచేయక అతనికేకలు విని పకపకా నవ్వ నారంభించారు. దానితో కోపంవచ్చి అతడు కారుకూతలు కూయ నారంభించాడు. అతని ఆగడాన్ని భరించలేక వెంటనే పక్కనున్న పాఠశాల భటునితో బయటకు నెట్టించారు పంతులుగారు. తోకతొక్కిన తాచులాగా అతడు బుసకొడుతూ పంతులుగారిని శపిస్తూ "రేపీ వేళ కేం చేస్తానో చూడు" అంటూ విసవిస వెళ్లిపోయాడు. వెళ్లినవాడు ఒక గది తీసికొని అలికి ముగ్గులు పెట్టి ఏదో యంత్రాన్ని వేసి ప్రయోగం చేసి పంతులుగారిని చంపేస్తానంటూ స్నానం చేసి తల విరబోసికొని కూర్చొని నిష్ఠగా ఏదో మంత్రజప మారంభించాడు. దాన్ని చూచి పంతులుగారి మిత్రులు భయపడి అతని దగ్గర కెళ్లి అలాంటి వారితో తగవు లాడ్డం క్షేమం కాదంటూ అతని దగ్గర కెళ్లి క్షమాభిక్ష వేడమని హితవు చెప్పారు. అయినా పంతులుగారు చలించక చిరునవ్వుతో 'ఏం చేస్తాడో చూద్దాం' అని వచ్చినవారిని వచ్చినట్లే పంపేశారు. ఆ యోగి రాత్రి వరకు భోజనం లేకుండా కూర్చొని చీకట్లో "హ్రాం" "హ్రీం" అని కేకలువేస్తూ అర్ధరాత్రి వరకూ ఆహారం లేకపోవడంతోనో, కొబ్బరినీళ్లు శైత్యం చేయడంవల్లనో, నిద్రమత్తువల్లనో, గంజాయిమైకంచేతనో మరేకారణమో కాని తూలి కింద పడిపోయాడు. ఎవరో తన్ను తోసేసి పడగొట్టారని భ్రమించి భయపడిపోయాడు. ఆభయంతోనే అతనికి జ్వరం వచ్చింది. ఒకరిని భయపెట్టబోయి తానే భయపడినట్లు మరునాడు చూడవచ్చిన వారందరితో పంతులు "శరభ సాళ్వాన్ని" తన మీద ప్రయోగం చేశారని, ఆ దేవత వచ్చి తాను పంపే దేవత నెత్తిమీద తన్ను కింద పడవేసిందనీ

తాం దరలోనే తన్నంతంటేస్తుందనీ చెప్పనారంభించాడు. పంతులుగారికి మంత్రమహిమలమీద విశ్వాసం తగ్గిన తరువాత తల్లిగారి భ్రమ నివారించడానికి, ''శరభ సాళ్వ మంత్రోపదేశం'' పొందారు.

ఆవిషయం ఆయెరాగి విని వుండవచ్చు. అందువల్లనే ఆ భ్రమ. అతతకంతకు అభ్రమలోనే బలహీనుడై సంధిలో కూడా పంతులుగారినే పలవరిస్తున్నాడని విని పంతులుగారు జాలితో అతని దగ్గరకు వెళ్లి తానేమీ చేయలేదని ధైర్యం చెప్పి అతన్ని తమ ఇంటికి తీసుకువెళ్లారు. అతడు మామూలుస్థితికి రావడానికి నెలరోజులు పట్టింది. అప్పుడాతనికి కొత్తబట్టలు కట్టబెట్టి ఒకరూపాయి ఇచ్చి పంపారు పంతులుగారు.[1]

ముహూర్తాలు గురించి ఆయన మాట్లాడుతూ, ఆంధ్రదేశంలో పక్క వెళ్లి కూడా మంచి ముహూర్తంలో తప్పితే జరగదు. తల్లిదండ్రులు బిడ్డలు సుఖపడాలని మంచి చెడ్డలన్నీ విచారించి వధూవరుల జాతకాలు పరీక్షించి లగ్నం నిశ్చయిస్తారు. జన్మపత్రాలు చూచి దీర్ఘాయుష్మంతులైన వరులనే కామార్తెలకు భర్తలుగా నిర్ణయిస్తారు. మరి జాతకబలమే ఉంటే దేశంలో ఇంతమంది బాలవితంతువు లెలా ఉంటారన్నది ఆయన మొదటి ప్రశ్న.[2] అందువల్లనే కంటికి కనిపించే వాస్తవాలు తనకు ఈ ముహూర్తాల మీద నమ్మకం నశింపచేస్తుందన్నారు.

ఈ భయంకరమైన విశ్వాసాలూ ఆచారాల ప్రక్కన ఉన్న మరొక క్రూరమైన విశ్వాసం జంతు బలి. మానవత్వానికి కళంకమైన ఈ ఆచారాన్ని వివేకవర్ధని పత్రికలో ఆయన నిశితంగా విమర్శించారు.

## సాంఘికదురాచారాలు

వీరేశలింగంగారి కాలంనాటికి అడ్డమాకలేక రాజ్యమేలుతున్న అత్యంత ప్రధానమైన సాంఘికదురాచారం అతిబాల్యవివాహం. మనను వికసించని శిశు దశనుంచి కళ్లు తెరవని పసికూన నుంచి కడుపులోని పాపకు కూడా పెళ్లిళ్లు చేసేంత హీనస్థితికి దిగజారింది, ఆదురాచారం. ''మనవారు ముఖ్యాచారానికి

---

1. వీ.స్వీ.చ. I పే. 72.
2. వీ.స్వీ.చ. I పే. 6.

దాసులు. ఆవేశావమావేశించినప్పుడు దంభం, ధర్మం, సత్యం, సర్వం పరిత్యాజ్యాలే.'' [1] పాశవిక ప్రవృత్తి రాజ్యమేలేటప్పుడు కన్నబిడ్డ అనే ప్రేమ మమతలు అదృశ్యమవుతాయి. సమర్థించుకోవడానికి, నోరు తిరగని ఏవో సంస్కృత శ్లోకాలను వల్లెవేస్తారు అర్థం తెలియకుండా. వారికి సమాధానంగా వీరేశలింగంగారి మాటలు. ''ప్రాచీనభారతీయుల్లో బాల్య వివాహాలసలెవరు కూడా వినబడి ఉండదు. వేదాల్లో బాల్యవివాహాలే మృగ్యం'' [2]

అస్వాభావికమైన ఈబాల్యవివాహపిశాచం ఆవేశాలవల్ల వచ్చిందే కాని విధివిహితమైంది కాదు. పంతులుగారి వివాహసమయానికి ఆయనకు పన్నెండూ, ఆమెకు ఎనిమిది ఏళ్లు. వధూవరులిద్దరికీ పెళ్లంటే ఏమిటో తెలియదు. కేవలం పిండివంటలు తినడం, భోగంమేళాలు చూడటం, బాజాభజంత్రీలు వినడం మాత్రం ఆనందంగా ఉండి ఉండవచ్చు. బొమ్మలపెళ్లిలాగ తమ పెళ్లి జరిగిందని పంతులుగారి అనువర్ణనం.

బాల్యవివాహంతోపాటు భోగంమేళం మరొక సాంఘికదురాచారం. వీరేశలింగంగారి వివాహ సమయంలో కూడా వధూవరులతరపువా రిద్దరూ చెరియొక మేళం పెట్టించారు. మేళం లేకపోతే పదిమందిలో తలవంపులని వారిభావం. మౌఢ్యానికి ఇంత కంటే తార్కాణమేం కావాలి? [3]

వీరేశలింగం గారిలో విప్లవభావాలు తలెత్తకముందు కూడా భోగంమేళాల విషయంలో ఆయన దృక్పథం సమకాలికులకంటే భిన్నమైందే. వేశ్యల నుంచుకోవడం ఆనాడు సర్వసామాన్యమైన విషయం. ఇంకా చెప్పాలంటే అది ఒక గొప్పగా, ఉన్నతసంస్కారంలో భాగంగా కూడా భావించేవారు. కొత్తకొత్తగా మారుతూ ఉన్నా వేశ్యా విషయంగా భిన్నాభిప్రాయం కలవారు పంతులుగారు. [4] ఛాందసుడుగా ఉన్న కాలంలోనే దుర్నీతి మీద పంతులుగారికి సహజద్వేష ముండేది. దుర్నీతిపరు లెదురైతే కంటగించుకునేవారు. కామరాజు.

---

1. వీ.స్వీ.చ. I వే. 27.
2. వీ.స్వీ.చ. I వే. 27.
3. వీ.స్వీ.చ. I వే. 29.
4. వీ.స్వీ.చ. I వే. 62.

వద్ద (చిత్రపు) పంతులుగారు లేఖకుడుగా ప్రవేశించారు. ఈ చిత్రపు కామరాజుగారు వేశ్యాసాంగత్యం గౌరవ ప్రదమని భావించే పూర్వనాగరిక కోటిలోవాడు, గవర్నమెంటుప్లీడరు.

ఆయన ఇంటివద్ద పంతులుగారు పనిచేసే కాలంలో సైతం కొన్నిసమయాల్లో ఆయన వేశ్య నిశ్శంకంగా వచ్చి సరసన కూర్చొండి ప్లీడరుగారితో సరసాలాడేది. అది సహించలేని పంతులుగారు నెలజీతం అందుకోగానే పని మానేశారు. పనివిషయంలోనే కాక కామరాజుగారు సర్వవిధాల దయతో గౌరవంగా చూచినా ఈ కారణం వల్ల పంతులుగారు ఇమడలేకపోయారు. ఈ విషయంలో పంతులుగారి ప్రవర్తన మనల్ని ఆశ్చర్యపరుస్తుంది. ఎలాగంటే ఏచిన్నకష్టాన్ని చూసినా అబలల లంటి కరగిపోయే పంతులుగారి హృదయం వేశ్యలవిషయంలో పాషాణసదృశమే. కాగడాపెట్టి వెతికినా వారి పట్ల సానుభూతి ఆయనహృదయంలో మచ్చుకక్కడా కనబడదు. అంత కఠినం కావడానికి కారణం వేశ్యలు సమాజానికి చీడపురుగులని ఆయన భావం. పెళ్ళిళ్ల వంటి పవిత్రమైన శుభకార్యాల్లో వారి భోగంమేళాలు అసహ్యకరాలని ఆయన అభిప్రాయం.

కాలుష్యమున్నచోట ఆయన కాలు మోపలేరు. అంతేకాదు జాషువాగారి మాటల్లో

"కందుకూరి కులుడు కాలు మెట్టినచోట
కాలుపెట్టలేదు కలుషలవము"[1]

వేశ్యలపట్ల ఆయన ఇంత కఠినంగా ఉండడానికి మరొక కారణం పెళ్ళిళ్లలో భోగంమేళాలపేర నిర్బంధంగా వసూలుచేయబడుతున్న సంభావనలు. పెళ్ళికి రావడం పాపం. తన స్థితిగతులతో సంబంధం లేకుండా అధికారుల మెప్పుకోసం ఉన్నా లేకున్నా తలకుమించిన సంభావన భోగంమేళాలకు సమర్పించాలి.[2] ఈ సంభావనల నిర్మూలన వివేకవర్ధని పత్రిక ప్రధానాశయాల్లో ఒకటి.

---

1. 'యుగపురుషుడు – వీరేశలింగం' జాషువా 'జోతలు', పే.81.
2. వీ.స్వీ.చ. 1 పే. 107.

"ఈ హిందూదేశమందు తప్ప మరేదేశంలోనూ ఏకాలంలోనూ ఏజాతిలోను వ్యభిచారమే ప్రతిష్ఠావహమైన కులవృత్తిగా నేర్పరచుకొని ...స్వేచ్ఛగా విహరించు కులమువారు ఉన్నట్లు కనియుం, వినియుం వుండలేదు". ఆకాలంలో రాజమండ్రి మొదలైన పట్టణాల్లో వేశ్యాప్రియులసంఖ్య మేర మీరిపోయింది.[1] ఈ విషయాన్ని గురించి వీరేశలింగంగారు "ఈ కాలంలో జారిణీసంభోగమే సత్కృత్యమని కొనియాడబడుతోంది. కట్టుకున్నభార్యను దుఃఖపెట్టి పరాంగనలను చేపట్టేవారు శ్లాఘనీయులుగా[2] ఎన్నబడకున్నారు. వేశ్యలు లేనివారు పెద్దమనుషులే కారని గణింపబడుతున్నారు. మీదు మిక్కిలి ఏకపత్నీ వ్రతస్థులు పురుషులేకారనీ పరిహసింపబడుతున్నారు". అధికారులే, ధనికులే వేశ్యల వశవర్తులు కావడంతో వారి అనుగ్రహం కోరేవారు ఆవేశ్యల అడుగులకుమడుగులొత్తవలసినవా రయ్యారు. ఈ వ్యసనపరులంతా తమను సమర్థించుకుంటూ వేశ్యావృత్తి నశిస్తే సంగీతనాట్యాలు నశిస్తాయని విలపిస్తూండేవారు. కులకాంతలకే లలితకళలు నేర్పితే కళలకే గౌరవం పెరుగుతుందని పంతులుగారి వాదన. సమాజానికి పట్టిన వేశ్యలనే చీడపురుగుల దౌర్భాగ్యం నశిస్తుందని ఆయన అభిప్రాయం. ఈ భావాలనన్నిటిని 'బ్రాహ్మ వివాహం' ద్వారా ఆయన ప్రచారం చేశారు. వీరు ముఖ్యంగా భోగంమేళాలకు సంభావనలిచ్చే ఆచారాన్ని ఎత్తిచూపి దానికి స్వస్తి చెప్పించగలిగారు. అదీ ముందుగా వివేకవర్ధనిలోనే ప్రచురింపబడింది. ఇలాంటి వ్యంగ్యరచనలు సంఘ దురాచారాలను కళ్లకుకట్టినట్లు చూపేవి ఆనాడు రావడం ప్రప్రథమ మవడంవల్ల ఆరోజుల్లో ఎక్కడ చూచినా జనులు గుంపులు గుంపులుగా చేరి దానిని చదివి ఆనందింపడం మొదలుపెట్టారు. అది ప్రచురించిన రెండేళ్లతరువాత పంతులుగారు ఏదో పనిమీద బందరు వెళ్లారట. అక్కడొక బాలిక అబ్రాహ్మవివాహాన్ని మొదటి నుండీ చివరవరకూ పంతులుగారి కప్పజెప్పి ఆయనఆశ్చర్యాన్ని కలిగించిందని

---

1. "యుగపురుషుడు - వీరేశలింగం" మామిడిపూడి వెంకటరంగయ్య సర్వతోముఖ సంఘ సంస్కర్త , పే. 36.
2. "వేశ్యలు" వివేకవర్ధని జవాన్ 1875, కం.వీ.కృ.గ్రంథం 8.పే.362-63.

అంటారు. దీన్నిబట్టి అప్రహాసనం ఎంత ప్రజాదరణాన్ని బడసిందో తన్మూలంగా పంతులుగారు తలపెట్టిన కార్యానికి ఎంత విజయం చేకూరిందో చెప్పనవసరంలేదు. ఇలా కనీకనబడకుండా సమాజంలో వేరుకుపోయిన దురాచారాలను ఎత్తి చూపి ప్రజలకు దాని వల్ల కలిగే అనర్థాల నవగతం చేయగలిగారు.

ఈ పత్రికానిర్వహణంలో పంతులుగారికి మిత్రులైన బుర్రా రాజలింగంశాస్త్రి గారు, వారి బాల్యసఖులైన చల్లపల్లి బాపయ్యపంతులుగారు, ధవళేశ్వరంలో ఉన్నప్పుడు మిత్రులైన బసవరాజు గవర్రాజుగారు అప్పుడాయనే దగ్గరకు తరచుగా వచ్చే పటిూరి లక్ష్మీనరసింహంగారు పంతులుగారికి తోడ్పడుతూ ఉండేవారు. విశాఖపట్టణము నుండి వచ్చి గోదావరిమండలన్యాయసభలో న్యాయవాదులైన పిర్కావూరి రుజ్జన్నశాస్త్రిగారుకూడా వారికి మిత్రులై పత్రికకెప్పుడయినా రాస్తూ ఉండేవారు. వీరితో కూడా బుర్రా రాజలింగంశాస్త్రి గారు, బసవరాజు గవర్రాజుగారు, పటూరి లక్ష్మీనరసింహంగారు ఎప్పుడూ కలిసిమెలిసి ఉండేవారు. పత్రికలో రాసే విషయాలను గూర్చి, మాన్పవలసిన దురాచారాల్ని గూర్చి, అనాచారాల్ని గూర్చి వీరాలోచించుకొనేవారు. పంతులుగారే వీరిలో నాయకుడు. వారిరాతలవలన నొచ్చినవారు వారిని దుష్టచతుష్టయమని కూడా అనుకునేవారని పంతులుగారు రాస్తారు.[1]

భయంకరమయిన ఈ దురాచారాల ప్రక్కనే ఈ నాటికీ ఇంకామాసిపోని మరికొన్ని దురాచారాలు, తాగుడు, ఏయాదకత్వం, కులతత్వం, మతమౌఢ్యం, వీటన్నిటినీ ఖండిస్తూ వ్యాసాలురాసి వివేకవర్ధనిలో ప్రకటించేవారు. వర్ణవ్యవస్థను గురించి మాట్లాడుతూ ''క్రమవిభజనసిద్ధాంతమే ప్రాచీనకాలంలో ఉన్నదనీ అదే వర్ణవ్యవస్థగా రూపొందిందనీ[2] అన్నారు. అగ్రకులాలవారు కడజాతివారిని నీచంగా చూస్తున్నారనీ మానవత్వం నశించిపోతుందనీ పంతులుగా రన్నారు. వివేకవర్ధనిలో అయిన ' లేఖిని ' మన్యాయంధమై దుర్నీతిని ఖండించింది. ''కన్యాశుల్కాన్ని'' నిరసిస్తూ వ్యాసపరంపర ప్రచురితమయింది.[3] మతాధిపతుల దురహంకారాలను, పురోహితుల అజ్ఞానాన్నీ, ప్రజలనుంచి డబ్బుదోచుకొనేవారి దోపిడీతనాన్నీ నిరసించారు.[4]

---

1. కం. వీ. స్వీ. చ. 1. పే. 100, 101, 102.
2. ' వర్ణము ' కం. వీ. కృ. గ్రం. 7, పే. 39.
3. వీ. స్వీ. చ. 1 పే. 150.
4. 'వివేకవర్ధని' వైదుష్యలు ఫిబ్రవరి 1881, కం. వీ. కృ. గ్రం. 7. 508.

## అవినీతి – లంచగాండితనం : –

అన్ని దురాచారాలూ అక్కచెల్లెళ్లుగా ఆడుకుంటున్న ఆరోజుల్లో వాటికి మూలబలం అందరిలో మరీ ముఖ్యంగా అధికారుల్లో వెచ్చుపెరిగిన అవినీతి, లంగగాండితనం, అన్ని దురాచారాల మీద కత్తిదూసిన లెనిపిల్లి, లేదిసిబిడ్డాన్ని ఈ లోపాన్ని నరకడానికూడా విసియెరాగింవారు. 'వివేకవర్ధని' పదిమంది దృష్టిలో పడింది. రాజమండ్రి మున్సిపల్ కౌన్సిలు గురించి రాసిన సంపాదకీయం వల్ల [1] అర్హులైన వ్యక్తులను మునిసిపల్ కౌన్సిల్లో నియమించాలని సంపాదకీయం సూచించింది. ఈ సూచన రాజమండ్రి సబ్‌కలెక్టరు సమర్ధతను దృష్టిలో పెట్టుకొనివేసిందే. నగర అపరిశుభ్రతనూ, గోదావరీనదీ తీరాన కాల్చబడుతున్న ఇటుకబట్టీల మూలంగా కలుషిత మవుతున్న వాతావరణాన్ని వివేకవర్ధనిలో వివరించడం పంతులుగారి నిర్భీకతకు దూరదృష్టికి, శాస్త్రీయ దృక్పథానికీ ఉదాహరణం[2]. 1875 నాటికి వివేకవర్ధని పత్రికలో మరొకరు కలిశారు. అయన మీర్ ఆజావల్లీ ఖాన్ సాహెబుగారు. అయన తన 'విద్వన్మనోహరిణి' పత్రికను తెచ్చి వీరేశలింగంగారికి వివేకవర్ధనితో కలిపి ఇంగ్లీషువిభాగాన్ని తానుచూడసాగారు.[3] ఎంతకాలం కలిసి పనిచేశారో స్పష్టంగా తెలియదు కాని అవినీతి నెత్తిమూపడంలో పంతులుగారు కృతార్థులయ్యారు.

''ప్రహసన వజ్ర ప్రహారాలతో
ప్రజలను నిద్దుర లేపాడు
కాంతి పథాలను చూపాడు'' 4

వీరేశలింగంగారి ''వివేకవర్ధని'' మున్సిపల్ కౌన్సిల్ కార్యకలాపాలను గురించి వ్యాసపరంపర ప్రకటించనారంభించింది. అసమర్థులయిన మున్సిపల్ కమీషనర్ పథకాలనూ, కపట వ్యక్తుల మోసాలనూ నిర్భయంగా

---

1. ఎం.ఎస్.ఎస్.ఆర్.ఆగష్టు 1887 ఐ.ఓ.యల్.
2. వైది
3. వీ.స్వీ.చ. 1 పే. 95.
4. ''యుగపురుషుడు – వీరేశలింగం' దాశరథి 'నీరాజనం' పు. 68.

తూరా ప్రారంభిచారు.[1] పరిపాలనలోని లోపాలనెత్తి చూపడమే కాదు ఆచరణ యోగ్యాలైన పరిష్కారమార్గాలను కూడా సూచించేవారు. సుబ్రమణ్య అయ్యర్, బి.ఎ., సి.హెచ్.యజ్ఞన్నశాస్త్రి, ఎఫ్.ఎ. లలాంటి సమర్థులు కొందరు మునిసిపల్ కమీషనర్లు ఉన్నారనీ పేర్కొన్నారు.[2] కాని తదితరులు అక్కడ కూర్చోవడమే అపరాధమనీ అన్నారు. తెలుగూ, ఇంగ్లీషూ రెండూ రాని ఒక ముస్లింవ్యక్తి కమీషనర్‌గా పనిచేసినప్పుడు అతని అజ్ఞానానికి నిందించారు. ఈ విధంగా 1878 వరకు మునిసిపల్ కౌన్సిల్ విషయంపై పోరాడుతూనే ఉన్నారు[3]. ఒకప్రహసనం కూడా అవ్యవహారాలమీద వ్యంగ్యధోరణిలో రచించి ప్రచురించారు, ''మునిసిపల్ నాటకము'' అని. బ్రిటిషు ఉద్యోగులు తమ అభిమానపాత్రులకు అస్థానాల నరణంగా యియ్యడంకంటే ఒకతరగతి ప్రజలకైనా వారి నెన్నుకొనే అవకాశం ఇస్తే ఉచితంగా ఉంటుందని ప్రభుత్వానికి సూచిస్తూ[4] రాశారు. ఈ మునిసిపల్ కౌన్సిలర్ల ప్రవర్తనలోని అవకతవకలను అయన బట్టబయలు చేశారు. వివేకవర్ధనిలో బ్రిటిషు అధికారులను, తగినచర్య తీసుకోలేని వారి అసమర్థతనూ, పదవిలో ఉన్న భారతీయుల అవినీతినీ విమర్శిస్తూ సంపాదకీయాలు కొనసాగేవి. అధికారుల్లోని అవినీతికి విద్యార్థిదశలో నైతికబోధ చెయ్యకపోవడమే కారణమనీ పాఠశాలల్లో నీతిబోధ ఏర్పాటు చెయ్యడం అవసరమనీ సూచించారు.[5]

1878 మేలో వీరేశలింగం పంతులుగారు లంచగొండి తనానికి ఒకమంచి తార్కాణాన్ని కనుక్కున్నారు. కృష్ణాజిల్లాకోర్టు సిరస్తాదారు పి.శ్రీరాములు రాజమండ్రి జిల్లా మునిసిఫ్‌గా నియమించబడ్డారు.[6] ఈయన ఒకేసమయంలో రెండుమూడు వ్యాజ్యాలలో సాక్షుల్ని విచారణచేస్తూ, తామొకవ్యవహారంలో సాక్షుల్ని విచారిస్తూ, ఇంకొక వ్యవహారంలో సాక్షుల విచారణ గుమాస్తాల కప్పగిస్తారు. ఈ అవకతవకవ్యవహారాన్నిరచ్చకీడ్చిన వారు పంతులుగారు[7]

1. ఎం.ఎస్.ఎస్.ఆర్, ఏప్రిల్ 1878 ఐ.ఓ.యల్.
2. ,, అక్టోబరు 1878 ,,
3. ,, ఏప్రిల్ 1878 ,,
4. ,, అక్టోబరు 1878 ,,
5. ,, మే 1878 ,,
6. మద్రాసు స్టాండర్డ్, అక్టోబరు 30, 1878.
7. ఎం.ఎస్.ఎస్.ఆర్, మే. 1878 ఐ.ఓ.యల్.

అంతేకాదు అప్పట్లో పీనల్‌కోడ్ ప్రకరణల్లో కొత్తకొత్త అంకెలన్నీ వాటంచేసుకున్నారుం. వ్యాజ్యంవేసిన వారి తరఫు న్యాయవాదులే ప్రకరణసంఖ్య సూచించేవారు. ఎవరు చెప్పిన ప్రకరణసంఖ్య ఎక్కువైతే దాన్ని అరాత్రి పరిశీలించి మరునాడు వారి కనుకూలంగా తీర్పు చెప్పేవారు. ఈ ప్రకరణసంఖ్య అంటే న్యాయపరిభాషలో వారు సమర్పించుకొనే లంచమన్నమాట. ఎవరెంత ఎక్కువ లంచమిస్తే తీర్పు వారి కనుకూలంగా ఉండేది.[1] ఈ ప్రకరణం నోటిమాటగా కొనసాగవలసిందే కాని లిఖితపూర్వ కాధారం లభించేది కాదు. పట్టుబడకుండా ఉండేందుకే ఈ జాగ్రత్తలు. గవర్నమెంటు ప్లీడరు చిత్రపు కామరాజుగారి ద్వారా ఈ అధికారి పొందే లంచాలు వెల్లడిచేయడానికి కంకణం కట్టుకున్నారు, పంతులుగారు. కానీ, లంచం తీసుకోవడం ఎంత నేరమో ఇవ్వడం సైతం అంతేనేరం. కాబట్టి లంచమిచ్చిన వారెవ్వరూ సాక్ష్యమిచ్చేవారుకాదు. బహిరంగంగా సాక్ష్యమివ్వడానికి ఎవ్వరూ ముందుకు వచ్చేవారు కారు. కొంతమంది న్యాయవాదులు తాము లంచమిచ్చినట్లు ప్రత్యక్షంగా చెప్పకపోయినా అక్రమాలు జరుగు తున్నట్లుగా సాక్ష్యమిస్తామన్నారు. చల్లపల్లి బాపయ్యపంతులుగారు, చిరాగ్రపూరి ఎంగన్నశాస్త్రిగారు, వీరేశలింగంగారు కలిసి న్యాయవాదుల మాటల సారాంశాన్ని గ్రహించి, మునసబు లంచాలు పుచ్చుకుంటున్నాడని అర్థం వచ్చేలా ఒకవ్యాసం ప్రకటించారు. ఈ ఆరోపణ కోర్టులో విచారణకు వచ్చినపుడు ఆన్యాయవాదులు తాము చెప్పినదానికి విరుద్ధమైన సాక్ష్యమివ్వాలనీ భావించారు.[2] కానీ చిత్రపు రామరాజుగారు మునసబుగారి తీర్పు నిమిత్తం వ్రాసిన చిత్తు తీర్పుకాగితాలు చించివేయబడిన తరువాత ఇతరమైన కాగితపు ముక్కలను కలిపి తమ ఇంటికెదురుగా నున్న పాడుబడ్డ దొడ్డిలో పెట్టి పెంటకుప్పలో పారేసిన విషయం ఒకన్యాయవాది ద్వారా పంతులుగారికి తెలిసింది. వెంటనే ఆయన వీధులు తుడిచేవారికి కొంతడబ్బు ముట్టజెప్పి ఆముక్కల్ని

---

1. వీ.స్వీ.చ. 1 పే. 114
2. మద్రాసు స్టాండర్డు, అక్టోబరు 30, 1878.

సేకరించి అతికించారు. ఆ వ్యాజ్యాన్ని పోగొట్టుకున్న మహమ్మదీయుణ్ణి పిలిచి మాట్లాడారు. తన ప్రతివాది కామరాజుగారికి లంచమివ్వడంవల్ల మునసబు తనకన్యాయం చేసాడన్నాడు. ఆ విషయాన్నే అతని సమ్మతితో మండలిన్యాయాధిపతికి విన్నపమొకటి వ్రాయించి అతనిసంతకం సేకరించారు. చిత్తుతీర్పు సగభాగాన్ని ఆ విన్నపంతో జతపర్చి మండలన్యాయసభకు అప్పీలు పెట్టుకున్నారు. జిత్తులమారి ఎత్తులకు ప్రసిద్ధుడైన చిత్రావు కామరాజుగారు ఎంతో చాకచక్యంతో వీరేశలింగంగారి దగ్గరున్నతీర్పుముక్కలను అపహరించారు. సిరస్తాదారుకు లంచంపెట్టి మండలన్యాయసభ కోసమని భద్రపరచబడ్డ ముక్కలను కూడా తారుమారు చేశారు.

ఇంత చేసినా సత్యం, ధర్మం తనవైపే ఉన్నాయనీ తుదివిజయం తనదేననీ నమ్మి వీరేశలింగంగారి నమ్మకం కూడా వమ్ముకాలేదు. ఆయనదగ్గరున్న చిన్నముక్క తీర్పు అసలు స్వభావాన్నేమార్చివేసింది. తప్పించుకొనే దారి కానక అవమానం భరించలేక ఆరాత్రి కామరాజుగారు ఆత్మహత్య చేసుకున్నారు.[1] సిరస్తాదారు రోజారింపో అచిరకాలంలోనే దరిద్రుడై మతిచాంచల్యాన్నికూడా పొందాడు. లంచాలు తీసుకొన్నందుకు శ్రీరాములుగారిని కూడా విచారించ వలసిందని ఉన్నత న్యాయస్థానం ఉత్తర్వులు జారీచేసింది. కేసు పూర్తికాకముందే శ్రీరాములు కూడా మరణించారు. అదీ ఆత్మహత్య అని ప్రజాభిప్రాయం.[2]

వాలేసు దొర మండలన్యాయాధిపతిగా ఉన్నరోజుల్లో తమ్మాశ్రయించిన వారికోసం ప్రాడ్వివాకు వెంకయ్య ప్రార్థించినా పరీక్షాసిద్ధులు కానివారికి పట్టాలను ఇవ్వలేదు. కాని, కొత్త సిరస్తాదారు కొలువులో చేరడంతో న్యాయవాదులనుంచి యోగ్యతాపత్రాలు తెచ్చుకొన్నవారికే పట్టాలుప్రసాదించబడ్డాయి కొన్ని నెలల్లోనే ఎనిమిదిమందివరకూ అక్షరజ్ఞానంలేనివారికక్కూడా న్యాయవాద పట్టాలివ్వబడ్డాయి. ఈ అక్రమాన్ని బయటపెట్టింది మళ్ళీ వివేకవర్ధనే. విచారణ

---

1. మద్రాసు స్టాండర్డ్,అక్టోబరు 30, 1878.
2. వీ.స్వీ.చ. 1. పే. 134

జరపవలసిందిగా ఉన్నతన్యాయసభ న్యాయాధిపతికి ఉత్తర్వులుజారీ చేసింది. 1879 జనవరి 23 తేదీ మధ్యాహ్నం మూడు గంటలకు సభకు రమ్మని ఆజ్ఞాపత్రం వచ్చింది పంతులుగారికి.[1] ఆజ్ఞాపత్రం రాసి పంపింది మండలన్యాయ సభలోని సిరస్తాదారు కాజ రామకృష్ణారావు. కానీ ఆజ్ఞాపత్రం పంపే అధికారం ఎవరికీ లేదు. విషయమేమిటో విచారించమన ఉన్నత న్యాయస్థానం ఆదేశించిందే కాని వీరేశలింగంగారిమీద చర్య తీసుకోమనలేదు. కానీ లంచాల కలవాటుపడ్డ సిరస్తాదారు తనదారికి అడ్డుగా నిలిచారన్న ఉక్రోషాన్నిలా తీర్చుకో దలచాడు. "చర్య తీసికొనే అధికారం ఉందా?" అన్న పంతులుగారి ప్రశ్నతో మండలన్యాయాధిపతి వీరేశలింగంగారికి సెలవిచ్చి పంపి ఉన్నతన్యాయస్థానం ఆజ్ఞానుసారం కొత్తగా ఇచ్చిన న్యాయవాదపట్టా టన్నిటిని మూకుమ్మడిగా రద్దు చేశారు.

ఇలా ఎక్కడ ఏ అన్యాయం జరిగినా, అవినీతి కల్పించినా ఆచారం వివేకవర్ధని ప్రకటించి తీరవలసిందే. ఈ అవినీతికి ప్రోద్బలం లంచగొండితనం. ఆనాటి లంచాల విశ్వరూపాన్ని వీరేశలింగంగారిలా వర్ణిస్తారు.[2] "దొరతనం వారికి చెల్లించవలసిన నెలపన్నులకంటే వీరిచ్చే రాజపురుషుల కివ్వవలసిన లంచాల మొత్త మెక్కువ. వ్యాజ్యపు ఖర్చు మొత్తం కంటే న్యాయాధిపతికి సమర్పించ వలసిన ఉపాయనం ఎక్కువ. శిక్షాస్మృతి ననుసరించి కట్టవలసిన డబ్బుకంటే విడిపిపెట్టడానికి పెట్టవలసిన లంచ మెక్కువ......రాజకీయోద్యోగుల్లో లంచం పుచ్చుకోవడం సర్వసాధారణం. పుచ్చుకోకపోవడం అరుదు. లంచం తప్పు కాదు. ఉద్యోగధర్మమని అందరి నమ్మకం.

ఇలా అన్నిరంగాల్లో సంస్కరణావశ్యకత కనబడుతున్నప్పుడు వ్యంగ్యంగా సంపాదకీయాల ముఖంగా ఆనాటి సమాజాన్ని హెచ్చరించారు. తన ప్రహసనాల ద్వారా హేళనచేశారు. ఈ ప్రహసనాలు రాజమండ్రి సంఘజీవితంలో అమితమైన సంచలనాన్ని కలిగించాయి. ఒక్కొక్క ప్రహసనం ఒక్కొక్క

---

1. వీ.స్వీ.చ. 1 పే. 108.

2. వీ.స్వీ.చ. 1 పే. 80.

దురాచారాన్ని, ఒక్కొక్క మూఢవిశ్వాసాన్ని రచ్చ కీడ్చేవిగా రూపొందాయి. ఉద్యోగుల్లో ప్రబలిన అవినీతి, లంచగొండితనాన్ని ఎత్తి చూపెట్టే రచనలు కోకొల్లలుగా వెలుగు చూశాయి. అంతా ప్రహసనాల పేర్లు అందలి పాత్రల పేర్లు కూడా కథావస్తువునకు తగినట్లుగా, అంతా పాత్రల గుణగణాలు వ్యక్తంచేసేవిగా ఉంటాయి.

ప్రహసనాల్లో 'కలి పురుషశనైశ్చర విలాసం' లో హిందువుల మూఢ విశ్వాసాన్నీ, 'హాస్యసంజీవని' లో ఆచారం పేరిట చాదస్తాన్ని, దానం పేరిట కులాభిమానాన్ని, పూర్వాచారపు టసహ్యాన్నీ పిచ్చినమ్మకాల ధార్మికాలనీ అంతంత హేళనచేశారు. 'వేశ్యాప్రియ ప్రహసనం' లో, 'కౌతుక వర్ధని' లో వేశ్యలనూ, వారిప్రియులనూ, హాస్యాస్పదులుగా వర్ణిస్తారు. గణికా ప్రాణనాథరావు, విటేంద్రరావు, వివేకరావు, సత్యప్రియాచార్యులు, నయభూషణరావు అనేపేర్లలోనే పెన్నిధినీ పరమార్థాన్నీ ప్రదర్శిస్తారు.

ఇక 'బ్రాహ్మవివాహం' అన్న ప్రహసనంలో ఆనాటి బాల్యవివాహాలూ, వృద్ధవివాహాలు, దంభాచారాలు, వేశ్యా గమనం, భోగంమేళాలు మొదలైన దురాచారాలన్నీ వ్యంగ్యంగా వర్ణితాలవుతాయి. మునిసిపల్ నాటకం తిర్యగ్విద్వన్మహా సభ, మహారణ్యపురాధిపత్యం లాంటి ప్రహసనాల్లో మరికొన్ని సామాజిక లోపాలు, బలహీనతలు బహిర్గతంచేయబడ్డాయి. ఈ ప్రహసన రచనల్లో పత్రికానిర్వహణలో ఉపన్యాసాలలో వ్యాసాలలో అయన ఎన్నో సమస్య లను ప్రస్తావించారు. ఎన్నెన్నో ఇక్కట్లును ఎదుర్కొన్నారు.

'లంచాలు తగవంటే రాజకీయోద్యోగులకు కోపం. వేశ్యాంగనా సంగమం నీతి కాదంటే శృంగారనాయకులకు కోపం. పూర్వాచారం మరలుచ్చుకోవాలంటే పామరజనానికి కోపం. నీతిమాలిన బాహ్యవేషాలు మతవిరుద్ధాలంటే ఆచారభ్రష్ట పురుషులకు కోపం' [1] ఇందరి కోపాలకు గురి అయినా అజేయుడుగా నిలబడిన వీరేశలింగంగారు

---

1. వీ.నీ.చ. 1. పే. 83.

" ఆరంభించిన సుకృతులు
పారము ముట్టంగ జయము బడసిన ధీరుడు " [1]

పంతులుగారిలోని ప్రత్యేకత :—

పంతులుగారి సమకాలికులలో విద్యాధికులలో ఎక్కువమంది రాజకీయరంగంలో సంస్కరణలు చాలనే భావం కలవారే. పంతులుగారు మాత్రం దేశాభివృద్ధి కాంక్షించేవారు. అన్నిరంగాల్లోను సంస్కరణలు కాంక్షించాలన్నారు. ఇదీ వీరిలోని విశిష్టత. ఆవిషయంలో వారి భావాలు 1888 ప్రాంతంలో వారు వెల్లడించిన విషయాలవల్ల వెల్లడవుతుంది.

ఇంచుమించు అన్ని విషయాల్లో సమానంగా వృద్ధిపొందడం అభివృద్ధి అవుతుంది గాని, అన్ని విషయాలు అధమదశలో ఉండి కేవలం ఒక్కవిషయంలోనే వృద్ధిచెందడం నిజమైన అభివృద్ధి కానే కాదు. ఆవిధంగా ఏకదేశాభివృద్ధివల్ల దేశానికి కావలసినంత క్షేమ కరాలు కానేకావు. అందువల్ల రాజాంగవిషయ మయినాస్వాతంత్ర్యంతో పాటు జ్ఞాన విషయంలో, నీతివిషయంలో, మత విషయంలో, కులాచారవిషయంలో కూడా అభివృద్ధి సాధించడం అత్యంతావశ్యకం. క్రూరమయిన కులాచారాలకు బానిసలమైన మనం మనయిళ్లలోని స్త్రీలపట్ల క్రూరులమై వారి కష్టాలను నివారింపలేనివాళ్లం – రాజకీయస్వాతంత్ర్యం సంపాదించి దేశకష్టాల్ని ఎలా నివారింపగలుగుతాం? మతవైషమ్యాలతో సమైక్యతను విస్మరించి పరస్పరం ద్వేషించుకుంటూ అల్పవిషయాలపై తగవులాడుకుంటూ స్వాతంత్ర్యం సంపాదించినంతమాత్రాన సర్వజనక్షేమంకోసం సమైక్యంగా ఎలా పాటుపడగలుగుతాం? అదీగాక రాజకీయస్వాతంత్ర్యంకోసం ప్రభుత్వసహాకారం కూడా కావాలి. కానీ సంఘ సంస్కరణ అలాకాదు. స్వయంగా పాటుపడి సాగించవచ్చునని పంతులుగారి అభిప్రాయం. [2] అందువల్లే ఆదినుంచీ వారు చాలావరకు సంఘసంస్కరణ మీదే తమ సర్వశక్తుల్నీ కేంద్రీకరించారు.

---

1. ' యుగపురుషుడు – వీరేశలింగం ' బాలాంత్రపు వెంకటరావు ' సంస్కరణ ', పే. 45.
2. వీ. స్వీ. చ. 2, పే. 457.

రాజకీయస్వాతంత్ర్యాన్నిగురించి పట్టించుకోకపోవడం, విదేశీయులతో కలిసిమెలిసి తిరగడం, స్నేహభావంతో ప్రవర్తించడం, దృష్టినంతా సంఘసంస్కరణ మీదే కేంద్రీకరించడం – అప్పట్లో చాలా మందికి పంతులుగారికి స్వాతంత్ర్యం రావడం ఇష్టం లేదనే అభిప్రాయాన్ని స్ఫురింపజేశాయి. ఆకారణాన దురాచారనిర్మూలనంకోసం పోరాడినందుకు స్వార్థపరులు కొందరు, స్వాతంత్ర్యద్వేషంతో మరుకుగా పాల్గొనలేదని యువకుల్లో ఆయనకు వ్యతిరేకులు కొందరేర్పడ్డారు. చాలా తక్కువసహకారంతో అన్నిఘనకార్యాలు నెరవేర్చిన ప్రతిష్ఠ పంతులుగారిది. ఆయన-ఈ జాతికి, ముఖ్యంగా స్త్రీజాతికి చేసినసేవ క్షుణ్ణంగా అవగాహన చేసికోవాలంటే ప్రధానసాధనం ఆయన స్వీయ చరిత్ర. అయితే రసభావపరంపరలతో సాగిపోయే మధురకావ్యం గాదది. కానీ ఆపకుండా చదివించే ఉత్కంఠపుట్టించే అపూర్వరచన. వ్యక్తిగా సంతరించుకో వలసిన గుణాలన్నిటినీ ఒకేచోట కుప్పపోసిన ఉత్తమగ్రంథం. చదివిన ప్రతివాడు తీర్చుకోలేనిఋణం తనతలపై మోపబడిందని అంగీకరించక తీరదు. వీరేశలింగంగారి పుట్టుక లేకపోతే-ఈ జాతి మరొక వందేళ్లు వెనకబడి ఉండేది. ఆయనకున్న నిశితమైన అంతర్దృష్టి, అచంచలధైర్యసాహసాలు, సంచలనాత్మకశక్తి ఆయనను భారతీయమహాపురుషుల్లో ఒకణ్ణి చేసిందంటారు రాజగోపాలాచారి గారు. హెర్క్యులిస్ అంతటి ఉద్దండతతో అవినీతిని ఎదిర్చినవాడు పంతులుగారు. అదే ఆయనవ్యక్తిత్వం

——

## సమాలోకనం

కలం పట్టిన కవి ముందు ఎన్నో భావాలు తలవంచి నిలుస్తాయి. ఆభావాలకు ఊపిరికవి అంతశ్చేతనమే, అతను సంతరించుకున్న సంస్కారమే. అయితే అభ్యుదయ కామియైన కవిభావాలు కవితాసౌందర్యం పేరుతో ఊహాలోకాల్లో విహరిస్తూ ప్రయోజనరహిత మయిన కవిత అల్లవు. నిరర్థక మయిన సాహిత్యాన్ని రూపొందించవు. స్పందన అతని ఆయువుపట్టయితే కళ్లతో లోకాన్ని చూస్తున్నంతవరకూ హృదయంతోపాటు మేధ కూడా మానవత్వపు పరమార్థాన్ని తెలుసుకున్నపుడు, "ఒడిలిపోయిన జీవితాల కుదుళ్లలో ఆత్మీయత అనే ఆర్ద్రతను విదల్చడమే" కవితా పరమార్థమవుతుంది. అలా విదల్చిన వాడే ఉన్నతుడు. ఆకవిత్వం ఉదాత్తం. మరో అడుగు ముందుకు వేసి బాధలకు పాదేమిటో తెలిసికొని వాడి వాదనతో, కవితా సాధనతో బాధలమూలాలన్నీ ఖండించేవాడు మహోన్నతుడు, యుగపురుషుడు.

తమ ఊహల్లో సమాజాన్ని సృష్టించుకున్నవారు సామాన్య సాహితీ స్రష్టలు. సమాజ పరిశీలనతో తమ భావాల కూపిరి ఊదేవారు సాహిత్యసంస్కర్తలు, సాహిత్యమర్మజ్ఞులు. సామాజిక జీవనాన్ని కళ్లకు కట్టించడమే కాదు వారి సాహిత్యప్రయోజనం; 'జీవితాన్ని ఇలా మలుపు తిప్పుకో' 'నీ హృదయాన్నిలా సరిదిద్దుకో' అనిహెచ్చరించడం కూడా దానిలక్ష్యం. ఆసామాజిక స్పృహ దండిగా గల సాహిత్యమే సమాజాన్ని సక్రమమార్గాన నడిపిస్తుంది. జనుల లక్ష్యమేమిటో గుర్తుచేస్తుంది. శతాబ్దాల కిందటి సాహిత్యాన్ని అనుశీలనంచేస్తే సమాజ నిర్మాణం, సామాన్యవ్యక్తుల జీవనవిధానం, కొన్నింట దృశ్యాదృశ్యంగా, కొన్నింట రేఖామాత్రంగా మరికొన్నింట మరికొంత స్ఫుటంగా పొడగట్టుతాయి. గతించిన కాలంలో సృష్టియయిన సాహిత్యాన్ని చూస్తే ఆనాటి సాహిత్యం ప్రాయికంగా గీర్వాణవాణికి అనుకరణమో, అనుసరణమో కావడంవల్లనూ, ధీరోదాత్తాది వ్యక్తులు కథానాయకులుగా ఉండాలని సాహిత్యానుశాసకులు

శాసించడం వల్లనూ సామాన్యజన జీవనరీతులు మనకంతగా కన్పించవు. అలనాటి కవులు తీర్చినది చాలాభాగం వారి మధురోహల్లో జనించిన ఆదర్శసమాజాన్నే. ఒక్కొక్క తరాన్ని ఒక్కొక్క ప్రధాన ధర్మం శాసిస్తుంది. ఆతరం జీవితానికది జీవనాడి అవుతుంది. ఒకే ధర్మం ప్రతి శతాబ్దాన్నీ శాసించదు. కొన్ని కొన్ని మార్పులకు లోనవుతూ ధర్మాలు ఎప్పటికప్పుడే కొత్తకొత్త రూపులు దిద్దుకుంటూ ఉంటాయి. అలా ధర్మంపరివర్తన చెందకుండా ఒకేలా ఉండాలనుకోవడం మూర్ఖత్వమవుతుంది. ఏతరంలో ఏది ప్రధానధర్మమైంది, ఎప్పుడే మార్పునకు లోనయింది తెలుసుకోవాలంటే ఆ అవగాహనకు ఒక అలంబనం సాహిత్యం.

సాహిత్యాన్నిలా పరిశీలనాత్మకంగా పరికించినప్పుడు దిగ్భ్రాంతిని కల్గించే విషయం భారతీయ సమాజంలో స్త్రీల స్థితిగతులు.

పరిణామశీల మయిందీజగత్తు. కాలచక్రభ్రమణంతో ఎన్నెన్నోమార్పులు, ఏవేవో ఒడిదుడుకులు. ఏనాడో స్త్రీదశ ఉన్నతమయిందని చరిత్రకందిన కాలం చెపుతుంది. కాని కళ్లముందున్న పరిస్థితి నమ్మలేని మార్పు. నాగరికత అంటే పురోగమనం కావాలి గానీ తిరోగమనం కాకూడదు. అలా జరిగిననాడు జాతి అధఃపాతాళానికి దిగజారక తప్పదు. తన అవివేకం వల్ల సుసంపన్నమయిన భోగభాగ్యాలను కోల్పోయినట్లే ముందుచూపు లేని స్వార్థం ఏగు జాతిని నిర్వీర్యంగా అవివేకంగా అజ్ఞానంలో ముంచింది. ఒకనాడు విజ్ఞానం ఒక వర్గంవారి సొత్తు. తక్కినవారి కది అందుబాటులోలేనిది. స్వత్వం గలిగిన వర్గంలో సైతం స్త్రీలకు కాలక్రమాన పఠనపాఠనాలకు సంబంధించిన అధికారం అంతరించింది. ఇలా ఏకాద్దిమందికో జ్ఞానం పరిమితం చేయబడడమే జాతిపతనానికి నాందీవాచక మయింది. ప్రశ్నించే అధికారంలేదనీ, అడిగే హక్కు కూడదనీ మరార్థంగా అనుశాసించడమే తార్కికశక్తిని చిదిమివేసింది. ఇలా ఒక్కొక్క విజ్ఞానశాఖకు స్త్రీని దూరం చేస్తూ హేతుబద్ధమయిన ఆలోచనను అణగార్చింది. ఇలా ఒక్కొక్క కట్టుబాటు క్షణే ఏర్పరచే భవిష్యత్తులోని తరాలను చీకటిదారుల్లో పయనింపజేశారు గతకాలపు సంకుచిత జీవులయిన [illegible] మేధావులు.

గురుకుల వాసం కావచ్చు, ఆర్థికస్థితిగతులు కావచ్చు, కారణమేదైనా చరిత్ర కందినంత వరకూ అతిప్రాచీనకాలంలో స్త్రీవిద్యకు ప్రోత్సాహం, పురుషులతో సమానత్వం ఋగ్వేద కాలం వరకే ఉన్నాయి. తరువాత పరిణామంలో క్రమంగా విద్యావతుల సంఖ్య తగ్గిపోతూ వచ్చింది. ఒక్కొక్క తరమూ సహజంగానే కొన్ని మార్పులకు లోనవుతూ రావడం కనబడుతుంది. మార్పు మంచిచెడూ రెండు విధాలుగా జరగడం సాధారణము, ప్రతికూల శక్తులెంత బలీయాలో కానీ ఎప్పుడు ఏ మార్పు జరిగినా స్త్రీల స్థితిని మరింత దిగజార్చేదిగా మాత్రమే తయారయ్యింది. వేకువ ఎప్పుడో తెలియదు అంతులేని చీకటికి. అంత చీకటిలోనూ ఎక్కడో మినుకు మినుకుమంటూ చుక్కలు మెరుగులీనుతున్నట్లే ఒక్కొక్క శతాబ్దంలో కొద్దికొద్ది మంది స్త్రీలు విద్యావతులుగా, వీరనారీమణులుగా, పరిపాలనా దక్షులుగా, కవయిత్రులుగా కళాపోషకులుగా రూపొంది వెలుగురేఖలు విస్తరింపచేశారు. అలముకున్న చీకటి ప్రపంచాలు చెయ్యాలంటే ఆ వెలుగు దివ్వెల చరితాలను తెలుసుకోవాలి. ఆ కొద్ది కాంతిరేఖలే తేజఃపుంజాలు కావాలి.

ఇప్పటి వరకూ పూర్వప్రకరణాలలో చర్చించింది, కటికచీకటిలో కాంతి కిరణాలను వెదజల్లిన ఆ కొద్ది వెలుగు దివ్వెలను గురించి. కానీ ఆధునిక యుగం వీరేశలింగంగారి జన్మకాలం. అన్నివిధాలా కన్నుపొడుచుకున్నా కానరాని చీకటి ముద్ద. అంతచీకటి చూశారు గనకనే వెలుగు విలువ తెలుసుకున్నారు. ఉషోదయం కోసం ఉబలాట పడ్డారు. ఒక్కసారి దృష్టిని గతంవైపు సారించి స్వీకరించదగిందేముందో అన్వేషించారు, అక్కరగల దానిని గ్రహించారు. సమకాలిక సమాజం పక్షవాతపు రోగిగా కన్పించింది. ఒక సగభాగం ఆరోగ్యంగా, మరొక సగం రుగ్ణతలో ఉన్న సమాజానికి తగు చికిత్స చేయవలసిన అవసరం గుర్తించారు.

" అంగ వ్రాతములో చికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శేషాంగ శ్రేణికి రక్ష సేయుచు క్రియ ...." పరిస్థితి విషమించక ముందే నివారణ చేయవలసిన అగత్యం ఎంతయినా కనిపించింది. కలాన్నే కత్తిగా ఉపయోగించు కున్నారు. కళకళ కోసమే అన్న పాతపడ్డ సిద్ధాంతాన్ని పక్కకు నెట్టారు. సమాజాన్ని నిలబెట్టే వెన్నెముకగా తెలిసివేసే తప్పటడుగుల నుంచి మళ్లించే కొరడా దెబ్బగా నిద్దుర నటించే కళ్లల్లో సూటిగా గుచ్చుకొనే సూర్యకిరణాల్లాగా సాహిత్యాన్ని బహుముఖంగా మరెవరికీ చేతకానంత సమర్థంగా, సమర్థ్వంగా తన దీక్షాదక్షతలకు కార్యకలాపాలకూ సైదోడు చేసుకున్నారు, పంతులుగారు. పాత సిద్ధాంతాలకు ఆచారాలకూ రోసిపట్టే పాతకవిత్వాన్నీ కవితాసామగ్రినీ వదిలేశారు. సాహిత్యంలో ఒక్కొక్క నూతన ప్రక్రియకూ నాంది పలికారు. చేసిన ప్రతిరచన, చెప్పిన ప్రతి ఉపన్యాసం, అచ్చొత్తిన ప్రతిపత్రికా, జరిపిన ప్రతివాదం సమాజశ్రేయస్సు కొరకే అంకితం చేశారు. ఆసమాజ శ్రేయస్సుకు మూలం స్త్రీజనోద్ధరణ. అనగ్నసత్యాన్ని మొట్టమొదట గుర్తించిన విజ్ఞాని వీరేశలింగంపంతులుగారు. అందుకే వారిచేతిమీదుగా సాగిన ప్రతిరచనకూ, సంస్కరణకూ స్త్రీముఖ్యకేంద్రమయింది.

రేఖామాత్రంగా ఆదినుంచి స్త్రీల స్థితిగతులను పరికించాం గదా! పంతులుగారు తమ అచంచలదీక్షతో అవిరళ కృషితో అనితర సాధ్యంగా మహిళా లోకపు స్థితిగతుల్లో తిరిగి తెచ్చిన ఉజ్జ్వలమయిన మార్పును ముందు చూద్దాం.

నడుంకట్టి 1872 నుంచి వీరేశలింగంపంతులుగారు స్త్రీల కోసం, వారి దౌర్భాగ్య స్థితి నిర్మూలన కోసం అనుక్షణం శ్రమించారు. బాలికాపాఠశాలను స్థాపించి స్త్రీలలో అజ్ఞాన పిశాచాన్ని, మౌఢ్య మహాభూతాన్ని పారదోలే విజ్ఞానాన్ని వారికందజేసే ప్రయత్నానికి కంకణధారణ చేశారు.

ఉచితవిద్యను స్త్రీలకందించే ఉన్నతపాఠశాల శ్రీ వీరేశలింగం ఆస్తిక పాఠశాల. పాఠశాలలకే పరిమితం కాలేదు ఈ కృషి. పత్రికల్లో స్త్రీవిద్యాప్రాముఖ్యం చర్చించబడింది. 'పురుషార్థప్రదాయిని' పత్రికలో స్త్రీవిద్య మండనమ్మే

ప్రధానలక్ష్యమయింది. వీరు రచించిన ప్రతి నవల, నాటకం, ప్రహసనం – ఇందలి పాత్రలన్నీ అవకాశమున్నంత వరకూ స్త్రీవిద్యా ప్రాముఖ్యాన్ని ఉపన్యసిస్తాయి. స్త్రీవిద్యా ప్రహసనంలో సరస్వతి తండ్రిపాత్ర చేసిన ఉపన్యాసం స్త్రీవిద్యా వ్యతిరేకులందరికీ, వీరేశలింగంగారిచ్చిన సమాధానం. అంతిమ శ్వాస అనంతవాయువుల్లో కలిసే వరకూ కలందించలేదు. ప్రతి అక్షరమూ స్త్రీ సౌభాగ్యానికే అంకితం.

ఈయన సంస్కరణ కార్యక్రమాల్లో అతిప్రధానమయింది వితంతు వివాహం.

వీరేశలింగంపంతులుగారి జీవిత విశేషాల నుంచి అనేక ప్రధానాంశాలు తేటతెల్లమవుతాయి. 1880లో రాజమండ్రి సంఘసంస్కర్తల్లో మదరాసు సంఘసంస్కరణ విషయంలో చురుగ్గా పాల్గొన్నారు. ఆయన తన నాయకత్వాన్ని జిల్లాకేంద్రం నుంచి రాష్ట్రరాజధాని వరకు పెంచడానికి ప్రయత్నించినట్లు కనబడుతుంది. 1870లో పంతులుగారికి మదరాసు తెలుగుపండితులతో మాత్రం సంబంధమేర్పడింది. కాని 1880 మధ్యకాలానికి మదరాసు జాతీయసంఘసంస్కరణ సభలకు ఆయన ఆహ్వానించబడ్డారు. కళాశాల డిగ్రీ లేకపోవడం, పల్లెటూరి వాలకం, ఆంగ్లభాషలో ఉపన్యసించే శక్తి పరిమితం కావడం – ఇవి కాస్మాపాలిటిన్ నగరమైన మదరాసులో పంతులుగారికి కొంత ఇబ్బందిని కల్గించాయి. రఘునాథరావు వంటి వారితో స్థాయిలోగాని, గౌరవప్రతిష్ఠలలో గాని పంతులుగారు సరికాలేకపోయారు. కాని మదరాసు నాయకుల అంగీకారంవల్ల పంతులుగారు మదరాసునగరంలో వితంతు వివాహాలు జరపడానికి వాటికోసం విరాళాలను సేకరించడానికి వీలుపర్పడింది.

1880లో వీరేశలింగంపంతులుగారి వివిధ కార్యకలాపాలతో ప్రముఖమయింది వితంతు వివాహోద్యమం. ఇది ఆయనకు విశేషమయిన ప్రాచుర్యాన్ని ఇచ్చింది. పేరుప్రఖ్యాతులు కూడా తెచ్చింది. అయినప్పటికీ శంకరాచార్యులవారు శ్రీముఖంద్వారా కావించిన కులబహిష్కార శిక్షమాత్రం తప్పలేదు. అది ఆయనకు

శాశ్వతంగా ఉండిపోయింది. మఠాధికారులను, స్థానిక సనాతననాయకులను ఎదిరించి వివాద పడేవారికి జరిగే శిక్షననుభవించడంతో పంతులుగారు సుప్రసిద్ధు లంటారు. వితంతు వివాహౌద్యమం పంతులుగారి దీర్ఘకాలిక కార్యక్రమం. ఆసంఘలక్ష్యాలు కూడా కార్యక్రమాన్ని కానసాగించడమే కావడంవల్ల కేవలం ప్రచారం చేయడమే కాకుండా సభ్యులతో కలిసి ఆచరణాత్మకం గావించడం ప్రధానమయిన విషయం. సంఘసంస్కరణలో సహచరులతో కలిసి పనిచేయడం పంతులుగారికి క్రమక్రమంగా కష్టతరమైపోయింది.

ఈ సంఘం సుమారు ముప్ఫయికిపైగా వితంతు వివాహాలు జరిపింది. నిధులను పంచడంలో పంతులుగారికీ, ఆత్మూరి లక్ష్మీనరసింహంగారికీ భిన్నాభిప్రాయాలేర్పడ్డాయి. చివరకు వివాహితుల నుంచి, లక్ష్మీనరసింహంగారి నుంచీ పంతులుగారు వేరయిపోవలసివచ్చింది. రాజమండ్రి వితంతువివాహసంఘం సమావేశమవుతూనే ఉన్నది. కాని పంతులుగారు మాత్రం వితంతువివాహ సంస్కరణలకోసం ఆసంఘం నుంచి ధనసహాయం మింకేమీ ఆశించలేదు. 1879లో సంఘాల సామర్థ్యాన్ని గురించి ఆయనకు సందేహం కలగలేదు. వాటిని స్థాపించవలసిన ఆవశ్యకతను మాత్రం గ్రహించారు. 1887 నాటికి స్వీయానుభవం ఆ విశ్వాసాన్ని ఆయనలో కొంత సడలించింది. అయినా, ఆసంస్థల కనుకూలంగా మాటలాడ్డం ఆయన మానలేదు. వానిలో చేరడం మానలేదు. అయినప్పటికీ మన మిక్కడొక విశేషాన్ని గమనించాలి. ఆయన సంఘసంస్కరణ కార్యకలాపాలు ఈ స్వచ్ఛందసేవాసంస్థలకు వెలుపల నుంచే జరగడం మొదలయినాయి.

1880 ఆరంభంలో పంతులుగారు సాధించిన ఘనవిజయం బ్రిటీషు ఉద్యోగులతోను యూరోపియన్ మిషనరీలతోనూ కలిసి పనిచేయడం వల్ల వచ్చిందే. ఆకృషి వల్ల వారితో సన్నిహితసంబంధ మేర్పరచుకోగలిగారు. ఆయన మీద వారికున్న విశ్వాసంవల్లనే ఆయన బాలికాపాఠశాలను నెలకొల్పగలిగారు. ఆస్తిక పాఠశాలను ఉన్నతపాఠశాలగా చేయగలిగారు. దీనితో ఆయన సాధించిన ఘనవిజయాలు రెండు సదాచారాలను నెలకొల్పడం. ఒకటి ఆస్తికపాఠశాలలో సహవిద్యను

ప్రప్రథమంగా ప్రారంభించడం. బాలికలకు ఉచితవిద్యాసౌకర్యాలు ఏర్పరచడం. సహవిద్యవల్ల సంభవిస్తాయనే అనేక కష్టనష్టాలనురానీయక తగు జాగ్రత్తలను తీసుకోవడమూను. ఇది పిఠాపురంరాజాగారి ఉన్నతపాఠశాల, కళాశాలల్లో కూడ వారిని అనుమతిపరిచేటట్లు ప్రోత్సహించింది. దీనివల్ల పంతులు గారికి అభిమానపాత్రమయిన స్త్రీవిద్య ఇబ్బడిగా, ముబ్బడిగా లాభంపొందింది.

రెండో సత్కార్యం హరిజనులకు ఉచితవిద్య అదీ పాఠశాలలో ఏర్పరచడం మతాన్ని మార్చుకున్నవారికే క్రైస్తవ పాఠశాలలో ప్రవేశంలభించి ఉచితవిద్య లభిస్తుండగా హైందవ ధర్మాన్ని వదలని వారికాభాగ్యం లేకపోవడాన్ని చూచారు పంతులుగారు. జాతిపిత మహాత్ముని కంటె ముందుగానే హరిజనులను పంచములని దూరంగా పారదోలే రోజుల్లో అంటరానితనాన్ని అదృశ్యంచేసి వారికి పాఠశాలలో ప్రవేశమిచ్చారు. ఉచితవిద్యా సదుపాయం సమకూర్చారు. అపూర్వమైన యీసదాచారాన్ని ఆంధ్రదేశంలో ప్రప్రథమంగా ప్రారంభించి మానవత్వంగల మహామనీషిగా నిలబడ్డారు పంతులుగారు.

పాఠశాలలు నెలకొల్పడమే కాదు. అంతకంటె ముఖ్యమయిన సంస్కరణ మోడువారిన జీవితంలో నవవసంతాన్ని సృజించడం. దానికే ఒక మహోద్యమాన్ని ఆరంభించారు. ఆ ప్రథమ వితంతువివాహానికి అవసరమయిన బందోబస్తుకూడా సంపాదించారు. ఆసంపాదించగలగడానికి కూడా ఆయనకు బ్రిటీషు ఉద్యోగులతో, మిషనరీలతోగల గాఢస్నేహమే కారణం. ఆపాశ్చాత్యుల అభిమానం పంతులుగారి విజయానికి ప్రధానకారణమయింది. ఉద్యోగులతో ఆయనకు గల సంబంధం ఆయనకు గౌరవాన్ని, మర్యాదనూ సంపాదించగలిగాయి. మునిసిపల్ కౌన్సిల్‌లో మెంబరుకావడంవల్ల రాజమండ్రి పట్టణంలో ఒకస్థానం లభించింది. నిధులనిర్వహణలో భాగస్వామ్యం చేకూరింది. దానివల్ల ఆయన వ్యతిరేకుల మీద దాడిజరప గలిగారు. ఆయన పత్రికలు కూడా దానికెంతో ఉపకరించాయి.

పట్టణంలోని సంప్రదాయసిద్ధమయిన సంబంధాల నుంచి పంతులుగారిని కులబహిష్కరణతో శాశ్వతంగా వెలివేసినా స్థానికులయిన ముఖ్యోద్యోగులతో

అంతనకు గల సంబంధం దానివల్ల కలిగే యిబ్బందులను కొంతవరకు తగ్గించింది. మదరాసులో ఆయన సంపాదించిన స్థాయి స్థానికంగా కూడా ఆయన ఎదుర్కోడానికి తోడ్పడింది. అంతేకాదు ఆయన స్వీయ ప్రతిభాపాటవాలే ఆ స్థాయికి కారణమని వాటిపైన ఆధారపడే అడ్డు వచ్చిన ఆటంకాలను పంతులుగారు అనాయాసంగా అధికమించేవారనీ స్పష్టమయింది. తన పక్షంవారి నాకట్టుకుని కార్యక్రమాల్ని నిర్వహించగలిగారు. నాగోజీరావు, న్యాపతి సుబ్బారావు, బసవరాజు గవర్రాజుగార్లవంటి ప్రముఖులయిన సహచరులతో పంతులుగారు సన్నిహితసంబంధాలను కలిగివున్నప్పటికీ అనుచరుల నాకర్షించడంలో సంపూర్ణవిజయం సాధించలేకపోయారు.

ఇతరులను తనవైపు తిప్పుకోవడం, తనను బలపరచేటట్టు చేసుకోవడం - ఇవి జీవితమంతా ఆయన కెదురయిన సమస్యలు. ఈ సమస్యలతో సతమతమవుతూనే సమస్యల మహాలబ్ధిదానికి తలపడ్డారు పంతులుగారు. అందుకే మూఢవిశ్వాసాలూ, సాంఘికదురాచారాలనూ రూపుమాపడానికి ఆయన చేసిన ప్రయత్నాలు ఆయన కనేక కష్టనష్టాలను కాని తెచ్చాయి. జీవితకాలంలో వాటినన్నిటినీ ఎనలేని ధైర్యసాహసాలతో ఆయన ఎదుర్కొన్నారు. శారీరక దౌర్బల్యంకాని, రుగ్ణత కానీ ఆయన కార్యక్రమాల నాపలేక పోయాయి. మహోన్నతమయిన మనోబలంతో అప్రతిఘటనలను, కష్టనష్టాలను విజయవంతంగా అతిగమించి తన కార్యక్రమాలను అమలుపరచగలిగారు. ప్రజానీకంలో జీర్ణించుకుపోయిన దురాచారాలకు, అనాచారాలకూ గల కారణాలను తెలుసుకొని పరిష్కారమార్గాలను సూచించారు. అన్నిటికీ కారణం అజ్ఞానమే అవడంవల్ల ప్రతివ్యక్తికీ విజ్ఞానసుధలు పంచే అమృతమూర్తి అయ్యారు పంతులుగారు.

ఇక్కడ ఒకవిషయాన్ని మనం గమనించాలి. అనాడాయన ప్రతికక్షులవల్ల పడ్డ బాధలను ఆవిషయం మనకవగతం చేస్తుంది. ఇప్పటికాయన గతించి సుమారు ఆరు దశాబ్దాలయివుంది గదా! ఈ నాటికీ ఆయన వ్యక్తిగతలోపాలనెంచి ప్రచారం చేయడాని కత్యుత్సుకులయేవ్వ వారున్నారంటే అనాడింకెంత అధికంగా ఉండేవారో అవగతమవుతుంది గదా! సత్పురుషులు సమాజంలో సర్వజనులకు ఉపయోగపడే

సత్కార్యాల నాచరించడాని కారంభించినా వాటికి ప్రతిఫలంగా సర్వవిధాలయిన అవమానాలనూ, అవహేళనలనూ అనుభవించవలసి రావడం చరిత్రననుశీలించిన సర్వసామాన్యంగా కనబడే విషయాలే గదా! పంతులుగారు తమ జీవితంలో వీటిని ఎదుర్కొని నిలవడం అసాధారణం.

పంతులుగారి అంతరంగాన్ని తెలిసికోడానికి ప్రధానాధారం ఆయన స్వీయచరిత్ర, ఆయన రచించిన గ్రంథాలునూ. వాటితోపాటు సమకాలిక పత్రికలు, సమకాలీనుల రచనలూ, ప్రత్యేకించి 'సోషల్ రిఫార్మర్', మదరాసు నుంచి ఆనాడు వెలువడుతూ వుండిన పత్రికలూ కూడా ఆయనకు సంబంధించిన విషయాల కాధారభూతాలు. జీవితం పశ్చిమదిశకు చేరేసమయాన రాజమహేంద్రవరపు రవాసులకాయన చేసిన విన్నపం అసాధారణమయింది. ఆయనకు భగవంతుని మీద ఉన్న విశ్వాసంకూడా అచంచలమయిందే. భగవంతునికి తనపై "నిర్హేతుక జాయమాన కటాక్షమున్న" దని ఆయన అచంచలవిశ్వాసం. తానాయన్నారాధించడమే కాదు, స్త్రీలకూడా ఒక ప్రార్థనాసమాజాన్ని కట్టించడం, సంఘసంస్కరణ కార్యకలాపాల్లో సద్భక్తి, వేషంతో సంబంధంలేని అంతరంగపు శోతుల భక్తి కూడ ఒకటి అన్నట్లు ప్రార్థనా కార్యక్రమాల్లో పాల్గొనడం ఇందుకు తార్కాణాలు.

తనలాటి అల్పకపు జీవిని ఇంకా ఏ సత్కార్యానికో బతికిస్తున్నాడు భగవంతుడంటారు పంతులుగారు. స్త్రీలంటే ఆయనకున్న ఆర్ద్రచిత్తం, పవిత్రభావం, అసహాయులుగా వారికై శ్రమించిన ఆయన దీక్ష, అనవసరపు నిందారోపణలతో అనుభవించిన మానసిక వ్యథ, అది కూడా జీవితంలోని చరమాంకంలో, అనుక్షణం నీడలాగా అనుసరిస్తూ ప్రతివిషయంలోను చేదోడువాదోడుగా వున్న అర్థాంగి ఆయన్ను ఏకాకిని చేసినప్పుడు ప్రాణంకంటే మిన్నగా భావించిన జీవిత పరమ లక్ష్యాలను మహార్తిమంతం గామించుకొని స్వయం సిద్ధాలయిన ప్రణాళిక నాచరించాలన్న దృఢ మనస్కుణ్ణి వాటి నుండి వైదొలగమని సహచరులనేవారు

సలహోలిచ్చినప్పుడు ఆయనారోగ్య పరిస్థితుల్లో తోడులేని ఆయన పలవించిన చిత్తక్షోభ – స్వీయచరిత్రలో వర్ణితాలై పాఠకుల కంటనీరు తిరిగేలా చేస్తాయి.

పరిశీలన సమగ్రంగా చేసిన తరువాత దర్శనమిచ్చే వీరేశలింగంపంతులుగారి విశ్వరూపం సాంఘికదురాచార గహనానికి దావాగ్ని, మహాఢవిశ్వాస విష వృక్షానికి పరశురామకుఠారం, అంతటా ప్రళయతాండవం చేసే అవినీతిని అంతంచేసే అదృశ్యశక్తి, చీకటింట అల్లాడే అనదల కన్నీళ్లు తుడిచే ఆర్ద్రభావానికీ, జ్ఞానతేజస్సులు వెదజల్లే పుంభావ సారస్వతరూపానికీ, ప్రాణమై నిలిచిన మూర్తీభవత్ నవ్యచైతన్యమే పంతులుగారు.

ఇది ప్రస్తుతి కాదు. రాజమండ్రిలో ఆయన శిలావిగ్రహం దిగువున ప్రత్యక్షమయ్యే క్రింది పద్యం అక్షరాలా సత్యం.

" తన దేహము తన గేహము
తనకాలము తన ధనమ్ము తన విద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘనుడే వీరేశలింగ కవి జనులారా "



## ఆధార గ్రంథ సూచిక

### 1- తెలుగు

1) గ్రంథాలు :

1. అప్పారావు, గురజాడ – కన్యాశుల్కము, ఫ్రీడమ్‌ప్రెస్, మద్రాస్, ప్ర.ము. 1969.
2. – గురజాడరచనలు : మహాకవి డైరీలు, విశాలాంధ్రప్రచురణాలయం, విజయవాడ, 1954
3. – ముత్యాలసరాలు: విశాలాంధ్రప్రచురణాలయం, విజయవాడ, 1955.
4. – లేఖలు, విశాలాంధ్రప్రచురణాలయం, విజయవాడ, 1958.
5. ఆరుద్ర – సమగ్రఆంధ్రసాహిత్యం, 12 సంపుటాలు, ఎమెస్కోప్రచురణ, 1965.
6. ఉపనిషత్తులు – ఆనందాశ్రమ గ్రంథమాల, పూనా.
7. ఋగ్వేదసంహిత, అధర్వవేదము – ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్, పూనా.
8. కాళేశ్వరరావు – నా జీవిత కథ.
9. కృష్ణమూర్తి, దంటు – శ్రీ వీరేశలింగ చరిత్ర.
10. కృష్ణారావు, జి.వి. – కావ్యజగత్తు, సువర్ణ ప్రింటర్స్, పలూరు, ప్ర.ము. 1963
11. కేసరి, కె.యన్. – నా చిన్ననాటి ముచ్చట్లు, మద్రాసు, 1953.
12. కోటేశ్వరమ్మ, వి. – భారతదేశంలో స్త్రీవిద్య, ఉషఃశ్రీ ప్రింటర్స్, విజయవాడ, 19
13. గోపదేవ్, పండిత (అను) – వేదతత్త్వప్రకాశము, ఋగ్వేదాది భాష్యభూమిక, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి, 1967.
14. చంద్రశేఖరరావు, మద్దుకూరి – చంద్రం వ్యాసావళి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ-2, 1974.
15. తిరుమలరావు, సర్దేశాయి – కన్యాశుల్కనాటకకళ, శారద ప్రింటింగ్ ప్రెస్, అనంతపురం, 1974.
16. దాణప్ప, తూమాటి – ఆంధ్రసంస్థానములు – సాహిత్యపోషణము, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు, 1969.
17. – తెలుగులో కొత్తవెలుగులు, డిలైట్‌ప్రింటర్స్, విశాఖపట్టణం, 1972.

18. నన్నయ - శ్రీమదాంధ్రమహాభారతము, ఆదిపర్వం, వావిళ్ల రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మద్రాసు.

19. నరసింహం, కె.పి.ఆర్. - సాహిత్యదర్శనము, కె.హరనాథ్ అండ్ బ్రదర్స్, వాల్తేరు, 1973.

20. నారాయణరెడ్డి, సి. - ఆధునికాంధ్రకవిత్వము, శివాజీప్రెస్, సికింద్రాబాదు, ద్వి.ము. 1977.

21. ప్రతాపరెడ్డి, సురవరం - ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ఆంధ్రసారస్వతపరిషత్తు, హైదరాబాదు, 1950.

22. బసవేశ్వరరావు, కల్లూరి - చరిత్ర నేర్పుతున్న పాఠాలు, ఆలోచనగ్రంథమాల, విజయవాడ, 1976.

23. బ్రహ్మర్షి రఘుపతివెంకటరత్నం (జీవితసంగ్రహం - ఉపదేశాలు - కథలు), డా. రఘుపతివెంకటరత్నంనాయుడు శతజయంతి ఉత్సవసంఘం, 1970.

24. ముద్దుకృష్ణ - వైతాళికులు, ఆదర్శగ్రంథమండలి, విజయవాడ, 1966.

25. రమాకాంతరావు, అక్కిరాజు - వీరేశలింగంపంతులు సమగ్రపరిశీలన, శివాజీప్రెస్, సికింద్రాబాద్, 1972.

26. రమణారెడ్డి, కె.వి. - మహోదయం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1969.

27. రాజగోపాలరావు, టేకుమళ్ల - హిందూసంఘ సంస్కారచరిత్ర.

28. రామకృష్ణమాచార్య, నండూరి - ఆంధ్రసంస్కృతి - వికాసము, శ్రీవేదవ్యాస చక్రవర్తి, ప్రగతి గీతామందిరం, ఖైరతాబాదు, హైదరాబాదు, 1976.

29. రామచంద్ర, తిరుమల (సంపా.) - తెలుగు వ్యాసము - నూరుసంవత్సరాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, హైదరాబాదు, 1974.

30. రాహుల్‌సాంకృత్యాయన్ - ఋగ్వేదఆర్యులు, మిక్కిలినేని సుబ్బారావు (అను.) విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1974.

31. లక్ష్మీకాంతం, పింగళి - సాహిత్యశిల్పసమీక్ష, మాలిక్‌పబ్లిషర్స్, తిరుపతి, 1966.

32. లక్ష్మీనరసింహం, అత్మూరి – తైత్తిరీయసంహిత, రాజమండ్రి, 1886.

33. లక్ష్మీనరసింహంపంతులు, చిలకమర్తి – మహాపురుషుల జీవితములు, కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్, రాజమండ్రి, 1948.

34. – స్వీయ చరిత్రము, విశాఖపట్టణం, 1957.

35. లక్ష్మీనారాయణ, కాడాలి – భారతీయసంస్కృతి, శారదా ప్రెస్, తెనాలి, రెండవకూర్పు, 1972.

36. లక్ష్మీరంజనం, ఖండవల్లి – ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్, కర్నూలు, ద్వి.ము. 1957.

37. వరలక్ష్మి, జె. – యుగయుగాల్లో భారతీయ మహిళ, ప్రియదర్శిని ప్రచురణ, ప్రథమముద్రణ, హైదరాబాద్, 1977.

38. వీరభద్రరావు, కొత్తపల్లి – తెలుగుసాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం, ఢిల్లీ, 1960.

39. వీరాస్వామి, ఏనుగుల – కాశీయాత్రచరిత్ర, దిగవల్లి వెంకటశివరావు (సంపా.) విజయవాడ, 1941.

40. వీరేశలింగం, కందుకూరి – ఉత్తమస్త్రీచరిత్ర, హితకారిణీ సమాజం, రాజమండ్రి, 1951.

41. – కందుకూరి వీరేశలింగ కృతగ్రంథములు, సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ, రెం.సంపు. 1917.

42. – వీరేశలింగం, కందుకూరి కృత గ్రంథములు, సర్వోదయగ్రంథ మండలి, పటమటలంక, విజయవాడ, మూడవసంపుటి, 1948.

43. – కందుకూరి వీరేశలింగకృత గ్రంథములు, మనోరమా ముద్రాక్షరశాల, రాజమండ్రి, పదవసంపుటం, 1917.

44. – డైరీలు, లేఖలు, అక్కిరాజు రమాపతిరావు (సం.), విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1970.

45. – నీతిచంద్రిక – విగ్రహం, శ్రీరామా ముద్రాక్షరశాల, రాజమండ్రి 19

46. – నీతిచంద్రిక – సంధి, హితకారిణీసమాజం, రాజమండ్రి, 1948

47. – శ్రీకళ్యాణకల్పవల్లి, హితకారిణీ సమాజం, రాజమండ్రి, నాల్గవ కూర్పు, 1950.

48. – సత్యవతిచరిత్ర, హితకారిణీ సమాజం, రాజమండ్రి, 1950.

49. – శ్రీ విక్టోరియామహారాజ్ఞిగారి చరిత్రము, హితకారిణీసమాజం, రాజమండ్రి, 1951.

50. – స్వీయచరిత్ర, హితకారిణీ సమాజం, రాజమండ్రి, 1954.

51. – సత్యవాదిని, హితకారిణీ సమాజం, రాజమండ్రి, 1957.

52. – సత్యరాజా పూర్వదేశయాత్రలు, ఎమెస్కో ప్రచురణ, మచిలీపట్టణం, పునర్ముద్రణ, 1969.

53. వెంకటప్పయ్య, కొండా – స్వీయచరిత్ర, విజయవాడ, రెండవసంపుట 1952-55.

54. వెంకటశివుడు, రాయసం – శ్రీవీరేశలింగం సంస్కృతి, చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు, 1931.

55. వేంకటావధాని, దివాకర్ల – ఆంధ్ర వాఙ్మయచరిత్రము, ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1958.

56. – (సంపా.) చైతన్యలహరి, యువభారతీ పబ్లికేషన్స్, సికింద్రాబాదు, 197

57. శ్రీ శ్రీ – ప్రాసక్రీడలు, నవోదయపబ్లిషర్స్, విజయవాడ-2.

58. శ్రీనివాస్, ఎమ్.ఎన్. – ఆధునిక భారతదేశంలో సామాజిక పరివర్తన, రత్తయ్య, ఇ.వి.(అను.), తెలుగు అకాడమీ, హైదరాబాదు, 1973.

59. శ్రీనివాసరావు, వేమూరి – పూర్వగాథాలహరి, వేంకట్రామా అండ్ కో, విజయవాడ, ప్ర.ము. 1976.

60. శ్రీరామ అప్పారావు, పోణంగి – తెలుగు నాటక వికాసము, శివాజీప్రెస్, సికింద్రాబాదు, 1967.

61. సత్యనారాయణ, యండమూరి – ఉషఃకిరణాలు, విక్టరీప్రెస్, విజయవాడ, 1960.

62. సీతమ్మ, కె. – కందుకూరి వీరేశలింగం చరిత్ర, కాకినాడ, 1921.

xxxxxxxxxxxxxxxxxxxx

63. సీతాపతి, గిడుగు – స్వీయచరిత్ర, హైదరాబాద్, 1962.

64. సీతారామయ్య, కురుగంటి – హనుమంతరావు, పిల్లలమర్రి – నవాంధ్ర సాహిత్యవీధులు, హైదరాబాదు, 1942.

65. సుబ్రహ్మణ్యం, జి.వి.(సంపా.) – మహతి, యువభారతీపబ్లికేషన్స్, సికింద్రాబాదు, ప్ర.ము. 1972.

66. సుబ్రహ్మణ్యభారతి – చంద్రిక కథ, గోపాలకృష్ణరాఘవన్ (అను.), బంగోరె, నెల్లూరు, 1971.

67. సుబ్బారెడ్డి, మద్దూరి – సాహిత్యవివేచన, ఫ్రీడమ్ ప్రెస్, మద్రాసు, 1974.

68. సూర్యనారాయణరావు, వల్లూరి – సూర్యనారాయణీయము, స్వీయచరిత్ర కావ్యూర్వు, 1936.

ఆఆX

II. వ్యాసాలు :

1. కోటీశ్వరరావు, కోలవెన్ను – దివ్యస్మృతి, భారతి, మే, 1948.
2. నారాయణరావు, జి.వి – శ్రీవీరేశలింగంపంతులు, భారతి, ఏప్రిల్, 1957.
3. రమాపతిరావు, అక్కిరాజు – 120 ఏళ్ల వీరేశలింగం, భారతి, ఏప్రిల్, 1968.
4. వెంకట్రావు, నిడదవోలు – నవయుగ నిర్మాత శ్రీవీరేశలింగం, భారతి, ఏప్రిల్, 1948.

III. పత్రికలు, ప్రత్యేక సంచికలు మొ.

1. అభ్యుదయం, అక్టోబరు, 1978. డిశెంబరు, 1978.
2. ఆంధ్రభాషాసంజీవని – మద్రాసు
3. తెలుగు విజ్ఞానసర్వస్వం, తెలుగుభాషాసమితి, మదరాసు, సంపు.3&4, 1959.
4. పురుషార్థప్రదాయిని – మదరాసు.
5. భారతి.
6. వివేకవర్ధని – రాజమండ్రి.

IV. రేడియో ప్రసంగాలు :

కోటీశ్వరమ్మ, పి. – చరిత్రపుటల్లో స్త్రీవైభవం – ఆకాశవాణి సౌజన్యంతో.
– మారుతున్న సమాజంలో స్త్రీపాత్ర – 4.12.76

దాణప్ప, తూమాటి – ఆకాశవాణి సౌజన్యంతో, వేమన–వీరబ్రహ్మేంద్రుల తాత్త్విక ధోరణులు.

V. అముద్రితాలు :

లక్ష్మణరెడ్డి, వి. – ' సాంఘికాభ్యుదయం – భాషావికాసం ' పందొమ్మిదో శతాబ్ది తెలుగుపత్రికలు, అముద్రిత ఎం.ఫిల్. సిద్ధాంతవ్యాసం, నాగార్జున విశ్వవిద్యాలయం, నాగార్జుననగర్, 1978.

= = =

## II. ENGLISH

I. BOOKS :

1. Altekar, A.S - the position of women in Hindu civilisation, I Ed. Delhi, 1938, Motilal Banarsidas Indological Publishers and Book Sellers, Delhi, Reprint 1973.

2. Anjaneyulu, D - Kandukuri Veeresalingam, Publications Division, I.Ed., New Delhi, 1976.

3. Basham, A.L - the wonder that was India, Fontana, I.Ed., Delhi, 1971.

4. Bhat, G.K. - Vedic Themes, Ajanta Pub., Delhi, I.Ed. 1978.

5. Chandavarkar, G.L - Dhondukeshav Karve, Pub. by the Director of Publications Division, Patiala House, Manager of India Press, Faridabad, Delhi, 1970.

6. Chhandachakraborthy - Common Life in the Rgveda and Atharaveda--an account of the Folklore in the Vedic Period, Pub. by Sri Shankar Battacharya, 34, Mohan Bagan Lane, Calcutta,1977.

7. Jeannine Aubozor - Daily Life in Ancient India, Asia Publishing House, Bombay, II Ed. 1967.

8. Kosambi, D.D. - the culture+civilization of Ancient India, Vikas Publishing House, New Delhi, IV Ed.1976.

9. Majumdar, R.C - Ancient India, Pub. by Motilal Banarsidas, Delhi, VII Ed. 1974.

10. Majumdar, R.C, Ray Choudary - An advanced History of India, Pub. by. Macmillan and Co. Ltd., London, Third Ed. 1967.

11. Mahajan V.D. - Ancient India, Pub. by S.Chand & Co., Delhi 1968.

12. Malabari B.M - Infant marriage and enforced Widow hood in India, Bombay, 1887.

13. Narla V.R - Veeresalingam, Central Sahitya Acadami, New Delhi-I, First Ed. 1968.

14. Nilakanta Sastry, K.A., & Srinivasachari,G. - "Life and Culture of the Indian People", Allied Publishers, Bombay-400 001, Second Edn. 1974.

*14(a) -

15. Panduranga Vaman Kane - "History of Dharmasastra", Pub.by: R.N.Dandekar, New Delhi-7, 2nd Ed. Vol.I&II.

16. - History of Dharma Sastra, Bombay, 4th Vol., 1932-53.

17. - History of Dharma Sastra, Bhandarkar Oriental Research Institute, Poona, Vol.I, 1968.

18. Pramadhanath Bose - A History of Hindu Civilisation during British Rule, Asian Publication Services, New Delhi, Vol.I, 2nd Ed., 1975.

19. Phauke. H.A.- "R.G. Bhandarkar", National Book Trust India, New Delhi, 1st Ed. 1968.

20. Pratima Asthana - "Women's Movement in India", Vikasa Publishing House Pvt. Ltd., Delhi, 1974.

21. Radhakrishna. S - Introduction to 'The Cultural Heritage of India The Ramakrisnna Mission, Institute ofCulture, Calcutta, Vol. I & II, 1975.

22. Rapson. E.J - "The Cambridge History of India" Pub.by S. Chand & Co., New Delhi, 3rd Ed. 1968.

23. Sakuntala Rao Sastry - Women in Vedic Age, Bharatiya Vidya Bhavan, Bombay, 1954.

24. Sharma R.S. - "Indian Society: Historical Probings, In Memory of D.D. Kosambi," People's Publishing Houses, New Delhi, 1974.

25. Shiekh Kidwai, M.K - "Woman under different Social and Religious laws", Seema Publications, Delhi, 1st Ed. 1976.

26. Subal Chandra Mitra - "Isvar Chandra Vidyasagar", Ashish Publishing House, New Delhi, 2nd Ed. 1975.

27. Talbay Wheeler, J. - "India of the Brahmanic Age", with Reference to the Ramayana, Cosmo Publications, Delhi, First Ed. 1973.

28. Tara Ali Baig --- India's Woman Power, S.Chand & Co. (Pvt.)Ltd., New Delhi, 1st Ed. 1976.

* 14(a) Padmini Sengupta - 'Pandita Ramabai Saraswati' Her Life and Work. Asia Publishing House, New York, 1970.

II. EASSAYS, PAPERS etc :

Benson, Charles - A Statistical Atlas of the Madras Presidency, Govt. of Madras, Madras, 1895.

District Gazette - Godavari District, 1868 - 1876.

Feming Way, F.R - District Gazetter of Godavari, Madras 1915.

Fort St. George Gazette - 1869, 1871 & 1893.

Government of India Census of the Madras Presidency - Vol.I, 1871, Vol.I. 1881, Vol. XIII. 1891, Vol.I, XV. 1901, Vol.XIII, Part-I, 1921.

Indian Law Review - Madras Vol.VI 1883, pp.381-396, Vol.XIII 1889, pp.293 - 308.

Joshi, V.C (Ed.) - Rammohan Ray & the Process of modernisation in India, Vikas Publishing House Pvt. Ltd.,Delhi, 1st Ed. 1975.

Swami Lokeswara, Nanora - The Early Phases, Ithihas, Purnas, The cultural heritage of India, the Ramakrishna Mission Institute of Culture, 2nd Ed.

Madras Civil List - Jan. 1882, Jan. 1886, Jan. 1889, Oct. 1905, Oct. 1906, Oct. 1909.

Papers relating to the establishment of Village Vernacular Schools, in the Sub-Division of Rajahumundry, No.XXVI in the Selections from the records of the Madras, Govt. of Madras, 1858.

Prakasa Rao, D.V. - The widow marriage movement in South India, Kayaste Samachar, Allahabad, VII No.6, VIIV, No.4 & 5.

Punnaiah, K - A Tribute Sri K.Veerasalingam, Triveni, Masulipatam XI^A. No. 9 & 10, April & May, 1948.

Ramakrishna Bharatiya Vidya Bhavan (Pub.) - the history and culture of the Indian People - the Vedic Age, R.B.Vidyabhavan, Bombay, Vol.I, 3rd Ed.1970.

Reports on Public Instruction in the Madras Presidency - 1878-79, 1880-81, 1881-82.

Report of the Committee for the Revision of English, Telugu and Tamil Schools, Books in the Madras Presidency, No.XLIV in the selection of the Madras Government, Madras, 1875.

Report of the Twelfth Tour of H.E. the Hon. Sir Arthur Lawley, G.C.I.E., K.C.M.G. Governor of Madras, Madras 1909.

A Statistical Appendix for Godavari District, Madras 1906.

Subba Rao. K. - Revived Memories, Madras 1933.

University of Madras Calenders - 1875-76, 1891-92, 1896-97, 1898-99, 1899-1900.

The Hindu - Madras, The Hindu Weekly Review - Madras,
'Indian Social Reformer' - Madras, and Bombay.
Madras Mail - Madras, Madras Standard - Madras,
Madras Times - Madras, A Thenaeum & Daily News, Madras.

III. UNPUBLISHED WORKS :

John Leonard, G - 'Kandukuri Veeresalingam' - 1848-1919, A Biography of an Indian Social Reformer, A thesis submitted in partial fulfillment of the requirements for the degree of Doctor of Philosophy (History) at the University of Wisconsin, Madison, U.S.A., 1970.